# స్మాల్ స్కేల్ ఇండస్ట్రీస్

## (చిన్న తరహా పరిశ్రమలు)

సేకరణ:

**పానుగంటి వెంకటరమణ**



Ph: 73444

**రోహిణి పబ్లికేషన్స్**

మెయిన్ రోడ్, రాజమండ్రి -533 101

# SMALL SCALE INDUSTRIES

COLLECTED BY
**PANUGANTI VENKATARAMANA**

FIRST EDITION - 1998



COVER DESIGN:
**RAMANA**



TYPE SETTING:
**PRINT PLAZA**



PRINTED AT.
**SWAMY OFFSET PRINTERS**
[illegible] No 26-20-6 Swamy Street,
[illegible] VIJAYAWADA-3
Phones [illegible], 572832

**ROHINI PUBLICATIONS**
MAIN ROAD, RAJAHMUNDRY - 533 101

Price Rs. 70/-

# శ్రమయేవ జయతే!

అవును! ఈ నిజాన్ని ఎవరుకాదనలేరు! (మూర్ఖులూ, మోసగాళ్ళు, కమీషన్లు కొట్టే అవకాశవాదులు తప్ప) శ్రమిస్తే ఫలితం వుంటుంది. పరిశ్రమిస్తే ఆదాయం చేకూరుతుంది. మానవ విజ్ఞాన సంబంధమయిన అరవై నాలుగు కళలూ ఆదాయాన్ని సమకూర్చుకోటానికి ఉద్దేశించినవే!

శ్రమకు నిర్దేశిత రూపాన్ని ఇవ్వటమే పరిశ్రమ

ఎవరు, ఏ విషయంలో విజయం సాధించాలన్నీ శ్రమ ఒకటే సరిపోదు. ఆ శ్రమకు కృషీ, మానసిక సంబంధమయిన పట్టుదల, దృఢచిత్తం కూడా చాలా అవసరం. సాధించాలి అనుకోవటమే కాదు - సాధించగలం అన్న గట్టి నమ్మకం వుండాలి. అదే విజయం వైపు మిమ్మల్ని పయనింపచేస్తుంది.

ఉద్యోగం పురుషలక్షణం... అనేది ఒకప్పటి మాట. కానీ, సంపాదించటమే ఇప్పుడు మనిషి లక్షణం అనిపించుకుంటున్నది. కుటుంబ. ఆర్థిక అవసరాలను ఏ లోటూలేకుండా గడుపుకోవాలంటే డబ్బు సంపాదించవలసిన అవసరం ఎంతయినా వుంది. మనుష్యుల నిత్యావసరాలు డబ్బుతోనే ముడిపడి వున్నాయి. సంకల్ప బలంలో. పరిశ్రమిస్తే డబ్బు సంపాదించటం, జీవితంలో గౌరవ ప్రదమయిన స్థితికి చేరుకోవటం ఏమంత కష్టంకాదు.

డబ్బు ఎలాగయినా సంపాదించవచ్చునన్న ఆలోచన అనుకున్న వారిచేత ఎన్నో పొరపాట్లు చేయిస్తుంది. మోసం, వంచన, ద్రోహం, అమానుషం మొదలయిన అక్రమమార్గాలను అనుసరించేటట్టు చేస్తుంది. కొన్ని నిర్దిష్టమయిన ఆశయాలకు కట్టుబడి నీతి, నిజాయితీలను పాటిస్తూ ఆదాయాన్ని సమకూర్చుకునే వారికి వుండే సంతృప్తి ఆనందం వారికి వుండవు.

వ్యాపారానికి లక్షలూ, వేలూ అవసరం లేదు. ఎంతయినా సరిపెట్టుకోవచ్చు. వంద రూపాయలతో చేయగలిగిన వ్యాపారాన్ని ప్రారంభించి పొదుపు పాటిస్తూ ఆదాయంలో ఒక్కొక్క రూపాయి వంతున కూడబెడుతూ అంచెలంచెలుగా ఎదుగుతూ గమ్యం దిశగా పయనించవచ్చు తప్పనిసరిగా ఉన్నత శిఖరాలను అధిరోహించవచ్చును. ఆ విషయంలో ప్రస్తుతం ప్రముఖ పారిశ్రామికవేత్తలుగా వెలుగొందుతున్న త్రివేణి వక్కపొడి వ్యవస్థాపకులయిన శ్రీదేసు వెంకట సుబ్బారావుగార్నీ, అంబికా అగరుబత్తి వ్యవస్థాపకులు గౌరవనీయులు శ్రీఆలపాటి రామచంద్రరావుగార్ని ఇంకా శ్రీయల్.వి ప్రసాద్ ఈనాడు దినపత్రిక అధినేత శ్రీరామోజీరావుగార్ని మొదలయిన వార్ని ఆదర్శంగా తీసుకోవాలి. వాళ్ళే మీ సంకల్పానికి పునాదిరాళ్ళని అనుకోవాలి.

పుట్టగానే లేచి ఎవరూ పరిగెత్తరు.

బాల్యదిశలో మోకాళ్లు దోక్కుపోయేలా పడిలేస్తేనే తప్ప నడక అలవాటుకా
నడవటం అలవాటయిన తరువాత పరిగెత్తటం దానంతట అదే అలవడుతుం
వ్యాపారంలోనూ అంతే! ఎన్నో ఒడిదుడుకులను తట్టుకుంటేనే తప్ప నిలదొక్కుకోవ
సాధ్యంకాదు. నిలదొక్కుకున్న తరువాత పడిపోయే ప్రసక్తి వుండదు.

మీరు స్థాపించే పరిశ్రమ ఏదయినాసరే.. దాని అభివృద్ధికోసం మీరు అనుక్ష
శ్రమించాలి. మీ పరిశ్రమలో తయారయ్యే వస్తువు మార్కెట్‌లో ఒక ప్రత్యేకత
ఏర్పరచుకోవాలి. ఆ వస్తువు తాలూకు బ్రాండ్ కోనే వారి మనసుల
నాటుకుపోవాలి. అందుకు మీరు చేయాల్సింది నాణ్యత పాటించటం. అప్పుడే
పరిశ్రమ బంగారు బాటలో పయనిస్తుంది. నాణ్యత గల వస్తువును మీ పరిశ్ర
ద్వారా అందిచటం అనేది కేవలం, మీచేతలలోనూ మాత్రమే వుందని మరి
పోకండి. నాణ్యతతోపాటు మీవస్తువును సరయిన ధరకు అందించగలిగితే
మీకు ఎదురులేదు.

## ఇక ఈపుస్తకాన్ని గురించి.....

నిరాశ నిస్పృహలలో కృంగిపోతున్న నిరుద్యోగ యువతీయువకుల
చైతన్యవంతుల్ని చేయాలన్న తత్‌సంకల్పంతో విషయ సేకరణ ప్రారంభించి వ్రాయట
మొదలుపెట్టి వారు కల్పించిరి ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకునేందు
నా ప్రయత్నం నేను చేసాను. సేకరణ ఆధారంతో ఈ పుస్తకాన్ని పూర్తి చేయగలిగా

డబ్బు సంపాదించటానికి ఎన్నో మార్గాలు వున్నాయి. వాటిలో కొన్నిటిని మీ దృష్టి
తీసుకువచ్చే దిక్సూచిలాంటిదే ఈ పుస్తకం.

ఈ పుస్తకంలో ప్రాజెక్ట్‌ఎస్టిమేషన్ వివరాలు, ఫార్ములాలు(పాళ్ళు) తయారు చేయ
విధానాలు, యంత్ర పరికరములు వివరాలు యివ్వబడ్డాయి. ప్రాజెక్ట్ ఎస్టిమేష
గురించి పుస్తకం చివరిలో ప్రత్యేకంగా సవివరంగా మార్గదర్శకాలు మాత్రమే. వాట
స్థిర ప్రామాణికాలు అనుకోవద్దు, మార్పులూ, చేర్పులూ వుంటాయి. ప్రయత్నిం
చూడండి. ఫార్ములాలకి సంబంధించినంత వరకూ స్మాల్‌స్కేల్ ఇండస్ట్రీస్ సర్వీ
సెంటర్ (చిన్నతరహా పరిశ్రమల సేవా సంస్థ) ఇండియన్ స్టాండర్డ్ ఇన్‌స్టిట్యూష
వారు నిర్దేశించినవే కచ్చితమయినవిగా భావించాలి. అలాగే పరిశ్రమల
సంబంధించిన ఎస్టిమేషన్ వివరాలు కూడా,యంత్రాల, ముడి సరుకుల ర
పెరుగుదల తరుగుదలను దృష్టిలో వుంచుకుని సుమారుగా యివ్వటం జరిగిం
విషయసేకరణలో అందిస్తున్న ఈ పుస్తకం. చివరిగా...

నాకు ఈ సదవకాశాన్ని కల్పించిన రోహిణి పబ్లికేషన్స్‌వారు కృతజ్ఞతలతో

మీ

*పానుగంటి వెంకటరమణ*

# ఒక్క నిముషం!

దేశవ్యాప్తంగా నిరుద్యోగ సమస్య ఎంతగా పెరిగిపోయిందో ప్రత్యేకంగా చెప్పనవసరంలేదు. ఒక్క మనరాష్ట్రంలోనే నిరుద్యోగులు 45 లక్షల మంధికి పైగా ఉన్నారని ఒక అంచనా.

చదువుకున్న ప్రతి వారికీ ఉద్యోగాలు కల్పించటం అనేది ఏప్రభుత్వానికయినా అసాధ్యమయిన పని అనే చెప్పాలి! అందువల్ల ప్రభుత్వాన్ని నిందిస్తూ కూర్చోవటం సరైన పద్ధతి కాదు.

ఉద్యోగం లేకపోయిన నిత్యావసరాలను తీర్చుకోవటానికి ఏదో ఒక చిన్న వ్యాపారం చేయక తప్పదు.

ఏమి చేయాలి? ఎలా సంపాదించాలి? అన్న ఆలోచనలతో సతమతం అయ్యే యువతకు ప్రేరణ కలిగించి, వారిని సంపాదనా మార్గం వైపు మళ్ళించే మార్గదర్శి ఈ పుస్తకం.

రోహిణి పబ్లికేషన్స్ స్థాపించినప్పటి నుండీ స్మాల్‌స్కేల్ ఇండస్ట్రీస్‌కి సంబంధించిన పుస్తకం ఒకటి ప్రచురించాలన్న ఆలోచన నాలో ఉండేది. విషయసేకరణ జరపగలరనే ఉద్దేశంతో సుపరిచితులయిన ప్రముఖ రచయిత శ్రీ పానుగంటి వెంకటరమణగార్ని కలిసి ఈపుస్తకం పూర్తి చేయమని కోరటం జరిగింది.

నేను కోరిన విధంగా వారు పూర్తిచేసిన పుస్తకం యిప్పుడు మీ చేతులలో వుంది. లక్షలాది మంది నిరుద్యోగులలో ఏకొద్దిమందికి ఉపయోగపడినా ఈపుస్తకం ప్రచురించటంలోని నా ఆశయం నెరవేరినట్లే భావిస్తాను.

నిరంతరం ఉద్యోగాల వేటలో నిరాశ, నిస్పృహలకు లోనవుతూ అలసిసొలసిపోతున్న యువతీ, యువకులకు జీవితంలో అత్యంత విలువయిన కాలాన్ని కాళ్ళు అరిగేలా తిరుగుతూ వృధా చేసుకోకుండా వివిధ పథకాల ద్వారా ఆర్థిక సహాయాన్ని పొంది, స్వయం ఉపాధి కల్పన ద్వారా నిరుద్యోగాన్ని తరిమికొట్టే విషయ పరిజ్ఞానాన్ని అందించటమే ఈ పుస్తక ధ్యేయం.

ఒక్కమాటలో చెప్పాలంటే

స్వయం ఉపాధికి ప్రేరణ - ఈ పుస్తక ప్రచురణ

అభినందనములతో

పబ్లిషర్స్.



# ఆణిముత్యాల్లాంటి గ్రంథాలు

| | | |
|---|---|---|
| 1. జ్యోతిష పదార్ణవము | శ్రీ పుచ్చా శ్రీనివాసరావు | 50-00 |
| 2. నవరత్న కల్పతరువు | శ్రీ పుచ్చా శ్రీనివాసరావు | 40-00 |
| 3. జాతక దీపిక | శ్రీ పుచ్చా శ్రీనివాసరావు | 30-00 |
| 4. నక్షత్ర చింతామణి | శ్రీ బొమ్మకంటి వేంకటసుబ్రహ్మణ్య శాస్త్రి | 25-00 |
| 5. యోగం ఆరోగ్యం | గౌతం | 25-00 |
| 6. హస్త సాముద్రిక శాస్త్రము | శ్రీ లక్కోజు రమేష్‌బాబు | 80-00 |
| 7. హస్త రేఖలు ఫలితాలు | రోహిణి | 15-00 |
| 8. హిందీ-తెలుగుకోష్ | శ్రీ కప్పగంతుల సత్యనారాయణ | 100-00 |
| 9. మినీ హిందీ- తెలుగు డిక్షనరీ | శ్రీ కప్పగంతుల సత్యనారాయణ | 35-00 |
| 10. శేర్లు కొద్ది పేర్లు (పిల్లలపేర్లు) | శ్రీ మల్లాది వేంకటశేషశాయి | 25-00 |
| 11. విద్యార్థి కల్పవల్లి | శ్రీ ముసునూరి నారాయణరావు | 100-00 |
| 12. ఆంధ్రనామసంగ్రహం ఆంధ్రనామ శేషము, సాంబ నిఘంటువు | ఆడిదము సూరికవి | 35-00 |
| 13. ప్రాసాక్షర పదకోశము | శ్రీ ముసునూరి నారాయణరావు | 25-00 |
| 14. విశ్వకోశము (విశ్వప్రకాశిక) సంస్కృతం-తెలుగు నిఘంటువు | మహేశ్వర సూరి | 75-00 |
| 15. సుందరకాండము | శ్రీమాన్‌ఎన్.టి.పి. కోనప్పాచార్యులు | 125-00 |
| 16. అప్పకవీయం | డా॥ బులుసు వేంకటసత్యనారాయణ మూర్తి | 30-00 |
| 17. చంధోదర్పణము | డా॥ శ్రీచిర్రావూరిశ్రీరామశర్మ | 35-00 |
| 18. సులక్షణ సారము | డా॥ జొన్నలగడ్డమృత్యుంజయరావు | 30-00 |

19. కావ్యాలంకార సంగ్రహము   డా॥ శ్రీపోచిన పెద్దివెంకట మురళీకృష్ణ   50-00

20. చంద్రాలోకము   డా॥ శ్రీ బులుసు వేంకట సత్యనారాయణమూర్తి   20-00

21. PROSODY (ఆంగ్ల ఛందస్సు)   శ్రీ ఎం.వి. నారాయణాచార్యులు   30-00

22. అహోబల పండితీయము   శ్రీ యరనూరి మల్లికార్జునరావు   35-00

23. కలప జంత్రి   శ్రీ. పి.బి. వీరాచారి   30-00

24. సంపూర్ణ నీతిచంద్రిక   చిన్నయసూరి, కందుకూరి   75-00

25. నీతి కథామంజరి   శ్రీ కందుకూరి వీరేశలింగం   18-00

26. విశ్వబ్రాహ్మణ గోత్రాలు   శ్రీ పి.బి. వీరాచారి   25-00

27. వివేక సింధువు   శ్రీ బొమ్మకంటి వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి   25-00

28. స్మాల్ స్కేల్ ఇండస్ట్రీస్   శ్రీ పానుగంటి వెంకటరమణ   50-00

29. ఆయుర్వేద చికిత్సా విధానము   శ్రీ చక్రవర్తుల పద్మనాభశాస్త్రి   25-00

30. కాళిదాసు కథావళి   శ్రీ బొమ్మకంటి వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి   25-00

31. సంగీత విద్యా ప్రకాశిక   శ్రీ ఆకొండి శ్రీనివాస రాజారావు   100-00

32. సంస్కృత వాణి   డా॥ శ్రీ సముద్రాల వేంకట రంగ రామానుజాచార్యులు   30-00

33. నలదమయంతుల కథ   శ్రీ జయన్తి సుబ్రహ్మణ్య శాస్త్రి   15-00

34. సంగ్రహ వ్యాకరణము   శ్రీ కందుకూరి వీరేశలింగం   15-00

35. రోహిణి హిందీ వ్యాకరణం   శ్రీ పురాణపండ శ్రీ చిత్ర   16-00

36. కాంపెండియస్ ఇంగ్లీషుగ్రామర్   శ్రీ బి.ఆర్ పప్పు   14-00

37. సంస్కృతం - తెలుగు ప్రైమర్   డా॥శ్రీకొంపెల్ల సత్యనారాయణమూర్తి   10-00

38. ఇంగ్లీషు - తెలుగు ప్రైమర్   శ్రీ బి.ఆర్. పప్పు   10-00

39. హిందీ - తెలుగు ప్రైమర్   శ్రీ కప్పగంతుల సత్యనారాయణ   8-00

40. రాధాకృష్ణ   శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావు   13-00

41. కంఠాభరణం   శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావు   20-00

42. కోకిల   శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావు   20-00

43. చండకౌశికం (హరిశ్చంద్ర)   శ్రీ వడ్డాది సుబ్బారాయుడు   15-00

44. భక్తచింతామణి   శ్రీ వడ్డాది సుబ్బారాయుడు   20-00

# విషయ సూచిక





# వివిధ ఉత్పత్తులు



# స్మాల్‌స్కేల్ ఇండస్ట్రీస్

## (SMALLSCALE INDUSTRIES)

*ఇదికేవలం స్మాల్‌స్కేల్ ఇండస్ట్రీస్‌కి సంబంధించిన పుస్తకం మాత్రమే. అందువల్ల ఇతర విషయాలతో పేజీలు నింపకుండా.... వాటికి సంబంధించిన అతిముఖ్యమైన విషయాలను , వివరాలను మాత్రమే మీకు అందిస్తున్నాం.*

**పేపర్ వర్క్:** మీరు స్థాపించదలుచుకున్న పరిశ్రమ ఏదైనప్పటికీ....స్థాపించాలన్న ఆలోచన వచ్చిన వెంటనే ముందుగా పేపర్‌వర్క్ చేయటం... అంటే దానికి సంబంధించిన వివరాలను పూర్తిగా ఒక కాగితం మీద వ్రాసుకుని ఒకటికి నాలుగుసార్లు మీకు మీరే పరిశీలించుకోవటం అవసరం.

**మీరు చేయవలసింది.......**

1. మీరు స్థాపించదలుచుకున్న పరిశ్రమ?
2. ఆ పరిశ్రమను స్థాపించటానికి మీ కున్న అర్హతలు, అవకాశాలు, వనరులు?
3. ఇండస్ట్రీ స్థాపనకు మొత్తం పెట్టుబడి ఎంత కావాల్సి వుంటుంది?
4. ప్రస్తుతం మీ దగ్గరున్న డబ్బు? స్థిరాస్థి?
5. మీరు ఒక్కరే పరిశ్రమను స్థాపించగలరా? ఆర్థిక సహాయం కోసం పార్టనర్స్‌ని చేర్చుకుంటారు?
6. మీరు స్థాపించదలుచుకున్న పరిశ్రమకి సంబంధించి మీకున్న అనుభవం, అవగాహన, సాంకేతిక పరిజ్ఞానం?
7. మీ పరిశ్రమ ద్వారా మీరు తయారు చేసే వస్తువుకి మార్కెట్‌లో వున్న డిమాండ్ ఏమిటి? అటువంటి ప్రొడక్టు మార్కెట్‌లో ఎన్ని రకాలు వున్నాయి? మార్కెట్‌లో వాటి కున్న గిరాకీ స్థాయి, వాటన్నిటికంటే ఎక్కువ క్వాలిటీతో మీరు అందించగలరా? అలా అందిస్తూ పరిశ్రమ నడపటం సాధ్యమేనా?
8. ప్రారంభంలో కనీస ఉత్పత్తి ఎంతుండాలి? మార్కెట్‌లో వున్న రకాలను పరిగణలోకి తీసుకుంటూ రేటు ఎంత నిర్ణయించాలి?
9. ఎంతసరుకు మార్కెట్ చేసేందుకు అవకాశం వుంది ? రాబడి ఎంత వుంటుంది?
10. మీరు తయారుచేయదలుచుకున్న వస్తువు నాణ్యతను పెంచే ప్రయత్నంలో ఒకటి రెండు నెలలు రాబడిలేకపోయినా నిలదొక్కుకోగలరా?

11. ఈ విషయంలో ఎవరెవర్ని కలుసుకోవాలి?

పైన ఇవ్వబడిన ప్రశ్నలనూ, ఫాటికి సమాధానాన్ని బాగా ఆలోచించి ఒక పేపర్‌మీ్ద వ్రాసుకోండి. ఆ తరువాత వాటిని శ్రద్ధగా పరిశీలించండి. మీ మేలుకోరే పెద్దలతో అనుభవజ్ఞులతో చర్చించండి. ఆ తరువాత ఒక నిర్ణయానికి వచ్చి పరిశ్రమ స్థాపనకు ఉపక్రమించండి. స్వయం కృషితో అభివృద్ధి సాధించండి.

## ఇండస్ట్రీ రిజిస్ట్రేషన్

**స్టేట్ డైరక్టరేట్ ఆఫ్ ఇండస్ట్రీస్:** డిస్ట్రిక్ ఇండస్ట్రీస్ అధికారి వద్ద లభించే అప్లికేషన్ ఫారాన్ని పూర్తిచేసి పంపితే మీరు స్థాపించదలుచుకున్న యూనిట్ రిజిస్ట్రేషన్ నెంబర్ ఇవ్వబడుతుంది. ఈ నెంబర్ కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల సహాయ సహకారాలు పొందటానికి అవకాశాన్ని కల్పిస్తుంది. ఈ నెంబర్ రెండుసార్లుగా ఇవ్వబడుతుంది. 1. ప్రావిజనల్ రిజస్ట్రేషన్ 2. పర్మనెంట్ రిజస్ట్రేషన్.

పరిశ్రమ స్థాపన జరిగిన 7 రోజులలోగా డిస్ట్రిక్ ఇండస్ట్రీ అధికారి నుండి అప్లికేషన్ ఫారాన్ని పొంది రిజిస్ట్రేషన్ కొరకు అప్లయి చేయాలి. ప్రావిజినల్ రిజిస్ట్రేషన్ 6 నెలల కాలం వరకూ చెల్లుతుంది. ఆ తరువాత మరో ఆరునెలలకు రిన్యువల్ చేయించుకోవచ్చు.

పెర్మనెంట్ రిజిస్ట్రేషన్ కొరకు ఆ అప్లికేషన్ ఫారాన్ని పంపటంతోపాటు ఆ అప్లికేషన్ ఫారంలో సూచించబడిన మార్గదర్శక సూత్రాలను పాటిస్తున్నట్టు రసీదులూ, బిల్లులూ, సేల్స్ కోడ్స్, ఇన్‌కమ్‌టాక్స్ ఎసెస్‌మెంట్, వివిధ లైసెన్స్‌లు ఎలక్ట్రిక్ చార్జ్‌బిల్స్ మొదలయిన వాటికి సంబంధించిన వివరాలను తెలియచేసే పోటో స్టాట్ కాపీలు రెండు జతపరచి పంపవలసి ఉంటుంది.

## లైసెన్స్‌లు మరియు క్లియరెన్స్ సర్టిఫికెట్స్

*కొన్ని ముఖ్యమయిన వస్తువుల తయారీకి చట్టపరమయిన లైసెన్స్‌లు ముందుగా పొందవలసి వుంటుంది. వాటి విషయంలో ఎలాంటి అశ్రద్ధ చేయకూడదు.*

1. **ఎలక్ట్రానిక్ వస్తువులకి** : S.D.I. సర్కిల్ లోని స్టేట్ టెక్నికల్ సెంటర్ నుండి లైసెన్స్ పొందాలి.
2. **పవర్‌కనెక్షన్ ఫెసిలిటీ:** ఆఫీసర్స్ ఆఫ్ ఎలక్ట్రిసిటీ బోర్డ్ నుండి అనుమతి పొందాలి.
3. **లేబర్ యూనిట్‌కి:** ఛీఫ్ ఇన్స్‌పెక్టర్ ఆఫ్ ఫ్యాక్టరీస్.
4. **మెడిసన్స్, కాస్మోటిక్స్ తయారీకి:** స్టేట్ డ్రగ్ కంట్రోలర్ ఆఫ్ డ్రగ్ కంట్రోలర్ ఆఫీస్.

5. **స్థలాలు, ఇండస్ట్రియల్ ఏరియా:** కమీషనర్ ఆఫ్ కార్పొరేషన్, లేక మున్సిపాలిటీ లేక పంచాయత్.
6. **వ్యర్థ, మిగులు పదార్థాలను గ్యాస్‌మరియు వాటర్ రూపంలో విసర్జించేందుకు:** డైరక్టర్ ఆఫ్ పబ్లిక్ హెల్త్ లేక డ్రిస్ట్రిక్ట్ హెల్త్ ఆఫీసర్ నుండి లైసెన్స్ పొందాలి.
7. **స్టేట్ సేల్స్ టాక్స్ ఆక్టు క్రింద రిజిస్ట్రేషన్ అయిన పరిశ్రమలకు :** ఆఫీసర్ ఆఫ్ సిటీ జాయింట్ కమర్షియల్ టాక్స్ ఆఫీసర్.
8. **ఇన్‌కమ్‌టాక్స్ పేమెంట్స్‌కి:** అసిస్టెంట్ కమీషనర్ ఆఫ్‌సిటీ ఇన్‌కమ్ టాక్స్ డిపార్ట్‌మెంట్.
9. **పొల్యూషన్ కంట్రోలింగ్:** స్టేట్ పొల్యూషన్ కంట్రోల్ బోర్డ్ నుండి లైసెన్స్ పొందాలి.
10. **సెంట్రల్ ఎక్సయిజ్ ఆక్టు క్రింద రిజిస్ట్రేషన్ అయిన వాటికి:** డిస్ట్రిక్ట్ సూపరింటెండెంట్ ఆఫ్ సెంట్రల్ ఎక్సయిజ్ లేదా డిస్టిక్ట్ కలెక్టర్ ఆఫ్ సెంట్రల్ ఎక్సయిజ్ నుండి లైసెన్స్.

## ఆర్థిక సహాయం ఎలా అందుకోవాలి?

ఏదయినా వ్యాపారం చేయాలన్నా, ఇండస్ట్రీ నెలకొల్పాలన్నా ముఖ్యంగా కావాల్సింది డబ్బు. ఆర్థికస్తోమత లేనిదే లేక సహాయంలభించనిదే ఏ పని చేయలేము. ఈ విషయంలో ఆర్థిక పరిస్థితిని పరిగణలోకి తీసుకుంటూ బంధువులూ, స్నేహితులూ, శ్రేయోభిలాషులు మొదలగున వారి నుండి తక్కువ వడ్డీకి అప్పు తీసుకోవటం, స్థిరాస్థుల పై బ్యాంక్‌లోన్. ఉపయోగంలేని, ఆదాయం రాని ఆస్థుల విక్రయం, యల్.ఐ.సి. కోపరేటివ్ సొసైటీలనుండి లేదా పోస్టాఫీస్ డిపాజిట్‌ల నుండి రుణాలు తీసుకోవటం ద్వారా కొంత వరకూ డబ్బు సమకూర్చుకోవచ్చును.

ఇంకా ఫైనాన్స్ సంస్థలూ, బ్యాంక్‌లూ, ప్రభుత్వరంగ సంస్థల ఫైనాన్స్ పథకాలను కూడా ఋణసహాయానికి ఉపయోగించుకోవచ్చు. అయితే కొన్ని ప్రత్యేకమయిన నియమ నిబంధనలను పాటిస్తూ ఆయా సంస్థలు మీకు రుణసహాయాన్ని అందచేయవలసి వుంటుంది. అందుకు కొంత కాలం పట్టవచ్చు. నియమ నిబంధనలకు అనుగుణంగా సంబంధిత పత్రాలను జతపరిచి దరఖాస్తు చేసుకున్నా, వివిధ రంగాలలో, సంస్థలలో పేరుకు పోయిన అవినీతి మీ ఉత్సాహాన్ని నీరు కార్చవచ్చు. లాభాలతో

సహా ప్రాజెక్ట్ ఎస్టిమేషన్‌ని సవివరంగా దాఖలు చేసి ఒక్కోక్కప్పుడు ప్రయోజనం వుండకపోవచ్చు. అయినా ప్రయత్నించక తప్పదు. అంతకంటే పరిశ్రమను స్థాపించటానికి ముందే కాకుండా స్థాపించిన తరువాత మీ నిర్వహణ సామర్థ్యాన్ని, తెలియచేస్తూ దరఖాస్తు చేసుకుంటే రుణ సహాయం నిర్ణీత సమయంలో పొందే అవకాశం వుంది. ప్రయత్నించండి.

ఇక్కడ ఒక ముఖ్యమయిన విషయం చెప్పాలి.

ఎన్ని అడ్డంకుల ఎదురయినా మానవ ప్రయత్నం మానకూడదు. అవినీతి, లంచగొండితనాలను గురించి ఆలోచించకుండా ఆయా ఆర్థిక సంస్థలనుండి రుణ సహాయం పొందే విషయంలో మీ పనిని మీరు సిన్సియర్‌గా చేయండి. దరఖాస్తు ఫారం నింపటం మొదలుకొని ప్రాజెక్ట్ ఎస్టిమేషన్‌కి సంబంధించిన ఏ విషయాన్ని దాచకుండా ఖచ్చితమయిన లెక్కలతో సహా తగిన పత్రాలను జతచేయాలి.

రుణాలు పొందటం గొప్పకాదు. వాటిని సరయిన పద్ధతిలో సద్వినియోగపరిచి తగిన లాభాలను ఆర్జిస్తూ నిర్ణీత కాలంలో రుణాలను తిరిగి చెల్లించటంలోనే మీ సామర్థ్యం ప్రకటిత మవుతుంది.

**అందుకు కొన్ని మార్గదర్శిక సూత్రాలు:**

1. మీరు తయారుచేయదలుచుకున్న వస్తువు. లేక పరికరానికి సంబంధించి నాణ్యమైన ముడిసరుకును కొనుగోలు చేయాలి.
2. సాధ్యమయినంత వరుకు మెటీరియల్స్ వృధాకాకుండా చూసుకోవాలి.
3. యంత్రాల పూర్తి సామర్థ్యాన్ని వినియోగిస్తూ ఉత్పత్తిని పెంచుకోటానికి కృషిచేయాలి.
4. వస్తువు నాణ్యతనూ, ఉపయోగాన్ని మన్నికను తెలియ చేస్తూ వినియోగదారులను ఆకట్టుకునేందుకు మీకు అందుబాటులోవున్న ప్రచార సాధనాలను వినియోగించుకోవాలి. అందుకు పెట్టుబడిలో వీలయినంత శాతాన్ని కేటాయించాలి.
5. ప్రతినెలా, లేక మూడు ఆరునెలలకు ఒకసారి మీ ఉత్పత్తిని, వాటికి సంబంధించిన అమ్మకాలను సమీక్షించుకోవాలి. అమ్మకాలు తగ్గితే ఎందువల్ల అలా జరిగిందో మార్కెట్ సర్వే చేయటం ద్వారా తెలుసుకుని. అమ్మకాలను తగిన స్థాయికి పెంచేందుకు కృషిచేయాలి. అమ్మకాలు మీ అంచనాలకు మించి వుంటే ఉత్పత్తిని పెంచేందుకు అన్ని రకాల వనరులూ సమీకరించుకొవాలి.

6. ముఖ్యమయినవి అకౌంట్స్, వ్యాపార సంబంధమయిన ప్రతి ఖర్చునూ, రాబడినీ వివరంగా లెక్కలు వ్రాసుకోవాలి. ఖర్చు ఎక్కువగా ఉంటే మీ కున్న అవకాశాన్ని బట్టి సాధ్యమయినంత వరుకూ తగ్గించుకునే అవకాశాలను వెదకాలి. రాబడి పెరిగినట్లు లెక్కల్లో తెలిస్తే ఉత్పత్తి సామర్థ్యాన్ని పెంచేందుకు పెట్టుబడిగా వినియోగించుకోవాలి. వీలయినంతవరుకూ ఖర్చు, రాబడి నిలకడగా వుండేలా ప్రయత్నించండి.
7. బ్యాంకు సంబంధమయిన వ్యవహారాలనూ, ఇచ్చిపుచ్చుకోవటం లాంటివి స్వయంగా మీరే చూసుకోవాలి. ఈ విషయంలో ఎవర్నీ నమ్మకూడదు. వ్యాపార సంబంధమయిన వ్యవహారాలలో ఇతరులు తలదూర్చటానికి ప్రయత్నిస్తారు. ఏమీ తెలియకపోయినా అన్ని తెలిసినట్టు నటిస్తూ మాటల గారడిలో మిమ్మల్ని లోబరచుకుని, అదిచేస్తాం, ఇది చేస్తాం అంటూ చేసే ప్రతిపనిలోనూ కమీషన్ కొట్టేందుకు ప్రయత్నిస్తూంటారు. అటువంటి కమీషన్‌గాళ్ళను దరిదాపులకు చేరనీయకండి. సమయం, అవకాశాలను బట్టి ముఖ్యమయిన పనులను మీరే స్వయంగా చూసుకోవాలి. తప్పదనుకున్నప్పుడు మీరు నమ్మకస్తులనుకున్నవారికి అప్పగించాలి.
8. వర్కర్స్ విషయంలో అసంతృప్తి అన్న మాటకు చోటులేకుండా చేయాలి. నాణ్యమయిన, అధిక ఉత్పత్తికీ, తద్వారా మీ పరిశ్రమ అభివృద్ధికీ వారే కారకులు.
9. నిర్వహణ సంబంధమయిన విషయాలలో కేర్‌లెస్‌గా వుండటం పనికిరాదు. ప్రతిపనీ సాధ్యమయినంతవరుకూ టైంప్రకారం జరిగిపోయేలా చేసుకోవాలి. ముందుగా ఒక పథకం తీసుకుని. ఆపథకం ప్రకారం నడుచుకుంటూ అన్నీ సక్రమంగా పూర్తిచేస్తూవుండాలి.
10. ఇన్‌కంటాక్స్, సేల్స్‌టాక్స్ కట్టడంలో టైమింగ్స్ పాటించటం చాలా అవసరం. ఎగవేతకు దారులు వెదకటం మంచిదికాదు. సామర్థ్యంతో పాటు మీ సిన్సియారిటీ కూడా మీ పరిశ్రమ అభివృద్ధికి దోహదకారి అవుతుంది.

## పరిశ్రమల స్థాపన, వాటి అభివృద్ధికి ప్రభుత్వ ప్రోత్సాహక పథకాలు

## ప్రధానమంత్రి రోజ్‌గార్ యోజన

విద్యావంతులయిన నిరుద్యోగ యువకులకు సెల్ఫ్‌ఎంప్లాయిమెంట్ సౌఖర్యం కల్పించటానికి కేంద్రప్రభుత్వంచేత ప్రకటించబడిన స్కీమ్‌ఇది.

ఈ పథకం క్రింద ఎంపిక చేయబడిన నిరుద్యోగులకు బ్యాంక్‌ల ద్వారా లక్షరూపాలయ రుణసహాయం అందించబడుతుంది. అభ్యర్థుల ఎంపికలో భాగంగా. స్వల్పకాలిక శిక్షణ కూడా వుంటుంది. వయసు, విద్య, నేటివిటీ కుటుంబ వార్షిక ఆదాయం మొ॥విషయాలు పరిగణలోకి తీసుకోబడతాయి. ఎంపిక చేయబడిన పరిశ్రమలకూ వ్యాపారాలకు, నిర్వహణలకూ మాత్రమే ఈ రుణం మంజూర్ చేయబడుతుంది. ఈ రుణసహాయంతోపాటు ప్రభుత్వం తరుపున కొంత సబ్సిడీ కూడా వుంటుంది. అంతేకాదు రుణసహాయం పొందిన తదుపరి ఒక సంవత్సరం ఆరు నెలలపాటు, అంటే 18 నెలలపాటు ఎటువంటి వాయిదాలు తిరిగి చెల్లింపులు కట్టవలసిన అవసరం వుండదు. ఎందుకంటే పరిశ్రమ, లేక వ్యాపారం ప్రారంభించిన అభ్యర్థి ఆ రంగంలో నిలదొక్కుకుంటూ ఆర్థిక పరిస్థితిని మెరుగుపరుచుకోటానికి ఆ కాలపరిమితి ఇవ్వబడింది.

✪ (పూర్తి వివరాలకోసం దరఖాస్తు ఫారంతోపాటు నియమనిబంధనలకు సంబంధించిన పత్రం యధాతధంగా ఇక్కడ ఇస్తున్నాం.)

# APPLICATION FOR EDUCATED UNEMPLOYED YOUTH UNDER

## "PRIME MINSTER'S ROZGAR YOJANA" SCHEME 199 -9

1. Name of the applicant with Date of Birth & Father/s Name :
2. Address for Corespondence :
3. Place of Residence during last three years :
4. Qualifications :
5. If unemployed furnish employment exchange Regn. No. and Date :
6. Whether the applicant belong to SC/ ST/ BC :

7. Type of industry/Service/Business activity proposed to be started and proposed plece of estaablishment the venture (brief project report and details of experience in the proposed line of activity to be given) :

8. Present annual income of the Family duly supported by the Affidavit :

9. Amount of Loan required :
   a) Machinery & Equipment :
   b) Other Fixed Assets :
   c) Working Capital, Total :

10. Whether taken loan from any Bank/ Financial institution of State/ Central Government. (Details in brief to be furnished) :

11. I certify that all information furnished by me is true :

12. Signature of the Applicant :

**Note :** Application should be submitted complete in all respects in Duplicate a long with attested copies of the following Documents.

1. Age certificate
2. Certificate of Qualification - Academic and Technical.
3. Ration Card or any other proof of Residency for 3 years.
4. Experience certificate, if applicable.
5. Passport size photograph to affix to application.

# SPECIMEN OF AFFIDAVIT TO BE SUBMITTED ALONG WITH THE APPLICATION ON RS. 10 NON JUDICIAL STAMP PAPER DULY ATTESTED BY OATH COMMISSIONER (NOTARY)

## AFFIDAVIT

I..............................................................................................

S/o., D/o.,W/o.......................................................................................

resident of ..............................District/State .............................

....................... do hereby solemnly affirm and declare as under:-

1. That I am unemployed.
2. That I am not in a position to muster my own capital for the project.
3. That I am a permanent resident of ......................... Since ..................... years.
4. That the family iscome of my family which includes spouse and parents is Rs.......................... per annum from all sources such as salary, wages, agricultural, income, business, rent, interest, pension etc.,
5. That I have not defaulted in repayment of loan from any nationalised bank/ financial institution/Co-op. Bank.
6. That I shall abide by the rules framed under the Scheme of PMRY for Educated Unemployed Youth.
7. That I shall submit the progress report required by the Bank/ Government.

DEPONENT

## VERIFICATION

Verfied that the above contents are true and correct to the best of my knowledge and belief and nothing has been concealed there in.

Date:

DEPONENT

I.............................................D/o..................................................

W/o........................... ......................................................................

# ప్రధాని రోజ్‌గార్ స్కీం గడువు పెంపు

ప్రధానమంత్రి రోజ్‌గార్ యోజన పథకం 94-95 సంవత్సరానికి కూడా కొనసాగించాలని కేంద్ర ప్రభుత్వం నిర్ణయించింది. అందులో భాగంగానే విద్యావంతులైన నిరుద్యోగుల నుంచి దరఖాస్తుల్ని స్వీకరించే గడువును జులై 15 వరకు పొడిగించినట్లు జిల్లా పరిశ్రమల కేంద్రం (విజయవాడ ఆటోనగర్) జనరల్ మేనేజర్ ఓ ప్రకటనలో తెలియజేశారు. నమూనా ఫారాన్ని మార్చి 25వ తేది పత్రికల్లో ప్రకటించినట్లు ఆయన గుర్తుచేశారు.

ఎంపికయిన అభ్యర్థులకు పారిశ్రామిక యూనిట్లు/ సర్వీసింగ్ యూనిట్లు/ వ్యాపార సంస్థలను నెలకొల్పుకునేందుకుగాను రూ 1.00 లక్ష వరకు రుణాలు మంజూరు చేయబడతాయి. అందులో రుణం తిరిగి చెల్లించబడిన యెడల రూ. 7,500/-ల పరిమితి లోబడి 15% సబ్సిడీగా పరిగణించబడుతుంది.

అవసరమయిన ముందు అర్హతలు దిగువ ఇవ్వబడినవి.

1. విద్యార్హతలు : మెట్రిక్‌లేషన్/ యస్.యస్.సి/ ఐ.టి.ఐ ఉత్తీర్ణత లేదా ప్రభుత్వముచే స్పాన్సర్ చేయబడిన కనీసం 6 నెలల వ్యవధి ఉండే సాంకేతిక కోర్సుయందు ఉత్తీర్ణత
2. వయస్సు : 18 నుండి 35 సంవత్సరాలు
3. ఆదాయం : కుటుంబ వార్షికాదాయం అన్ని వనరుల నుండి రూ. 24,000/- లకు మించరాదు.
4. నివాసం : దరఖాస్తుధారు ఆ ఏరియాలో కనీసం 3 సంవతురాల నుండి నివశిస్తున్న శాశ్వత నివాసి అయి ఉండాలి
5. రిజర్వేషన్ : యస్.సి/యస్.టిలకు 22.5% మరియు ఓ.బి.సిలకు 27% మహిళలకు ప్రాధాన్యత ఇవ్వబడును.
6. మార్జిన్‌మని : ఔత్సాహికుడు ప్రాజెక్ట్ ఖర్చులో 5% మొత్తాన్ని నగదుగా చెల్లించవలసి ఉంటుంది.

7. వడ్డీ : భారతీయ రిజర్వ్‌బ్యాంక్ ఆదేశాల మేరకు
8. బ్యాంకు రుణంపై
గ్యారంటీ : బ్యాంకు రుణంతో సమకూర్చుకోబడిన ఆస్తులను బ్యాంకులకు కుదవ ఉంచాలి.

సంబందిత జిల్లా పరిశ్రమల కేంద్రాల జనరల్ మేనేజర్ల కార్యాలయాల వద్ద దరఖాస్తుల స్వీకారపు గడువుతేదీ.... నిర్ణీత దరఖాస్తు ఫారాలను జిల్లా పరిశ్రమల కేంద్రం నుండి ఉచితంగా పొందవచ్చును.

## ముఖ్యగమనిక

1. అభ్యర్థులు ఎంచుకున్న ప్రాజెక్ట్ యొక్క స్వయం కరణ (శక్తి) మరియు ఉత్పత్తి లేదా కార్యకలాపాలకు విక్రయరంగంలో ఎంత గిరాకీ ఉంది అన్న విషయాలను ధరఖాస్తు భర్తీచేసే ముందు అధ్యయనం చేయాలి.
2. రుణాలను బ్యాంకు యొక్క తిరిగి చెల్లింపు షరతుల మేరకు వాయిదాలలో సక్రమంగా చెల్లించాలనియు అందుకు విఫలమయితే సివిల్/ క్రిమినల్ న్యాయం క్రింద చర్యలకు గురికావలసి వస్తుందని అభ్యర్థులు గమనించాలి.

ప్రభుత్వేతర సంస్థలు పాల్గొనవలసిందిగా కోరడమయింది.

ఈ పథకాన్ని కార్యరూపంలో పెట్టడంలో పేరొందిన ప్రభుత్వేతర సంస్థలు చాంబర్ ఆఫ్ కామర్స్ అండ్ ఇండస్ట్రీ ట్రేడ్ అండ్ ఇండస్ట్రీ అసోసియేషన్‌లు వగైరాలను చేర్చుకోవాలని ప్రతిపాదించబడుతుంది. గుర్తింపు, లబ్ధిదారుల ఎంపిక, ప్రాజెక్టు ప్రొఫైల్ వగైరా తయారీ వగైరాల ప్రభుత్వ సంస్థలు సహాయపడవచ్చును.

ఆస్తులు, విక్రయం రుణ: తిరిగి చెల్లించి వగైరాల విక్రయ నిర్వహణలో వారు రుణగ్రహీతలకు సహాయపవచ్చును. వారు లబ్ధిదారుల శిక్షణను కూడా చేపట్టవచ్చును. ఆసక్తిగల స్వచ్ఛంధ సంస్థలు మరియు అసోసియేషన్‌ల జిల్లా యొక్క జిల్లా పరిశ్రమల కేంద్రాన్ని లేదా పరిశ్రమల కమీషనర్ సదరు హైదరాబాద్‌వారిని సంస్థలు ఏ రకంగా పాల్గొనగోరుతున్నారో అట్టి వాటి నిర్దిష్ట స్వభావ ప్రతిపాదనలతో సంప్రదించ వలసిందిగా కోరడమైనది.

# A.P. ఎలక్ట్రానిక్ డెవలప్‌మెంట్ కార్పొరేషన్

ఎలక్ట్రానిక్ సంబంధమయిన ఉత్పత్తులకు ఈ సంస్థరుణాలను మంజూరు చేస్తుంది. అవసరమయిన టెక్నాలజీకి సంబంధించిన వివరాలను అందించి, ప్రోత్సాహపూరితమయిన సహకారాన్ని అందిస్తుంది. ఇంకా వివరాలు తెలుసు కోగోరువారం ఆసంస్థను డైరక్టుగా సంప్రదించటం మంచిది.

# ట్రైసం స్కీమ్

షెడ్యూల్‌కాస్ట్, మరియూ షెడ్యూల్ తెగలవారికి ఈ స్కీమ్‌లో చక్కటి సదుపాయాలు ఇవ్వబడ్డాయి. ముందుగా సాంకేతిక సంబంధమయిన విద్యలలో మూడు నెలలపాటు శిక్షణ ఇవ్వటం జరుగుతుంది. శిక్షణ కాలంలో తగిన ఉపకారవేతనం ఇవ్వబడుతుంది. ఎంపిక చేయబడిన సాంకేతిక విద్య, అంటే వెల్డింగ్, ఐరన్‌టూల్స్ తయారుచేయడం వంటి వాటిలో శిక్షణ ఇవ్వబడుతుంది. శిక్షణ పూర్తి అయిన తరువాత ఆయా శిక్షణలకు సంబంధించిన టూల్ బాక్స్‌లు ఉచితంగా ఇవ్వబడతాయి.

ఈ శిక్షణకోసం ఎంపిక అయ్యే యువతీయువకులు గ్రామీణ ప్రాంతాలకు, పల్లె, గూడెంవంటి ప్రదేశాలకు చెందిన వారయివుండి పదవతరగతి వరుకూ చదువుకున్నవారయి వుండాలి. చదువుకోనివారి కోసం కొన్ని ఎంపిక చేసిన విద్యలలో శిక్షణలు కూడా వున్నాయి.

ఈ స్కీమ్‌లో ఇంకా ఫిట్టర్‌వర్క్, రేడియో, మోటార్, ఎయిర్‌కండిషనర్ మొదలయిన వాటికి సంబంధించిన మెకానిజంలో శిక్షణ ఇవ్వటం జరుగుతుంది. ఈ స్కీమ్ క్రింద సైకిల్‌షాప్, మైక్‌సెట్, జనరల్‌స్టోర్స్, వెల్డింగ్ యూనిట్, డ్రైక్లీనర్‌షాప్, టీస్టాల్, బట్టల దుకాణం మొదలయిన వాటికి సబ్సిడీ ఇస్తూ రుణసహాయం అందించబడుతుంది.

# A.P. ఉమెన్స్ కో -ఆపరేటివ్ ఫైనాన్స్ కార్పొరేషన్

ఇది మహిళలకోసం ప్రత్యేకంగా స్థాపించబడిన ప్రభుత్వరంగ సంస్థ. ఈ స్కీమ్‌లో ఆడవారిని కూడా వ్యాపారం రంగంలో ప్రోత్సహించాలన్నదే ప్రధాన ఉద్దేశం ఈ స్కీమ్‌లో ఎంపిక చేయబడిన ఆడవారికి 10 నుండి 25 వేల రూపాయల వరుకూ ఆర్థిక సహాయం లభిస్తుంది. సులభవాయిదాల పద్ధతిలో తిరిగి చెల్లించే వీలుకూడా కల్పించబడింది. మీగతా వివరాలను A.P. ఉమెన్స్‌కో-ఆపరేటివ్ ఫైనాన్స్ కార్యాలయంలో సంప్రదించి తెలుసుకోవచ్చు.

## స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా స్త్రీశక్తి పథకం

స్త్రీలే యజమానులుగా పరిశ్రమలు నడిపేందుకు ఉద్దేశించబడినది ఈ పథకం. అయితే ఆర్థిక పరిస్థితి కాస్త మెరుగయిన ఆడవారు ఈ పథకం క్రింద స్థాపించదలుచు కున్న పరిశ్రమకి తమవంతుగా సగం పెట్టుబడి పెట్టవలసి వుంటుంది. ఈ స్కీమ్‌లోని నిబంధనలు తెలియచేస్తున్నాయి. ఆడవారు ఎన్నుకొని, తమతోపాటే మరికొంతమంది ఆడవారికి పనికల్పించేందుకు ఈ క్రింద ఇవ్వబడిన పరిశ్రమలలో ఏదోఒకటి ఎన్నుకోవచ్చు.

1. కాఫీగ్రైండింగ్ 2. ఆటోమేటిక్ జరాక్స్ మెషిన్ 3. టైలరింగ్ 4. పొటాటోచిప్స్ యూనిట్ 5. పాప్‌కార్న్ యూనిట్ 6. బేకరీ 7. పికిల్స్ 8. రెడీమేడ్ డ్రెసెస్ 9. ఫ్రూట్‌స్టాల్ స్వీట్ స్టాల్ 10. లేడీస్ టైలరింగ్ సెంటర్. 11. బాల్‌పాయింట్ పెన్ రీఫెల్స్ మేకింగ్ ఇంకా మరికొన్ని.

ఆయా యూనిట్‌ల నిర్వహణలో ఆడవారికి ఎనిమిది రోజులపాటు ప్రత్యేకమయిన శిక్షణకూడా ఇవ్వబడుతుంది. ఈ స్కీమ్‌లో అనేక ప్రోత్సాహకరమయిన రాయితీలు కూడా కల్పించబడ్డాయి. మరిన్ని వివరాలు మీకు అందుబాటులో స్టేట్‌బ్యాంక్ ఆఫ్ ఇండియా వారి బ్రాంచ్‌లలో విచారించి తెలుసుకోండి.

## A.P. స్టేట్ ఫైనాన్షియల్ కార్పొరేషన్ (ఎస్.ఎఫ్.సి)

ఈ సంస్థ పదివేలనుండి తొంభైలక్షల రూపాయల వరకూ ఋణసహాయాన్ని అందిస్తుంది. వడ్డీకూడా తక్కువే. తీసుకున్న ఋణాలను ఇన్‌స్టాల్‌మెంట్స్ పద్ధతిలో తిరిగిచెల్లించే చక్కటి సదుపాయం కల్పించబడింది. ఈ సంస్థ నుండి ఋణాలు పొందగోరే వారు మీరు స్థాపించదలుచుకున్న పరిశ్రమ తాలుకు ప్రాజెక్ట్ ఎస్టిమేషన్‌తో పాటుగా యంత్రపరికరాల వివరాలు, (కొటేషన్లతో సహా) లీజ్ ఒప్పంద పత్రాలు, ప్రొడక్ట్ మార్కెటింగ్ ప్రొసీజర్స్, దానికి మార్కెట్‌లో వున్న గిరాకీ మొదలయిన విషయాలను సమగ్రంగా వివరించే పత్రాల పొటోస్టాట్ కాపీలు దరఖాస్తు ఫారంలో జతపరచి పంపాల్సివుంటుంది. ఈ దరఖాస్తు ఫారాలు S.F.C. వారికార్యాలయంనుండి వారు అందించేవి మాత్రమే తీసుకుని ఉపయోగించాల్సి వుంటుంది. ఇంకా ఇతర వివరాలకు A.P. స్టేట్ ఫైనాన్షియల్ కార్పొరేషన్ సంస్థల్లో, సంప్రదించి తెలుసుకోవచ్చు.

# A.P. ఖాదీ అండ్ విలేజ్ ఇండస్ట్రీస్ బోర్డ్

ఇది గ్రామీణ పరిశ్రమలకూ, వాటి అభివృద్ధికి తోడ్పడేందుకు ఉద్దేశింపబడిన సంస్థ. ఈ బోర్డ్ పప్పుధాన్యాలూ, వంటనూనెలు, సోడాలూ, తోలు, మట్టిపాత్రలూ, మగ్గాలు, వడ్రంగిపని మొదలయిన నిర్దేశింపబడి చేతి పనులకు గ్రామీణ ప్రాంతాలలో పనిచేసే వారిని ఎంపిక చేసి వారికి తగిన రుణ సహాయాన్ని అందిస్తుంది. ఇతర వివరాలను ఆ సంస్థ ప్రాంతీయ కార్యాలయాల్లో సంప్రదించి తెలుసుకోవచ్చు.

# A.P. స్మాల్ స్కేల్ డెవలప్‌మెంట్ కార్పొరేషన్ (S.D.C)

పరిశ్రమ స్థాపించాలని నిర్ణయించుకున్నవారు ఈ సంస్థను సంప్రదించవలసిన ఎంతయినా వుంది. మీరెటువంటి పరిశ్రమ స్థాపించదలుచుకున్నా ఇండస్ట్రీకి సంబంధిచి అన్న వివరాలను ప్రాజెక్టు ఎస్టిమేషన్ రిపోర్ట్‌తో సహా మీ ముందుంచుతుంది. మార్కెటింగ్ వివరాలతోపాటు రామెటీరియల్స్, మెషినరీ దొరికే సంస్థల అడ్రస్‌లూ, ఆర్థిక సాంకేతికపరమయిన అనేక వివరాలను సమగ్రంగా మీకు అందిస్తుంది.

# నెహ్రూ రోజ్‌గార్ యోజన్

ఈ స్కీమ్ క్రింద ఆ సంస్థ సూచించిన పరిమిత ఆదాయం గలవారికి మాత్రమే నిర్దేశిత రుణాలను అందిస్తుంది. అప్లికేషన్ ఫారంతో పాటు కొన్ని నియమనిబంధనలతో కూడిన పత్రాలు కూడా ఇవ్వబడతాయి. దరఖాస్తుచేసేవారు ఆ నియమనిబంధనలు తప్పకుండా పాటించాల్సివుంటుంది. ఈ రుణాన్ని పొందగోరుతూ అప్లయ్ చేసేవారు అంతకుముందు ఏ ఇతర బ్యాంకులలోనూ, ఎలాంటి రుణాలు వుండకూడదు. ఈ స్కీమ్‌లో రుణాలు అందచేయటంతోపాటు కొన్ని విభాగాలకు సంబంధించిన ఉచిత స్వల్పకాలిక ట్రైనింగ్‌కూడా ఇవ్వబడుతుంది. బుక్ బైండింగ్, లాండ్రీ, రెడీమేడ్ దుస్తులు, ఇంకా ఆ పరిధిలో వున్న పథకాలకి రుణాలు అందచేయబడతాయి. రిజర్వ్‌బేంక్ ఆఫ్ ఇండియావారి నిబంధనలను అనుసరించి అనుమతిపొందిన నేషనలైజ్డ్ బ్యాంక్‌లు రుణాలను మంజూరు చేస్తాయి. షెడ్యూల్డ్ కాస్ట్, షెడ్యూల్డ్ ట్రైబ్‌కి చెందిన స్త్రీలకు 25 పర్శంట్ సబ్సిడితో అయిదువేలూ, మిగతా వారి అదే సబ్సిడీతో నాలుగువేలు రుణం లభిస్తుంది.

మరిన్ని వివరాలకు సంబంధిత బ్యాంక్‌లలో గానీ, తాలుకు ఆఫీసులో గాని విచారించి తెలుసుకోవచ్చును.

## A.P. స్టేట్ మైనారిటీస్ డెవలప్‌మెంట్ ఫైనాన్స్ కార్పొరేషన్

ఆర్థికంగా వెనుకబడిన వారికి ఈ సంస్థ రుణ సహాయాన్ని అందించటం ద్వారా వారి అభివృద్ధికి చేయూతను ఇస్తుంది. పదిహేనువేల రూపాయలలో చేపట్టగల వివిధ వ్యాపారాలకు ఈ రుణం ఇవ్వటంజరుగుతుంది. అంతేకాకుండా ఆటోవర్క్స్, బ్యాటరీసర్వీస్, వేవ్‌వర్క్, ఆటోఇంజనీరింగ్ వర్క్స్, రెస్టారెంట్, బేకరీఇంకా మరికొన్ని ఇదే పరిధిలో వచ్చేవాటికి లక్షరూపాలువరుకూ ఈ సంస్థరుణాలను అందిస్తుంది. ఇక్కడ ఒక ముఖ్యమయిన విషయం గమనించాలి. ఈ సంస్థ తమకున్న గ్రాంట్స్‌మేరకు కొన్ని కొన్ని సమయాలలో మాత్రమే స్కీమ్ ఓపెన్ చేస్తున్నట్టు ప్రకటనలు ఇస్తుంది. ఆయా సమయాలలో మాత్రమే రుణాలు పొందగోరే వారు దరఖాస్తు చేయాల్సి వుంటుంది. ఆ సంస్థ ఎంపికచేసిన వారికి మాత్రమే ఆ సంస్థ నుండి డైరక్ట్‌గా రుణం లభిస్తుంది. ఈ స్కీమ్ క్రింద మీకు కావాల్సిన రుణాన్ని పేర్కొంటు దరఖాస్తుతో పాటు మీ ఫొటోలూ,టెక్నికల్, నాన్‌టెక్నికల్ విద్యార్హతలూ, కుటుంబవార్షికాదాయానికి సంబంధించిన ధ్రువీకరణ పత్రాలు జతచేయాల్సివుంటుంది. దరఖాస్తును పై సంస్థకి సంబంధించిన డిస్ట్రిక్ ఇండస్ట్రీస్ సెంటర్‌కి పంపాల్సివుంటుంది.

## స్మాల్‌స్కేల్ ఇండస్ట్రీస్ డెవలప్‌మెంట్, బ్యాంక్ ఆఫ్ ఇండియా (SIDBI)

వివిధ బ్యాంక్‌లద్వారా, ఫైనాన్స్ కార్పొరేషన్‌ల ద్వారా చిన్న తరహా, కుటీర, గ్రామీణ పరిశ్రమలకు పై సంస్థ అందజేస్తుంది. సింగిల్ విండో పథకం ద్వారా (సూచించిన నియమనిబంధనలును పాటిస్తూ) ఇరవై లక్షల రూపాయలవరుకూ సహాయాన్ని పొందేవీలుంది. ఇంకా ఇతర వివరాలకు స్థానిక S.B.I బ్యాంక్‌లలో సంప్రదించండి.

## ఛీఫ్ మినిస్టర్ ఎంపర్‌మెంట్ ఆఫ్ యూత్

రాష్ట్రజనాభాలో రెండున్నర కోట్లకు పైగా వున్న నిరుద్యోగ యువతీయువకులను దృష్టిలో వుంచుకుని స్వయం ఉపాధికల్పించటం ద్వారా వారి స్వయం శక్తిని వెలికి తీసి అభివృద్ధి పథ్థం వైపు నడిపించేందుకు రూపొందించబడిన పథకం ఇది. 1996వ సంవత్సరంలోనే ఈ పథకానికి పునాది వేయటం జరిగింది. దేశం మొత్తం మీద ఏ రాష్ట్రంలోనూ ఇటువంటి పథకం లేదనే చెప్పాలి. రూపొందించటంలో పరిపెట్టుకోకుండా దానిని అమలుపరున్నా గత ఆర్థిక సంవత్సరంలో అంచనాలమేరకు యువతీయువకులకు ఈ పథకం క్రింద రుణాలను అందించటం ఆనందించ దగిన

విషయం (1996-97 ఫైనాన్షియల్ ఇయర్‌లో ప్రభుత్వం ఈ పథకం క్రింద నూటయాభైకోట్ల దాకా రుణాలు అందచేయటం జరిగింది). ఈ రుణసహాయంతో యువతీయువకుల అధ్వర్యంలో ఇప్పటికీ ఇంచుమించు 2000 యూనిట్స్ పనిచేయటం ప్రారంభించి ఉత్పత్తులను విడుదలచేస్తున్నాయి. ఈ పథకంలో భాగంగానే ఆయా జిల్లాలకు నిర్దేశిత గ్రాంట్స్ విడుదల చేయబడతాయి. దరఖాస్తు చేసుకున్న అభ్యర్థులలో అర్హతలను బట్టి ఎంపిక చేసినవారికి ఈ రుణసౌఖర్యం కల్పించబడుతుంది.

ఈ పథకాన్ని ఉపయోగించుకుని స్వయం ఉపాధి పొందగోరే యువకులు ఇతర స్కీమ్‌లలోలాగా రుణంకోసం బ్యాంక్‌ల చుట్టూ తిరగవలసిన అవసరంలేదు. అందుకు అవసరం అయిన చర్యలు ఈ పథకంలో తీసుకోబడ్డాయి. లక్షరూపాయలకు మించని ప్రాజెక్ట్‌లకు ఎటువంటి హామీలు లేకుండా ఒక పద్ధతి ప్రకారం రాష్ట్ర ప్రభుత్వమే డైరక్టుగా 75 వేలు రుణాన్ని అందిస్తుంది. మిగిలిన రుణం K.V.B.I., మహిళామైనారిటీ కార్పోరేషన్స్, ఎస్.టి.బి.సి., డి.ఆర్.డి.ఎ.ల నుండి పొందవలసి వుంటుంది.

**ఈ పథకంలో ప్రాధాన్యతను ఇచ్చే ప్రాజెక్ట్‌లు కొన్ని........**

గొర్రెల పెంపకం, చిన్న నీటిపథకాలు, చేపల పెంపకం, రొయ్యల పెంపకం, పుట్టగొడుగుల పెంపకం, చేపల, రొయ్యల పీడింగ్ కనెక్షన్, శార్డెనింగ్, మార్కెటింగ్, విత్తనాల ఉత్పత్తి, పండ్లతోటల నర్సరీ, ఫ్లోర్‌కల్చర్, అగ్గిపుల్లలూ, కొవ్వొత్తులూ, అగరువత్తులు తయారీలు, పేపర్, కోళ్లపరిశ్రమలు, హేండ్‌లూమ్స్, అల్యూమినియం, కేన్, కట్టువెదురు ఉత్పత్తులు, ఇంకా ఇలాంటి మరికొన్ని పరిశ్రమలను సి.యం.ఇ.వై పథకం నుండి రుణాలను పొందేందుకు అవకాశం కల్పించబడింది. ఈవిధంగా పొందే రుణంలో 20 వేల రూపాయలు మాత్రమే తిరిగి చెల్లించాల్సి వుంటుంది.

అంతేకాకుండా.....

ఈ పథకం క్రింద పేదరిక నిర్మూలన స్కీమ్ పేరిట పేదవారికి పదివేల రూపాయల దాకా రుణం అందించబడుతుంది. కిరాణా, పాన్‌షాప్, సైకిల్ రిపేరింగ్, తోపుడుబండి, కమ్మరి, వడ్రంగం, రిక్షా, పండ్లదుకాణం, కూరగాయల దుకాణం, ప్లాట్‌ఫారం దుకాణదారులు మొదలయినవారికి ఈ రుణాలు ఇవ్వబడతాయి. ఈ రుణాలకు సంవత్సరానికి, నూటికి నాలుగు రూపాయలవడ్డీతో అంటే.... నెలకు నూటికి 33.3 పైసల స్వల్ప వడ్డీతో 20 వాయదాలలో తిరిగి చెల్లించాలి.

ఇంకా......

ఈ రుణాన్ని ఏవిధంగా పొందాలి?

సింగిల్ విండో పథకం అంటేఏమిటి?

ఆర్థిక సంస్థల సహకారం, ఏయే పరిశ్రమలకు ఎంతెంత రుణాలు ఏవిధంగా అందించబడతాయి? ఏయే వ్యాపార విభాగాలకు ఏయే సర్వీస్ విభాగాలకు ఎంతెంత రుణాలు ఇవ్వబడతాయి? సింగిల్ విండో పథకం అంటే ఏమిటి? మొదలయిన వివరాలను తెలుసుకోవాలంటే ప్రతిమండల కేంద్రాలలోనూ, జిల్లాకేంద్రాలలోను వున్న సంబంధిత అధికారులను సంప్రదించవలసి వుంటుంది.

ఈ విషయంలో ఇతరులు అందించే సమాచారాన్ని గురించి ఎదురుచూడకుండా ఎవరికి వారే స్వయంగా ఆ అధికారులను కలిసి వివరాలను అడిగి తెలుసుకోవటం, అవసరం అయిన దరఖాస్తుఫారాలను పొందటం మంచిది.

## మహిళలకు మరికొన్ని స్వయం ఉపాధి పథకాలు

ఆర్థికాభివృద్ధిసాధించి, స్వతంత్రులుగా జీవించాలనుకునే మహిళ ఆశయాలను వారి ప్రయత్నాలను గుర్తించి, వారు యితరులమీద ఆధారపడకుండా తమకాళ్ళమీద తాము నిలబడేందుకు వీలుగా ప్రభుత్వం వివిధరకాల పథకాలను రూపొందించి అమలుచేస్తూనే వుంది. అటువంటి మహిళలను వివిధ రంగాలలో శిక్షణ ఇచ్చేందుకు ప్రత్యేక బ్యాంకులూ, ఆప్టెక్ వంటి సంస్థలు కొన్ని ప్రత్యేకమయిన కార్యక్రమాలను రూపొందించి అమలుపరుస్తున్నాయి. చదువురాని మహిళలు కూడా కొన్ని వృత్తివిద్యలలో శిక్షణను ఇచ్చి రుణసహాయం కూడా అందించబడుతోంది.

## ఆర్థికసహాయాన్ని అందించే వివిధ పథకాలు

**కాంపోజిట్ పథకం:-** అయిదు లక్షలకు మించని జనాభా వున్న ప్రాంతంలోనే ఈ రుణసౌకర్యం పొందేందుకు వీలుంది. ఈ పథకం క్రింద రు.50,000 వరుకూ ఆర్థిక సహాయం అందించే వీలుంది అప్పు తీర్చటానికి 3 సంవత్సరాలనుండి 10 సంవత్సరాలవరుకూ కాలపరిమితి వుంటుంది.

**సింగిల్ విండో పథకం:-** స్వయం ఉపాధి రుణాల నిమిత్తం యువతీయుకులు బ్యాంక్‌ల చుట్టూ తిరిగే అవసరం లేకుండా లక్ష రూపాలయకు మించని ప్రాజెక్టులకు సెక్యూరిటీ నిబంధనల వంటివి లేకుండా డైరక్టుగా ప్రభత్వంనుండి రుణాలు అందించేందుకు ఈ పథకం వీలుకల్పిస్తోంది.

**మాజీసైనికులకు ప్రత్యేక పథకం:-** శారీరక సంబంధమయిన శక్తి సామర్థ్యాలను పోగొట్టుకున్న సైనికుల, మాజీసైనికుల, సైనికుల వితంతువులూ ఈ పథకం

క్రింద ఆర్థిక సహాయం పొందటానికి అర్హులుగా ప్రకటించబడ్డారు. మొత్తం ప్రాజెక్ట్ విలువ 12 లక్షలలోపు వుండాల్సిన ఈ పథకం తాలుకు రుణాన్ని పొందగోరే వారు రవాణా వెహికల్స్ విషయంలో తప్ప మిగతా దేనికీ సెక్యూరిటీ, హామీలవంటివి ఇవ్వనవసరం లేదు.

**సాధారణ రుణ పథకం:-** ఈ పథకం క్రింద మధ్యతరహా, చిన్న తరహా పరిశ్రమల స్థాపనకు సొంత యాజమాన్యం, భాగస్వామ్యం, ప్రయివేట్, పబ్లిక్ లిమిటెడ్, కో.ఆపరేటివ్ యూనిట్‌లన్నీ రుణసహాయం పొందటానికి అర్హతను కలిగి ఉంటాయి.

**రవాణా రుణ పథకం:-** వస్తు సామగ్రిని ట్రాన్స్‌పోర్ట్ చేసేందుకు వాహనదారులు స్థిరాస్థులు తాకట్టుపెట్టటం ద్వారా సిరాస్థి విలువలో సగభాగం రుణంగా పొందటానికి ఈ పథకం వీలు కల్పిస్తున్నది. ఈ విషయంలో చిన్న వాహనాలపై కూడా రుణాలు మంజూర్ చేసేందుకు అవకాశం వుంది.

**క్వాలిటీ కంట్రోల్ పరికరాల ఏర్పాటుకు:-** స్థాపించబడిన పరిశ్రమల వారు తమ ప్రొడక్ట్ నాణ్యతను మెరుగుపరుచుకుంటూ మార్కెట్‌ని పెంచుకోటానికి క్వాలిటీ కంట్రోల్ ఏర్పాటుచేసుకుంటే ఈ పథకం క్రింద రుణ సౌకర్యం పొందేందుకు వీలుంది. ఈ పథకం క్రింద మాగ్జిమమ్ 7,5,000 రూపాయలు రుణంపొందే అవకాశం వుంది. పాత యంత్ర పరికరాలపై రుణం లభించదు.

**ఎక్విప్‌మెంట్ రీఫైనాన్స్:-** స్థాపించబడి, రన్నింగ్‌లో వున్న పరిశ్రమల వారు విదేశీయంత్రాలను దిగుమతి చేసుకోటానికి స్వదేశంలో కొత్త యంత్రాలు కొనుగోలు చేసుకోటానికి ఈ పథకం క్రింద రుణాలు ఇచ్చే అవకాశం వుంది. ప్రాజెక్ట్‌లను మోడరేట్ చేయుట, లేక విస్తరించుటకు, రుణం పొందవచ్చు.

**ప్రయివేట్ పారిశ్రామికవాడల ఏర్పాటు పథకం:-** సెమీ అర్బన్‌ప్రాంతాలలోనూ, అవకాశాలువున్న గ్రామీణ ప్రాంతాలలోను పారిశ్రామిక వాడగాగానీ, పారిశ్రామిక ప్రాంతంగాగానీ అభివృద్ధి పరచదలుచుకుని ముందుకు వచ్చే ఉత్సాహ వంతులయిన వారికి ఈ పథకం క్రింద ఆర్థిక రుణాలు అందచేయబడతాయి.

**హోటల్స్:-** ఈ పథకంలో ప్లేస్, బిల్డింగ్, మెషినరీ, ఫర్నిచర్, కట్లెరీ, క్రోకరీ మొదలయిన సామానులకు సహాయం అందించే అవకాశం వుంది. టూరిజం డిపార్ట్‌మెంట్ వారిచే అనుమతి పొందిన స్టార్, నాన్‌స్టార్ హోటళ్ళ నిర్మాణం పనులు చేపట్టటానికి దీర్ఘకాల .రుణసహాయాన్ని మంజూరు చేసే విషయం పరిశీలించబడుతుంది.

**ఐ.డి.బి.ఐ. సీడ్ కేపిటల్ అసిస్టెన్స్ పథకం:-** కనీసపు విద్యార్హత లేకపోయినప్పటికీ స్థాపించనున్న పరిశ్రమకు సంబంధించి, తగినంత అనుభవం, నైపుణ్యం కలిగినవారికి పారిశ్రామిక, సాంకేతిక కర్తలకు ఇంకాఇతర ఆర్టిస్ట్‌లకు ఈ పథకం క్రింద ఋణాలు ఇవ్వబడతాయి. అయిదు సంవత్సరాల తరువాత నుండి ఋణాల తిరిగి చెల్లించే సదుపాయం ఈ పథకం కలగచేస్తున్నది.

**మీకున్న అవకాశాలనుబట్టి స్థాపించుకునేందుకు వీలయిన కొన్ని ముఖ్యమైన పరిశ్రమలు:-**

1. **వస్త్రపరిశ్రమ:-** 1.గుడ్డతో బొమ్మలు తయారుచేయుట 2. కొవ్వొత్తులు 3. ఎంబ్రాయిడరీ 4. దారపు వుండలు 5. గాజుగుడ్డ 6. రెడీమేడ్ దుస్తులు 7. కాటన్‌సాక్స్, మరియు బనియన్స్ 8. అద్దకం చీరలు 9. ఇంకా మరికొన్ని.
2. **సహజనైపుణ్యం కలిగిన సాంకేతిక పరిశ్రమ :-** 1. గుండుసూదులు 2. అల్యూమినియం పాత్రలు 3. సైకిల్స్ అసెంబ్లింగ్ 4. వడ్రంగిపని 5. రేకు డబ్బాలు చేయటం 6. కమ్మరిపని 7. సంగీత వాయిద్య పరికరములు 8. ఎరువులు తయారీ 9. బయోగ్యాస్ ప్లాంట్ 10. ఎలక్ట్రానిక్ క్లాక్స్ 11. సైకిల్ రిక్షాబాడీలు 12. గ్లాసులు, సీసాలు 13. రేడియో అసెంబ్లింగ్ 14. మోటార్ వైరింగ్ 15. లాగుడుబండ్లు, ఎద్దుబండ్లు 16. కేసెట్ రికార్డింగ్17. గొడుగులు 18. చేతితోచేయు ఇత్తడి, రాగి పాత్రలు 19. వైర్‌నెట్స్ 20. మలచబడిన కొయ్యసామగ్రి 21. ఓల్టేజిస్టెబిలైజర్స్ 22. అయిరన్ గ్రిల్స్. 23. బోల్టులు, రివిట్లు 24 T.V. ఏంటిన్నాలు 25. ఇనుప మంచాలు, బకెట్లు.
3. **ఆహార సంబంధమైన పరిశ్రమలు:-** 1. ఫ్రూట్స్, మరియు వెజటబుల్ ప్రిజర్వేషన్ 2. ఫ్రూట్ జ్యూస్ పికిల్స్ తయారుచేయటం 3. రాగులు శుభ్రపరుచుట 4. పప్పుధాన్యాలు సుగంధ ద్రవ్యాలు మొదలయినవి విక్రయించుట 5. జీడిపప్పు తయారీ 6. చాపలు తయారీ 7. తాటి బెల్లం తయారీ 8. చెరకు, బెల్లం పంచదార తయారుచేయుట 9.మసాలా, సాంబారుపొడులు, 10. బ్రెడ్, బిస్కట్స్, కేక్స్ మొదలయిన బేకరీ ఉత్పత్తులు 11. ఫ్రూట్‌జామ్‌లు 12. స్వీట్‌స్టాల్ 13. ఫాస్ట్‌ఫుడ్ స్టాల్ 14. తేనె నిల్వచేయుట 15. కూల్‌డ్రింక్స్ - ఐస్ క్రీమ్ 16. అరటి, బంగాళాదుంపల చిప్స్ 17. పాప్‌కార్న్ 18. పికిల్స్ 19. టిన్‌ఫుడ్స్ (నిలువ వుండేవి) 20. ఇంకామరికొన్ని.
4. **సర్వీసింగ్ ఇండస్ట్రీస్:-** 1 మేసనరీ 2. నేతపని 3. రీలింగ్‌యూనిట్ 4. సైకిల్ రిపేరింగ్ 5. లాండ్రీపని 6. టైర్స్‌వల్కనైజింగ్ 7. ఆర్ట్‌బోర్డ్ పెయింటింగ్

8. పంపుసెట్లు, స్ప్రే పరికరాల రిపేర్ 9. క్షీరవృత్తులు 10. ఎలక్ట్రానిక్స్ రిపేర్ 11. కాడ్‌స్పీకర్లు రిపేర్ 12. ఎయిర్‌కండిషనర్ రిపేర్ 13 వాచ్‌రిపేర్ 13. బ్యాటరీ ఛార్జింగ్ 14. డీజిల్ ఇంజన్స్ రిపేర్ 15. మోటార్‌వాహనాల రిపేర్ 16. గ్యాస్ స్టౌ రిపేర్ 17. ఎలక్ట్రిక్ వైరింగ్ 18. ఇంకా మరికొన్ని.

5. **రసాయనిక మరియు పాలిమర్ పరిశ్రమలు:-** 1. హెయిర్ ఆయిల్స్ 2. డిటర్జెంట్ సోప్, మరియు పౌడర్లు 3. కర్పూరం బిళ్లలు 4. సీలింగ్ వేక్స్, మైనపు వత్తులు 5. రబ్బరు వస్తువులు 6. లెదర్ 7. సబ్బు 8. ప్లాస్టిక్ కవర్డ్ వస్తువులు 9. తిలకం 10. వంటనూనెలు, ముఖ్యావసర ఆయిల్స్ 11. గోరింటాకు 12. కొమ్ములతో , దంతములలో వస్తువులు తయారు చేయుట 13. రెగ్జిన్ మరియు పి.వి.సి వస్తువులు 14. షాంపూ 15. నెయిల్‌పాలిష్ 16. సాంబ్రాణి వత్తులు 17. కలరావుండలు 18. కాటుక 19. ఆఫ్టర్‌షేవ్ లోషన్ 20. హెయిర్ డై.

6. **ఖనిజ సంబంధమైన పరిశ్రమలు:-** 1. గాజుల తయారీ 2. రంగోళీ తయారీ 3. వార్నీష్ 4. ప్లాస్టర్ ఆఫ్ పారిస్ 5. బంగారు, వెండి వస్తువుల తయారీ, 6. రాతి పలకలు 7. బలపములు, సుద్దముక్కలు 8. డిస్టెంపర్ 9. రాయి, గవ్వమొదలయిన వాటితో వస్తువుల తయారీ 10. క్లీనింగ్ పౌడర్ 11. వంట చెరకు 12. దేశవాళీసున్నం 13. రాళ్ళుకొట్టుట, రాళ్ళుచెక్కటం 14. సింథటిక్ పదార్థాలతో వస్తువుల తయారీ 15. ప్లాస్టిక్‌వస్తువులు 16. కుమ్మరి పరిశ్రమ 17. గ్రానైట్స్ 18. పెయింట్స్ 19. గాజువస్తువులు తయారుచేయుట 20. రాతితో వాడుక వస్తువుల తయారీ.

7. **అటవీ సంబంధమైన పరిశ్రమలు:-** 1. నారపరిశ్రమ 2. ఫోటోఫ్రేమ్స్ 3. చీపుళ్లతయారీ 4. అటవీసంబంధమైన ఫలసాయములు భద్రపరుచుట 5. కుష్‌తట్టీలు 6. చేత్తో కాగితం తయారీ 7. జిగురు 8. లక్క 9. గుగ్గిలం 10. కాచుతయారుచేయుట 11. అగ్గిపెట్టెల పరిశ్రమ 12. అగరవత్తులు 13. బాణాసంచా 14. ఫ్రేము వర్క్స 15. కాగితం సంచులు, కప్పులు, పళ్లెములు. 16. నోట్‌బుక్స్ బైండింగ్ 17. పేపర్‌కవర్స్ 18. వివిధ రకాల స్టేషనరీ 19. అట్టపెట్టెలు 20. వెదురుతో వస్తువుల తయారీ ఇంకా మరికొన్ని.

8. **వ్యాపార విభాగములు:-** 1. ఎలక్ట్రికల్ షాప్ 2. హార్డ్‌వేర్ షాప్ 3. పిండిమర 4. ఆటోరిక్షా 5. జెరాక్స్‌కాపీయింగ్ 6. ఫొటోస్టూడియో 7. ఫ్యాన్సీషాప్ 8. ప్రొవిజన్ స్టోర్ 9. బుక్‌స్టాల్ 10. స్టేషనరీ షాప్ 11. కూల్‌డ్రింక్స్ మరియు ఐస్‌క్రీమ్ పార్లర్ 12. రెడీమేడ్ దుస్తుల షాపు 13. టైప్ ఇనిస్టిట్యూట్ 14. పాన్‌షాప్ 15. జ్యూస్‌స్టాల్ మరియు టీస్టాల్.

# పబ్లిసిటీ మేటర్

ఈకాలంలో ఇంచుమించు ప్రతి వ్యాపారం పబ్లిసిటితో ముడిపడివున్నదని చెప్పక తప్పదు. మీరు తయారుచేసే వస్తువు ఏదైనా సరే, ఎంత నాణ్యమయినదయినా సరే దానికి అదనపు ఆకర్షణగా పబ్లిసిటీ వుండి తీరాల్సిందే. వివిధ కంపెనీల వారు తమ ఉత్పత్తి విలువలనూ ఉపయోగాలను తెలియచేస్తూ ఎంత విస్తృతంగా ప్రచారం చేస్తున్నారో మీరు T.V. లలో చూస్తునేవుంటారు.

కొనేవారిని ఆకర్షించటానికి, అమ్మకాలను సులభతరం చేసి మార్కెట్‌లో వస్తువు గిరాకీని పెంచటానికి నూతన విధానాలను అనుసరిస్తూ పబ్లిసిటీ ఇవ్వవలసిన అవసరం ఎంతయినా వుంది. ఈ రోజులలో పబ్లిసిటీ అనేది వస్తు విక్రయాలకు ఆయు పట్టువంటిది. మీరు ఇచ్చే పబ్లిసిటీ ఎప్పుడూ మాగ్నటిక్ పవర్, లేక మేజిక్ పవర్ గలిగినంత ఎట్రాక్టివ్ గా వుండాలి. వస్తువు నాణ్యతనూ, ఉపయోగాన్ని వినియోగదారులకు చక్కగా మనసుకు హత్తుకుపోయేలా వివరించగలగాలి. పబ్లిసిటీని బట్టి మీ వస్తువు మీంచి దృష్టిమరల్చుకోనీయకుండా చేయాలి.

పబ్లిసిటీకి సాధ్యమయినంత ఎక్కువ డబ్బు కేటాయించాలి. వస్తువు అమ్మకాలకు పబ్లిసిటీయే మూలధారం. పబ్లిసిటీ చాలా క్షుణ్ణంగా వుండాలేతప్ప వినియోగదారుని మభ్యపెట్టేందుకు ప్రయత్నించేదిగా వుండకూడదు.

ఈ రోజులలో ఉత్సవాలు జరుపుకునే దేవుడికి కూడా పబ్లిసిటీ అవసరం అయింది.

మీరు చూస్తూనేవుంటారు. కుంభాభిషేకాలు జరిగినప్పుడూ, బ్రహ్మోత్సవాలు జరిగినప్పుడూ ఇంకా పర్వదినాలలో విశేషమయిన పూజలు జరుగుతున్నప్పుడూ ఆ వివరాలను T.V. లలో తెలియచేయటం, వాల్‌పోస్టర్లు అందించటం, పాంప్లెట్స్ పంచిపెట్టటం వంటి పద్ధతుల ద్వారా ఆలయ కమిటీవారు ప్రచారం చేస్తుంటారు.

మనిషిని సృష్టించిన దేవుడికే తప్పని ఆ ప్రచారం మనిషి తయారుచేసిన వస్తువుకి ఇవ్వటం అవసరమే కదా! పబ్లిసిటీ ఎంత పకడ్బందీగా విస్తృతంగా వుంటే వస్తువు అమ్మకాలు అంత అభివృద్ధి చెందుతాయి. అమ్మకాలు అభివృద్ధి చెందితే ఆశించిన లాభాలు కూడా అంచనాల మేరకు వుంటాయి.

# టూత్ పేస్ట్

*ప్రస్తుతం మార్కెట్‌లో టూత్‌పేస్ట్‌లకు వున్న గిరాకీని గురించి ప్రత్యేకించి చెప్పనవసరం లేదు. కలవారు మొదలుకొని సామాన్యుల వరకూ టూత్‌పేస్ట్‌లు వాడటం విపరీతంగా పెరిగిపోయింది. తక్కువ పెట్టుబడితో కొద్దిగానూ, అమ్మకాల డిమాండ్‌ను పెంచుకుంటూ భారీగానూ, ఈ టూత్‌పేస్ట్‌లు తయారు చేయవచ్చును. నాణ్యతను అందిస్తూ, ప్రచార సంబంధమయిన విషయాలలో ఇతర టూత్ పేస్ట్‌లతో పోటీ పడగలిగితే మీ రాబడి అంచెలంచెలుగా పెరిగి మీ సంస్థమీరు ఊహించని రీతిలో అభివృద్ధి చెందుతుంది.*

**'రా' మెటీరియల్స్ (ముడిసరుకులు):** 1. గ్లిసరిన్ 2. కాల్షియం పాస్ఫేట్ 3. మెగ్నిషియం ఆక్సయిడ్ 4. ప్రెసిపిటేటెడ్ చాక్ 5. మెగ్నిషియం ట్రిసిలికేట్ 6. సోడియం లారిల్ సల్ఫేట్ 7. షుగర్ 8. ప్యూమిస్‌పౌడర్ 9. క్లోరోఫిల్. 10. ఆల్కాహాల్ 11. సుగంధ ద్రవ్యాల మిశ్రమము (పన్నీరు, పిప్పర్మెంట్, లావండర్ లవంగాలు మొదలయిన వాటి ఆయిల్)

**యంత్రసామగ్రి:-** 1. కొలాప్సబుల్ ట్యూబులు 2. ట్రిపుల్ రోల్‌టైపు గ్రైండర్ లేదా హోమోనైజర్ 3. పేస్ట్ ఫిల్లింగ్ యంత్రం 4. క్రింపింగ్ మెషిన్ 5. ఫార్ములా మిశ్రమములను కలిపేందుకు అవసరం అయిన పాత్రలు. 6. పేకింగ్ మెటీరియల్ (ట్యూబ్సుసైజుని బట్టి) పై పేకింగ్‌కి సంబంధించి వివిధ సైజ్‌ల బాక్స్‌లు వాటిని తయారు చేసే వారి వద్ద కాంట్రాక్ట్ పద్ధతిలో తయారుచేయించుకోవచ్చు.

**ఫార్ములా:-** గ్లిసరిన్, ఆల్కాహాల్ సమపాళ్ళలో తీసుకోవాలి! కాల్షియం పాస్ఫేట్ 200 గ్రాములు. ప్రెసిపిటేడ్ చాక్ 600 గ్రాములు. మెగ్నిషియం ఆక్సైడ్ 100 గ్రాములు. సోడియం లారిక్ సల్ఫేట్ - 20 గ్రాములు. షుగర్ 10 గ్రాములు. ప్యూమిస్ పౌడర్ 20 గ్రాములు మెగ్నిషియం ట్రైసిలికేట్ 100 గ్రాములు. క్లోరోఫిల్ 2 1/2 మిల్లీ లీటర్ సుగంధ ద్రవ్యాల మిశ్రమ అయిల్ 20 మిల్లీలీటర్లు.

మిశ్రమాలను కలిపే విషయంలో అర గ్రామునుండి అయిదు గ్రాముల వరకూ పాళ్ళలో మార్పులూ, చేర్పులు చేసుకుంటూ....మంచిక్వాలిటీ వచ్చేలా ప్రయత్నించండి. అలా వచ్చిందనుకున్నప్పుడు...మీరు ఏయే ముడిసరుకును ఎన్నెన్ని పాళ్ళలో కలిపారో

వివరంగా ఒక కాగితం మీద వ్రాసుకుని, మీకంటూ ఒక ప్రత్యేకమయిన ఫార్మ్యులాన తయారుచేసుకోండి. ఆ ఫార్మ్యూలా వివరాలు మీకు తప్ప మీ కుటుంబంలోని ఇత సభ్యులకు తెలియకుండా రహస్యంగా దాచుకోవటం చాలా అవసరం.

**తయారు చేయు విధానం:-** ముందుగా ఆల్కాహాల్ గ్లిజరిన్‌లు మిశ్రమం చేయాలి; మెగ్నిషియం ఆక్సయిడ్, సోడియం లారిక్ సల్ఫేట్ షుగర్, ప్యూమిస్ పౌడర్ మెగ్నిషియం ట్రైసిలికేట్, కాల్షియం పాస్ఫేట్, ప్రెసిపిటేటెడ్ బాక్ మొదలయిన వాటిని మెత్తటి పొడర్లుగా చేసి, ఆల్కాహాల్, గ్లిజరిన్‌లు మిశ్రమములో వేసి బాగా కలపాలి. ఆ తరువాత దానిని పోమోనైజర్‌లో వేస్తే మెత్తటి పేస్ట్‌లా తయారవుతుంది....పోమోనైజర్‌లో వేయటానికి ముందే సుగంధ ద్రవ్యాల మిశ్రమాన్ని దీనిలో కలపాలి. ఇదే పేస్ట్ రంగులలో కావాలంటే అందుకు అవసరం అయిన కార్బోజిన్‌రెడ్, క్లోరోఫిన్ గ్రీన్...వేన్‌టార్ ట్రాజైన్ ఎల్లో మొదలయినవి వాడుకోవచ్చు. ఆ తరువాత పేస్ట్‌ను కొలాప్సబుల్ ట్యూబుల్‌లోకి ఎక్కించి పేకింగ్ చేయాలి.

పై పేకింగ్ బాక్స్‌లపై వుండవలసిన డిజైన్ విషయంలోనూ, మీ ప్రొడక్ట్ పేరు విషయంలో తగిన శ్రద్ధ వహించటం అవసరం. మీ టూత్ పేస్ట్‌పేరూ, పై పేకింగ్ బాక్స్ అందంగా ఆకర్షణీయంగా, చూడగానే కస్టమర్‌లను ఆకట్టుకునేలా వుంటే అమ్మకాలు బాగుంటాయి.

**మీ ప్రొడక్టుకోసం కొన్ని పేర్లు:-** 1. సన్నీడెంట్ 2. ఎర్లీమార్నింగ్ 3. గుడ్‌విల్ 4. ప్రెష్‌టాక్ 5. సూర్యకిరన్ 6. స్ట్రాంగ్ అండ్ ప్రెష్ 7. లిటిల్ స్టార్స్ 8. బ్యూటీస్మైల్ 9. గుడ్‌లక్ 10. సెక్యూరిటీ.

**ముఖ్యగమనిక: –** పేస్ట్ తయారుచేయటానికి రాష్ట్ర ఫుడ్ అండ్ డ్రగ్స్ అడ్మినిస్ట్రేషన్ వారి కార్యాలయం నుండి అనుమతి (లైసెన్స్) పొందటం తప్పనిసరి.

పేస్ట్ తయారుచేయటానికి ఉపయోగించే యంత్రసామగ్రి బొంబాయి కలకత్తా, ఢిల్లీ, మద్రాస్ మొదలయిన ప్రధాన నగరాలలో దొరుకుతాయి. ట్యూబులు కావాల్సిన సైజులలో కన్నాట్ ప్లేస్ - న్యూఢిల్లీలో లభిస్తాయి.

# టాయిలెట్ సోప్

*నిత్యావసర వస్తువులలో టాయిలెట్ సబ్బులు చాలా ముఖ్యస్థానం వహిస్తాయి. శరీరం మీది మలినాన్ని వదిలించే ఈ టాయిలెట్ సబ్బులను సొంతంగా తయారుచేసి అమ్మటం లాభసాటి వ్యాపారం. అయితే ఇందుకు కొంత సాంకేతిక పరిజ్ఞానం అవసరం. ఎప్పటికప్పుడు ఏదో ఒక కొత్త టాయిలెట్ సబ్బు మార్కెట్‌లోకి విడుదల చేయబడుతున్న ఈ పరిస్థితులలో మీరు సొంతంగా తయారుచేసిన సబ్బులను మార్కెట్ చేసి సక్సెస్ కావటం అనేది మీ దీక్ష, పట్టుదల, స్వయం కృషిలమీద ఆధారపడి వుంది.*

**'రామెటీరియల్స్- (ముడిసరుకులు):-** 1. కొబ్బరినూనె 2. టాలో.. 3. ఆముదం 4. కాస్టిక్ సోడా (కాస్టిక్‌లై) 5. ఆయిల్స్ వేడి చేసే పరికరం. 6. వివిధ సైజులకి సంబంధించిన డై ఫ్రేమ్స్ 7. కవర్‌రేపర్స్

**ఫార్ములా:** టాలో 750 గ్రాములు. ఆముదం (కాస్టర్ అయిల్) 60 గ్రాములు కొబ్బరి నూనె 600 గ్రాములు. కాస్టిక్‌సోడా 700 గ్రాములు. సువాసన నిచ్చే రోజ్‌ఫ్లవర్, లవెండర్ మిశ్రమము, నిమ్మనూనె మొదలయినవి తగినంతగా కావాలి.

***తయారు చేయు విధానము:-*** కొబ్బరి నూనె, ఆముదం మొదలయిన ఆయిల్స్‌ని ముందుగా మరగబెట్టి నలకలూ, మలినం వంటివి లేకుండా స్వచ్ఛమయిన తెల్లటి వస్త్రములోగానీ, అతి సూక్ష్మమయిన రంధ్రములతోకూడి మెష్‌లా వున్న జల్లెడలో గాని బాగా వడ గట్టాలి. ఆ తరువాత ఆయిల్స్ మిశ్రమమును 98 ఫారెన్‌హీట్ డిగ్రీలు మండేలా వేడిచేసి, మెత్తగా మృదువుగా తయారుచేసిన కాస్టిక్‌సోడా పౌడర్స్ పలుచగా, కొద్ది కొద్ది నూనెల మిశ్రమములో వేస్తూ బాగా కలపాలి....సుగంధ ద్రవ్యాలకి సంబంధించి మీరు ఏ వాసనను కోరుకుంటున్నారో....దానికి సంబంధించిన ఆయిల్స్ తగినంతగా జతచేయాలి. మొత్తం మిశ్రమము బాగా చిక్క బడిన తరువాత..... అవసరమయిన సైజుల్లో.....షేపులలో మీరు ముందుగా రెడీచేసుకున్న డైఫ్రేములలో నింపి ఆరబెట్టాలి. పూర్తిగా ఆరి, గట్టిపడిన తరువాత టాయిలెట్ సోపులు తయారవుతాయి. వాటి షేపులను సరయిన పద్ధతిలో సవరించి పేకింగ్ చేసి మార్కెట్ చేయవచ్చును.

పైన ఇవ్వబడిన ఫార్ములాను సవరిస్తూ మీరు నాణ్యతతో కూడిన సొంత ఫార్ములాను రూపొందించుకుని భద్రపరచుకోవచ్చు. అతి తక్కువ పెట్టుబడిలో ముందుగా కొన్ని డజన్ల సబ్బులు తయారు చేసి.... మార్కెట్‌లో డిమాండ్ పెంచుకుంటూ భారీ ఎత్తున సబ్బులు తయారుచేసి అధిక లాభాలు ఆర్జించవచ్చు. పేకింగ్ రేపర్ అత్యంత ఆకర్షణీయంగా వుండటం కోసం.... మార్కెట్‌లోవున్న ముఖ్యమయిన సబ్బులను పరిశీలించండి.

**మీ ప్రొడక్టుకోసం కొన్ని పేర్లు:-** 1. డ్రీమ్‌ఫ్లవర్ 2. లక్కీస్టార్ 3. హిమబిందు 4. అప్సర 5. తేజ 6. స్వాతి 7. టచ్ 8. కుష్బూ 9. హాపీ 10. మూన్‌లైట్ . ఇవికాక మీరు అదృష్టంగా భావించే ఇతర ఆకర్షణీయమయిన పేర్లు కూడా పెట్టుకోవచ్చు. ముడిసరుకులు స్థానికంగా మీకు లభిస్తాయి. (విలేజ్ కాకుండా వుంటే)
ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ ప్రత్యేకంగా యివ్వబడింది.



# ఫేస్ పౌడర్

*అందాలకు మెరుగు పెట్టి ఫెయిర్‌గా, ఫ్రెష్‌గా కనిపింప చేసే ఫేస్ పౌడర్లను చాలా సులువుగా తయారుచేసుకోవచ్చు.... చక్కటి సువాసనలతో మంచి క్వాలిటీతో పౌడర్‌లు తయారు చేసి మార్కెట్ చేసి, కస్టమర్స్ ఆకట్టుకోగలిగితే ఇది మంచి లాభసాటి వ్యాపారం. ఇందుకు ఓపిక, స్వయం కృషి చాలా అవసరం.*

**'రా' మెటీరియల్స్ (ముడిసరుకులు):** 1. ఫ్రెంచ్ చాక్ (టాల్క్) దీని రసాయనిక పేరు మెగ్నిషియం సిలికేట్ 2. అల్యూమినియం సిలికేట్ 3. మెగ్నిషియం కార్బొనేట్ 4. జింక్ స్టిరేట్ 5. స్టార్చ్ 6. జింక్ ఆక్సయిడ్ 7. బోరిక్ యాసిడ్

**ఫార్ములా:-** ఫ్రెంచ్ చాక్ లేదా మెగ్నిషియం సిలికేట్ 600 గ్రాములు. అల్యూమినియం సిలికేట్ 160 గ్రాములు. స్టార్చ్ 105 గ్రాములు. జింక్ స్టీరేట్ 55 గ్రాములు. బోరిక్ యాసిడ్ 20 గ్రాములు. జింక్ ఆక్సయిడ్ 32 గ్రాములు. మెగ్నిషియం కార్బొనేట్ 105 గ్రాములు. సరిపడినంత పెరఫ్యూమ్.

పైన ఇవ్వబడిన ఫార్ములాలో కొద్దిపాటి మార్పులూ, చేర్పులతో మరింత నాణ్యతా, ప్రత్యేక గుణాలు కలిగిన పేస్‌పౌడర్లు తయారుచేసుకోవచ్చు...మార్పులూ, చేర్పులతో మీకు తెలియకుండానే ఒక అద్భుతమయిన పేస్ పౌడర్ తయారుకావచ్చు. ఆ ఫార్ములాను ఒక పేపర్ మీద వ్రాసుకుని భద్రంగా దాచుకోవటం అవసరం!

మరో ముఖ్యమయిన విషయం ఏమిటంటే మీరు తయారుచేసే పేస్ పౌడర్ పరిమళ భరితంగా వుండటానికి....మిక్సర్‌లో పౌడర్ తయారు అవుతున్నప్పుడే స్టాండర్డ్ గల పెర్‌ఫ్యూమ్‌ను చల్లటముఖ్యం. అలా పెర్‌ఫ్యూమ్ చల్లిన తరువాత ఆ సువాసన పౌడర్‌కి పూర్తిగా పట్టేటంత వరకూ కొన్ని రోజులపాటు పైన మూత పెట్టి వుంచి ఆ తరువాత పేక్ చేయాలి.

టిన్‌ల ద్వారా, ప్లాస్టిక్ డబ్బాల ద్వారా అందించండి!

**మేకింగ్ మెషినరీ:-** 1. గ్రయిండింగ్ మెషిన్ 2. అవసరానికి తగినన్ని జల్లెడలు 3. స్టాండర్డ్ కంపెనీ మెషిన్ 4. స్ప్రేయర్స్ (పెర్‌ఫ్యూమ్‌ను చల్లటానికి) 5. చెక్కస్పూన్‌లు 6. కొన్ని పాత్రలు 7. ఒకటిరెండు గ్రాములను కూడా ఖచ్చితంగా తూచే వెయిటింగ్ మెషిన్ (ఈ మెషినరీ మొత్తం మీ పట్టణంలోనే దొరుకుతుంది).

**తయారుచేయు విధానం :** వెరీ సింపిల్.... ఇవ్వబడిన ఫార్ములాలోని రామెటీరియల్స్ అన్నిటినీ ఆయా పాళ్ళలో మిశ్రమం చేస్తే మృదువయిన పేస్ పౌడర్ తయారవుతుంది. ఆ పౌడర్‌ని అందమయిన డెకరేటెడ్ రేకు టిన్‌లలో పేక్‌చేసి మార్కెట్ చేయవచ్చు. పౌడర్ ఎంత నాణ్యతలో వుండాలో, వివిధ సైజులలోని పౌడర్ టిన్‌లు కూడా అంత ఆకర్షణీయంగా వుండటం అవసరం.

పెట్టుబడిని గురించి ప్రాజెక్టు ఎస్టిమేషన్ వివరాలలో చూడండి.



# వేనిషింగ్ క్రీం

*అందంగా, ఫ్రెష్‌గా, చక్కటి సువాసనలతో ఎదుటివారిని ఆకట్టుకునేలా కనిపించేందుకు అవలంబించే అలంకరణ ప్రక్రియలలో పేస్ పౌడర్‌కంటే ముందుగా ముఖానికి వేనిషింగ్ రాసుకోవటం అలవాటుగా మారిన కాలం ఇది. వేనిషింగ్ క్రీమ్ చల్లదనంతో చక్కటి సువాసనలనూ తాజాదనాన్ని సమకూర్చటమేకాదు.... ముఖాన్ని పరిశుభ్రంగా వుంచుకోటానికి... మలినంతో కూడిన చిన్నచిన్న మచ్చలను పోగొట్టటానికి కూడా ఉపయోగపడుతుంది... స్త్రీపురుష బేధం లేకుండా ఉపయోగించే ఈ వేనిషింగ్ క్రీమ్‌కి నిరంతరంగా మార్కెట్‌లో డిమాండ్ వుంటూనే వుంది. అందువల్ల ఈ వేనిషింగ్ క్రీమ్ తయారీ లాభసాటి వ్యాపారమే అని చెప్పవచ్చు.*

**'రా' మెటీరియల్స్ (ముడిసరుకులు):-** 1. గ్లిసరిన్ 2. డిస్టిల్ వాటర్ 3. స్టీరిక్ యాసిడ్ 4. కాస్టిక్ పొటాష్ 5. బోరాక్స్ 6. సార్బిటాల్ 7. ముత్యపు పొడి... 8. పెర్ఫ్యూమ్ ఎస్సెన్స్.

**అవసరమయిన యంత్ర సామగ్రి:-** 1. హోమోజినైజర్ (మిక్సింగ్ యంత్రం) 2. ఒక స్టెయిన్ లెస్ స్టీల్ రియాక్షన్ వెస్సల్ 3. ఎనామిల్ పాత్రలు 4. వెయిటింగ్ మెషిన్ 5. ఒకస్టవ్ 6. చెక్క గరిటెలు 7. బాటిల్స్ (ఆకర్షణీయమయిన షేప్‌లలో) 8. పేకింగ్ అట్టపెట్టెలు 9. బాటిల్స్ పేకింగ్ బాక్స్‌లు (అట్టతో చేసినవి)

**ఫార్ములా:-** డిస్టిల్ వాటర్ 1600 మి.లీటర్‌లు బోరాక్సు 30 గ్రాములు గ్లిసరిన్ 100 గ్రాములు స్టీరిక్ యాసిడ్ 400 గ్రాములు. కాస్టిక్ పొటాష్ 10 గ్రాములు. రోస్ ఎస్సెన్స్ 10 మి.లీటర్లు ముత్యపు పౌడర్ 20 గ్రాములు.

***తయారు చేయు విధానము:-*** ముందుగా కాస్టిక్ పొటాష్ ను 200 మి.లీటర్ల నీటిలో ఒక పాత్రలో కరిగించండి! దీని వేడి చల్లారిన తరువాత ఆ ద్రవం వున్న పాత్ర మీద మూత పెట్టి వుంచాలి.

మరో పాత్రలో బొరాక్సును రెట్టింపు డిస్టిల్ వాటర్ లో అదే విధంగా కరిగించాలి. తరువాత స్టీరిక్ యాసిడ్‌ని ఒక పాత్రలో వేసి...తక్కువ వేడి తగిలేట్టు చేస్తూ కరిగించాలి. అది పూర్తిగా కరిగిన తరువాత స్టవ్ మీద వుండగానే... అంతకుముందు కరిగించి

సిద్ధంగా వుంచిన కాస్టిక్ పొటాష్ ద్రవాన్ని కొద్ది కొద్దిగా వేస్తూ స్టీరిక్ యాసిడ్‌లో పూర్తిగా కలిసేటంతవరుకు గరిటెతో కలబెడుతూ వుండాలి: పొటాష్ ద్రవం బాగా మిక్స్ అయిన తరువాత ఒక విధమయిన ప్రతిచర్య ఆరంభమవుతుంది.

ఆ ప్రతిచర్య పూర్తి అయిన తరువాత అందులో బొరాక్సు ద్రవాన్ని కూడా కలిపి.... గరిటెలో బాగా కలబెట్టాలి! బాగా కలిసిందని నిర్ణయించుకున్నప్పుడు గ్లిసరిన్ కలిపిన డిస్టిల్ వాటర్‌ని అందులో వేసి మరోసారి కలబెట్టాలి!

ఇదే విధంగా ఒక దాని తరువాత ఒకటి కలుపుకుంటూ పోతే.... మెత్తటి వెన్న పూసలాంటి వేనిషింగ్ క్రీమ్ తయారవుతుంది. అది బాగా చల్లారిన పిదప సుగంధ పరిమళ ద్రవ్వాన్ని అందులో కలిపి పదిరోజులపాటు అలాగే వుంచితే వేనిషింగ్ క్రీం మొత్తం పరిమళభరితం అవుతుంది.

ఆ తరువాత దానిని సైజులవారీగా, ఆకర్షణీయమయిన షేపులలో రెడీచేసుకుని వుంచిన గాజుసీసాలలోకి ఎక్కించి....మరింత ఆకర్షణీయమయిన అట్టబాక్స్‌లలో పేకింగ్ చేయాలి.

వేనిషింగ్ క్రీం నాణ్యత గలది తయారు చేయాలంటే.. ముందుగా మీరు ఉపయోగించే రా మెటీరియల్స్ నాణ్యమయినవిగా ఉండేలా చూసుకోవటం అవసరం. అవసరం అయిన యంత్రసామగ్రి స్థానికంగానే మీకు లభిస్తాయి.

పెట్టుబడిని గురించి ప్రాజెక్ట్ ఎస్టిమేషన్‌లో వివరాలు చూడండి



# నెయిల్ పాలిష్

*స్త్రీలు ఎంతో మక్కువతో వాడే ఈ నెయిల్‌పాలిష్ తయారుచేయటం చాలా సులభం. ఇక నాణ్యతను అందిస్తూ మార్కెట్ చేయటం.... డిమాండ్ పెరిగేలా చేసుకోవటం మీ ప్రతిభ మీద....పట్టుదలతో మీరు చేసే కృషి మీద ఆధారపడి వుంటుంది. ఇది మంచిలాభసాటి వ్యాపారం.*

**'రా' మెటీరియల్స్ (ముడిసరుకులు):-** 1. ఎథిక్ సాలిసిటేట్ 2. సెల్లోసాల్వ్ 3. అమిల్ ఎసిటేట్ 4. నైట్రో సెల్యులాజ్ 5. అసిటోన్ 6. రోజిన్ 7. కలర్ 8. పెరఫ్యూమ్.

**ఫార్ములా:-** సెల్లో సాల్వ్ 50 గ్రాములు - రోజన్ 20 గ్రాములు అసిటోన్ 400 మి.లీటర్లు అమిల్ ఎసిటేట్ 390 గ్రాములు. నైట్రో సెల్యులాజ్ 200 గ్రాములు ఎథిల్ సాలిసిలేట్ 50 గ్రాములు. కలర్స్.... వివిధ రకాలు తగినంత పెరఫ్యూమ్ కొద్దిగా వాడాలి.

***తయారుచేయు విధానము:- ముందుగా ముఖ్య గమనిక:-*** నెయిల్‌పాలిష్ తయారీకి ఉపయోగించే ముడిపదార్థాలలో వుండే గుణం....ప్రేలిపోయేలక్షణాలుగల పదార్థాలు వుంటాయి. కాబట్టి వాటికి నిప్పుకు దూరంగా.... వుంచటంచాలా అవసరం. నైట్రో సెల్యులాజ్ విషయంలో జాగ్రత్త తీసుకోవాలి.

ఇక తయారు చేయటం ఎలాగంటే..... ముందుగా అమిల్ ఎసిటేట్, ఎథిల్ సాలిసిలేట్, సెల్లోసాల్స్ మొదలయిన సాండ్ కెమికల్స్‌ని పొడిగాచేసి, మిశ్రమం అయ్యేటట్టు బాగా కలపాలి. నైట్రోసెల్యులాజ్‌ని కూడా చిన్న చిన్న ముక్కలు గా కానీ, గుండ్రంగా గానీ చేసి పన్నీరు బుడ్డి లాంటి పెద్ద సైజు కూజాలో (Carboy) వేయాలి. అందులో ముందుగా కనిపించుకున్న కెమికల్ మిశ్రమాన్ని వేసి బాగా షేక్ చేయాలి. ఆ తరువాత షెల్లాక్‌ని మీరు తయారు చేయాలనుకుంటున్న రంగునూ... ఎసిటోన్‌లో వేసి బాగా కరిగేలా చేసి కూజాలో వేయాలి. ఎసిటోన్‌ని వీలును బట్టి కావాల్సినంత పలుచగా వుండేటట్లు కలపాలి. కొద్దిగా ఫెర్‌ఫ్యూమ్‌ను చేర్చిమరింతగా కలిపి.... రెండురోజుల తరువాత....ఎక్స్‌పోజ్ కాకుండా జాగ్రత్త వహిస్తూ.... అందమయిన ఆకారాలలో ముందుగా రెడీ చేసుకున్న చిన్న చిన్న సీసాలలో ఆటోమేటిక్ ఫిల్లింగ్ మెషిన్ ద్వారా నింపి మార్కెట్ చేయవచ్చు.

ఈ నెయిల్‌పాలిష్‌ని ఎన్ని రకాల రంగులలోనయినా (షేడ్స్) తయారు చేసుకోవచ్చు... అతి తక్కువ ఖర్చులో ముందుగా కొన్ని బాటిల్స్ నెయిల్ పాలిష్‌ను తయారుచేసి అనుభవాన్ని మార్కెట్ డిమాండ్‌ను సంపాదించిన తరువాత భారీ ఎత్తున తయారుచేసి దేశం అంతటా విడుదల చేయవచ్చు.

# అగరవత్తులు

అగరవత్తుల అవసరాన్ని గురించి, మార్కెట్ నిత్యం వాటికి వున్న డిమాండ్‌ను గురించి ప్రత్యేకించి చెప్పనవసరం లేదు. కొద్దిపాటి అనుభవంతో ఇవి చాలా సులువుగా తయారుచేసుకోవచ్చు. కొద్దిపాటి పెట్టుబడితో ముందు స్వల్పంగా తయారుచేసుకుని, మార్కెట్‌లో మీ అగరువత్తులకు డిమాండ్‌ను పెంచుకుంటూ ఆ తరువాత భారీగా తయారుచేసి మంచి లాభాలు ఆర్జించవచ్చు. మీరు తయారుచేసి అందించే అగరువత్తులకంటూ ఒక ప్రత్యేకత, నాణ్యత వుండటం చాలా అవసరం. అదే మీ వ్యాపారాభివృద్ధికి కారణం అవుతుంది.

**'రా' మెటీరియల్స్ (ముడిసరుకులు):-** 1. చందనం 2. పిడకలపొడి 3. చందనం ఆయిల్ 4. బెన్‌జాయిన్ 5. స్వచ్ఛమైన నీరు 6. గోధుమ పిండి. 7. కర్ర పెండలం పౌడర్ 8. సూరేకారం

**సుగంధ ద్రవ్యాలు:-** లవంగాలు, జాజికాయ, జాపత్రి, తాళిసపత్రి, గులాబీ రేకులు, ఏలకులు, అనాసపువ్వు, పొగడపువ్వులు,తేనె, పటికబెల్లం, సజ్జరసం, పునుగు పచ్చకర్పూరం, జవ్వాది, రంగు వేసి తయారు చేయబడిన వెదురు పుల్లలు ( ఈ వెదురు పుల్లలు ప్రత్యేకంగా అమ్ముతారు)

**ఫార్ములా:-** చందనం 60 గ్రాములు. పిడకలపొడి 600 గ్రా. చందనం ఆయిల్. 30 గ్రా. బెన్‌జాయిన్ 60 గ్రా. స్వచ్ఛమయిన నీరు 600 మిల్లీలీటర్లు. గోధుమ పిండి 60 గ్రా కర్రపెండలం పౌడర్. 300 గ్రా. సూరేకారం 30 గ్రాములు.

**సుగంధ ద్రవ్యాలు:** లంగాలు60 గ్రా, జాజికాయ 30 గ్రా. జాపత్రి 30 గ్రా. తాళిస పత్రి 30 గ్రాములు గులాబీరేకులు 90 గ్రా. ఏలకులు 100గ్రా. అనాసపువ్వు 30 గ్రా. పొగడపువ్వులు 90 గ్రా. పటిక బెల్లం 60 గ్రా. సజ్జరసం 300గ్రా. తేనె 60 గ్రా. జవ్వాది 5 గ్రా. పునుగు 5 గ్రా. పచ్చకర్పూరం 5 గ్రా.

**తయారు చేయు విధానం:-** చందనం. పిడకలపొడి. బెన్‌జాయిన్. స్వచ్ఛమైన నీరు. గోధుమ పిండి, కర్రపెండలం పౌడర్. సూరేకారం. మొదలయిన వాటిని బాగా ఎండబెట్టి ఆ తరువాత పౌడర్ చేయాలి. ఆ తరువాత తెల్లటి వస్త్రంలో ఆ పౌడరు జల్లించి మరింత మెత్తగా వుండేట్టు చేసి పక్కన పెట్టాలి.

# మందార నూనె

**కావలసిన వస్తువులు:**

మందారపువ్వులు - 50గ్రా

ఆలివ్ నూనె - 1 1/2కేజి

ఉడుకులాం - 5గ్రా

లవెండరు - 5గ్రా

గిన్నెలో మందారపువ్వులు వేసి ఆలివ్‌నూనె పోసి నిప్పుల మీద పెట్టాలి. పువ్వులోని పరిమళం. నూనెలోనికి చేరి, తడి ఆవిరి. రూపంగా పోతుంది. మరిగేదాకా ఉంచి కిందకు దించి, ఉడుకులాం... లవెండర్లు కలిపి సీసాల్లో పోసి మూత బిగించాలి

మందారపువ్వులను ఎండబెట్టి, కొబ్బరినూనెలో పైన చెప్పిన విధంగా మరిగించాలి మరిగిన తర్వాత దించి, వడకట్టి సీసాలో పోసి. మూతబిగించాలి. దవనం, మరువం లాంటి నూనెలు కూడా ఈ విధంగానే తయారు చేయవచ్చును. కొబ్బరి నూనె వాసనకు, మంచినూనె వాసనకు తేడా ఉంటుంది. రిఫైండాయిల్, ఆముదం, కూడా హైరాయిల్ చేయటానికి వాడుతారు. రిఫైండాయిల్ ఏవాసనా ఉండదు. మంచి వాసనగల ఎసెన్సు వేయకపోయినా పరవాలేదు.

కుల్లి, వాసన రాకుండా ఉంటాలంటే ఒకగిన్నెలో పోసి కొంచెం నీరు (అంటే 1లీటరు నూనెకు ఔన్సు సుమారు) పోసి బాగా కలియబెట్టి కాచితే వాసన పోతుంది. నీరంతా ఆవిరి ఆయ్యేదాకా పొయ్యి మీద ఉంచి దించెయ్యాలి చల్లారిన తరువాత వడగట్టి హేరాయిల్స్‌గా వాడుకొనవచ్చును.

హెరాయిల్స్‌కు స్వచ్ఛమైన నూనెపై చెప్పినవి (ఏనూనె అయినా సరే) ఎన్నుకొని వడగట్టి సువాసనలు కలపాలి. ఇంట్లో తయారు చేసి కలపడం కష్టం సరైన ఫలితం రాదు. ఆమిశ్రమాలు నూనె, రంగుకలిపి, సీసాలో వాసనపోకుండా కార్కులు లేక మూతలు బిగించాలి.

# గమేళాల తయారీ

ఈ రోజున పెరిగిపోతున్న ఈ జనాభా నివాసానికి ఎన్ని ప్లాట్స్ నిర్మించినా సరిపోవడం లేదు. ఒక వూరి నుంచి మరోవూరికి వెళుతుంటే వకప్పుడు నిర్మానుష్యంగా వుండేది. కాని ఇప్పుడో ఎటుచూసినా ఇల్లే ఆఖరికి కొండలని కూడా వదిలి పెట్టకుండా ఆపై భాగంలో కూడా ఇళ్ళు నిర్మిస్తున్నారు.

చిన్న పూరిల్లు దగ్గర్నించి, పెద్దపెద్ద అపార్ట్‌మెంట్స్ వరకు కట్టే కట్టడానికి ఈ గమేళాలు చాలా అవసరం.

**'రా' మెటీరియల్స్ (ముడిసరుకులు)** :- సర్కిల్ కటింగ్ మిషన్ చేతితో నడిచే కుట్టుమిషన్, చేతి పరికరాల సెట్, ఎరెక్షన్, ఎలక్ట్రిల్ ఫిటింగ్‌లు మొదలగునవి.

**ఫార్ములా (తయారుచేసే విధానము)**:- 18-22 గేజ్ వుండే ఎంఎస్‌టిపి షిట్స్‌ని కటింగ్ మిషన్, ప్లడ్స్ హెమర్లు, హ్యాండ్ పియరింగ్ మిషన్ సహాయంతో కట్‌చేసి కావలసిన ఆకారాన్ని సృష్టించి తయారుచేస్తారు.

**మార్కెటింగ్ చేసే విధానము**:-తయారైన గమేళాలు ఇనుప కొట్లవారికి మార్జిన్ తెలియచేస్తూ మీవస్తువును చూపించండి.మార్కెట్‌లో అంతకు ముందున్న గమేళాలకి మీరుతయారు చేసినదానికి తేడా నాణ్యత చూపించి కన్విన్స్ చేయండి. ఇంకా తాపి మేస్త్రిలను సంప్రదించండి. సహజంగా ఈ గమేళాలు అద్దెకిచ్చే షాపులు నగరాల్లో ఎన్నో వుంటాయి. తాపీమేస్త్రిలకు ఆ వివరాలు బాగా తెలుసు వారిద్వారా అద్దెకిచ్చే షాపులను సంప్రదించి వారికి డైరెక్టగా అమ్మవచ్చు. వ్యాపారాభివృద్ధి ఎంతో చేయవచ్చు దగ్గరి దగ్గరి నగరాల్లోని ఔత్సాహిక మిత్రులకు ఈ గమేళాలు అవూరి ఇనుప కొట్లకు ఇవ్వటం, తిరిగి మని కలెక్టు చేసుకుని సేల్సుని బట్టి ఆర్డర్ ఇవ్వటం లాంటి విషయాల్లో తర్ఫీదు ఇస్తే మీరు అత్యంత తక్కువ సమయంలోనే స్థిరపడవచ్చు.

# లిక్విడ్ డిటర్జెంట్

*మారుతున్న కాలంతో పాటే నిత్యం మనం ఉపయోగించే వస్తువులలో కూడా తరుచూ మార్పులు చోటు చేసుకుంటున్నాయి. మొన్న బట్టలు వుతికేందుకు ఆయిల్‌తో కూడిన సబ్బు. నిన్న డిటర్జెంట్‌కేక్, పౌడర్ నేడు లిక్విడ్ డిటర్జెంట్, పేస్టు, మీ శక్తిసామర్థ్యాలను, పట్టుదలనూ కృషినీ జోడించి, అందుబాటులో ప్రచారసాధనాలను ఉపయోగించుకుంటూ మార్కెట్ చేయగలిగితే లిక్విడ్ డిటర్జెంట్ కూడా మంచి లాభసాటి వ్యాపారం. తక్కువ పెట్టుబడితో ప్రారంభించి...భారీస్థాయికి చేరుకోవటం ఇక మీ స్వయం కృషి మీద ఆధారపడివుంది.*

**'రా' మెటీరియల్స్ (ముడిసరుకులు) ఫార్ములా: -**

యూరియా 75 గ్రాములు., పొటాషియంక్లోరైడ్ 25 గ్రా॥, కాస్టిక్‌సోడా 100 గ్రా॥, ఏసిడ్ స్లరీ 500 గ్రా॥, వాటర్ 150 నుండి 250 మిల్లీ లీటర్లు, కావాల్సిన రంగు కొంచెంగా తీసుకోవాలి.

**యంత్రపరికరాలు:** 1. మిక్సింగ్ మెషిన్ 2. ప్లెడ్జర్ 3. 2 HP మోటార్ 4. లిక్విడ్ కలిపేందుకు పాత్రలు.

***తయారుచేయు విధానము:*** పొటాషియం క్లోరైడ్, యూరియాలు ఒక పాత్రలో వేసి తగినంత నీరు కలిపి వుంచుకోవాలి. కాస్టిక్ సోడాను తగినంత నీళ్ళలో కరిగించాలి. ఏసిడ్ స్లరీని కూడా అదే విధంగా నీటిలో కలపాలి. ఆ తరువాత కొద్ది కొద్ది భాగాలుగా క్రమక్రమంగా కాస్టిక్ సోడా ద్రవాన్ని ఏసిడ్ స్లరీ ద్రవంలో కలుపుతూ బాగా కలియబెట్టాలి. ఈ మిశ్రమానికి వేడెక్కె లక్షణం ఉండటం చేత బాగా చల్లబడేవరకూ ఆగి, ముందుగా నీళ్ళతో కలిసి వుంచుకున్న పొటాషియం క్లోరైడ్, యూరియాలను కలపాలి. కొంతనీరు చేర్చి అంత పలుచనా, అంత చిక్కగా కాని ద్రవంగాచేసి, కొంచెం రంగు...కొంచెం సువాసన పౌడర్ కలపండి.

ముఖ్యంగా స్పెసిఫిక్ గ్రావిటీ 1050 నుండి 1025లో వుండేలా చూడండి. ముడిపదార్థాలన్ని బాగా సంయోగం చెందే వరకూ కొద్దికాలం పాటు పెద్దసైజు కూజావంటి పాత్రలో పోసి కదిలించకుండా వుంచటం అవసరం. ఆ తరువాత లిక్విడ్‌ని

వడపోసి, ఆకర్షణీయమయిన రూపాలలో, వివిధ సైజులో ముందుగా రెడీ చేసుకుని వుంచుకున్న గాజు సీసాలలోగాని. ప్లాస్టిక్ సీసాలలోగాని నింపుకుని చక్కటి పబ్లిసిటీతో మార్కెట్ చేయటం ప్రారంభించాలి.

ఈ లిక్విడ్ డిటర్జెంట్ తయారీకి పెద్దగా యంత్రసామగ్రి అవసరం లేదు. ముడిసరుకులను జల్లించుకోటానికి జల్లెడలు.... గ్రయిండింగ్ మెషిన్, మిక్సింగ్ మెషిన్... నిల్వవుంచటానికి పెద్దసైజు కూజా. లేదా గాజు జార్‌లు వుంటేచాలు. క్వాలిటీకోసం ఫార్మూలాలో కొంచెం కొంచెం మార్పులు చేసి చూడండి... అతిగా తయారుచేయకుండా... మీదగ్గరవున్న పెట్టుబడికి తగినంతగా చేసి మార్కెట్ చేయటానికి ప్రయత్నించండి.

పెట్టుబడి వివరాలు ప్రాజెక్ట్ ఎస్టిమేషన్‌లో చూడండి.



# డిటర్జెంట్ పౌడర్

*ప్రపంచ వ్యాప్తంగా వంటకు ఉపయోగించే ఆయిల్స్ కొరతను నివారించటానికి శాస్త్రజ్ఞులు విశేషంగా కృషిచేసి ఆయిల్ సోప్స్ స్థానంలో ఈ డిటర్జెంట్‌ను కనిపెట్టి ప్రజలకు అందించారు. బట్టలను మామూలు మంచినీటితో మాత్రమే కాదు ఉప్పనీటితో కూడా ఉతికి మురికిని పోగొట్టేందుకు డిటర్జెంట్ ప్రొడక్టుచక్కగా ఉపయోగపడతాయి. సులభంగా తెలుసుకోగలిగే సాంకేతిక పరిజ్ఞానంతో ఈ డిటర్జెంట్‌లను తయారుచేయవచ్చు. మార్కెట్ చేయగల కెపాసిటీతో మంచిక్వాలిటీని అందించలిగితే గ్యారంటీ లాభాలను ఆర్జించిపెట్టే వ్యాపారం ఇది.*

**'రా' మెటీరియల్స్ (ముడిసరుకులు):-** 1. సింథటిక్ జియాలైట్స్ 2. సోడియం సిలికేట్ 3. ఫోమ్‌బూస్టర్ 4. సోడాఏష్ 5. ఆసిడ్ స్లర్రీ 6. బ్లీచింగ్ పౌడర్ 7. సోడియం డోడిసిల్ బెంజిన్ సల్ఫోనేట్ 8. సోడియం సల్ఫేట్ 9. అమ్మోనియం ఫాస్ఫేట్ 10. కావలసిన కలర్, మంచివాసన

**ఫార్ములా:-** 1. సింథటెక్ జయాలైట్స్ 30 గ్రాములు, 2. సోడియం సిలికేట్ 80 గ్రా॥, 3. ఫోమ్ బూస్టర్ 120 గ్రా॥, 4. సోడా ఏష్ 300 గ్రా॥, 5. ఆసిడ్ స్లర్రీ 30 గ్రా॥, 6. బ్లీచింగ్ పౌడర్ 80 గ్రా॥, 7. సోడియం డిబిబెంజిన్ సల్ఫోనేట్ 50 గ్రా॥, 8. సోడియం సల్ఫేట్ 100 గ్రా॥, 9. అమ్మోనియం ఫాస్ఫేట్ 80 గ్రా॥

***తయారుచేయు విధానం :-*** పౌడర్‌కి మీరు కోరుకుంటున్న రంగును ముందుగానే ఆసిడ్ స్లర్రీలో కలుపుకుని వుంచుకోవాలి. పైన పేర్కొన్న పౌడర్‌లు అన్నీ ఒక మిక్సీలో వేసి బాగా మిశ్రమం అయ్యేలా చేయాలి. రంగులో కలిపిన స్లర్రీని ఆ మిశ్రమంలో వేసి ఒక గ్రయిండర్‌లో వేసి బాగా కలిపేటట్టు చేయాలి. పౌడర్ క్రమపద్ధతిలో తయారవుతుంది. ఆ తరువాత అవసరమయిన జల్లెడలను తీసుకుని వాటిని బాగా జల్లించాలి. కొద్దిగా నీరు కలిపి, మరోసారి జల్లించి, తగినంత ఉష్ణోగ్రతలో గానీ, ఎండలో గానీ వుంచి ఎండ బెట్టాలి. బాగా ఎండిన తరువాత ఆ పౌడర్‌ను ఆకర్షణీయమయిన ప్లాస్టిక్ సంచులలో గానీ, రిఫిల్ బ్యాగ్‌లోగాని ప్యాక్ చేయాలి. మీరు కోరుకుంటున్న క్వాలిటీ గురించి ఫార్ములా చిన్నచిన్న మార్పులు చేసుకోవచ్చు. దుస్తులను అమితంగా తెల్లబరిచేందుకు ఆప్టికల్ వైటనర్‌ను చేర్చుకోవచ్చు.

గమనిక:- కెమికల్స్‌లో చర్మానికి హాని చేసే వాటిని దూరంగా వుంచాలి.

ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ వివరాలు ప్రత్యేకంగా యివ్వబడ్డాయి.

# క్రోషావైర్ బేగ్‌లు

ప్రస్తుతం మార్కెట్‌లో క్రోషావైర్‌తో అల్లిన బేగ్‌లకు విపరీతమయిన గిరాకీ వుంది. ఆడవాళ్ళు షాపింగ్ చేయటానికి, పచారీసామానులు తెచ్చుకోటానికి, ఇంకా వివిధ రకాల అవసరాలకు క్రోషావైర్ బేగ్‌లు ఉపయోగిస్తున్నారు. ఎంతో అందంగా, ఫ్యాషన్‌బుల్‌గా వుండి ఎక్కువ కాలం మన్నే ఈ క్రోషావైర్ బేగ్‌లు అల్లి మార్కెట్ చేయటం చాలా లాభసాటి వ్యాపారం. దీనికి ఎక్కువ పెట్టుబడికూడా అవసరం లేదు. హౌస్‌వైఫ్ గా ఉండే స్త్రీలు ఖాళీ సమయాలలోనూ, ఉద్యోగంలేని యువతులు ఫుల్‌టైంలోనూ ఈ బేగ్‌లు అల్లి మార్కెట్ చేయటం ద్వారా ఉద్యోగం చేసి సంపాదించే దాని కంటే ఎక్కువ డబ్బు ఆర్జించవచ్చును.

**మెటీరియల్స్ (కావల్సిన సరుకులు):-** 1. క్రోషావైర్ వివిధ రంగులలో 2. క్రోషానీడిల్ (అల్లటానికి) 3. సైజును బట్టి ప్లయివుడ్ (బేగ్ అడుగున ప్లాట్‌గా వేయటానికి, 4. అయిరన్ బోల్టులు, వాషర్‌లు (హేండిల్స్, ప్లయివుడ్ ఫిక్స్ చేయటానికి).

**తయారుచేయు విధానము:-** క్రోషావైర్ క్వాలిటీని బట్టి రకరకాల రేట్లలో దొరుకుతుంది. (1కిలో రూ 50 /- నుండి 80 రూపాయలవరుకూ)

ముందుగా ఏదయినా మహిళా సంక్షేమ కార్యాలయంలోగానీ, కుట్టుపనులు అల్లికలు నేర్పే సెంటర్స్‌లో గానీ క్రోషా వైర్‌తో చేయగలిగే అల్లికను గురించి నేర్చుకోవాలి. ఈ అల్లికను గురించి, బేగ్‌ను తయారుచేయటాన్ని గురించి తెలుసుకోటానికి వారం రోజులు కంటే ఎక్కువ పట్టదు. శ్రద్ధ పట్టుదల గలవాళ్ళు రెండుమూడు రోజులలో కూడా నేర్చుకోవచ్చును.

ఇక బేగ్ అల్లటాన్ని గురించి - 30 సెంటిమీటర్ల ఎత్తు 50 సెంటిమీటర్ల వెడల్పు గల బేగ్‌ను అల్లటానికి సుమారు 400 నుండి 500 గ్రాముల వరకూ వైరు కావాల్సివుంటుంది. ఈ బేగ్‌ను తయారుచేయటానికి అదేపనిగా పెట్టుకుంటే ఏడెనిమిది గంటల సమయం పడుతుంది. డిజైన్‌కి సెకండ్ క్వాలిటీ బేగ్ మెయిన్‌పార్ట్‌కి వస్ట్ క్వాలిటీ వైర్ వాడుకోవచ్చు. అంటే వైర్ ఖరీదు మీ 351-00 లోపే వుంటుంది. ప్లైవుడ్‌బోర్డ్‌కి, అయిరన్ బోల్టులు వాషర్స్‌లకి మరో పదిరూపాయలు అవుతుంది. అంటే

50 × 30 సెంటీమీటర్ల బేగ్‌ను తయారుచేయటానికి సుమారు రూ 45-00 ఖర్చు అవుతుంది. ఈ బేగ్ మార్కెట్‌లో రూ॥125లకు రిటైల్‌గా అమ్ముకోవచ్చు. హోల్‌సేల్‌గా రూ॥100-00 ఇవ్వవచ్చు. అంటేఒకబేగ్ అల్లిఅమ్మితే సుమారు రూ. 55-00 మిగులుతుంది.

ఈ బేగ్‌ల అల్లకాన్ని కుటీర పరిశ్రమగా పెట్టుకుంటే.... రోజువారీ కూలీచెల్లించే పద్ధతులోకానీ, ఒక బేగ్‌కు ఇంతని గాని చెల్లించే పద్ధతిలో పది లేక ఇరవై మందిని పనిలో పెట్టుకుంటే రోజుకి రూ॥250 చొప్పున లాభంపొందవచ్చు. అంటే నెలకు రూ 7500-00 వరకూ ఆదాయం వుంటుంది. బేగ్‌లు సైజుల వారీగా తాయారు చేయటాన్ని బట్టి ఈ ఆదాయాన్ని నెలకు రూ॥10,000-00 వరకూ పెంచుకోవచ్చు. అయితే చేసే పనిలో శ్రద్ధ, శ్రమపడగల లక్షణాలు గలవారిని పనిలో పెట్టుకోవాల్సి వుంటుంది.

45 × 90 సెంటిమీటర్ల బేగ్‌కి సుమారు 750 గ్రాముల వైర్ ఖర్చవుతుంది. అంటే వైర్ ఖరీదు ఫస్ట్ క్వాలిటీది అయిదే రూ॥ 60-00. బోల్టులు, వాషర్లు రూ 15-00 బేగ్ తయారీకి మొత్తం రూ॥75-00 ఖర్చవుతుంది. ఈ బేగ్ ఖరీదు మార్కెట్‌లో రూ॥ 200 లనుండి 225 వరకూ వుంది. ఒకరు ఈ బేగ్‌ని పూర్తి సమయం వినియోగిస్తే యించుమించు 15 గంటలలో అల్లగలుగుతారు.

ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ వివరాలు ప్రత్యేకంగా యివ్వబడ్డాయి.



# ట్యూషన్ సెంటర్

నిరుద్యోగులయిన యువతీయువకులకూ, చాలీచాలని జీతాలతో ఎక్కడో ఒకచోట ఎడ్జస్ట్ అయి పనిచేసే గ్రాడ్యుయేట్స్, పోస్ట్‌గ్రాడ్యుయేట్స్‌కి స్వయం ఉపాధికి ఇదొక చక్కని అవకాశం.

ఈ ట్యూషన్ సెంటర్ నడపటానికి మీరు పూర్తి సమయాన్ని వెచ్చించ నవసరం లేదు. ఉదయం రెండు గంటలు 6.30 ని.ల నుంచి 8.30 నిముషాల వరకూ, సాయంత్రం రెండు గంటలు 6 To 8 కేటాయిస్తే సరిపోతుంది. దీనికి పెద్దగా పెట్టుబడి అవసరం లేదు.

మీరు చేయవలసిందల్లా, ఒక్కో సబ్జెక్టు చెప్పేందుకు ఒక్కొక్కరు చొప్పున..అంటే ఇంగ్లీషు, మేథమేటిక్సు, కెమిస్ట్రీ, ఫిజిక్స్, తెలుగు, హిస్టరీ, సివిక్స్, హిందీ, బాటనీ మొదలయిన సబ్జక్ట్స్‌లో 10th మరియూ జూనియర్, అండ్ సీనియర్ ఇంటర్మీడియట్స్ విద్యార్థులకు ఎఫిషియంట్ కోచింగ్ ఇవ్వగల సామర్థ్యంగల వారంతా ఒక గ్రూపుగా ఏర్పడండి. లేదా ఒక్కరే నాలుగయిదు సబ్జక్ట్‌లు చెప్పగలం అన్న ధీమా వుంటే మరీ మంచిది. అటువంటివారు ఒక ఇంటిని గానీ, ఒక పెద్ద రేకుల షెడ్‌ను గానీ అద్దెకు తీసుకోండి. మీరు ట్యూషన్‌లో చేర్చుకునే విద్యార్థులకు సరిపడే బెంచీలను, ఒకబ్లాక్ బోర్డును ఏర్పాటు చేయండి. అలాకాకపోయినా క్రింద కూర్చునేందుకు చాపలు ఏర్పాటు చేసినా ఫరవాలేదు. బ్లాక్ బోర్డు వుంటే మంచిది.

10th క్లాస్‌కి ఒక ఫీజు, జూనియర్ ఇంటర్మీడియట్ కి ఒక ఫీజు, సీనియర్ ఇంటర్మీడియట్‌కి ఒక ఫీజు వంతున నిర్ణయించండి. అది కూడా ఒకటిరెండు సబ్జెక్టు అయితే ఇంత, మొత్తం సబ్జెక్టులకయితే ఇంత అని నిర్ణయించుకోండి.

మీ ట్యూషన్ సెంటర్‌కి ముడిసరుకులతో గానీ, ప్రచారసాధనాలతో గానీ, మార్కెట్ చేయాల్సిన శ్రమగానీ, నష్టం భరించాల్సి వస్తుందన్న భయంకానీ అవసరంలేదు.

కనీసం మీ ట్యూషన్ సెంటర్‌లో 20 మంది విద్యార్థులు చేరినా చాలు. నెలకు మూడు నాలుగు వేలు సంపాదించుకోవచ్చు. ఇంటి అద్దె వెయ్యిరూపాయలు పోను మీకు ఎలా లేదన్నా రెండున్నర నుండి మూడు వేలు దాకా మిగులుతుంది. రోజుకి ఉదయం ఒక షిఫ్టు సాయంత్రం ఒక షిఫ్టు అయితే మీ ఆదాయం అయిదు వేలకు తక్కువ ఉండదు. అదే గ్రూపుగా చెపితే కనీసం వందనుండి నూటయాభైమంది విద్యార్థులయినా మీ ట్యూషన్ సెంటర్‌లో చేర్చుకోటానికి ప్రయత్నించాల్సివుంటుంది.

కేవలం సంపాదన కోసమే అన్నట్టు కాకుండా విద్యార్థులకు శిక్షణ ఇవ్వటంలో ప్రత్యేకమయిన శ్రద్ధతో దృష్టికేంద్రీకరిస్తే మీ ట్యూషన్ అభివృద్ధిచెంది మీకు మరింత ఆదాయంతో మంచి పేరును కూడా తెచ్చిపెడుతుంది. ఇదొక పార్ట్‌టైంజాబ్ గా తీసుకుని ప్రయత్నించండి.

# ప్లాస్టిక్ బటన్స్

*ప్లాస్టిక్ బటన్స్ వాడకాన్ని గురించి, వాటి ఉపయోగాన్ని గురించి, మార్కెట్‌లో వాటికి ఉన్న డిమాండ్‌ను గురించి ప్రత్యేకించి చెప్పనవసరం లేదు. దుస్తులకే కాకుండా కొన్ని రకాల బ్యాగ్‌లకి కూడా ఈ బటన్స్ ఉపయోగించటం అందరికీ తెలిసిందే. ఈ ప్లాస్టిక్ బటన్స్ తయారీ చాలా సులువుకూడా. అయితే వీటిని మార్కెట్‌ను చేయటంలోనూ, డిమాండ్‌ను పెంచటంలోనూ వుంది మీ శ్రద్ధా సామర్థ్యం అంతా.*

**'రా' మెటీరియల్స్ (ముడిసరుకులు):-** 1. యాక్లలిక్‌షీట్ (పాలిస్టర్) 2. పేకింగ్ అట్టపెట్టెలు 3. మీ కంపెనీ పేరును తెలియచేసే లేబిల్స్.

**మేకింగ్ మెషినరీ:-** 1. ప్లాస్టిక్ షీట్ కటింగ్ మెషిన్ 2. హోల్ మాస్టర్‌యంత్రం 3. డ్రిల్లింగ్ యంత్రం 4. 2. హెచ్.2. విద్యుత్‌మోటార్ 5. డిజైన్ మెషిన్.

***తయారుచేయు విధానము:-*** ముందుగా రెడీ చేసుకున్న వివిధ సైజుల డైలులో యాక్రలిక్ షీట్లనుండి రంధ్రాలు వేసే పద్ధతి ద్వారా బటన్లు తయారుచేస్తారు. ఆ చుట్టూ రఫ్‌గా ఉండే పీస్‌లను తొలగిస్తూ పాలిష్ చేయటం ద్వారా చక్కటి ఫినిషింగ్ ఇస్తారు.

ఈ ప్లాస్టిక్ బటన్స్‌ని ఇప్పటికే చాలా కంపెనీల వాళ్ళు తయారుచేస్తున్నారు. మీరు ఈ ప్లాస్టిక్ బటన్స్ ఉత్పత్తిని ప్రారంభించదలిస్తే ముందుగా మార్కెట్‌ను సర్వే చేయండి. ఏయే కంపెనీలకు సంబంధించిన ఉత్పత్తులకు మార్కెట్‌లో గిరాకీ వుందో, వాటి ప్రత్యేకత ఏమిటో తెలుసుకోండి. వాట్ స్థాయికేమాత్రం తగ్గని ఉత్పత్తిని మీరు అందించగలగాలి. ఇతర కంపెనీల ఉత్పత్తులను తీసి ఒక సరికొత్త ప్రత్యేకత (డిజైన్లలోగాని. రంగులలోగాని. ఆకారాలలోగాని) మీరు అందించగలిగితే మీరు తప్పకుండా సక్సెస్ అవుతారు.

పైన చెప్పబడిన ముడిసరుకులు యంత్రసామగ్రి ముఖ్యమయిన నగరాలలో పట్టణాలలో లభిస్తాయి.

ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ వివరాలు ప్రత్యేకంగా యివ్వబడ్డాయి.

# హెయిర్ పిన్స్ అండ్ క్లిప్స్

జుత్తురేగిపోకుండా వుండేందుకూ, అందమయిన జడలో పూవులు నిలిచేందుకు స్త్రీలు ప్రతిదినం ఉపయోగించే హెయిర్ పిన్నులనూ, క్లిప్పలను మనం చూస్తూనే ఉన్నాం. ఒకప్పుడు చెంపపిన్నులు పేరుతో పిలవబడే ఒకేరకమయిన ఈ పిన్నులు. యిప్పుడు రకరకాల సైజులలో, వివిధ రకాల ఆకర్షణీయమయిన మోడల్స్‌లో దొరుకుతున్నాయి.

**'రా' మెటీరియల్స్ (ముడిసరుకులు):-** 1. వివిధ రంగుల పెయింట్స్, 2. స్ప్రింగ్ వైర్లు 3. రేకులు (లైట్ నికిల్ కోటెడ్‌వి)

**మేకింగ్ మెషినరీ:-** 1. డ్రిల్లింగ్ మెషిన్ 2. కావలసిన సైజులలో డైలు 3. పెయింటింగ్‌కి అవసరం అయిన పనిముట్లు 4. గ్రిప్స్ మేకింగ్ యంత్రం 5. విద్యుద్దీకరణ 6. మీ కంపెనీ పేరుతో అందంగా తయారుచేయబడిన పేకింగ్ అట్టలు..

***తయారుచేయు విధానము:-*** మీరు తయారు చేయదలుచుకున్న గేజ్‌లో స్ప్రింగ్‌వైర్‌ను తీసుకుని ఆటోమేటిక్ యంత్రంద్వారా వైర్‌ను గ్రిప్స్‌గా కట్‌చేయాలి. ఆ తరువాత హెయిర్‌పిన్‌లో అవసరం అయిన చోట వంపులు వచ్చేలా డైస్ ఉపయోగించాలి. క్లిప్స్ విషయానికి వస్తే తగినంత గేజ్‌లో రేకును తీసుకుని, డైస్ ఉపయోగించి మెషినరీ ద్వారా తగిన ఆకారాలలో కట్‌చేసి, ఆ తరువాత ఆకర్షణీయమయిన రంగులువేసి... పైకి కనిపించేలా అట్టలకు తగిలించి, ఆ తరువాత బాక్స్‌లలో నీట్‌గా పేక్ చేయాలి.

ఈ హెయిర్ పిన్స్, క్లిప్‌ల తయారీకి యంత్రపరికరాలు తప్పనిసరి కాబట్టి పెట్టుబడి కాస్త ఎక్కువ పెట్టక తప్పదు. ముందుగా ఈ పిన్‌లు తయారీ విషయలో ప్రాక్టికల్ అనుభవాన్ని సంపాదించి, నిపుణులయిన పనివారిలో ప్రొడక్ట్ తయారుచేయటం ప్రారంభిస్తే మంచి లాభం వుంటుంది. లాభం ఇంత అని ముందుగా తేల్చి చెప్పటం కంటే మీ మార్కెటింగ్ సామర్థ్యాన్ని బట్టి అధిక లాభం ఆర్జించే అవకాశాలు ఎక్కువగా వుంటాయని ఖచ్చితంగా చెప్పవచ్చును.

యంత్రపరికరాలు బొంబాయి, మద్రాస్, బెంగళూర్, ఢిల్లీ, హైద్రాబాద్, కలకత్తాలవంటి ప్రధాన నగరాలలో లభిస్తాయి.

ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ ప్రత్యేకంగా యివ్వబడింది.

# ప్రింటెడ్ కాటన్ శారీస్

*ఆడవారి ఇళ్ళల్లో డైలీయూజ్ కి వాడుకునే చీరలలో ప్రింటెడ్ కాటన్ శారీస్ ఎక్కువ వాడకంలో వుంటాయి. వేసవికాలంలో వీటిని ఉపయోగించటం మరింత ఎక్కువగా కనిపిస్తుంటుంది. చెమటను పీల్చే గుణంగల ఈ చీరలు వేసవి వేడి నుండి తట్టుకునేందుకు ఉపయోగపడతాయి. తేలికగా వుండి తక్కువ ధరలో అందమయిన డిజైన్స్‌లో తయారుచేయబడే ఈ చీరలకు మార్కెట్‌లో ఎప్పుడూ గిరాకీయే!*

**'రా' మెటీరియల్స్ (ముడిసరుకులు):-** 1. ఫిలిం మీద డ్రా చేయబడిన డిజైన్, 2. ట్రాన్స్‌ఫరెంట్ క్లాత్ లేక సిలికోట్‌స్క్రీన్ 3. 150 సె.మీటర్లు పొడవు 60 సెంటిమీటర్ల వెడల్పు గలిగిన చెక్క ఫ్రేములు 4. ఫోటో ఫిల్మ్ సొల్యూషన్ 5. పెయింట్ 6. థిన్నర్ 7. రెడ్యూసర్ 8. అర అంగుళం తీగమేకులు 9. వేక్స్ 10. కాటన్ ప్రింటెడ్ కలర్స్ 11. బ్లీచింగ్ పౌడర్ 12. కోరాక్లాత్ 13. స్టార్చ్ 14. లేటెస్ట్ శారీ డిజైన్స్ కేటలాగ్ 15. లేబిల్స్.

**ఫార్ములా:-** కాటన్ మీద ఫిక్స్ అయ్యే రంగులలో తగినంతగా వేక్స్‌ను కలపటమే ఈ ప్రింటెడ్ శారీస్ తయారీకి ఫార్ములా.

**యంత్రపరికరాలు:-**1. ఆరుట్యూబ్ లైట్లతోగల ఎక్స్‌పోజింగ్ గ్లాస్ టేబుల్ 2. 20 మీటర్ల పొడవు ఒకటిన్నర మీటర్ వెడల్పులో నేక్స్ పూయబడి కొద్దిగా ఏటవాలుగా వుండే టేబుల్స్ (తయారుచేసే ప్రొడక్టును బట్టి, స్థలాన్ని బట్టి ఎన్ని టేబుల్స్ అయినా పెట్టుకోవచ్చు) 3. హీటింగ్ డ్రమ్స్ 4. ప్రెస్సింగ్ మెషిన్, కుట్టుమెషీన్‌లు 4. 5. నీళ్ళతొట్టెలు అరడజను 6. కత్తెరలు కావాల్సినన్ని 7. రంగులు కలుపుకోటానికి ప్లాస్టిక్ బకెట్లు 8. రెండువైపులా హేండిల్స్ వున్న వెడల్పాటి రబ్బరు బ్రషులు 9. మెత్తటి ఇసుక మూటలు.

***తయారుచేయు విధానము:-*** ముందు 150 × 60 సెంటిమీటర్ల కొలతలో వున్న చెక్కఫ్రేముకి ట్రాన్స్‌ఫరెంట్ క్లాత్‌ను తీగ మేకులతో నాలుగు వైపులా గట్టిగా బిగించాలి. ఆ తరువాత ఆక్లాత్‌కి ఫోటో ఫిల్మ్ సొల్యూషన్‌ను అప్లయ్ చేసి నీడలో ఆరబెట్టాలి. సొల్యూషన్ బాగా ఆరి ఫిక్స్ అయిన తరువాత...ముందుగా రెడీచేసుకున్న డిజైన్ చేయబడిన ఫిలింను ట్యూబ్‌లైట్స్‌తో వున్నా ఎక్స్‌పోజింగ్ గ్లాస్ టేబుల్‌మీద వుంచి ఫిలిం నాలుగు మూలలనూ టేపుతో కదలకుండా అతికించాలి. ఆ తరువాత సొల్యూషన్

వేసిన చెక్క ఫ్రేమును టేబుల్ మీద వుంచిన ఫిలిం డిజైన్ మీద పెట్టి, దాని మీద ఇసుక మూటలను వుంచి... అందులోని ఇసుకను ఫ్రేమ్‌లోపలిభాగం అంతటా సమానంగా పరచాలి. (అందువల్ల క్లాత్, ఫిలింమీద కరెక్ట్‌గా వుండి, ఎక్స్‌పోజింగ్ కరెక్ట్‌గా వస్తుంది) ఆ తరువాత ట్యూబ్‌లైట్స్ ఆన్‌చేయాలి. ఇదంతా రెడ్‌కలర్ డిమ్‌లైట్ వెలుతురులో డార్క్‌రూంలో చేయాలి. సరిగ్గా పద్దెనిమిది నిముషాల పాటు అలావుంచితే ట్యూబ్‌లైట్స్ కాంతికి, వేడికి ఫిలింమీది డిజైన్ సొల్యూషన్ వేయబడిన సిలికోట్ స్క్రీన్‌మీద ఫిక్స్ అవుతుంది. ట్యూబ్‌లైట్స్ ఆర్పేసి. ఆఫ్రేమ్‌ను అలాగే తీసుకుపోయి.... సిమ్మెంట్ తొట్టెలోని నీటిలో ముంచితే... డిజైన్ ఫిక్స్ అయినంతమేర వుండిపోతుంది. డిజైన్‌లేని. లైటింగ్ చొరబడిన ప్రదేశాలలో సొల్యూషన్ వూడిపోతుంది. అది బాగా ఆరబెట్టి ఆ తరువాత ఫ్రేమ్‌లోపలి భాగంలో పెయింట్‌వేసి, ఫ్రేమ్‌ను వెనక్కి త్రిప్పి టిన్నర్‌లో ముంచిన కాటన్ క్లాత్‌తో తుడవాలి. అప్పుడు సొల్యూషన్ వున్నచోట పెయింట్ అంటుకుపోయి మిగతా భాగంలో పోతుంది. ఇలా ఒకటిరెండుసార్లు పెయింట్ వేసిన తరువాత ఫ్రేమ్ వెనుక భాగంలో గ్రీన్‌కలర్ పెయింట్ వేసి నీడగా వున్న చోట ఆరబెట్టాలి. బాగా ఆరిన తరువాత ప్రింట్ చేయటానికి డిజైన్ రెడీ అయినట్టే!

ఇక కాటన్ క్లాత్.... అంటే కోరాక్లాత్ సంబంధించిన బెయిల్స్‌లో నుండి తాను తీసుకుని 5 1.2 మీటర్లు ఆరుగజాలు చీరలుగా చించి. బ్లీచింగ్ వాటర్‌లో బాగా వుతికి తెల్లబడేట్టు చేయాలి. అలా తెల్లబడిన చీరలను బాగా ఆరబెట్టి, ఆరిన తరువాత మైనం పూసిన చెక్క టేబుల్ మీద ముడతలు లేకుండా పరచాలి. అలా ఒక్కొక్క టేబుల్‌కి ఎన్నెన్ని చీరలు పడతాయో అన్ని చీరలు పరిచి ప్రింటింగ్‌కి సిద్ధంచేసుకోవాలి. ఆ తరువాత గమ్ముతో కలిపివుంచుకున్న రంగులను ప్లాస్టిక్ బక్కెట్‌లలో నింపుకుని చెక్కఫ్రేములను పరిచిన చీరమీద వుంచుకుని అందులో కావాల్సిన రంగును వేసి రబ్బర్ స్క్రేపర్స్‌తో పైనుంచి క్రిందికి. క్రిందినుంచి పైకి రంగును లాగాలి. అలా బిట్లు బిట్లుగా చీరలమీద డిజైన్‌గా ప్రింటు చేసుకుంటూ. డిజైన్‌కి సంబంధించిన జాయింట్స్ కలిసేలా చూసుకుంటూ ఒక క్రమ పద్ధతిలో కాటన్ శారీస్ మీద ప్రింట్స్ వేయాలి.

అవిధంగా ప్రింట్‌చేయబడిన చీరలను కొద్దిసేపు టేబులుమీద వుంచి, ఆ తరువాత వాటని ఖాళీ ప్రదేశంలో మరికొద్దిసేపు ఆరబెట్టి తొట్టెలలో వున్న నీటిలో ముంచి.... జాడించాలి! ఆలా చేయటంవల్ల చీరలమీద ఫిక్స్ అవగా మిగిలిన రంగు దిగిపోతుంది. ఆ తరువాత చీరలను ఆరబెట్టి. ఆరిన చీరలను ఒక దానితో ఒకటి కలిసి కుట్టి,

గంజిపిండితో కలిపిన గంజిలో ముంచుతూ నిప్పుల తొట్టెలు ఏర్పాటుచేయబడిన వేడి వేడి రోలింగ్ డ్రమ్ములమీద రోల్‌చేస్తే చీరలు ముడతలు లేకుండా స్టిఫ్‌గా తయారవుతాయి. వాటిని ఒక పద్ధతి ప్రకారం ఫోల్డ్‌చేసి, ప్రెసింగ్ యంత్రంలో ఇటునుండి అటులాగుతూ ప్రెస్ అయ్యేట్టుచేస్తే అయిరన్ చేయబడిన చీరల్లా నీట్‌గా తయారవుతాయి. ఆ తరువాత వాటి మీద కంపెనీ తాలుకు లేబుల్స్ అంటించి మార్కెట్ చేయాలి.

పల్లెటూళ్ళలో వారానికి ఒక సారి జరిగే సంతలలో ఈ ప్రింటెడ్ కాటన్ శారీస్ మంచి గిరాకీ వుంది. ఇదేవిధంగా చీరలను రెండు, మూడు రంగులలోనూ, సింగిల్ మరియు డబుల్ కలర్ బోర్డర్స్‌లోనూ ప్రింట్ చేయవచ్చు. పెట్టుబడికాస్త ఎక్కువే అయిన యిది మంచి లాభాలను ఆర్జించే పరిశ్రమ.

ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ వివరాలు ప్రత్యేకంగా యివ్వబడ్డాయి.



# చూయింగ్ గమ్

ఈరోజులలో చూయింగ్ గమ్‌ను గురించి తెలియని యువతీ యువకులు, పిల్లలు వుండరు. సరదాగా, స్టయిల్‌గా నమిలే ఈ చూయింగ్‌గమ్ ఆయాసాన్ని అదుపులో ఉంచుకోటానికి కూడా ఉపయోగపడుతుంది. క్రీడాకారులు దీనిని ఎక్కువగా ఉపయోగించటం గమనించదగ్గ విషయం. కొద్దిపాటి పెట్టుబడితో తయారుచేసుకోవచ్చు. కానీ, తయారు చేయటానికి అనుభవం అవసరం. ముందుగా ఆ అనుభవాన్ని సంపాదించి, ఆ తరువాత తయారుచేయటం మొదలుపెట్టండి.

**'రా' మెటీరియల్స్ (ముడిసరుకులు):-** 1. గమ్‌చికిల్ 2. గ్లూకోజ్ లేక చక్కెర 3. కార్మెల్ బటర్ 4. తగినంత స్వచ్ఛమయిన నీరు 5. ఆకర్షణీయమయిన డిజైన్స్‌తో ప్రింట్ చేయబడిన పేకింగ్ పేపర్, చిన్నచిన్న పేకింగ్ పెట్టెలు 6. సువాసన ఎసెన్స్.

**ఫార్ములా:-** గమ్ చికిల్ 100 గ్రాములు, కార్మెల్ బటర్100 గ్రా॥, చక్కెర లేక గ్లూకో200 గ్రా॥, స్వచ్ఛమయిన నీరు తగినంత, సువాసన కోసం ఎసెన్స్ 10. మి.లీటర్లు

**తయారుచేయు విధానము:** గ్లూకోజ్ లేక పంచదారను తగినంతట నీటిలో కలిపి కరిగించి, చిక్కటి పాకం వచ్చేటట్టు వేడిచేసి ఆపాకం గట్టి పడిపోకుండా తగినంత సెగమీద వుంచవలయును. గమ్‌చికిల్ నీటిలో బాగా వుడకపెట్టి, అందులోని హార్డ్‌ని వుండే పదార్థాన్ని.... మలినమును తొలగించాలి. ఆ తరువాత వేడిచేసిన గమ్‌చికిల్‌నూ, గ్లూకోజ్ పాకాన్ని బాగా కలపాలి. సరయిన పాకం వచ్చిన తరువాత అందులో కార్మెల్ బటర్‌ను కలిపి మీకు కావాల్సిన రంగునూ, ఎసెన్స్‌ను జతచేసి, ముందుగా రెడీచేసుకున్న 'డై' ప్లేట్స్‌లో పోసి ఆరబెట్టాలి. ఆ తరువాత ఆకర్షణీయమయిన డిజైన్స్‌తో వున్న ప్రింటెడ్ పేపర్స్‌లో చుట్టి పేక్ చేయాలి.

ప్రయత్నించండి. తక్కువ పెట్టుబడితో తయారుచేయగల ఈ చూయింగ్‌గమ్‌కి మార్కెట్‌లో డిమాండ్‌కి కొదవలేదు.

ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ వివరాలు ప్రత్యేకంగా యివ్వబడ్డాయి.

# ఎయిర్ అండ్ వాటర్ కూలర్ బాక్సులు

*ఎయిర్‌కూలర్స్, మరియు వాటర్ కూలర్స్ తయారు చేసేవారికి ఈ బాక్సులు తప్పనిసరిగా అవసరం వుంటాయి. ఇందుకు సంబంధించిన ఎలక్ట్రానిక్ విడిభాగాలను అసెంబ్లింగ్ చేయటం ద్వారా ఎయిర్ మరియు వాటర్ కూలర్స్‌ను తయారుచేస్తారు. చలికాలం, వర్షాకాలాల్లో ఎలావున్నా వేసవికాలం దగ్గరయ్యే కొద్దీ ఆ బాక్సులకు చెప్పలేనంత గిరాకీ వుంటుంది. ఇక లాభం మీరు తయారు చేయగల బాక్సుల సంఖ్యను బట్టి ఉంటుంది. అవసరాన్నిబట్టి, ఆర్డర్‌లను బట్టి పనివారి సంఖ్యను పెంచుకుంటూ పోవాలి. ఒక బాక్స్‌కి ఇంత అని కాంట్రాక్ట్ పద్ధతిలో పనివారిని నియమించుకుంటే ప్రాబ్లమ్ వుండదు. అందువల్ల తీసుకున్న ఆర్డర్‌లను టైం ప్రకారం డెలివరీ ఇచ్చే అవకాశం వుంటుంది.*

**'రా' మెటీరియల్స్ (ముడిసరుకులు):-** 1. హార్డ్‌వేర్ పరికరాలు. 2. C.R. *షీట్లు (రేకుషీట్లు) 3. పెయింట్స్ 4. వెల్డింగ్ రాడ్స్*

**ఫార్ములా:-** తయారుచేయు విధానం తెలియటమే దీనికి ఫార్ములా.

**మేకింగ్ మెషినరీ:-** 1. బెండింగ్ యంత్రం 2. స్ప్రేపెయింటింగ్ పరికరాలు 3. గ్యాస్ వెల్డింగ్ యూనిట్ 4. బెంచ్ డ్రిల్లింగ్ 5. డ్రిల్‌బిట్స్ మొదలయిన పరికరాలు 6. ఎలక్ట్రిక్ ఆర్క్ వెల్డింగ్ మెషిన్ అవసరం అయిన ఆంప్లిప్లేయర్ 7. 6 అంగుళాల బ్లేడ్ అండ్ హేండ్ షియర్ యంత్రం. 8. స్పాట్ వెల్డింగ్ మెషిన్ 9. ఎలక్ట్రిక్ పవర్ 10. మెజర్‌మెంట్ టేపు, చాక్‌పీస్.

***తయారుచేయు విధానము:-*** S.W.G. గేజ్‌లో (16 నుండి 22 వరుకూ మీకు అవసరం అనుకున్నది) స్టాండర్డ్ సైజులో లభించే C.R. షీట్లను తీసుకుని... కటింగ్ మెషిన్‌లో మీరు ముందుగా నిర్ణయించుకున్న కొలతలు ప్రకారం ఆకారాల కట్ చేసుకోవాలి ! నిర్ణీత మెజర్‌మెంట్స్‌ను అనుసరించి కట్‌చేసుకున్న భాగాలను వెల్డింగ్‌చేయటం ద్వారా కలుపుతూ పోతే బాక్స్ తయారవుతుంది. ఆ తరువాత వెల్డింగ్ చేయబడిన ప్రదేశాలలో ముందుగా వైట్ పెయింట్‌గానీ, రెడ్ ఆక్సయిడ్ పూసి, ఆ తరువాత స్ప్రేపెయింటింగ్ చేయాలి!

ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ వివరాలు ప్రత్యేకంగా యివ్వబడ్డాయి.

# గుండు సూదులు

*ఆఫీసులో పనిచేసేవారికి, ఇతర పనుల మీద ఆఫీసుల చుట్టూ తిరిగే వారికీ, కార్బన్ పేపర్ ఉపయోగించి ఏదయినా వ్రాయదలుచుకున్నవారు పైన వున్న పేపరూ దాని క్రింద వుంచిన కార్బనుపేపరూ దాని క్రింద డూప్లికేటింగ్ కోసం వుంచిన పేపరు కదలకుండా వుండాలంటే గుండుసూదిని తప్పకుండా ఉపయోగిస్తారు. రెండుమూడు కాగితాలలో వున్న ఏదయినా దరఖాస్తు చెదిరిపెకుండా వుండాలంటే గుండుసూది తప్పనిసరి. మార్కెట్‌లో ఈ గుండుసూదులకు ఎప్పడూ గిరాకీ వుంటూనే వుంటుంది. ఎందుకంటే ఇది లాభసాటి పరిశ్రమ కాబట్టి.*

**'రా' మెటీరియల్స్: (ముడిసరుకులు):** 1. మైల్డ్‌స్టీల్‌వైర్ (18 నుండి 24 యస్.డబ్ల్యూ.జి) 2. పేకింగ్ కోసం అట్టపెట్టెలు.

**ఫార్మూలా:-** అవసరం అయిన గేజిలో మైల్డ్ స్టీలువైర్ ను తీసుకుని గుండుసూదులుగా మలచటానికి సంబంధించిన అనుభవమే దీని ఫార్ములా.

**మేకింగ్ మెషినరీ:-** 1. హెచ్. పి.మోటార్‌తో నడిచే ఆటోమేటిక్ పిన్‌మేకింగ్ మెషిన్ 2. ప్లేటింగ్ బార్ 3. డైయిర్ 4. రివాల్వింగ్ డ్రమ్ (క్లీన్ చేయటానికి) 5. చిన్నచిన్న ఇతర పరికరాలు.

***తయారుచేయు విధానం:-*** గుండుసూదులను పాతిక అంగుళం, అరఅంగుళం సైజులలో తయారుచేయవచ్చును. 2 హార్స్ పవర్స్ గల మోటార్ సహాయంతో నడిచే ఆటోమేటిక్ పిన్‌మేకింగ్ మెషిన్‌లోకి మైల్డు స్టీల్‌వైర్ చుట్టను ఫీడ్ చేస్తే పైన హెడ్ (గుండు) క్రింద సన్నటి సూదిలా తయారవుతాయి. వాటిని రివాల్వింగ్ డ్రమ్‌లో వేసి బాగా క్లీన్‌చేసి, ఆ తరువాత ప్లేటింగ్ చేసి ఆరబెట్టాలి.

ఆ తరువాత, ముందుగా రెడీ చేసుకున్న వివిధ సైజులలోని అట్టపెట్టెలలో 100, 200, 300, గ్రాములవారీగా పేక్ చేసి మార్కెట్ చేయాలి. వర్కింగ్ కాపిటల్‌తో సహా ఈ గుండుసూదుల తయారీకి సుమారు లక్షా ఇరవైవేల రూపాలయవరుకు పెట్టుబడి పెట్టవలసి వుంటుంది. మేకింగ్ మరియూ మార్కెటింగ్ కెపాసిటీని బట్టి లాభం కూడా అదే రేంజ్‌లో వుంటుంది. లాభం ఇంతని పుస్తకంలో అంకెల ద్వారా తెలుసుకోవటం కంటే అనుభవంతో మీరు తెలుసుకోవటమే మంచిది.

యంత్రపరికరాలు.... మద్రాసు, హైద్రాబాద్, బెంగళూర్ వంటి ముఖ్యనగరాలలో లభిస్తాయి.

ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ వివరాలు ప్రత్యేకంగా యివ్వబడ్డాయి.

# లిక్విడ్ పేస్ట్ మెటల్ పాలిష్

*కొన్ని రకాల లోహపు వస్తువులను తళతళ మెరిసేటట్లు చేయటానికి ఉపయోగించేదే ఈ మెటల్ పాలిష్. ముఖ్యంగా నేమ్ ప్లేట్స్‌కీ, లోహసంబంధమైన గిఫ్ట్ ఆర్టికల్స్‌కీ, బకిల్స్ మొదలయిన వాటికి ఈ మెటల్ పాలిష్‌ను ఉపయోగించవచ్చును. దీనిని తయారుచేయటం సులువే అయినా... అనుభవం తప్పనిసరి! క్వాలిటీ, మార్కెటింగ్ కెపాసిటీని బట్టి లాభం బాగానే వుంటుంది.*

**'రా' మెటీరియల్స్ (ముడిసరుకులు):- మరియు ఫార్ములా:-**1. ప్యూమిస్ పౌడర్ 25 గ్రా. 2. నాఫ్తా 475 గ్రా. 3. ఓలిక్‌ఆసిడ్ 60 గ్రా. 4. డైల్యూటెడ్ - అమోనియా 175 గ్రా. 5. ట్రైఎథినాల్ అమైన్ 90 గ్రా. 6. స్వచ్ఛమైననీరు 900 మి.లీటర్లు. 7. పుల్లర్ మత్తిక 10 గ్రా.

***తయారుచేయు విధానం:-*** ప్యూమిస్ పౌడర్, డైల్యూటెడ్ అమోనియా, పుల్లర్‌మత్తిక, ట్రైఎథినాల్ అమైన్, మొదలయిన నాలుగింటినీ తీసుకుని మిక్సర్‌లో వేసి మెత్తటి పౌడర్‌గా చేయాలి. బాగా జల్లించి మరింత మెత్తగా వుండేలా చూడాలి. ఆ మిశ్రమానికి నీళ్ళు కలిపి మెత్తటి ముద్దగా తయారుచేయాలి.

ఓలిక్ ఆసిడ్ సాఫ్తాలను కలిపి మరొక మిశ్రమం తయారుచేయండి. ఈ రెండు మిశ్రమములను మేళవించి.. ... స్టెబిలైజర్‌వాడి, హోమజనైజర్‌లోకి పంపి చిక్కటి ద్రవంలా తయారుచేసి వివిధ రకాల సైజులలోని ఆకర్షణీయమయిన సీసాలలో నింపి మార్కెట్ చేయండి. ఈ ద్రవాన్ని మరింతగా చిక్కబరచి, పేస్ట్‌లా తయారుచేసి గుండ్రటి రేకు టిన్నులలో కూడా నింపి మార్కెట్ చేయవచ్చు.

ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ వివరాలు ప్రత్యేకంగా యివ్వబడ్డాయి.

## పౌడర్ మెటల్ పాలిష్

**'రా' మెటీరియల్ (ముడిసరుకులు):- ఫార్ములా:** 1. సిలికాపౌడర్ 30 గ్రా. 2. సిట్రిక్ ఆసిడ్ 60 గ్రా. 3. ప్యూమిస్ పౌడర్ 145 గ్రా. 4. డొలమైట్ 60 గ్రా. 5. బెన్‌టోనైట్ 125 గ్రా.

**తయారుచేయు విధానం:-** పైన ఇవ్వబడిన ముడిసరుకులన్నిటిని ఆయా పాళ్ళలో కలిపి ఒక మిక్సర్‌లో వేసి బాగా కలిసేలా పౌడర్ చేయండి. ఆ తరువాత సన్నటి వస్త్రంలో గాని, జల్లెడలో గాని జల్లించండి. అవసరం అనుకుంటే ఒకటికి రెండుసార్లు జల్లిస్తే మంచిది. అలా జల్లించగా వచ్చిన పౌడర్‌ను ఆకర్షణీయమయిన ప్యాకింగ్‌లద్వారా మార్కెట్ చేయండి.



# ఫినాయిల్

*ప్రస్తుతం కాలంలో ఫినాయిల్ వాడకం ఎక్కువయిందనే చెప్పాలి; ఇంట్లో ఫ్లోర్‌నూ, ఆఫీస్ ఫ్లోర్‌లననూ, టాయ్‌లెట్‌లను శుభ్ర పరచటానికి ఈ ఫినాయిల్ ఎక్కువ ఉపయోగపడుతుంది. లీటర్, అరలీటర్ సీసాలలో లభించే ఈ ఫినాయిల్ ధర తక్కువగా వుంటుంది. తయారుచేయటానికి పెట్టుబడి కూడా తక్కువే అవుతుంది.*

**'రా' మెటీరియల్స్ (ముడిసరుకులు):-** 1. లైట్‌క్రెసోట్ ఆయిల్ 2. రోసిన్ 3. కాస్టిక్ సోడా. 4. స్వచ్ఛమైన వాటర్.

**ఫార్మూలా:-** లైట్ క్రెసోట్ ఆయిల్ 10 లీటర్‌లు. కాస్టిక్ సోడా 400 గ్రాములు. రోసిన్ 900 గ్రాములు. స్వచ్ఛమైననీరు 900 మి.లీ.

**మేకింగ్ మెషినరీ:-** 1. స్టోరేజ్ వెస్సల్ 2. బాటిల్ ఫిల్లింగ్ యంత్రం 3. రియాక్షన్ ప్లాంట్ 4. మిక్సర్ 5. బాటిల్ సీలింగ్ యంత్రం 6. బాటిల్స్ 7. ప్యాకింగ్ బాక్స్‌లు.

***తయారుచేయు విధానము:-*** కొంచెం దళసరిగా వున్న డబ్బాలో నీరు పోసి వేడి చేయండి. ఆ వేడినీటిలో కాస్టిక్ సోడావేసి ఒక కర్రతో బాగా కలియబెట్టండి. కాస్టిక్‌సోడా వేడి నీటిలో పూర్తిగా కరిగిన తరువాత ముందుగానే మెత్తటి పొడిగా చేసి ఉంచుకున్న రోసిన్‌ని కాస్టిక్ సోడా కలిపిన నీటిలో కొంచెం కొంచెంగా వేస్తూ బాగా కలుపుతూ వుండండి. బాగా కలిసి కొంతసమయం మరిగేసరికి ఆ మిశ్రమ ద్రవం పాకంలా తయారయి పొంగుతుంది. వెంటనే ఆ డబ్బాను పొయ్యిమీద నుండి దించి, ఏడు, ఎనిమిది నిముషాల తరువాత ఆ చిక్కటి ద్రవంలో క్రెసోట్ ఆయిల్ పోసి బాగా కలిపి, తిరిగి పొయ్యిమీద పెట్టండి. ఆ తరువాత సన్నటి మంటమీద పదినిముషాల పాటు వుంచి పొంగురాకముందే దించేయండి.

ఇది బాగా చల్లారిన తరువాత అరలీటరు, లీటరు సీసాలలో యంత్రసహాయంతో నింపి, సీల్‌చేసి లేబల్స్ అతికించి మార్కెట్ చేయండి.

ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ వివరాలు ప్రత్యేకంగా యివ్వబడ్డాయి.

# రెడీమెడ్ ఫ్యాన్సీ బ్లౌజులు

మారుతున్న కాలంతోపాటే ధరించే దుస్తులలో వివిధ రకాల ఫ్యాషన్లు చోటుచేసుకుంటున్నాయి. స్త్రీలు ధరించే జాకెట్స్‌లో ఈ ఫ్యాషన్స్ ప్రధానంగా కనిపిస్తున్నాయి. క్లాత్‌కొని, టైలర్‌కి ఇచ్చి తగిన ఫ్యాషన్స్‌లో కుట్టించుకునే కాలంపోయి, ఎప్పటికప్పుడు కొత్తకొత్త ఫ్యాషన్స్‌లో మార్కెట్‌లో కనిపిస్తున్న రెడీమెడ్ ఫ్యాన్సీ బ్లౌజ్‌లు మీదనే స్త్రీలు ఎక్కువగా మొగ్గుచూపుతున్నారు. ఎందుకంటే కొన్ని వెంటనే ఇంటికి తెచ్చి వాటిని తొడుక్కోవటానికి వీలుంటుంది. టైలర్ చుట్టూ తిర్గగనవసరం లేదు. కటింగ్ మెథడ్స్‌లో టైలరింగ్‌లోనూ అనుభవం ఉంటే చాలు. ఇది ఎంతో లాభసాటి పరిశ్రమ అని మీకే తెలుస్తుంది.

**'రా' మెటీరియల్ (ముడిసరుకులు):-** 1. వివిధ రంగులలో, డిజైన్‌ల క్లాత్. 2. మార్కింగ్ చాక్ (టైలరింగ్‌ది) 3. రంగు రంగుల దారాలు 4. హుక్స్, లైనింగ్ క్లాత్, జిప్స్.

**ఫార్మూలా:-** వివిధ ఫ్యాషన్స్‌లో కటింగ్స్, మరియు కుట్టటంలో అనుభవం వుండటమే దీనికి ఫార్మూలా.

**మేకింగ్ మెషినరీ:-** మీరు తయారుచేయదలుచుకున్న బ్లౌజులు సంఖ్యను బట్టి, కుట్టుమిషన్స్ ఎన్నయినా పెట్టుకోవచ్చు. 2. పెద్దసైజు టైలరింగ్ కత్తెర్లు, 3. మెషీన్ ఆయిల్4. మెజర్‌మెంట్స్ టేప్ 5. హుక్స్ కుట్టేందుకు, సూదులు.

**తయారుచేయు విధానము:-** వివిధరంగులలో, డిజైన్స్ కూడిన సిల్కు, కాటన్ మరియు పాలిస్టర్, టుబైటు, క్లాత్‌లను తానులుగా ఆర్డర్‌చేసి తెచ్చుకోవాలి (ఇవి బొంబాయి, కలకత్తా, ఢిల్లీ మొదలయిన నగరాలలోని కాటన్ మిల్స్ నుండి ఆర్డర్స్ చేసి తెచ్చుకుంటే చాలా చౌకగా లభిస్తాయి, ఇవికాక బొంబాయి మార్కెట్‌లో కిలోల వంతున కూడా కట్‌పీసెస్ అమ్ముతారు ఇవి మరింత చౌకగా లభిస్తాయి)

అలా తెచ్చుకున్న క్లాత్‌లను 32,34,36,38,42,44 సైజులలో వివిధ ఫ్యాషన్‌లతో కట్‌చేయాలి. ఈ ఫ్యాషన్‌లలో అధికప్రాధాన్యతను బ్లౌజ్‌నెక్ కటింగ్స్‌కీ బ్లౌజ్ వెనుక భాగానికి సంబంధించిన కటింగ్స్‌కీ, బాడీ షేప్‌లకీ ఇవ్వాల్సి వుంటుంది. ఆ తరువాత

బుట్టచేతులూ, పొట్టిచేతులూ, మోచేతివరకూ కామన్‌హాండ్స్ ఇలా వివిధ రకాలుగా కట్‌చేయాల్సి వుంటుంది. ఇటువంటి కటింగ్ విషయంలో అనుభవం ప్రధానం అని మరవకండి.

అలాకట్ చేసిన పీసెస్‌ని అదే రంగు దారంతో కుట్టు మిషన్‌ల మీద ఒక పద్ధతి ప్రకారం కలుపుకుంటూ పోతే లేటెస్ట్ మోడల్ ఫ్యాన్సీ బ్లౌజ్‌లు తయారవుతాయి. (వీటిలో ఫ్రంట్‌ఓపెన్, బాక్ ఓపెన్, బేక్‌సైడ్ ఓపెన్ అని ఉంటాయి) వాటిలో కొన్నింటికి హుక్స్, కొన్నింటికి జిప్స్ కుట్టి బ్లౌజ్‌లను మార్కెట్ చేయవచ్చును. మార్కెట్‌లోని షాపులకి హోల్‌సేల్ రేటులో సప్లయ్ చేయవచ్చు. ఆర్డర్స్ మీద కుట్టి అందించవచ్చు. ఈ విధమయిన బ్లౌజ్‌లకు కలరూ, ఫ్యాషన్ ప్రధానం.... క్లాత్ నాణ్యతను పెద్దగా పట్టించుకోవటం జరగదు... అదే పట్టుజాకెట్‌లకూ పల్చని క్లాత్‌తో తయారుచేసే జాకెట్‌లకు లోపల లైనింగ్ క్లాత్ వేయాల్సి వుంటుంది.

రెడీమేడ్ షర్టులు కూడా ఇదే విధంగా తయారుచేసి మార్కెట్ చేయవచ్చు.

దీనికి సంబంధించిన మెషనరీ స్థానికంగా లభిస్తాయి.

పెట్టుబడి మీ స్థోమతను బట్టి పెట్టుకోవచ్చు. వివరాలు ప్రాజెక్ట్ ఎస్టిమేషన్‌లో చూడండి



# గొడుగులు

గొడుగుల ఉపయోగాన్ని గురించి ప్రత్యేకంగా ఎవరికీ చెప్పనవసరం లేదు. మండు వేసవిలో తల, ముఖం మాడిపోకుండా, వడదెబ్బతగలకుండా వుండటానికీ, వర్షాకాలంలో తడవకుండా బయట తిరగటానికి గొడుగులు వాడని వాళ్ళు వుండరు అని చెప్పటం అతిశయోక్తి కాదు. మారుతున్న కాలానికి అనుగుణంగా ఈ గొడుగులు కూడా, వివిధ రకాల డిజైన్స్‌లో, ఫ్యాషన్స్‌తో తయారు అవుతున్నాయి. ఈ గొడుగుల తయారీ కొద్దిపాటు ట్రెయినింగ్‌తో చాలా సులువుగా నేర్చుకోవచ్చు. ఈ గొడుగుల తయారీకి అయ్యే విడి వస్తువుల మార్కెట్‌లో అమ్ముతారు. వాటిని కొని తెచ్చుకుని ఒక పద్ధతి ప్రకారం కలువుకుంటూపోతే ఆకర్షణీయమయిన గొడుగులు తయారవుతాయి. ఇది మంచి లాభాలను ఆర్జించేవ్యాపారం అని చెప్పొచ్చు.

**'రా' మెటీరియల్స్: (ముడిసరుకులు):-** 1. యం.యస్. పైపు 2. స్ప్రింగ్, 3. క్లిప్ 4. గొడుగు క్లాత్ (రెగ్యులర్ బ్లాక్ మరియు వివిధ రంగులవి) 5. ప్లాస్టిక్ హాండిల్ (వంపు వున్నది) 6. దారం. 7. ఎలాస్టిక్ టేప్ 8. రన్నర్స్ 9. స్టాటెడ్ కేవ్ పైపు 10. బ్రాస్‌రింగ్ 11. రిబ్.

**ఫార్ములా:-** ముడిభాగాలను అసెంబుల్ చేసే పద్ధతి తెలియటమే దీనికి ఫార్ములా.

**మేకింగ్ మెషినరీ (ఎక్విప్‌మెంట్స్):-** 1. కుట్టుమిషన్ 2. కటింగ్ ప్లేయర్ 3. కత్తెర 4. పెద్దసైజు సూది 5. విద్యుద్దీకరణ.

**తయారుచేయు విధానము:-** గొడుగు కటింగ్‌లో ముందుగానే క్లాత్‌ను తయారు చేసుకోవాలి. ప్లాస్టిక్ హాండిల్‌తో వున్న సెంటర్ పైప్‌ని..హోల్స్‌లో వున్న బ్రాన్‌రింగ్‌ను మార్క్‌చేయబడిన చోట తగిలించి, ఆటుచివర, ఇటు చివర రంధ్రాలు వుండే ఆటో మేటిక్ ఫోల్డెడ్ వూచలు పై భాగాల రంధ్రాలను బ్రాన్‌రింగ్ రంధ్రాలను కలిపి, సన్నటి తీగలో బిగించాలి. ఆ తరువాత క్లాత్‌ను వూచలపై భాగంలో పరిచి, వూచలు ఫోల్డ్ అయ్యే మధ్యభాగంలో నల్లటి దారంలో పైకి కనిపించని విధంగా గట్టిగా కుట్టువేయాలి. ఆ తరువాత ఊచలచివరి భాగాలను....క్లాత్ చివరి భాగాలతో కలిపి గట్టిగా కుట్టాలి.... రిబ్‌నూ, ఎలాస్టిక్ టేప్‌నూ, స్ప్రింగ్, క్లిన్, రన్నర్స్ మొదలయిన వాటిని తగిన విధంగా అసెంబుల్ చేయాలి.

ఇదేవిధంగా అనేక రంగుల కలిసిన క్లాత్‌తో కూడా గొడుగును తయారు చేయవచ్చును. ... ప్లాస్టిక్ క్లాత్ తయారు చేసే గొడుగులు పిల్లలను బాగా ఆకర్షిస్తాయి. స్ప్రింగ్‌కి బటన్‌ని అమర్చటం ద్వారా, బటన్ ప్రెస్ చేయగానే ఆటోమెటిక్‌గా తెరుచుకునే గొడుగులకు ప్రస్థుతం మార్కెట్‌లో ఎక్కువ డిమాండ్ వుంది.

ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ వివరాలు ప్రత్యేకంగా యివ్వబడ్డాయి

# ట్యూబ్‌లైట్ ప్లాంక్స్

*కరెంట్ వినియోగాన్ని అనుసరించి ట్యూబ్‌లైట్స్ గిరాకీ బాగా పెరిగిందనే చెప్పాలి. వీటి కాంతి కూడా సాధారణమయిన బల్బులు కంటే మెరుగ్గా వుంటుంది కనుక. ఇళ్ళల్లో ఆఫీసులలో,స్ట్రీట్స్‌లో ట్యూబ్‌లైట్స్ వాడకం అధికంగా కనిపిస్తోంది. అటువంటి ట్యూబ్‌లైట్స్ బిగింపుకు ప్రధానమయింది ట్యూబ్‌లైట్ ప్లాంక్ (బద్దీ). ఇరువైపులా అంచులు వెనక్కువంచబడి వుండే ఈ బద్దీ వెనుక భాగంలో ప్లాస్టిక్ కవరేజీలో ఉన్న వైరును బిగించాల్సి వుంటుంది. ట్యూబ్‌లైట్స్ డిమాండ్ ఎంతగా వుంటే ఈ బద్దీల డిమాండ్‌కూడా అంతగానే వుంటుంది.*

**'రా' మెటీరియల్స్ (ముడిసరుకులు):-** 1. S.W.G. 18 లేక 20 M.S . షీట్. 2. బ్రష్‌లు 3.అయిరన్ రివిట్లు 4. పెయింట్స్ 5. శాండ్‌పేపర్.

**ఫార్మూలా:-** యంత్ర పరికరాలను ఉపయోగించి బద్దీలు తయారుచేయటంలో తగినంత అనుభవం సంపాదించటమే ఫార్ములా.

**యంత్రపరికరాలు:-** 1. పోర్టబుల్‌హేండ్ డ్రిల్లింగ్ మెషిన్ 2. హేండ్ ప్రెస్ నెంబర్ 4 (బేస్ ప్లేట్ డై ఫిక్సర్స్‌తో) 3. చేత్తో ఉపయోగించే పరికరాలు 4. హేండ్ షియరింగ్ మెషిన్ 5. విద్యుద్దీకరణ.

***తయారుచేయు విధానము:-*** ముందుగా నిర్ణయించుకున్న కొలతల ప్రకారం (ట్యూబ్‌లైట్స్ సైజులనుబట్టి) 18 లేక, 20 గేజ్‌గల M.S. షీట్‌ను. హేండ్ హియరింగ్ యంత్ర సహాయంతో కావల్సిన సైజ్‌కి కట్‌చేసుకోవాలి. ఆ తరువాత వెడల్పులో రెండు వైపులా వుండే అంచులను వెనక్కి వంచాలి. బద్దీని (ప్లాంక్) గోడకు అమర్చేందుకు అనువుగా పోర్టబుల్ హాండ్ డ్రిల్లింగ్ యంత్రాన్ని ఉపయోగించి రెండు చోట్ల రంధ్రాలు చేయాలి. అదికాక స్టార్టర్ తగిలించేందుకు అనువుగా మరో పెద్ద రంధ్రం కూడా చేయాల్సి వుంటుంది. శాండ్ పేపర్‌తో బద్దీని నీట్‌గా తుడిచిన తరువాత వైట్ పెయింట్‌వేసి. నీట్‌గా తయారుచేసిన తరువాత మార్కెట్ చేయాలి.

ఈ బద్దీలకు హోల్‌సేల్ డీలర్స్ నుండి, కాంట్రాక్టర్‌లను ఆర్డర్‌లు తీసుకుని ఎక్కువ సంఖ్యంలో సప్లయ్‌చేస్తే మంచి లాభం వుంటుంది. ముందుగా తర్ఫీదు పొందటం, మార్కెట్ డిమాండ్‌ను పరిశీలించటం ముఖ్యం.

ఈ బద్దీలు (ప్లాంక్స్) తయారుచేయటానికి అవసరం అయిన యంత్ర పరికరాలు మద్రాసు, హైద్రాబాద్, బెంగళూర్ వంటి నగరాలలో లభిస్తాయి.

పెట్టుబడిని గురించి ప్రాజెక్ట్ ఎస్టిమేషన్‌లో చూడండి

# ఫ్రూట్ సాస్‌లు

*కొన్ని రకాల పళ్లరసాలూ, గుజ్జులతోను మరికొన్ని రసాయనిక పదార్థాలతో మేళవింపు చేసి తయారుచేసే ఫ్రూట్‌సాస్‌ల గిరాకీ ప్రస్థుతం మార్కెట్‌లో ఎక్కువగానే వుందని చెప్పాలి. బ్రెడ్, బంగాళాదుంపల చిప్స్, అరటిచిప్స్ మొదలయిన వాటిని ఈ సాస్‌లలో కలిపి తింటే చాలా రుచిగా వుంటాయి. ఈ సాస్‌లను వివిధరకాల సరికొత్త రుచులో తయారు చేసి మార్కెట్‌చేస్తే మంచిలాభం వుంటుంది.*

**'రా' మెటీరియల్స్ (ముడిసరుకులు):- మరియు ఫార్ములా:-** 1. పంచదార 1కిలో 2. విత్తనాలు, పీచులేని ఫ్రూట్‌జ్యూస్ 1/2 లీటరు. 3. సోడియం బెంజూట్ 3 గ్రాములు 4. సిట్రిక్ ఆసిడ్ 25 గ్రాములు (పుల్లగా ఉండే జ్యూస్‌లకి సిట్రిక్ ఆసిడ్ వాడకూడదు) 5. స్వచ్ఛమయిన నీరు 1లీటర్.

***తయారుచేయు విధానము:-*** మీరు తీసుకున పండ్లకు సంబంధించిన విత్తనాలూ, పీచూ, పిప్పి మొదలయిన వాటిని తీసివేసి స్వచ్ఛమయిన పండ్ల రసాన్ని శుభ్రంగా కడిగిన ఒక పాత్రలో వేసి మూత పెట్టాలి. మరొక పాత్రలో అవసరం అయినంత పంచదారను తగినంత నీటిలో (పైన ఇవ్వబడిన పాళ్ళల్లో) వేసి సిట్రిక్ ఆసిడ్‌తో కలిపి సన్నటి సెగమీద అయిదు నుండి పది నిముషాలపాటు వేడి చేయాలి. ఆ తరువాత పండ్లరసాన్ని - పంచదార, సిట్రిక్ యాసిడ్ మిశ్రమంలో కలపాలి. అది బాగా చల్లారిన తరువాత సోడియం బెంజూట్‌ను అందులో కలపాలి.

ఆ తరువాత అవసరం అయిన రంగునూ, ఎసెన్స్‌లు జతచేర్చి సాస్‌ను ఆకర్షణీయమైన సీసాలలో కొద్దిపాటి వెలితిలో నింపి....స్క్రూ సిస్టమ్‌లో వున్న గట్టి మూతలతో బిగించాలి. సీసాలకు అందమైన డిజైన్‌లలో ప్రింట్ చేయబడిన లేబిల్స్ అంటించి మార్కెట్‌లోకి విడుదల చేయాలి. ఇక మీ ప్రాడక్ట్‌కి గిరాకీ పెరగటం అనేది మీ సామర్థ్యం మీద మీరు అందించే క్వాలిటీ మీద ఆధారపడి వుంటుంది.

ముడిసరుకులు స్థానికంగా మీకు లభిస్తాయి. ఇక మీరు కోరుకున్న ఆకర్షణీయమయిన సీసాలను ఆర్డర్ ఇచ్చి తయారు చేయించుకోవాలి. లేబిల్స్ కూడా మరింత అందంగా కలర్‌ఫుల్‌గా వుండేటట్లు ప్రింట్ చేయించాలి.

ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ ప్రత్యేకంగా యివ్వబడింది.

# షాంపూ

*కుంకుడు కాయలనూ, షికాకాయలను నలగ్గొట్టి తలంటి పోసుకునే కాలంపోయింది. వాటిస్థానాన్ని విపరీతమయిన గిరాకీతో షాంపులు ఆక్రమించుకున్నాయి. షాంపూతో తల అంటుకోవటం వల్ల మురికి త్వరగా వదులుతుందన్న నమ్మకం ఇప్పుడు జనంలో బాగావుంది... కుంకుడు కాయ పులుసులా కళ్లల్లో పడిమంట పుట్టించదు ఈ షాంపూ. ఈ షాంపూనుతయారు చేయటం సులభతరం మాత్రమే కాదు... సమర్థవంతంగా మార్కెట్‌చేసి, డిమాండ్‌ను పెంచగలిగితే మంచి లాభదాయకమయిన వ్యాపారం కూడా.*

**'రా' మెటీరియల్స్: (ముడిసరుకులు) ఫార్ములా:-** బొరాక్స్ 6 గ్రాములు, కొకొనామైడ్ 10 గ్రా॥, కొబ్బరినూనె 400 గ్రా॥, సోడియం లారిల్ సల్ఫేట్ 10 గ్రా॥, కాస్టిక్ పొటాష్ 80 గ్రా॥, షుగర్ 100 గ్రా॥, స్వచ్ఛమయిన నీరు 900 మి.లీటరులు.

**యంత్రపరికరములు:-** 1 స్టీలు కుళాయి 2 స్టవ్ లేక బట్టీ 3. కొయ్య గరిటెలు 4. ప్లాస్టిక్ బక్కెట్లు 5. వెయింగ్ మెషిన్ 6. ప్లాస్టిక్ బాటిల్స్, సాచెట్స్. 7. లేబిల్స్ 8. యింకా మరికొన్ని పరికరాలు.

***తయారుచేయు విధానము:-*** సెమీబాయిల్డ్ పద్ధతిలో సన్నటి మంట మీద లిక్విడ్స్, వేడిచేయాలి, సాలిడ్ రసాయనాలను ముందు పౌడర్‌లుగా మార్చి జల్లించి, ఆ తరువాత నీటిలో కలిపి వేడిచేస్తూ కరగ నివ్వాలి. ఆ తరువాత రెండు మిశ్రమాలను కలిపి సన్నటి సెగమీద వేడిచేస్తూ కొయ్యగరిటెతో బాగా కలపాలి. కావాల్సిన రంగును కూడా అప్పుడే కలపాలి, చల్లారిన తరువాత కొంచెం సువాసన ఎసెన్స్‌ను చేర్చి, తూకం ప్రకారం చిన్నచిన్న ప్లాస్టిక్ సీసాలలో సాచెట్స్‌లో పేక్ చేయాలి.

మార్కెట్‌లో విడుదలవుతున్న షాంపూ సాచెట్స్‌ని గమనించండి... వాటితో పోటీ పడే విధంగా మీ సాచెట్స్ అందంగా కలర్‌ఫుల్‌గా చక్కటి డిజైన్‌లో వుండేలా చూడండి. మీరు అందించే షాంపు మార్కెట్‌లో డిమాండ్ పెంచుకోటానికి ఇదొక కారణం అయితే మీరు అందించే క్వాలిటీ మరోముఖ్య కారణమై మీ వ్యాపారం త్వరిత గతిని అభివృద్ధిచెంది మంచి లాభాలను ఆర్జించే దిశగా పయనిస్తుంది.

ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ వివరాలు ప్రత్యేకంగా యివ్వబడ్డాయి.

# వార్నీష్ (ఫ్రెంచ్ పాలీష్)

*గృహాలలో, ఆఫీసులల్లో స్కూలు, మరియు కాలేజీలలో వుండే ఫర్నిచర్... అంటే... చెక్కబీరువాలు, ర్యాకులు, కుర్చీలు, టేబుల్స్, వుడెన్‌కాట్స్, తలుపులు, విండోఫ్రేమ్, మొదలయిన చెక్క సామానులు. చెదలుపట్టకుండా, అందంగా ఆకర్షణీయంగా కనిపించేలా చేసేందుకు వార్నీష్ చక్కగా ఉపయోగపడుతుంది. వార్నీష్ లేకుండా ఫర్నిచర్‌కి ఫినిషింగ్ రాదు.*

**'రా' మెటీరియల్స్ (ముడిసరుకులు):-** 1. ఫైన్ ఆయిల్ 2. బెంజిన్ 3. లైట్ స్పిండిల్ ఆయిల్ 4. మెథిల్ ఆల్కాహాల్ 5. రిఫైన్డ్ రెడ్ ఆయిల్

**ఫార్ములా:-** ఫైన్ ఆయిల్ 1 కిలో, బెంజిన్ 7 కిలోలు, లైట్ స్పిండిల్ అయిల్ 30 కిలోలు, మెథిల్ ఆల్కహాల్ 11 కిలోలు, రిఫైన్డ్ రెడ్ ఆయిల్ 1కిలో 500 గ్రాములు.

***తయారుచేయు విధానము:-*** పైన పేర్కొన్న ముడిసరుకులన్నీ ఒక యం.యస్ మిక్సర్‌లో వేసి బాగా కలిసిపోయేటంత వరుకూ మిశ్రమంచేస్తే ఫ్రెంచ్ పాలీష్ అనబడే మంచివార్నీషు తయారవుతుంది. ఫార్ములాలో చిన్నచిన్న మార్పులూ, చేర్పులూ చేసుకుంటూ మంచి క్వాలిటీగల వార్నీష్‌ను తయారుచేయటానికి ప్రయత్నించండి.

ఆ తరువాత 2 లీటర్లు, 1లీటరు, అరలీటరు డబ్బాలో ప్యాకింగ్ చేసి మార్కెట్ చేయండి...మంచి క్వాలిటీగల వార్నీష్‌ను అందించగలిగితే పెద్ద పెద్ద ఫర్నిచర్ వర్క్‌షాపులనుండి అధికంగా ఆర్డర్‌లు పొందవచ్చును.

ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ వివరాలు ప్రత్యేకంగా యివ్వబడ్డాయి.

# ఫ్రూట్ జామ్

*బ్రెడ్ స్లైస్‌లపై వెన్నతోపాటు రాసే రుచికరమయిన జామ్‌లను గురించి తెలియని వారుండరు. నోటికి రుచిగా ఆకలి తీర్చటంలో ఇంతకంటే ఫాస్ట్ ఫుడ్ మరొకటి వుండదనే చెప్పవచ్చు. ఈ ఫాస్ట్‌ఫుడ్‌కి రుచిని చేకూర్చే ప్రధానమయినదే ఫ్రూట్ జామ్. పిల్లలు దీనిని బ్రెడ్‌తో కలిపి చాలా ఇష్టంగా తింటారు. ఈ జామ్ ఏ ఒక్క పండుతోనయినా గానీ, నాలుగయిదు రకాల పండ్ల మిశ్రమముతోగాని తయారుచేసుకోవచ్చు. మార్కెట్‌లో ఈ జామ్‌ల గిరాకీ బాగానే వుంది. దీనిని తయారుచేయటం కూడా చాలా శులభం. లాభదాయకం.*

**'రా' మెటీరియల్స్ (ముడిసరుకులు):-** 1. పంచదార 2. ఫ్రూట్ మిక్స్‌డ్ ఎస్సెన్స్ 3. సోడియం బెన్‌కోట్ 4. ఎరుపు, నారింజ ఫుడ్ కలర్ 5. వివిధరకాల పండ్లు 4 రకాలు 6. సిట్రిక్ ఆసిడ్

**ఫార్ములా:-** సపోటాపళ్ళు 250 గ్రా॥, ఆపిల్స్ 2 కిలోలు, బొప్పాయిపళ్ళు 1కిలో, అరటిపళ్ళు 300 గ్రాములు, పంచదార 2 1/2 నుండి 3కిలోలు., ఫ్రూట్‌మిక్స్‌డ్ ఎసెన్స్ 5 మి.లీటర్లు., సోడియం బెన్‌కోట్ 4 గ్రాములు (నిల్వవుంచటానికి), ఫుడ్‌కలర్ కావాల్సింది తగినంత, సిట్రిక్ ఆసిడ్ 10 గ్రాములు.

**తయారుచేయు విధానము:-** చక్కటి పండ్లను శుభ్రపరిచి పై తొక్కలు తొలగించి, విత్తనాలనూ, పీచునూ తీసివేసి తొనలుగానూ, ముక్కలుగానూ కోసి శుభ్రంగా కడిగి వుంచిన స్టీలు పాత్రలో వేయాలి. పాత్ర పెద్దది గా వుండాలి. ఒక స్టవ్ మీద ఈ పాత్రను వుంచి, పంచదారను కలిపి తక్కువ మంటమీద వుంచి, పొంగకుండా వేడి చేస్తూ బాగా కలిపి మిశ్రమం చేయాలి. ఇది బాగా మరుగుతున్న సమయంలో సిట్రిక్‌యాసిడ్‌ని కలపాలి. ఇది బాగా చిక్కబడి ఒక విధమయిన గుజ్జుతో తయారవుతుంది. ఇందులో ఎసెన్స్‌నూ సోడియం బెన్‌కోట్‌ను కలపాలి. ఆ తరువాత స్టవ్‌మీంచి క్రిందికి దించి ఆరనివ్వాలి!

వెడల్పుమూత గల ఆకర్షణీయమయిన సీసాలను (మీ పరిశ్రమకి సంబంధించి ఈ సీసాలు ప్రత్యేకమయిన ఆకారాలలో వుంటే మంచిది) వేడి నీటిలో శుభ్రంచేసి....రెడీగా వున్న జామ్‌ను వేడిగా వున్నప్పుడే ఆ సీసాలలోకి పీకలదాకా ఎక్కించి, సీసాలలోనే చల్లారనివ్వాలి. ఆ తరువాత జామ్ పైభాగంలో లిక్విడ్ పారఫిన్ మైనవమును పల్చటిపొరగా వేసి స్క్రూకిస్టంలో వున్న మూతలను గట్టిగా బిగించి సీసా బాడీమీద అందమయిన డిజైన్స్‌లో ప్రింట్ చేయబడిన లేబుల్స్ అంటించి మార్కెట్ చేయండి.

ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ వివరాలు ప్రత్యేకంగా యివ్వబడ్డాయి.

# వుడెన్ స్విచ్ బోర్డ్స

కొత్త భవనాలకయినా, ఇళ్లకయినా, ఆఫీసుల కయినా కరెంట్ కనెక్షన్ కావాల్సి వచ్చినపుడు స్విచ్‌బోర్డులు అవసరం తప్పనిసరిగా వుంటుంది. స్విచ్‌బోర్డ్స్‌లో పని భాగంలో వైర్ కనెక్షన్ ఇచ్చి పైన స్విచ్‌లు బిగించాల్సి వుంటుంది. చెక్కతో చేయబడిన ఈ స్విచ్‌బోర్డ్స్ కరెంట్ షాక్‌నుండి రక్షణ కల్పిస్తాయి. కొద్ది పాటి పెట్టుబడితో సులభ పద్ధతిలో ఈస్విచ్ బోర్డ్‌లను తయారుచేసి మంచిలాభాలు పొందవచ్చును.

**'రా' మెటీరియల్స్ (ముడిసరుకులు):-** 1. వివిధ రకాల కొయ్యముక్కలు 2. వార్నిష్ 3. మక్కు (చెక్క ముడిపదార్థంగా చేయబడిన పేస్ట్) 4. బోల్టులు 5. మేకులు

**ఫార్మూలా:-** తయారుచేసే పద్ధతి క్షుణ్ణంగా తెలియటమే దీనికి ఫార్ములా.

**యంత్రసామగ్రి:-** 1. వుల్ప్ డ్రిల్లింగ్ యంత్రం. 2. సుత్తి, కటింగ్ ప్లేయర్ వంటి చేతి పనిముట్లు 3. వుడ్ కటింగ్ మెషీన్ 4. డ్రిల్లింగ్ మెషీన్ 5. హేమర్, కటింగ్ ప్లేయర్ వంటి చేతి పనిముట్లు.

**తయారుచేయు విధానము:-** కొయ్యను కావాల్సిన సైజులలో వుడ్ కటింగ్ యంత్రసహాయంతో కట్‌చేసి, ఆ ముక్కను చిన్న, పెద్ద బాక్స్‌లుగా అసెంబుల్ చేయాలి. ఆ తరువాత అవసరమయిన చోట డ్రిల్లింగ్ మెషిన్‌లో రంధ్రాలుచేసి, ముక్కలు చెదిరి పోయినచోట 'మక్కు' అనబడే చెక్కపేస్ట్‌ను అద్దాలి. అది బాగా ఆరిన తరువాత వార్నిష్ కోటింగ్ తగినంతగా ఇచ్చి స్విచ్ బోర్డ్‌లను వాడకానికి సిద్ధంచేయాలి.

కాంట్రాక్ట్ పద్ధతిలో ఈ చెక్క బోర్డ్‌లు అధికంగా తయారుచేయవచ్చు.

ముడిసరుకులూ, యంత్రసామగ్రి మీకు అందుబాటులో వున్న పట్టణాలలో దొరుకుతాయి. మీరు తయారుచేసే బోర్డ్‌ల సంఖ్యను బట్టి నెలసరి ఆదాయం వుంటుంది.

ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ వివరాలు ప్రత్యేకంగా యివ్వబడ్డాయి.

# మస్కిటో కాయిల్స్

*పరిసరాలలో శుభ్రంలో లోపం, వాతావరణ కాలుష్యం మురికి నీరు కారణంగా దోమలు వ్యాపిస్తాయి. దోమకాటువలన మలేరియా, ఫైలేరియా వంటి వ్యాధులకు గురికావాల్సి వుంటుంది. అటువంటి దోమలు బాధకు గురికాకుండా వుండేందుకు మస్కిటో కాయిల్స్ బాగా ఉపయోగపడతాయి. సీజన్స్ బట్టి మస్కిటో కాయిల్స్ గిరాకీ మార్కెట్‌లో విపరీతంగా వుంటుంది.*

**'రా' మెటీరియల్స్ (ముడిసరుకులు):-** 1. సిట్రోనెల్లా ఆయిల్ 2. సిడార్ వుడ్ ఆయిల్ 3. మెత్తటి బొగ్గు పొడి 4. స్టార్చ్ పౌడర్ 5. కర్పూరం 6. కర్రపెండలం పొడం 7. పెరెత్రం పొడ 8. చుట్టుకోటానికి అవసరం అయినంత అయిరన్ తీగ 9. చక్రంలాంటి డైలు.

**ఫార్ములా:-** సిట్రోనెల్లా అయిల్ 15 గ్రాములు, సిడార్ వుడ్ ఆయిల్ 7 గ్రా॥, మెత్తని బొగ్గు పొడి 100 గ్రా॥, స్టార్చ్ పౌడర్ 20 గ్రా॥, కర్పూరం 10 గ్రా॥, కర్రపెండలం పౌడర్ 50 గ్రా॥, పెరెత్రం పౌడర్ 20 గ్రా॥, అయిరన్ తీగ కావాల్సినంత.

***తయారుచేయు విధానము:-*** స్టార్చ్ పౌడర్, బొగ్గుపొడీ, కర్రపెండలం పౌడరును బాగ జల్లించి, ఆ తరువాత మూడింటిని వేడి నీటితో మిశ్రమం చేసి ముద్దగా తయారుచేయాలి. ఆ తరువాత మిగతా ఆయిల్స్, పౌడర్ కర్పూరం మొదలయిన వాటిని ఒక్కొక్కటిగా ఆ ముద్దతో జతచేసి బాగా గ్రయిండింగ్ చేసి సాగే గుజ్జులా తయారుచేయాలి. ఆ గుజ్జును చుట్టలు చుట్టుకున్నట్టుండే రింగ్‌డైస్‌లోకి ఎక్కించి, ఆరిన తరువాత డైజ్ తొలగిస్తే మస్కిటో కాయిల్స్ తయారవుతాయి. వాటిని ఆకర్షణీయమయిన ప్రింటెడ్ డిజైన్స్‌తోవున్న పల్చటి అట్ట పెట్టెలలో ప్యాకింగ్ చేసి, మార్కెట్‌లో విడుదలచేయాలి. దోమల బాధనుండి నివారణను బట్టి మీరు అందించే మస్కిటో కాయిల్స్‌కి డిమాండ్ పెరుగుతుంది.

ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ వివరాలు ప్రత్యేకంగా యివ్వబడ్డాయి.

# పౌల్ట్రీఫీడింగ్ (కోళ్లదాణా)

*ప్రస్తుతం కోళ్లఫారాలు బాగా విస్తరిస్తున్న సంగతి అందరికీ తెలిసిందే. ఇది మంచి లాభసాటి వ్యాపారంగా గుర్తించి, చాలామంది చదువుకున్న యువతీ యువకుల ఈ కోళ్లఫారం నడపటం వైపు మొగ్గు చూపుతున్నారు. మనిషి ఆరోగ్య కరమయిన ఆహారం అవసరం అయినట్టే కోళ్లకు కూడా పుష్టికరమయిన దాణా అందించవలసిన అవసరం వుంది. కోళ్ల ఆరోగ్యకరమయిన పెరుగుదలకు సమగ్రమయిన దాణా అందించటం చాలా ముఖ్యం.*

*కోళ్లఫారాలు నడపటం ఎంత లాభదాయకమో, కోళ్లదాణా తయారు చేసి అమ్మటం కూడా అంతేలాభదాయకం. ఈ కోళ్ల దాణాకి మార్కెట్‌లో ఎప్పడూ గిరాకీ ఉంటూనే వుంటుంది. శ్రేష్ఠమయిన దాణా తయారీ అధిక లాభాలను అందిస్తుంది.*

**'రా' మెటీరియల్స్ (ముడిసరుకులు):-** 1. కంది లేక పెసర పొట్టు 2. బంగాళదుంపలేక కర్రపెండలం. 3. చెరకుపిప్పి. 4. యూరియా 5. బోసి పౌడర్ 6. కాగితం పిండి. 7. నూనె చెక్క 8. మొక్కజొన్న తవుడు 9. కాల్షియం పౌడర్ 10. ఉప్పు.

**ఫార్మ్యాలా:-** ఈ ఫార్మ్యులాను అనుసరించి కోళ్ళదాణాని శాంపిల్‌గా తయారు చేయండి. అలా తయారు చేసిన దానిలో కొద్దిపాటి మార్పులు చేర్పులూ చేసుకుంటూ శ్రేష్టమయిన దాణా తయారుచేసేందుకు ప్రయత్నించండి.

1. కందిపొట్టు 6 కిలోలు 2. కర్రపెండలం 6 ॥, 3. చెరకు పిప్పి 12 ॥. 4. యూరియా 1.250 కిలోలు, 5. బోసిపౌడర్ 6 కిలోలు, 6. కాగితం పిండి 30 కిలోలు 7. నూనె చెక్క 25 కిలోలు, 8. మొక్కజొన్న తవుడు 25 కిలోలు, 9. కాల్షియం పౌడర్ 5 కిలోలు, 10. ఉప్పు 6 కిలోలు

**తయారుచేయు విధానము:-** ఫార్మ్యాలాలో ఇవ్వబడిన సరుకులన్ని ఆయా తూకాలలో తీసుకొని ఒక గ్రయిండింగ్ మెషిన్‌లో వేసి బాగా పొడిచేసే మిశ్రమంచేయాలి.... మిశ్రమం నాణ్యతను ఒక సారి పరిశీలించి. ఆ పౌడర్‌ను 5,10,15,20, కిలోల సంచులలో ప్యాకింగ్ చేసి మార్కెట్ చేయాలి.

ఈ కోళ్ళదాణా పరిశ్రమకి పెట్టుబడి:- యంత్రపరికరాలు, ముడిసరుకులూ, ఇతరఖర్చులతో కలిపి సుమారు లక్షా నలభై వేల రూపాయల దాకా అవుతుంది. ఖచ్చితమయిన ప్రాజెక్ట్ వివరాలకోసం స్మాల్‌స్కేల్ ఇండస్ట్రీస్ డెవలప్‌మెంట్ కార్యాలయంలో సంప్రదించండి.

# నాన్‌వెజ్ 'ఫాస్ట్‌ఫుడ్ స్టాల్

*భోజన ప్రియులకు ఏ వూళ్ళోనూ కొరత వుండదు. ఘుమఘుమలాడుతూ నోరూరించే నాన్‌వెజిటేరియన్ పదార్థాలంటే నాన్‌వెజ్ ప్రియులు ఎగబడి తింటారు. సాయంత్రం కాగానే అలసిపోయి ఆఫీసులనుండి బయటపడి ఈవినింగ్ టిఫెన్ కోసం వెదుకులాడే అటువంటి వారికోసం రుచికరమయిన నాన్‌వెజ్ ఫాస్ట్‌ఫుడ్ స్టాల్స్ నడపటం మంచి లాభదాయకమయిన వ్యాపారం. రోజంతా కష్టపడనవసరం లేదు. సాయంత్రం నాలుగంటల నుండి రాత్రి తొమ్మిది గంటలవరకూ స్టాల్‌నడిపితే చాలు. ఈ స్టాల్ నిర్వహణలో శ్రమ తక్కువ లాభం ఎక్కువ.*

**తయారుచేయవలసిన నాన్‌వెజ్ ఫాస్ట్‌ఫుడ్ అయిటమ్స్:-** 1. కోడిమాంసం పకోడీలు, 2. బాయిల్డ్ ఎగ్స్ 3. ఎగ్ ఆమ్లెట్స్ 4. మాంసం పకోడీలు 5. మటన్ కబ్బాస్ 6. చేపముక్కలు (ఫ్రైడ్ స్లేస్‌లు) 7. రొయ్యపకోడీలు 8. కైమావుండలు.

**'రా' మెటీరియల్స్ (ముడిసరుకులు):-** 1. కారం 2. సాల్ట్‌పౌడర్ 3. మసాలా పౌడర్ 4. ఉల్లిపాయ ముక్కలు 5. నిమ్మకాయలు 6. సెనగనూనె 7.కొత్తిమీరి 8. పైన చెప్పబడిన నాన్‌వెజ్ అయిటమ్స్ అన్నీ 9. సెనగపిండి.

**ఫార్ములా:-** పక్వంగా ఫ్రైచేయటం తెలియటం, కారం, సాల్ట్, మసాలా పౌడర్ సరయిన పాళ్ళలో కలపటం.

**అవసరమయిన వంట సామగ్రి:-** స్టవ్‌లు2. లోతయిన కళాయిలు2. జల్లెడ గరిటెలు2. గ్యాస్‌సిలెండర్ 1. అయిటమ్స్‌ను కలుపుకునే స్టీలు గిన్నెలు. పచ్చి అయిటమ్స్‌ని వుంచేందుకు బేసిన్‌లు. పేపర్ ప్లేట్స్, లేక ఆకులు, పార్సిల్స్‌కి బోల్డు న్యూస్ పేపర్లు.

***తయారుచేయు విధానము:-*** బాయిల్డ్ ఎగ్స్, ఆమ్లెట్ తయారీని గురించి అందరికీ తెలిసిందే, ఇక కోడిమాంసం పకోడీల విషయానికివస్తే...మీ స్టాల్ వున్న సెంటర్‌లో డిమాండ్‌ను బట్టి ఒకటి, లేక రెండు కిలోల కోడిమాంసాన్ని తీసుకోండి. ఆ మాంసం నుండి కొరకటానికి వీలుకాని బోన్స్‌ని తీసివేసి, మాంసాన్ని ముక్కలు ముక్కలుగా చేసి ఒక బేసిన్‌లో వేసి మూత పెట్టండి.

కస్టమర్స్ ఆర్డర్‌ను బట్టి 100 గ్రాముల కోడిమాంసాన్ని తూనికయంత్రంలో తూచి. ఆ మాంసాన్ని ఒక గిన్నెలో వేసి, అవసరమయిన పాళ్ళలో అందులో సెనగపిండి. కారం, సాల్ట్, మసాలా పొడి వేసి అవిబాగా కలిసేటట్టుచేయండి. ఆ తరువాత మరుగుతున్న నూనెలో... ఆ మిశ్రమాన్ని పకోడీలా వేసే పద్ధతిలో కొంచెం కొంచెంగా వదలండి, అవి నూనెలో వేగుతున్నప్పుడు జల్లెడ గరిటెతో ఆ క్రిందికీ పైకీ కలియబెట్టడం మరచిపోకండి. బాగా వేగాయి అనుకున్న తరువాత జల్లెడ గరిటెతోసి జల్లెడలా చిన్నచిన్న రంధ్రాలలో వున్న గిన్నెలు వేయండి. పకోడీలను ఎక్కువగా అంటిన నూనె ఆ గిన్నెలోంచి దాని క్రిందవున్న గిన్నెలోకి దిగుతుంది! ఆ వెంటనే వేడివేడి పకోడీలకి ఒక పేపర్ ప్లేట్‌లో గాని, అడ్డాకులోగాని వేసి అందులో తరిగినవుల్లిపాయ ముక్కలు వేసి. నిమ్మకాయ పిండి కస్టమర్స్‌కి అందచేయండి!

మాంసం, రొయ్య, పకోడీలు కూడా ఇదేవిధంగా వేయించాలి.

మటన్ కబ్బాన్‌లు (చీకులు) తయారుచేయటం:- మెత్తటి మాంసపు ముక్కలకు కారం, మకసాలా పొడి, సాల్టుబాగా పట్టించి, దాన్ని నూనెలో తడిపి, స్ట్రాంగ్‌గా వున్న ఇనుప వూచకు ఒకదాని వెనుక ఒకటి గుచ్చి ఆ వూచలను నిప్పుల కుంపటి మీద కాల్చాలి. అంతే! రుచికరమయిన మటన్ కబ్బాన్‌లు రెడీ. వాటిలో వుల్లిపాయ ముక్కలు, నిమ్మరసం చేర్చి ఆరగించటమే!

ఇక చేపముక్కలకు (స్లైస్‌లకు) సాల్టు, కారం, మసాలా పొడి పట్టించి మరుగుతున్న నూనెలో వేయించాలి.

ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ వివరాలు ప్రత్యేకంగా యివ్వబడ్డాయి.



# డిస్టెంపర్ (పెయింట్)

*భవంతులకూ,ఇళ్లకు అందమయిన రంగులు వేయటం అందరికీ ఇష్టంగా వుంటుంది. అందుకు ఉపయోగించే ఒకరకమయిన పౌడర్‌నే డిస్టెంపర్ అంటారు దీన్ని వివిధ రంగులలో, కావాల్సిన షేడ్‌లో కూడా తయారుచేసుకోవచ్చు. మామూలు రంగు సున్నం కంటే ఇది ఎక్కువ కాలం మన్నటంతో మార్కెట్‌లో ఈ డిస్టెంపర్‌ల గిరాకీ బాగానే పెరిగిందని చెప్పాలి. మరిగించిన ఆయిల్ బౌండ్‌ను నీళ్లను డిస్టెంపర్‌లో వేసి బాగా కలిపితే చిక్కటి లిక్విడ్ పెయింట్‌గా ఉపయోగించుకోవచ్చు. ఇప్పటికే ఈ డిస్టెంపర్ ఎన్నో పరిశ్రమలవారు తయారుచేస్తూ మార్కెట్‌లో గిరాకీని పెంచుకోటానికి పోటీ పడుతున్నారు. మీ సామర్థ్యానికి పట్టుదలను తెలివితేటలనూ జోడించి మీరు కూడా తయారుచేయటం ప్రారంభిచండి. సక్సెస్ మీరు అందించే నాణ్యతమీద ఆధారపడివుంటుంది.*

**'రా' మెటీరియల్స్ (ముడిసరుకులు):-** 1. కాకిరాయి మన్ను. 2. గ్లూపౌడర్ 3. కాల్షియం కార్బొనేట్ 4. సల్ఫోనేటెడ్ కాస్టర్ ఆయిల్ 5. బెటానియండైఆక్సయిడ్ 6. పిగ్‌మెంట్ కలర్.

**ఫార్ములా:-** 1. కాకిరాయి మన్ను 1 1/2KG., 2. గ్లూ పౌడర్ 35 గ్రా., 3. కాల్షియం కార్బొనేట్ 1/2 KG., 4. సల్ఫొనేట్ కాస్టర్ ఆయిల్ 35 గ్రా., 5. బెటానియం డై ఆక్సయిడ్ 7 గ్రా., 6. సెలెక్టెడ్ పిగ్‌మెంట్ కలర్ 10 గ్రా.

**యంత్ర పరికరములు:-** 1. పెయింట్ మిక్సర్ 2. పగ్‌మిల్ 3. బాల్‌మిల్ 4. ఎడ్జ్‌రన్నర్ 5. హాండ్ టూల్స్ 6. ఎమల్సిఫైల్ 7. పేపర్‌బేగ్స్ 8. బేగ్ సీలింగ్ మెషిన్.

***తయారుచేయు విధానము:-*** బాల్‌మిల్ యంత్రాన్ని నీట్‌గా వుండేటట్టు చూసుకోవాలి. కాకిరాయి మన్నునూ, కాల్షియం కార్బొనేట్ బెటానియం డై ఆక్సయిడ్, గ్లూ పౌడర్ మొదలయిన ముడిసరుకులను తగు పాళ్ళలో బాల్‌మిల్‌లో పొడిగా చేయాలి. ఆ పొడిని బాగా జల్లించి, అందులో సల్ఫోనేటెడ్ కాస్టర్ ఆయిల్‌ని సెలెక్టెడ్ పిగ్‌మెంట్‌తో కలిపి పొడిగా చేసిన మిశ్రమంలో కలిపి ఇరవై నిముషాలపాటు గ్రైండింగ్‌చేయాలి. అంతే! డిస్టెంపర్ పొడి తయారయినట్టే. ఆ పొడిని సరయిన తూకాలతో...ముందుగా రెడీ చేసుకున్న బేగ్స్‌లోనింపి సీల్ చేసి మార్కెట్‌లో విడుదల చేయొచ్చు. బేగ్స్‌మీద

డిస్టెంపర్ బరువు, కలరూ, రేటు ముందుగానే ప్రింట్ చేసి వుంచుకోవాలి. లేదా అద్దకం టైప్‌లో హాండ్ ప్రింటింగ్ అచ్చుతో అప్పటికప్పుడు ముద్రలు కూడా వేసుకోవచ్చు. పెట్టుబడి కాస్త ఎక్కువే అయినా చక్కటి క్వాలిటీలో సమర్థవంతంగా మార్కెట్‌చేస్తూ గిరాకీని పెంచుకుంటే పెట్టుబడికి తగిన లాభాలు ఖచ్చితంగా వుంటాయి. ఈ పొడి డిస్టెంపర్‌ని తగిన జాగ్రత్తలతో నిలువ వుంచుకోవచ్చు! ఎప్పుడు కావాలంటే అప్పుడు అవసరం అయినంత మేరకు డిస్టెంపర్ పొడిని డైల్యూట్ చేసి వాడుకోవచ్చు.

ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ వివరాలు ప్రత్యేకంగా ఇవ్వబడ్డాయి.



# గోల్డ్ ప్లేటింగ్

*బంగారు ఆభరణాలంటే ఇష్టపడని ఆడవారుండరు. వివిధ రకాల బంగారు ఆభరణాలు ఆడవారి అందాన్ని ద్విగుణీకృతం చేసే ఆకర్షణను చేకూరుస్తాయి. అయితే బంగారు ఆభరణాలు చేయించుకుని ధరించటం అందరికీ సాధ్యంకాదు. ఆర్థికంగా వెనుకబడిన వారికీ, ఆర్థిక సమస్యతో మునిగి తేలేవారికి బంగారు ఆభరణాలు అందని ద్రాక్ష పళ్లేనని చెప్పాలి. అటువంటి వారి కోసమే ఇతర లోహాలతో చేయబడి పైన బంగారు పూతపూయబడిన ఆభరణాలు వెలువడుతున్నాయి. ఇచ్చే లోహపు వస్తువును బట్టి దానికి పూత పూసేందుకు అయ్యే ఖర్చును ఛార్జ్‌గా వసూలుచేసి ఈ గోల్డ్ ప్లేటింగ్‌చేస్తుంటారు. కొంతకాలానికి ఆపూతపోవటంతో మళ్లీ పూత వేయాల్సివుంటుంది. అందుకే గోల్డ్ ప్లేటింగ్‌కి నిత్య మార్కెట్‌లో గిరాకీ వుంటూనే వుంది.*

**'రా' మెటీరియల్స్ (ముడి సరుకులు)** : 1. గోల్డ్ 2. నైట్రిక్ ఆసిడ్ 3. హైడ్రోక్లోరిన్, 4. అమోనియా 5. ఆల్కాహాల్ 6. డిస్టిల్డ్ వాటర్ 7. పొటాషియం సైనేడ్ 8. పొటాషియం గోల్డ్ సైనేడ్ 9. రాగి, సిల్వర్ 10. పాస్పేట్, కార్బనేట్

**ఫార్ములా:-** (శాంపిల్) 1. గోల్డ్ 6 గ్రాములు, 2. నైట్రింగ్ ఆసిడ్ 2 గ్రా॥. 3. హైడ్రోక్లోరిన్ ఏసిడ్ 3 గ్రా॥, 4. అమోనియా 2 గ్రా॥, 5. పొటాషియం సైనేడ్ 1 గ్రా॥, 6. డిస్టిల్డ్ వాటర్ తగినంత, 7. ఆల్కాహాల్ తగినంత, 8. రాగి, 1గ్రాము., 9. సిల్వర్‌క్లోరైడ్ 1 గ్రా॥

**యంత్ర పరికరములు:-** 1. ప్లాస్టిక్ బారెల్, 2. యం.యన్.వెల్టెడ్ టాంక్, విత్ హీటర్. 3. P.V.C.వైన్డ్ బారెల్, 4. రెక్టిఫైడ్ ఆయిల్ యమ్మర్సిడ్. 5. ఎల్‌టార్ యూనిట్, 6. పింగాణీ పాత్రలు.

***తయారుచేయు విధానము:-*** 750 C.C. సైజులో వున్న ఒక రెసిస్టెంట్ గాజు ఫ్లాస్కును తీసుకుని అందులో బంగారాన్ని ఉంచాలి. ఆ తరువాత పైన ఇవ్వబడిన ఎప్రాక్సిమేట్ తూనికల ప్రకారం నైట్రిక్‌ఏసిడ్, హైడ్రోక్లోరిన్ ఏసిడ్ కలపాలి. గాజు ఫ్లాస్కును బాగా షేక్‌చేసి, మూతపెట్టి లోపలవున్న మిశ్రమాన్ని వేడిచేయటం ద్వారా బాగా కరిగించాలి. ఆ తరువాత గాజు ఫ్లాస్కునుండి ఆ మిశ్రమాన్ని పింగాణీ పాత్రలో పోసి బాగా చల్లార్చాలి. చల్లారిన తరువాత స్వచ్ఛమయిన నీటిని పోస్తూ, ఆల్కాహాల్

అమోనియాలను కలపండి. ఆ తరువాత ఇంకొక పాత్రలో ముందుగానే కలిపి వుంచుకున్న పొటాషియం సైనేడ్ ద్రవంలో గోల్డ్ మిశ్రమాన్ని కలిపి 90 నిముషాల పాటు వేడిచేయాలి. ఆ తరువాత పైన ఇవ్వబడిన మిగతా రసాయనాలను కలిపి, 2 లేక 3 గంటలపాటు వేడిచేయాలి. ఆ తరువాత దానిని వేరొక పాత్రలో పోసి చల్లార్చాలి. ఈ మిశ్రమాన్ని మాములుగా కాకుండా లేబొరేటరీ పరికరాలను ఉపయోగించి తయారుచేయటం మంచిది.

మీరు ఏ వస్తువు కయితే ప్లేటింగ్ చేయదలుచుకున్నారో ఆ వస్తువును శుభ్రపరచటానికి ముందుగా ఏసిడ్ ట్రీట్‌మెంట్ జరపాలి. తరువాత ఏక్టివేషన్ డిప్ ద్వారా వివిధ రసాయనాలతో శుభ్రపరచి, చివరిగా నీటితో కడిగి, బాగా ఆరిన తరువాత గోల్డ్ ప్లేటింగ్ యంత్రంద్వారా వస్తుమీద గోల్డ్ మిశ్రమాన్ని పూయాలి.



# హెయిర్ ఆయిల్

*హెయిర్ ఆయిల్ కేశపోషణకే కాదు, కేశ రక్షణకు కూడా ఉపయోగ పడుతుందన్న సంగతి అందరికీ తెలిసింది. కేశపోషణ విషయంలో మగవారికంటే ఆడవారే ఎక్కువ శ్రద్ధ వహిస్తూ, సువాసనలు వెదజల్లే వివిధ రకాల హెయిర్ ఆయిల్స్ పట్ల ఆకర్షితులవుతుంటారు. అనుకున్న విధంగా హెయిర్ స్టయిల్ చేసుకోటానికీ, జుత్తును మృదువుగా, మెరిసేటట్లు వుంచుకోటానికి హెయిరాయిల్స్ ఉపయోగపడుతుంటాయి. అందుకే దేశంలో చాలా కంపెనీలవారు వివిధ పేర్లలో ఆయిల్స్‌ని తయారు చేస్తూ ఆకర్షణీయమయిన పేకింగ్‌లు ద్వారా అందిస్తున్నారు. దీనిని తయారుచేయటం చాలా సులువు. పట్టుదల, స్వయంకృషి ఉంటే మార్కెట్ చేయటం కూడా కష్టపమీ కాదు!*

**'రా' మెటీరియల్స్ (ముడిసరుకులు)+ ఫార్ములా: (శాంపిల్)** రోజ్‌మేరి ఆయిల్ 5 గ్రాములు., లావెండర్ 5 గ్రా॥, జరానియం ఆయిల్ 2 గ్రా॥, లెమన్ ఆయిల్ 5 గ్రా॥ శ్రేష్టమైన నువ్వుల నూనె 5 KG లు., కొమారిన్ 30 గ్రా॥, బెర్గమోట్ ఆయిల్75 గ్రా॥, ఆయిల్ బెంజిల్ అసిటేట్ 3 గ్రా॥, శాంపిల్ ఆయిల్ 2 గ్రా॥, కావాల్సిన రంగు, రెడ్, గ్రీన్, లెమన్ తగినంత

**యంత్రపరకరములు:-** 1. కేప్ సీలింగ్ మెషిన్ 2. పాలిథిన్ శాచెట్స్ సీలింగ్ మెషిన్ 3. బాటిల్ ఫిల్లింగ్ మెషీన్, 4. స్టెయిన్ లెస్ స్టీల్ డ్రమ్స్ 5. స్టిరర్‌మిల్ మోటార్ 6. బాటిల్స్ 7. పేకింగ్ మెటీరియల్.

***తయారుచేయు విధానము:-*** పైన యివ్వబడినవన్నీ ఒక స్టెయిన్‌లెస్ స్టీల్ డ్రమ్‌లో వేసి కావాల్సిన రంగును చేర్చి స్టిరర్ మెషిన్ ద్వారా బాగా మిక్స్ చేయాలి. ఆ మిశ్రమం రంగుతో పాటు బాగా కలిసేటంతవరుకూ ఆగి, ఆతరువాత ఫిల్టర్స్ ద్వారా వడగట్టి - బాటిల్స్‌లోనూ, ప్లాస్టిక్ టిన్నులలోనూ, పాలిథిన్ శాచెట్స్‌లోను నింపి పాకింగ్ చేసి మార్కెట్‌లో విడుదలచేయలి.

యంత్రపరికరాల కొనుగోలు స్తోమతలేని వారు పైన ఇవ్వబడిన రా మెటీరియల్స్ అన్నిటినీ ఒక పింగాణీ పాత్రలో వేసి రంగు కలిపి బాగా కలియ బెట్టాలి. ఆ కల్పిన మిశ్రమాన్ని వారం రోజులపాటు అలాగేవుంచి..... రోజుకు రెండుమూడు సార్లు కలియబెడుతూ ఆ తరువాత ముందుగా ఒక పల్చటి వస్త్రంతో ఫిల్టర్ చేసి ఆ తరువాత బ్లాటింగ్ పేపర్‌తో ఫిల్టర్ చేసి పేకింగ్‌కి రెడీ చేయొచ్చు. మార్కెట్‌లో గిరాకీ పెంచుకున్న తరువాత మెషినరీ ఏర్పాటు చేసుకోవచ్చు. జుత్తువూడకపోవటం, చక్కటి సువాసన మీరు అందించే హెయిర్ ఆయిల్ నాణ్యతా ప్రమాణాల నిదర్శన.

# జాబ్ వర్క్ ప్రింటింగ్ ప్రెస్

సినిమాటిక్కెట్లు మొదలుకొని శుభలేఖల వరుకూ అచ్చువేయించేందుకు ఈ జాబ్‌వర్క్ ప్రింటింగ్ ప్రెస్ ఆవశ్యకత ఎంతగానోవుంది. విజిటింగ్‌కార్డ్స్, సభలనూ సమావేశాలను తెలియజేస్తూపంచిపెట్టే పాంప్లెట్స్, వ్యాపారసంబంధమయిన చిన్నచిన్న ప్రచార పత్రాలు ప్రింటింగ్ ప్రెస్‌లోనే ముద్రించవలసి వుంటుంది. సాధారణంగా బుక్‌వర్క్‌చేసే ప్రెస్‌లలో జాబ్‌వర్క్ చేసే అవకాశం వుండదు కాబట్టి, శుభలేఖలూ, ఇన్విటేషన్‌లూ మొదలయిన వాటికి జాబ్‌ప్రెస్‌ను ఆశ్రయించక తప్పదు. వెడ్డింగ్ కార్డ్స్ రకరకాలవి ఆఫ్‌సెట్ లో ప్రింట్‌చేయటం ప్రస్థుతం ఫ్యాషన్ అయింది. కానిస్తోమతలేని వారికి ఈ జాబ్ వర్క్ ప్రింటింగ్ ప్రెస్ మాత్రమే శరణ్యం కాబట్టి అన్ని సీజన్స్‌లోనూ ఈ ప్రెస్‌కు డిమాండ్ వుంటుంది.

**'రా' మెటీరియల్స్ (ముడిసరుకులు):-** 1. ప్రింటింగ్ యింక్స్ (వివిధ రంగులలో) 2. వేస్ట్‌కాటన్ (క్లీనింగ్‌కోసం) 3. క్రైండ్స్ (చట్రంబిగింపుకి) 4. లెడ్స్ 5. వివిధసైజులలో కట్టైలు (చట్రం బేలన్స్‌కి) 6. పేపర్ 7. రెడ్యూసర్ 8. కిరోసిన్, 9. డిటర్జెంట్ సోప్

**ఫార్ములా:-** పేజమేకప్, చెస్ బిగింపు, ట్రెడిల్ ఆపరేషన్ కలర్ కాంబినేషన్, మొదలయినవి తెలియటం. వంకర్లు రాకుండా నీట్‌గా ప్రింట్‌చేయటంలో అనుభవం.

**యంత్రపరికరములు:-** 1. ప్రింటింగ్ మెషిన్ (ట్రెడిల్) 2. మోటార్ 3. వుడెన్ కేసెస్ (అక్షరాలుపోసే గడులు గలవి) చెక్కస్టాండ్‌లు. 4. ప్రూఫ్‌మెషిన్ (హేండ్ ఆపరేటెడ్) 5. చిన్నచిన్న సింబాలిక్ బ్లాక్‌లు 6. మెటల్‌టైప్ (వివిధపాయింట్స్) 7. చెస్‌లు (వివిధ సైజులలో) 8. లెటర్స్ కలెక్షన్‌స్టిక్‌లు (వివిధసైజులలో) 9. క్వాడ్స్ 2 ఎం, 3ఎం, 4 ఎం. మొ॥నవి. 10. రోలర్స్ 11. బ్రాస్‌రూల్స్ 12. వుడెన్ రాక్స్ 13. అయిరన్ గాలీలు (వివిధసైజులలో) 14. పేజ్‌మేకప్ స్కేల్ 15. గుండు సూదులు 16. స్టోన్ టేబుల్ (చెస్ బిగించటానికి)

***(ప్రింటింగ్) తయారుచేయు విధానము:-*** జాబ్‌వర్క్ ఏవిధమయినదో, దేనిమీద ప్రింట్‌చేయవలసి వున్నదో (పేపర్, కార్డ్) ఏ కలర్‌లో ప్రింట్ చేయాలో (సింగిల్ కలర్ డబుల్ లేక ట్రిపుల్ కలర్) కస్టమర్ అడిగి తెలుసుకుని వాటికి నిర్ణయించిన రేట్లు

చెప్పాలి. ఆ వర్క్‌ని నిర్దేశిత సైజులో కస్టమర్ ఇచ్చిన మేటర్‌ని తెలుగు లేక ఇంగ్లీషు సంబంధమైన వివిధ పాయింట్స్‌లో వుండే మెటల్ టైపులతో హేండ్‌స్టిక్‌తో కంపోజ్ చేయాలి. ఆ తరువాత కంపోజ్ చేసిన మేటర్‌ని పెద్దసైజుగా వీలో వుంచి, మధ్యమధ్య గేప్స్ వదులుతూ అందంగా మేకప్‌చేసి, ప్రూఫ్ తీసి దిద్దాలి! తప్పులుంటే కరెక్షన్ చేసి, అనవసరం అయిన అక్షరాలను తొలగించి అవసరం అయిన అక్షరాలను వాటి స్థానంలో వుంచి ఆ మేటర్‌ని అలాగే స్టోన్ టేబుల్‌మీదకి చేర్చాలి. ఆ తరువాత ఆ మేటర్‌చుట్టూ కైండ్స్ చెక్కలు వేసి చెస్ సెంటర్‌లో వుండేలా చూసి గట్టిగా బిగించాలి. ఆ చెస్‌ని ట్రెడిల్ మెషిన్‌లో చెస్ ప్లేన్‌లో రోలర్స్ దిగువున వుంచి ముందుగా ప్రూఫ్ తీయాలి. ఆ ప్రూఫ్ చూసుకొని, ప్రింటింగ్ బెడ్ మీద గుండుసూదులలో మార్జిన్ అరేంజ్‌చేసుకుని, ముందుగా ఇంక్ ప్లేట్స్‌ని శుభ్రంచేసుకుని, కావాల్సిన యింక్‌ని సరిపడనంత ప్లేట్‌మీద అప్లయ్‌చేసి ట్రెడిల్ ఖాళీగా మూవ్ చేయాలి. అలా చేయటం వల్ల ప్లేట్‌మీద ఇంక్ రోలర్స్‌కి అంటిప్లేట్ అంతటా పరుచుకుని రోలర్స్‌కి పూర్తిగా అంటుకుంటుంది. ఆ తరువాత బెడ్‌మీది ప్రింటింగ్ మార్జిన్‌లో మీరు ప్రింట్‌చేయదలచుకున్న కార్డ్‌నుగానీ, పేపర్‌ని గానీ ఒకదాని తరువాత ఒకటి వుంచుతూ చక్కటి క్వాలిటీతో ప్రింట్‌చేయాలి. ఇందులో సింగిల్ కలర్ ప్రింటింగ్‌కి ఒక రేటు టేబుల్ మరియు ట్రిపుల్ కలర్ ప్రింటింగ్‌కి ఒక్క రేటు వుంటాయి. అటువంటప్పుడు మీరు ప్రింట్‌చేయవలసిన మేటర్ కలర్స్‌ని డివైడ్ చేసి విడివిడిగా చెస్‌లు బిగించి ప్రింట్‌చేయాల్సి వుంటుంది. సందర్భాన్ని బట్టి ఉపయోగించటానికి మీ దగ్గర చిన్నచిన్న సింబాలిక్ బ్లాక్‌లు వుంటే మంచిది.

మీరు అందించే క్వాలిటీ ప్రింటింగ్ మీ ప్రెస్‌కి డిమాండ్ పెంచుతుందన్న విషయంమరిచిపోకూడదు.

ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ వివరాలు ప్రత్యేకంగా యివ్వబడ్డాయి.

# సీలింగ్ వేక్స్

ఏదయినా ముఖ్యమయిన పార్శిల్స్ ఇన్సూర్డ్ పద్ధతిలో పోస్ట్ద్వారా పంపవలసివచ్చినపుడు ఈ సీలింగ్ వేక్స్తో అవసరం వుంటుంది. రూల్స్‌కి విరుద్ధంగా అక్రమవ్యాపారాలు చేసే వ్యాపార సంస్థలకు, కోర్టు వివాదాలలో వున్నా స్థిరాస్థి సంబంధమయిన భవంతులకూ, గోడౌన్స్ మొదలయిన వాటికి సీలు చేయాల్సి వచ్చినపుడు ముందుగా వాటికి తాళాలు వేసి, ఆ తాళాలకు ఒక విధమయిన క్లాత్‌ను చుట్టి దానిపై సీలింగ్ వేక్స్‌ను వేస్తారు. అఫిషియల్, నాన్ అఫిషియల్ సీలింగ్స్‌కి ఉపయోగించటానికి ఈ సీలింగ్ వేక్స్ ఎంతో అవసరం వుంటుంది. సాధారణంగా ఈ సీలింగ్ వేక్స్ తయారీలో రంగు విషయానికి వస్తే ఆరంజికలర్, బ్లాక్ కలర్‌ను ఎక్కువగా ఉపయోగిస్తారు.

**'రా' మెటీరియల్స్ (ముడిసరుకులు):-** 1. టర్పెంటైన్ 2. లక్క 3. రోజిన్ 4. పిగ్మెంట్‌కలర్ 5. బారైట్స్

**ఫార్ములా:-** 1. టర్పెంటైన్ 50 గ్రా॥ 2. లక్క 450 గ్రా॥ 3. రోజన్ 230 గ్రా॥ 4. పిగ్మెంట్ కలర్ 100 గ్రా॥ 5. బారైట్స్ 230 గ్రా॥

**యంత్ర పరికరములు:-** 1. బట్టీ (బొగ్గుతోమండేది) 2. కాస్ట్ ఐరన్‌తో చేసిన కళాయి 3. మౌల్డ్స్ 4. ముడిసరుకులను వుంచేందుకు అనువైన పాత్రలు 5. తూనిక యంత్రం 6. హేండ్ టూల్స్ 7. కాస్ట్ అయిరన్ తో చేసిన గరిటెలు 8. పేకింగ్ మెటీరియల్.

**తయారుచేయు విధానము:-** బొగ్గు బట్టీ మీద కళాయిని వుంచి, లక్క పొడర్నీ, రోజన్‌ను వేసి బాగా కరిగించాలి. ఆ రెండూ బాగా కరిగి మిశ్రమం అయిన తరువాత అందులో బారైట్స్‌వేసి ఆ మిశ్రకమంలో కలిసిపోయేటట్లు కాస్టర్ అయిరన్ గరిటతో కలియబెడుతూ వుండాలి. ఆ తరువాత టర్పెటైన్ వేయాలి. కావాల్సిన రంగును కొద్దిగా నీళ్ళల్లో కలిపి. మరుగుతున్న మిశ్రమంలో కొద్దికొద్దిగా వేస్తూ మొత్తం రంగును అందులో బాగా కలిపేలా కలియబెట్టాలి. అంతే! సీలింగ్ వేక్స్ రెడీ. ఆ తరువాత ఆయిల్ రాసివుంచిన అచ్చులలో ఆ మిశ్రమాన్ని వేసి, అది చల్లారి గట్టిపడిన తరువాత అచ్చులలోంచి తీసి పేక్‌చేసి మార్కెట్ చేయాలి.

అఫిషియల్‌గా ఉపయోగించే సీలింగ్ వేక్స్ తయారీలో నాణ్యత ప్రధానం.

ప్రాజెక్ట్ ఎస్టిమేషన్స్ ప్రత్యేకంగా ఇవ్వబడ్డాయి.

# గ్యాస్ లైటర్ (ఎలక్ట్రానిక్)

చుట్టా, బీడీ, సిగరెట్లు కాల్చేవారికి గ్యాస్‌లైటర్ చక్కగా ఉపయోగపడుతుంది. ఇంట్లో షడన్‌గా అగ్గిపెట్టె అయిపోవచ్చు, తెచ్చేవారు వుండకపోవచు. స్టవ్ వెలిగించటం అర్జంట్ కావచ్చు. అటువంటి సమయాలలో ఇట్లో ఆడవారికి కూడా ఈ గ్యాస్ లైటర్ ఉపయోగపడుతుంది. చెమటకారణంగానో, వర్షంలో తడవటం వల్లనో అగ్గిపెట్టె తడిసి నానిపోయి వెలగదు. గ్యాస్‌లైటర్‌తో అటువంటి ఇబ్బంది వుండదు. పైగా స్మోకింగ్ అలవాటువున్న చాలామంది ఈ గ్యాస్‌లైటర్‌ని ఉపయోగించటం స్టయిల్‌గానూ, డిగ్నిటీగానూ ఫీలవుతారు. చిన్నచిన్న ఎలక్ట్రానిక్ స్పేర్‌పార్ట్‌లను ఉపయోగించే ఈ గ్యాస్‌లైటర్ తయారీ చాలా లాభసాటిగా వుంటుంది. విదేశీ గ్యాస్ లైటర్స్‌తో పాటు స్వదేశంలో తయారయ్యే గ్యాస్ లైటర్స్‌కూడా ఇప్పడిప్పడే మార్కెట్‌లో డిమాండ్‌ను పెంచుకుంటున్నాయి.

**'రా' మెటీరియల్స్ లేక స్పేర్‌పార్ట్‌లు:-** 1. M.S. షీట్ (20 నుండి 24 S.W.G) 2. ఇగ్నిషియంపీస్ 3. కాపర్‌నాబ్ 4. మెటల్‌కేస్ 5. ప్లాస్టిక్ హేండిల్ 6. ఎలక్ట్రిక్ క్రిస్టల్ 7స్ప్రింగ్ (మెటల్)

**ఫార్ములా:-** స్పేర్‌పార్ట్ అసెంబ్లింగ్ కరెక్ట్‌గా తెలిసివుండాలి. టెస్టింగ్ పానెల్ ఉపయోగించి లైటర్ వర్కింగ్ కెపాసిటీని టెస్ట్‌చేయటంలో అనుభవం ఎలక్ట్రానిక్స్ మెకానిజంలో తగిన శిక్షణ వుంటే మంచిది. చక్కగా పనిచేయగల గ్యాస్ లైటర్‌ను తయారు చేయగల, అంటే ఏ పార్ట్ తరువాత ఏ పార్ట్‌ని తగిలించాలో తెలియటమే దీని ఫార్ములా.

**యంత్రపరికరములు:-** 1. టెస్టింగ్ పానెల్ 2. లేత్ మిషిన్ 3. డ్రిల్లింగ్ మెషీన్ 4. స్పాట్‌వెల్డింగ్ మెషీన్ 5. షీరింగ్ మెషీన్ 6. హేండ్ ప్రెస్ 7. చిన్నచిన్నస్క్రూబోల్టులు 8. రివిట్స్ 9. హేండ్‌టూల్స్.

**తయారుచేయు విధానము:-** M.S. షీట్‌ను అవసరం అయిన గేజ్‌లో తగిన మెజర్‌మెంట్స్‌తో కావాల్సిన ముక్కలు కత్తిరించాలి. వాటిని ఒక మెటల్ కేస్‌లో వుంచి హేండ్ ప్రెస్‌తో ప్రెస్‌చేయాలి. ఆ తరువాత ఇంజెక్షన్ మౌల్డ్‌తో ప్లాస్టిక్ హేండిల్ తయారుచేయాలి. ఇగ్నిషియం తీగనూ, ప్లాస్టిక్ హేండిల్, మెటల్ స్ప్రింగ్, కాపర్ నాబ్, ఎలక్ట్రిక్ క్రిస్టల్ మొదలయిన వాటిని ముందు వెనుకలను అనుసరిస్తూ ఒక పద్ధతి ప్రకారం స్పాట్ వెల్డింగ్ ద్వారా అసెంబ్లింగ్ చేయాలి. అవసరం అయినచోట డ్రిల్లింగ్‌చేసి స్క్రూలూ, రివిట్స్ అమర్చాలి. ఇక చివరిగా టెస్టింగ్ పానెల్ ద్వారా గ్యాస్‌లైటర్ వర్కింగ్ కెపాసిటీని పరీక్షించాలి.

ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ వివరాలు ప్రత్యేకంగా యివ్వబడ్డాయి.

# లేడీస్ 'బ్రా'

ఆడవారి వస్త్రధారణలో ప్రధానంగా చోటు చేసుకునేవి బాడీలు అనబడే ఈ బ్రాసియర్స్. అడవారి శరీరక వంపులను ద్విగుణీకృతం చేసే అప్పర్‌గార్మెంట్స్ మార్కెట్‌లో వాటికి వున్న గిరాకీ అపారమయినదని చెప్పటం అతిశయోక్తి కాదు. ఆడవారి అలంకారానికి, అవసరానికి ఉపయోగపడే ఈ 'బ్రా'ల తయారీ చాలా సులువైంది. అంతకుమించి లాభసాటి అయిందికూడా. దీనికి ప్రత్యేకమయిన టెక్నిక్ అంటూ ఏమీలేదు సరయినసైజులో కొలతలూ, కుట్టటం తెలిస్తేచాలు. నాణ్యమయిన బ్రాసియర్స్ కుట్టి మార్కెట్ చేయవచ్చు.

**'రా' మెటీరియల్స్ (ముడిసరుకులు):** 1. పాప్లెన్ క్లాత్ 2. ఫోమ్ 3. ఎలాస్టిక్ 4. హుక్స్ 5. దారాలు.

**ఫార్ములా:-** సరయిన షేప్, ఖచ్చితమయిన కొలతలతో కుట్టటం.

**యంత్రపరికరములు:-** 1. కుట్టుమిషన్ 2. కటింగ్‌టేబుల్ 3. టైలరింగ్ చాక్(డీస్) 4. కత్తెర 5. ఐరనింగ్ బాక్స్ 6. మెజర్‌మెంట్ టూల్స్ 7. పేకింగ్ మెటీరియల్స్.

**తయారుచేయు విధానము:-** కావాల్సినంత పాప్లిన్ క్లాత్‌నూ, ఫోమ్ ప్యాబ్రిక్‌ను తీసుకుని, కటింగ్ టేబుల్ మీద మార్కింగ్ మెజర్‌మెంట్స్ ద్వారా కావాల్సిన సైజులలో ఖచ్చితమయిన ఆకారాలలో కట్‌చేసుకోవాలి. ఫోమ్ ప్యాబ్రిక్‌ని లోతయిన షేప్‌మద్యలో వుంచి, పైనా, కిందా పాప్లెన్ క్లాత్ కుట్టాలి. ఆ తరువాత రెండు చివరల ఎలాస్టిక్ టేప్ అమర్చి కుట్టాలి. వాటికి స్టీల్ హుక్స్ అమర్చితే 'బ్రా'లు తయారయ్యినట్టే. వాటిని ఆకర్షణీయమయిన అట్టపెట్టెలలో సైజులవారీగా పేక్‌చేసి మార్కెట్‌చేయాలి. అట్టపెట్టెలమీద సైజుతాలుకు నెంబర్స్‌వేయాలి.

ఈ 'బ్రా'లు తెలుపులోనే కాకుండా బ్లాక్ బ్రౌన్‌క్లాత్‌లు ఉపయోగించి తయారుచేస్తే బ్లౌజ్‌మాచింగ్‌కి అనువుగావుంటుంది.

వీటిని ధరించే ఆడవారిని అమితంగా ఆకట్టుకోవాలంటే నాణ్యతను పాటించటం అవసరం.

ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ వివరాలు ప్రత్యేకంగా యివ్వబడ్డాయి.

# కోకోనట్ డ్రింక్

*శరీర సంబంధమైన ఉష్ణోగ్రతను తగ్గించి చల్లదనాన్ని ఇచ్చే చక్కటి పానీయం ఈ కోకోనట్ డ్రింక్ నిల్వవుంచటానికి వీలుగా తయారుచేసే ఈ డ్రింక్ ఆరోగ్యమైనది కూడా. పేషెంట్స్‌కి కూడా ఇవ్వదగ్గ ఈ కోకోనట్ డ్రింక్ తయారు చేయటం చాలా సులభం. దీనిని పట్టుదలతో సమర్ధవంతమయిన ప్రచారంతో మార్కెట్ చేయగలిగితే అధికలాభాలను కూడా ఆర్జించవచ్చు. ఇతర ఫ్రూట్‌డ్రింక్స్ కంటే ఇది శ్రేష్ఠమయినదని ఖచ్చితంగా చెప్పవచ్చు.*

**'రా' మెటీరియల్స్ (ముడిసరుకులు):-** 1. సోడియం బెంజోట్ (డ్రింక్‌ను నిల్వవుంచటానికి) 2. కోకోనట్ ఎసెన్స్ 3. పంచదార 4. తాజాకోకోనట్ వాటర్ 5. స్వచ్ఛమయిన నీరు

**ఫార్ములా:- (శాంపిల్)** సోడియం బెంజూట్ 75 మి.గ్రా., కోకోనట్ ఎస్సెన్స్150 మి.లీటర్లు, పంచదార 2 KG., తాజాకోకోనట్ వాటర్ 900 మి.లీటర్లు, స్వచ్ఛమయిన నీరు తగినంత

**యంత్రపరికరములు:-**1. స్టవ్ 2. స్టీలు పాత్ర (లోతయినది) 3. స్టీల్ గరిటె 4. తూనిక యంత్రం 5. స్టెరిలైజ్డ్ బాటిల్స్ 6. బాటిల్ ఫిల్లింగ్ మెషిన్. 7. బాటిల్‌కేప్ సీలింగ్ మెషిన్ 8. లేబిల్స్ 9. ఫిల్టర్స్ వగయిరాలు.

***తయారుచేయు విధానము:-*** ముందుగా కోకోనట్ వాటర్‌ను బాగా వడగట్టి అందులో నలకలు, కొబ్బరి సంబంధమయిన పీసెస్ వుండకుండా చేసి ఒక స్టీలు పాత్రలో ఉంచాలి. ఇంకొక పాత్రలో కొద్దిగా నీరు పోసి అందులో పంచదారను పోసి కరిగించి, కోకోనట్ వాటర్ వున్న స్టీలు పాత్రలో వేసి, స్టవ్‌మీద సన్నటి మంటమీద వుంచాలి. అది బాగా మరిగి పంచదార బాగా కలిసిన తరువాత స్టవ్‌మీద దించి చల్లార్చాలి. ఆ తరువాత నిల్వవుంచటానికి తీసుకున్న సోడియం బెంజూట్‌ని, కోకోనట్ ఎస్సెన్స్‌నీ స్టవ్‌మీంచి దించిన మిశ్రమంలో కలపాఇ. ఆ రెండుకలిపేటప్పుడు పంచదార కోకోనట్ వాటర్ మిశ్రమం పెద్ద వేడిగా వుండకుండా గోరువెచ్చని వేడిలో వుంటే సరిపోతుంది. ఆ తరువాత మొత్తం మిశ్రమానికి తగినంత నీరు కలపాలి.

అప్పుడు కోకోనట్ డ్రింక్ తయారయినట్టే. అలా తయారయిన కోకోనట్ వాటర్‌ని మరోసారి ఫిల్టర్‌చేసి స్టెరిలైజ్ చేయబడిన ఆకర్షణీయమయిన బాటిల్స్‌లో నింపి, మూతలు గట్టిగా బిగించి మార్కెట్ చేయాలి. సీసాలమీద లేబల్స్ అంటించటం మరిచిపోకూడదు.

పెట్టుబడి వివరాలు ప్రాజెక్ట్ ఎస్టిమేషన్‌లో.....

# పిండిపేకెట్స్

కాలానికి అనుగుణంగా మనిషి అవసరాలలో, అలవాట్లలో మార్పులు వస్తున్నాయి. ప్రతివిషయంలోనూ స్పీడ్. అనుకున్న వెంటనే జరిగిపోవాలి. మారుతున్న ప్రజల అవసరాలకు అనుగుణంగా వాటిని తీర్చేందుకు వివిధ రకాల పరిశ్రమలు వెలుస్తున్నాయి. ఒకప్పుడు ఏదయినా పిండి కావాలంటే ముందుగా దాని తాలుకు ధాన్యాన్ని తెచ్చి కడిగి ఆరబెట్టి ఆ తరువాత పిండిమరలో పిండి ఆడించి దాని అవసరం గడుపుకునేవాళ్ళు. ఇప్పుడు అలాకాదు. ఏ రకం పిండి కావాలన్నా నిముషాలమీద డిపార్ట్‌మెంటల్ స్టోర్‌నుండి కొని తెచ్చుకోవచ్చు. వివిధ రకాల పిండిలు పేకెట్స్ తయారుచేసి అమ్మటం లాభదాయకమయిన పరిశ్రమగా మారింది. సమయాన్ని శ్రమనూ పొదుపు చేసుకుంటూ కోరుకున్న వంటకాన్ని వెంటనే తయారు చేసే విధంగా లభించే ఈ పిండి పేకెట్స్‌కి మార్కెట్‌లో చెప్పలేనంత గిరాకీ వుంది.

**'రా' మెటీరియల్స్ (ముడిసరుకులు):-** 1. సెనగపప్పు, గోధుమలు - 3. మినుములు 4. పెసలు 5. రాగులూ, వగయిరాలు.

**యంత్ర పరికరములు:-** 1. ఫ్లోర్‌మిల్ 2. జల్లెడలు 3. 3 HP మోటార్ 4. బేగ్ ఫిల్లింగ్,మరియు సీలింగ్ మెషీన్స్ 5. పాలిథిన్ బేగ్స్ 6. అట్టపెట్టెలు 7. ఎలక్ట్రిఫికేషన్.

**తయారుచేయు విధానము:-** కావాల్సిన పప్పుధాన్యాలు తీసుకుని, ముందుగా వాటిపై భాగంలో వుండే తొక్కలను తొలగించాలి. ఆ తరువాత వాటిని బాగా కడిగి ఆరబెట్టట్న గానీ, కళాయిలో వేసి కొద్దిగా వేయించటం గాని చేసి, ఫ్లోర్‌మిల్ ద్వారా పిండి చేయాలి. పిండి మెత్తగా వచ్చేందుకు ఒకటికి రెండు సార్లు మిల్‌ను ఉపయోగించాలి. ఆ తరువాత అవసరం అయిన జల్లెడలలో జల్లించి మృదువైన పిండిని వేరుచేసి పాలిథిన్ పేకెట్స్ నింపి, పాకెట్ సీల్స్‌చేసి మార్కెట్ చేయాలి. పావు కిలో, అరకిలో, ఒక కిలో, రెండు కిలోల పేకెట్స్‌లో నింపాలి, ఆ తరువాత వాటిని అట్టపెట్టెలలో పేర్చి పేకింగ్ చేసి మార్కెట్ చేయాలి.

పిండి నాణ్యత మార్కెట్ గిరాకీకి మూలకారణం... అందుకు శ్రేష్ఠమయిన పప్పుధాన్యాలను ఉపయోగించటం చాలా అవసరం.

ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ వివరాలు ప్రత్యేకంగా ఇవ్వబడ్డాయి.

# ఐరన్ గ్రిల్స్

*భవనం, ఇళ్ల నిర్మాణాలలో ఐరన్ గ్రిల్స్ ప్రధానంగా చోటు చేసుకుంటున్నాయి. రకరకాల ఆకారాలలోనూ, డిజైన్‌లలోనూ తయారుచేసే ఈ గ్రిల్స్ భవననిర్మాణానికి అందాన్ని ఆకర్షణను చేకూరుస్తాయనటం అతిశయోక్తి కాదు. M.S షీట్స్, ప్లాట్స్, ఏంగిల్స్ మొదలయిన వాటిని రకరకాల ఆకారాలలో తగిన రీతిలో కట్‌చేసి వెల్డింగ్ చేయటం ద్వారా తయారు చేసే ఈ గ్రిల్స్‌కి మార్కెట్‌లో చాలా డిమాండ్ వుంది. ఇనుప చువ్వల కిటికీల స్థానంలో ఇప్పుడు ఈ గ్రిల్స్ టైప్ అయిరన్ కిటికీలనే పూర్తిగా ఉపయోగించటం గమనించదగ్గ విషయం. మన్నిక డిజైనింగ్ విషయాలలో శ్రద్ధతో కొత్త దనాన్ని అందించగలిగితే ఇది మంచి లాభసాటి పరిశ్రమ అవుతుంది.*

**'రా' మెటీరియల్స్ (ముడి సరుకులు):-** 1. M.S షీట్స్, ప్లాట్స్, యాంగిల్స్, రాడ్స్ 2. వెల్డింగ్ రాడ్స్ 3. మార్కింగ్ చాక్ 4. M.S అవుట్‌లెట్స్SWG.

**ఫార్ములా:-** అనుభవం, లేక టెక్నికల్ ట్రయినింగ్

**యంత్ర పరికరములు:-** 1. ప్లెగ్జిబుల్ షాఫ్ట్ గ్రైండర్ 2. ఫిల్లర్ టైప్ డ్రిల్లింగ్ మెషీన్ 3. ఆర్క్ వెల్డింగ్ సెట్ 4. బెంచ్ గ్రైండర్.

***తయారుచేయు విధానము:-*** M.S. షీట్స్, అవుట్‌లెట్స్, యాంగిల్ ఐరన్, ప్లాట్స్, రాడ్స్ మొదలయిన అయిరన్ రామెటీరియల్స్‌ను తీసుకుని, కావాల్సిన సైజ్‌లకు మార్క్‌చేసి షియరింగ్ మెషీన్ సహాయంతో కట్ చేసుకోవాలి. అవసరమయిన వాటిని బెండింగ్ మెషిన్ ద్వారా నిర్దేశిత షేపులలో వుంచుకోవాలి. పేపర్ మీద గీసివుంచుకున్న డ్రాయింగ్ ప్రకారం ఆముక్కలను తగిన విధంగా వెల్డింగ్ చేస్తూ జతచేయాలి. ఆ తరువాత బెంచ్ గ్రైండర్‌లోనూ, షాఫ్ట్‌గ్రైండర్‌లోనూ అతికిన చోట డ్రిల్లింగ్ యంత్రాన్ని ఉపయోగించాలి. అంతే! గ్రిల్స్ తయారయినట్లే. వీటిని భవంతి నిర్మాణంలో అమర్చవలసినచోట అమర్చి ఆ తరువాత వైట్, బ్లాక్ పెయింట్స్ వేసే ఆకర్షణీయంగా వుంటాయి. అయిరన్ గ్రిల్స్‌ని క్రాస్ గడులుగానే కాకుండా వివిధ రకాల డిజైన్‌లుగా వెల్డింగ్ చేయటం ద్వారా తయారుచేయవచ్చును.

గమనిక: ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ ప్రత్యేకంగా యివ్వబడింది.

# పేపర్ కప్స్ అండ్ ప్లేట్స్

స్టీలు, గాజు, ఇత్తడి, అల్యూమినియం మొదలయిన సామాన్లు వాడిన తరువాత తప్పని సరిగాతోముకోవాల్సి వుంటుంది. క్లీనింగ్, లిక్విడ్, పౌడర్ లాంటివి ఉపయోగించి సామాన్లు తోమటం ఖర్చుతో కూడుకున్న పని, పైగా శ్రమ, టైంవేస్ట్. ఈ మూడు విషయాలను దృష్టిలో వుంచుకుని తయారు చేసిన పేపర్ కప్పులూ, ప్లేట్లూ వాడుకలోకి వచ్చి మార్కెట్‌లో విపరీతమయిన గిరాకీని పెంచుకుంటున్నాయి. డిస్పోజబుల్ ఆర్టికల్స్‌గా పిలువబడే ఈ కప్పులూ, ప్లేట్లూ రైల్వే కాంటీన్స్‌లోనూ ఐస్‌క్రీమ్ పార్లర్స్‌లోనూ, ఎక్కువగా ఉపయోగించబడటం చూస్తూనే వున్నాం. ఇవి తయారుచేయటం సులభమైనపని. ఒకే ఒకసారి వాడి అవతలికి విసిరేసే ఈ పేపర్ కప్పులూ, ప్లేట్లు ప్రతిరోజూ మళ్ళీమళ్ళీ కావాల్సి ఉంటాయి కాబట్టి మార్కెట్‌లో వీటికి వున్న డిమాండ్ అపారమయినదని చెపొచ్చు. డిమాండ్‌గల వస్తువులను తయారుచేసి అమ్మటం అత్యంత లాభదాయకం అని ప్రత్యేకంగా చెప్పనవసరం లేదు.

**'రా' మెటీరియల్స్ (ముడి సరుకులు)** : 1. పారాఫిన్ వేక్స్ 2. ప్యాకింగ్ పేపర్ 3. గ్రేహార్డ్ బోర్డ్ షీట్స్ 4. మెషిన్ ఆయిల్.

**ఫార్ములా:-** తయారుచేయటంలో అనుభవం. మెషినరీ ఆపరేటింగ్ నాలెడ్జ్ అండ్ ఎక్స్‌పీరియన్స్

**యంత్ర పరికరములు:-** 1. పేపర్ కటింగ్ మెషీన్ 2. డైస్ 3. స్క్రూప్రెస్ 4. చేతి పనిముట్లు 5. వేక్స్ కోటింగ్ మెషిన్.

**తయారుచేయు విధానము:-** బోర్డ్ షీట్స్‌ను రెడీగా వుంచుకోవాలి. అవసరం అయిన 'డై'లను పేపర్ కటింగ్ మెషిన్‌కి ఫిట్ చేసి, అవసరం అయిన పరిమాణాలలో కట్ చేయాలి. ఈ బోర్డ్ షీట్స్‌మీద అవసరం అయిన క్వాంటిటీ, క్వాలిటీ రేటు మొదలయిన వాటిని తెలియచేసే మేటర్‌ని ముందుగానే ప్రింట్‌చేసుకోవటం గాని, చేయించుకోవటం గానీ చేయాలి.

కటింగ్‌చేసిన పేపర్ బోర్డ్ షీట్స్‌కి వేక్స్ కోటింగ్ యంత్రసహాయంతో వేక్స్ అప్లయ్‌చేయాలి. ఆ తరువాత స్క్రూప్రెస్ ద్వారా అవసరం అయిన ఆకారాలలో ప్లేట్స్ మరియు కప్పులు తయారుచేసి, ఫినిషింగ్ ఇవ్వాలి. ఆ తరువాత యాభై,వంద, రెండువందల చొప్పున పాలిథిన్ కవర్స్‌లో వుంచి నీట్‌గా పేక్‌చేసి మార్కెట్‌లో విడుదలచేయాలి. మార్కెట్‌లో మీ ప్రొడక్ట్సు అమ్మకాలను జాగ్రత్తగా పరిశీలించినమీద ప్రొడక్టు సంఖ్యను కొద్ది కొద్దిగా పెంచుకోవాలి.

గమనిక: ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ వివరాలు ప్రత్యేకంగా యివ్వబడ్డాయి.

# హేండ్ కర్చీఫ్

*ఇంట్లో వుండగా టవల్ ఎలా ఉపయోగపడుతుందో, వివిధ పనుల మీద బయటికి వెళ్లే అందరికీ హాండ్ కర్చీఫ్ కూడా అంతే ఉపయోగపడుతుందని అందరికీ తెలిసిందే. అందరికీ ఉపయోగపడే ఈ హేండ్‌కర్చీఫ్‌లను మార్కెట్‌లో విపరీతమయిన గిరాకీ వుంది. ఒక్కసారి హేండ్‌కర్చీఫ్ కొనవలసివస్తే డజనో, అరడజనో కొంటారు తప్ప ఒకటి రెండు కొనరు. బయట ఎక్కడయినా అల్పాహారం తీసుకున్నప్పుడు హేండ్‌కర్చీఫ్ కావాల్సివుంటుంది. ముఖానికి చెమటపట్టినప్పుడు జలుబు చేసి ముక్కు చీదవలసి వచ్చినపుడు - ఇలా ఎన్నో అవసరాలకు పనికి వచ్చే ఈ హేండ్‌కర్చీఫ్ తయారీ ఎంత సులభమో అంతలాభదాయకం.*

**'రా' మెటీరియల్స్ (ముడిసరుకులు):-** 1. కాటన్ క్లాత్ (ప్రింటెడ్, లేక వైట్) 2. దారపు రీల్స్ 3. ప్యాకింగ్ మెటీరియల్స్ 4. స్టాంప్‌సైజ్ లేబిల్స్ 5. గమ్ 6.స్టార్చ్.

**ఫార్ములా:-** కటింగ్ నాలెడ్జ్ వుండాలి. స్టిట్చింగ్ టెక్నిక్స్ తెలిసివుండాలి.

**యంత్రపరికరములు:-**1. టైలరింగ్ సిజర్ 2. టైలరింగ్ చాక్ (డీస్) 3. కటింగ్ టేబుల్ 4. మెజర్‌మెర్ టేప్ 5. జిగ్‌జాగ్ మిషన్ (ఎంబ్రాయిడరీది) 6. ఐరన్‌బాక్స్ 7. ఇతర ఫర్నిచర్ 8. అయిరనింగ్ రోలర్‌మెషిన్.

***తయారుచేయు విధానము:-*** కావలసిన కాటన్ క్లాత్‌ను తీసుకుని (సిల్కు, టుబైటు, కాటన్‌మిక్స్‌డ్ పాలిస్టర్ మొదలయిన క్లాత్‌తో చేసిన కర్చీఫ్స్‌కూడా కొంత మంది వాడుతుంటారు) అవసరమయిన సైజ్‌లలో కట్‌చేసి, జిగ్‌జాగ్ కుట్టుమిషన్ మీద నాలుగు వైపులా అంచులను కుట్టాలి. అంతే! కర్చీఫ్ తయారయినట్లే అలా తయారయిన కర్చీఫ్స్‌ని పల్చటి స్టార్చ్‌వాటర్‌లో ముంచి, డ్రమ్ హీటర్స్‌మీద ఆరబెట్టి, ఆ తరువాత కొన్ని కర్చీఫ్‌లను తొందరగా పేర్చి అయిరనింగ్ రోలర్స్ ద్వారా ప్రెస్ చేసి అట్టపెట్టెలలో పేక్ చేసి మార్కెట్ చేయాలి. ఆడవారి విషయంలో ఈ కర్చీఫ్‌లను పింటెడ్ క్లాత్‌తో కుట్టవలసి వుంటుంది. రంగుదారాలతో ఎంబ్రాయిడరీ చేయబడిన కర్చీఫ్‌లంటే అడవారు ఎక్కువగా ఇష్టపడతారు. ఇక మగవారి విషయానికి వస్తే ప్లెయిన్‌కలర్స్ మీద డార్క్‌బోర్డర్, గళ్ళకర్చీఫ్‌లు ఎక్కువగా వాడుతుంటారు.

ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ ప్రత్యేకంగా యివ్వబడింది.

# మెస్

*పదిమందికి భోజనం పెట్టడం ద్వారా ఆదాయాన్ని సమకూర్చుకునే స్వయం ఉపాధి పథకం ఇది. ఒక మోస్తరు హోటల్స్‌లో కూడా రేట్లు బాగా పెరిగి, సామాన్యులకు భోజనం అందుబాటులో లేకుండా పోతోంది. అటువంటి వారి ఆకలితీర్చే అన్నపూర్ణలాంటిది ఈ మెస్. వేరే పనివాళ్లను పెట్టుకోకుండా ఇంటిలోని వారితోనే మెస్ నడపవచ్చు... దీనికి లైసెన్స్‌లాంటి వాటితో పనిలేదు. మెస్ అంటే ఓ పదిమంది కలిసి చేసుకునే స్వయంపాకం అని గవర్నమెంట్ డిక్లేర్‌చేసింది కనుక దీనికి పెద్దగా పన్నుల బెడద వుండదు. పెద్ద ఎస్టాబ్లిష్‌మెంట్‌తో పనిలేదు. సాధారణమయిన నాలుగు చెక్కబల్లలూ, పదిచెక్క స్టూల్స్ వుంటే సరిపోతుంది. మీల్స్‌ప్లేట్స్ కూడా అక్కరలేదు విస్తరాకులతో సరిపెట్టుకోవచ్చు.*

**'రా' మెటీరియల్స్ (ముడిసరుకులు):-** 1. క్వాలిటీ రైస్ 2. పప్పులు 3. కూరగాయలు 4. నూనె 5. విస్తరాకులు 6. పచ్చళ్ళు 7. నీళ్ళు 8. పెరుగు(లేక మజ్జిగ) 9. సాల్ట్ 10. కందిపొడి, లేక కారపుపొడి 11. అప్పడాలు.

**ఫార్ములా:-** చక్కగా, రుచిగావుండటం, పరిశుభ్రతను పాటించటం, హోటల్ రేట్ కంటే తక్కువరేటుకి భోజనం పెట్టటం.

**యంత్ర పరికరములు:-** 1. వంట పాత్రలు 2. గ్యాస్‌స్టవ్‌లు 3. గ్యాస్ సిలెండర్స్ 4. మిక్సర్5. గ్రైండర్ 6. వడ్డించేందుకు అవసరం అయిన బేసిన్‌లు 7. గ్లాసులు 8. కూరలగుత్తెలు 9. గరిటెలు, స్పూన్స్ 10. వాటర్ డ్రమ్స్ 11. వాష్‌బేసిన్ మొదలయినవి.

***నిర్వహణ విధానము:-*** ఇంట్లోనే ఒక హాల్లోగానీ, పెద్ద గదిలోకానీ..... పదిమంది కూర్చుని తినే విధంగా నాలుగు టేబుల్స్, పది స్టూల్సు అరేంజ్‌చేయాలి. అందుకు వసతిలేక పోయినా ఫరవాలేదు. నేలమీద పొడుగు చాపలు పరిచి కూర్చోబెట్టవచ్చు. ముందుగా మీరు మెస్ నడపటం మొదలు పెట్టినట్లు మీ చుట్టుపక్కల రిక్షాస్టాండ్స్‌లోనూ, ఆటోస్టాండ్‌లోనూ, మీకు దగ్గరగా వున్న ఆఫీసులూ, వ్యాపారు సంస్థలను తెలిపేలా ప్రచారం చేయండి. ముందు ఓ పదిమందికి సరిపడా వంటలు తయారుచేయటంతో ప్రారంభించండి. మొదట్లో వంటకాలు మిగిలిపోవచ్చు, అవి రాత్రిభోజనంగా మీకు ఉపయోగపడేలా చూసుకోండి. హోటల్లో భోజనం రేటు 15

రూపాయలుంటే మీరు 12 రూపాయలకే భోజనం పెట్టండి. దూరం నుండి ఆఫీసులకి వచ్చేవాళ్ళు, భోజనం సమయంలో మీ ఏరియాకి కస్టమర్స్‌ని తీసుకువచ్చే ఆటోడ్రయివర్లు, ఇళ్ళు దూరంగా వుండి మీ ఏరియాలో వ్యాపారం చేసుకుంటున్న వాళ్లు.... దూరం నుండి వచ్చి మీకు దగ్గరలో వున్న కాలేజీలలో చదువుకునే పేద విద్యార్థులు.... మెల్లగా మీ మెస్‌కి రావటం అలవాటు పడతారు. మీ వంటకాలన్నీ బాగా రుచిగావుండేలా చూసుకోవాలి. రోజూ ఒకేరకం కూరలు కాకుండా కూరలను మార్చి మార్చి వండాలి. మీ మెస్‌లో భోజనం చేసిన వాళ్ళు మరికొంతమందిని పని గట్టుకొని మీ మెస్‌కి తీసుకువచ్చేలా వుండాలి మీ వంటకాలు. కూరలు, అన్నం వగయిరాలు వృధా పోకుండా కస్టమర్స్‌ని అడిగి, కావాల్సినంతే వడ్డించండి. పెరుగుతున్న కస్టమర్స్‌ని గమనిస్తూ, అంచనావేస్తూ మీ వంటకాల క్వాంటిటీని పెంచుకోవాలి!

రోజూ రెండు పూటలా కలిపి 50 నుండి 80 మందికి భోజనం పెడితే చాలు మీకు రోజుకి 500రూపాయలకు పైగా మిగిలినట్టే.

పెట్టుబడికి ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ చూడండి.





# టెలివిజన్ కాయిల్స్

*టెలివిజన్ తయారీలో ఈ ఇన్‌డక్షన్ కాయల్స్ అవసరం ఎంతయినా వుంది. ఈ కాయిల్స్‌ని కేవలం టి.విలలో మాత్రమే కాదు ఫిల్టర్ సర్క్యూట్, ఏంప్లిఫ్లయిర్స్ రేడియోలు మరియూ ఈక్విలైజర్స్ లో కూడా ఉపయోగించబడతాయి. టి.వి రిపేరర్స్‌కి కూడా వీటి అవసరం వుంటుంది. ఎలక్ట్రానిక్ ప్రొడక్ట్సుల ఉత్పత్తినానాటికీ పెరిగిపోతున్న కారణంగా ఈ కాయిల్ తయారీ మంచి లాభదాయకమయిన పరిశ్రమ అవుతుంది. అయితే కాయల్స్ తయారీకి ఎలక్ట్రానిక్ మెకానిజంలో శిక్షణ తప్పనిసరి.*

**'రా' మెటీరియల్స్ (ముడిసరుకులు)** 1. ఎనామిల్డ్ కాపర్‌వైర్ 2. సెరామిక్ కండెన్సర్స్3. ఐరన్ కోర్ 4. ఫైబర్ షీట్స్ 5. అల్యూమినియం షీట్స్ 6. PVC పౌడర్, ప్లాస్టిక్ రాడ్స్.

**ఫార్ములా:-** ఎలక్ట్రిక్, మరియూ ఎలక్ట్రానిక్ సంబంధమయిన టెక్నాలజీ తెలిసివుండటం లేదా శిక్షణ.

**యంత్రపరికరములు:-**1. ఎల్.సి.ఆర్.మీటర్ 2. కాయిల్‌వైండింగ్ యంత్రం 3. ఇంజక్షన్ మౌల్టింగ్ మెషీన్ 4. ఓవెన్ 5. మల్టీమీటర్

***తయారుచేయు విధానము:-*** ఇంజక్షన్ మౌల్టింగ్ యంత్రసహాయంతో ప్లాస్టిక్ రాడ్స్ తయారుచేసుకోవాలి. పైన ఇవ్వబడిన ముడి వస్తువులన్నీ ఎలక్ట్రానిక్ టెక్నాలజీ ననుసరించి ఒక పద్ధతిలో ఒకదాని తరువాత ఒకటిగా అసెంబ్లింగ్ చేయవలసి వుంటుంది. వైండింగ్ యంత్రసహాయంతో ఎనామిల్డ్ కాపర్‌వైర్ కాయల్‌గా వైండింగ్ చేయబడుతుంది. పివిసి టేప్‌తో ఇన్స్యువేషన్‌చేసి వాతావరణ సంబంధమయిన రియాక్షన్‌కి తట్టుకునే విధంగా వేక్స్ అప్లయ్‌చేయాలి. పూర్తిగా తయారయిన కాయల్ ఉపయోగించాల్సి వుంటుంది. అన్నీ పరీక్షలు పూర్తి అయిన తరువాత కాయిల్స్‌ని నీట్‌గా పేక్ చేసి మార్కెట్‌చేయాలి.

ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ వివరాలు ప్రత్యేకంగా ఇవ్వబడ్డాయి.

# డిపార్ట్‌మెంటల్ స్టోర్స్
## (మినీ సూపర్ బజార్)

*ఎటువంటి సాంకేతిక పరిజ్ఞానం లేకుండా కొద్దిపాటి అనుభవంతో నడపగల అత్యుత్తమయిన నిర్వహణ. ఒకప్పుడు దీనినే కిరాణాకొట్టు అనేవారు. ఎవరు ఏదికావాలన్నా పొట్లాలు కట్టి ఇవ్వాల్సి వచ్చేది. ఇప్పుడా అవసరంలేదు కస్టమర్ అడిగింది అడిగినట్టు వారికి కావాల్సిన సామగ్రి పేకెట్స్‌లో సప్లయ్‌చేయొచ్చు. ఎక్కువగా శ్రమ పడనవసరం లేదు. నిత్యావసర వస్తువులు విక్రయించే ఈ డిపార్ట్‌మెంటర్ స్టోర్ నిర్వహణకు పెట్టుబడి కాస్త ఎక్కువే అయినా లాభాలు కూడా అదే రేంజ్‌లో వుండటం గమనించదగ్గ విషయం. హోల్‌సేల్ డీలర్స్‌నుండి అప్పతెచ్చి రిటైల్‌గా విక్రయించే సదుపాయం వుంది.*

**'రా' మెటీరియల్స్ (ముడిసరుకులు):-** 1. అన్ని రకాల పప్పుదినుసులు 2. కాస్మోటిక్స్ ప్రొడక్ట్సు 3. మసాలా సామగ్రి 4. బేకరీ ప్రొడక్ట్సు 5. మైదా, గోధుమ, రవ్వ మొదలయిన పిండి రకాలు 6. ఇంకా రకరకాల నిత్యావసర వస్తువులు (పేకింగ్ చేసినవి)

**బిజినెస్ ఫార్ములా:-** కస్టమర్స్‌కి అడిగింది లేదనకుండా అందించగలగటం, క్వాలిటీ గల నిత్యావసర వస్తువులు అమ్మకానికి ప్రాధాన్యతను ఇవ్వటం, ప్రొడక్టు క్వాలిటీని చక్కగా వివరించగలగటం. ఇతర స్టోర్స్‌లో ధరలకంటే కనీసం ఒక రూపాయి అయినా తక్కువ అని కస్టమర్స్ గుర్తించేలా చేయటం.

**యంత్రసామగ్రి:-** 1. గ్లాస్ అల్మైరాలు 2. సేల్స్‌కౌంటర్స్, 3. షోకేస్‌లు. 4. కాష్‌కౌంటర్ 5. కాలిక్యులేటర్ 6. పేపర్‌బేగ్స్ 7. కేరీబేగ్స్ 8.పిన్ మెషిన్ 9. సరుకుల వివరాలను తెలియచేసే ప్రింటింగ్ లిస్టులు 10. ఎలక్ట్రిఫికేషన్ 11. హోంరెవరీకి అవసరం అయిన పరికరాలు 12. అక్కౌంట్‌బుక్స్ 13. టెలిఫోన్

***నిర్వహణ విధానం:-*** ప్రతి పేకింగ్ మెటీరియల్ కస్టమర్స్‌కి కనిపించేలా గాజు అల్మైరాలలో సర్దుకోవాలి. కస్టమర్స్‌కి అవసరం అయిన నెంబర్ వన్ క్వాలిటీగల సామానులను అమ్మకానికి తేవాలి. కస్టమర్స్‌తో సరళమయిన సంభాషణ ముఖ్యం. హోల్‌సేల్ డీలర్స్‌తో వ్యాపార సంబంధమయిన చక్కటి అండర్ స్టాండింగ్ కలిగి వుండాలి.

సాధ్యమయినంతవరుకూ కస్టమర్ అడిగిన చిన్నా పెద్ద ఏ వస్తువు అయినా లేదనకుండా వుండేలా ఏర్పాటు చేసుకోవాలి. చురుకుగా పనిచేయగల సేల్స్‌బోయ్స్‌ని గానీ, గర్ల్స్‌గాని నియమించుకోవాలి. కస్టమర్స్ ఎక్కువసేపు నిరీక్షించకుండా వారిచ్చిన లిస్ట్‌ను వెంటనే అందించి పంపాలి. బ్యాంక్ ఎంప్లాయిస్ పోస్టల్ సిబ్బంది ఇంకా గవర్నమెంట్ ఆఫీసులలో పనిచేసే కస్టమర్స్ ఖాతాలు పెట్టడం మంచిది. హోల్‌సేల్ డీలర్స్‌తో సేల్స్ రిప్రజెంటేటివ్‌లతో మీరు జరిపే వ్యాపార లావాదేవాలు కస్టమర్స్‌కి తెలియకూడదు. క్వాలిటీ, తూకాల విషయంలో సాధ్యమయినంతవరుకూ కస్టమర్స్ నుండి ఎలాంటి కంప్లయింట్ రాకుండా చూసుకోవాలి.

**గమనిక:** ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ ప్రత్యేకంగా యివ్వబడింది.



# బ్రిలియన్‌టైన్

వాతావరణ పరిస్థితుల కారణంగా కొన్ని సీజన్స్‌లో అరికాళ్ళు పగుళ్ళు తీస్తుంటాయి. మోకాళ్ళు మోచేతులు దగ్గరచర్మం ముడుచుకుపోతుంది. ముఖం పొడిబారినట్టు కనిపిస్తుంటుంది. శరీరం రఫ్‌గా తయారవుతుంది. అటువంటప్పుడు బ్రిలియంటైన్ చాలా ఉపయోగపడుతుంది. వేస్‌లైన్‌గా పిలవబడే ఈ బ్రిలియన్‌టైన్ రాసినచోట చర్మం మెత్తబడి మృదువుగా తయారవుతుంది. పగుళ్ళబాధవుండదు. ఇది రాస్తూ వుండటం వలన పగుళ్ళు కలిసిపోతాయి. చక్కటి సువాసనతో తయారుచేయటానికి వీలయిన ఈ బ్రిలియన్‌టైన్‌కి మర్కెట్‌లో చాలా గిరాకీవుంది. ఆడవారూ, మగవాళ్ళు వాడటానికి ఇష్టపడే ఈ బ్రిలియన్‌టైన్ లాభాలను ఆర్జించే పరిశ్రమల లిస్ట్‌లో ఎప్పుడోచేరిపోయింది.

**'రా' మెటీరియల్ (ముడిసరుకులు):-** 1. నీమ్ ఆయిల్ 2. అవసరమయిన రంగు 3. సువాసన ఆయిల్ 4. మెత్తటి పారఫిన్ వేక్స్

**ఫార్ములా:-** 1. నీమ్ ఆయిల్ 8 గ్రాములు, 2. అవసరమయిన రంగు తగినంత 3. సువాసన ఆయిల్ కొంచెం, 4. మెత్తటి పారిఫిన్ మైనం 140 గ్రా.

**యంత్రపరికరములు:-** 1. స్టౌ, 2 చెక్కగరిటెలు 3. కళాయివంటిపాత్ర 4. సీసాలు 5. పేకింగ్ అట్టపెట్టెలు 6. లేబిల్స్

**తయారుచేయు విధానము:-** కిరోసిన్ స్టౌవ్‌ను గానీ, గ్యాస్‌స్టవ్‌నుగాని రెడీ చేసుకోవాలి. కళాయివంటిలోతు, వెడల్పువున్న పాత్రను తీసుకుని, పారిఫిన్ మైనం, నీమ్ అయిల్‌నీ కళాయిలో పోసి స్టౌమీద వుంచి సన్నటి మంటలోకరిగిస్తూ చెక్కతెడ్లు ఉపయోగిస్తూ ఆ మిశ్రమాన్ని బాగా కలియబెట్టాలి. ఆ మిశ్రమం బాగా కలిసిన తరువాత అవసరం అయిన రంగును (వేస్‌లైన్‌కి సాధారణంగా గ్రీన్‌కలర్ వాడతారు) ముందుగా కొద్దిపాటి మిశ్రమంలో కలిసి, సరిచూసుకున్న తరువాత కావలసినంత రంగును మొత్తం మిశ్రమంలో కలపాలి. ఆ తరువాత సువాసన ఆయిల్‌ను చేర్చి బాగాకలిపి, ఆ తరువాత ఆకర్షణీయమయిన సీసాలలో నింపి అందమయిన డిజైన్‌లలో ప్రింట్‌చేయబడిన అట్ట పెట్టెలో పేక్‌చేసి మార్కెట్‌చేయాలి. బ్రిలియన్‌టైన్ తయారీలో నాణ్యతను పాటించాలి.

గమనిక: ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ వివరాలు ప్రత్యేకంగా ఇవ్వబడ్డాయి.

# ఫోటో స్టూడియో

వున్నది వున్నట్టుగా మాత్రమే కాదు, లేనిదానిని కూడా వున్నట్టు చూపించుటమే ఫోటోగ్రఫీ టెక్నాలజీకి వున్న ప్రత్యేకత. ఒక్కో మనిషి ఒక్కో యాంగిల్‌లో అందంగా కనిపిస్తారు. అందంగా లేనివార్ని కూడా కొన్ని ప్రత్యేకమయిన యాంగిల్స్‌లో అందంగా వున్నట్టు ఫొటోలో చూపించవచ్చు. చాలామందికి అందరితోకలిసిగానీ, ఒంటరిగా గానీ పదిమంది ఎదుటా ఫొటోతీయించుకోవటం ఇష్టంవుండదు. అయినా తమ రూపాన్ని ఫొటోలో చూసుకోవాలన్న కోరికమాత్రం ప్రగాఢంగా వుంటుంది. అటువంటి వాళ్ళు తమ కోరిక తీర్చుకోటానికి ఫొటోస్టూడియోకి వెళ్ళకతప్పదు. పార్టీలలో, ఫంక్షన్స్‌లో ఫొటోలు ఫ్లాష్ కెమెరాలతో ఫొటోలు తీసినా, ఫిల్మ్ డెవలపింగ్, ప్రింటింగ్ కోసం ఫోటో స్టూడియోకి వెళ్ళక తప్పదు. సాంకేతిక పరిజ్ఞానానికి తెలివితేటలనూ, అనుభవాన్ని జోడించి నడపగలిగితే ఫొటో స్టూడియో నిర్వహణ మంచి ఆదాయాన్ని తెచ్చిపెడుతుంది.

**'రా' మెటీరియల్స్ (ముడిసరుకులు):** 1. ఫిల్మ్ 2. బ్రోమైడ్ పేపర్ 3. ఫోటోప్రాసెసింగ్ కెమికల్స్ 4. ఫిల్మ్‌టచ్చింగ్ మెటీరియల్ 5. లిక్విడ్ కెమికల్స్

**ఫార్ములా:-** ఫొటోగ్రఫీ టెక్నాలజీగానీ, అందుకు సమానమయిన ప్రాక్టికల్ ఎక్స్‌పీరియన్స్‌గాని వుండాలి (ఇది స్టూడియో నిర్వహణకు సంబంధించిన విషయం కాబట్టి ఫిల్మ్ డెవలపింగ్ కోసం కలపవలసిన రసాయనాల ఫార్ములా ఇక్కడ ఇవ్వటం లేదు) ముఖాన్నీ, ఆకారాన్ని బట్టి అందంగా చూపించేందుకు అనువయిన యాంగిల్స్‌ను సెట్‌చేసుకోగల అనుభవం, ఫిల్మ్‌డెవలపింగ్, ఫొటో ప్రింట్‌లు సకాలంలో ఇవ్వటమే స్టూడియో నిర్వహణకు చక్కటి ఫార్ములా.

**యంత్రపరికరములు:-**1. ఆటోస్టార్ట్ కలర్ ప్రింటర్ 2. ఎయిర్‌కండిషనర్ విత్ స్టెబలైజర్ 3. ఆటోమాటిక్ కలర్‌ఫోటో ప్రాసెసర్ 4. ఫిల్మ్‌ప్రాసెసర్ 5. ఆటోరోల్ పేపర్ ప్రాసెసర్ 6. డార్క్‌రూం ఎక్విప్‌మెంట్ 7. స్టాండ్ కెమెరా 8. వైటింగ్ సెట్ 9. బేక్‌గ్రౌండ్ స్క్రీన్స్ 10. కుర్చీలు, స్టూల్స్ 11. మేకప్‌మెటీరియల్స్ 12. ఎలక్ట్రిఫికేషన్.

***నిర్వహణ విధానము:-*** ఒకహాలులా పొడవుగా, విశాలంగా వున్న షాపును అద్దెకు తీసుకోవాలి. మీ స్టూడియో పేరును తెలియచేసే బేనర్‌ను ఆకర్షణీయమయిన

అక్షరాలలో షాపు ముందు వుంచాలి. ఎప్పటికప్పుడు సులువుగా మార్చుకునేందుకు వీలయిన చిన్నచిన్న చెక్క సెట్టింగ్‌లూ, చక్కటి బేక్‌గ్రౌండ్ సీనరీలలో వున్న పెయింటెడ్ స్క్రీన్స్ ఏర్పాటుచేసుకోవాలి. ప్రచార నిమిత్తం మీ స్టూడియో అడ్రసూ, వివరాలనూ, ఫొటోలు తీయటంలో కలర్ ప్రింట్స్ వేయటంలో మీకున్న ప్రత్యేకతను తెలియచేస్తూ అక్కడక్కడ గోడలమీద వ్రాయించండి. పాంప్లెట్స్ ప్రింట్‌చేసి పంచిపెట్టండి. అంతకుముందు మీరు తీసిన అందమయిన ఫొటోలు, బ్లాక్ అండ్‌వైట్ మరియు కలర్‌వి ఫ్రేములు కట్టించి గానీ, ఒక చార్టుకు అంటిచిగాని స్టూడియోముందు భాగంలో కస్టమర్స్‌ను ఆకర్షించే విధంగా అరేంజ్‌చేయండి. కొన్ని ప్రత్యేకమయిన యాంగిల్స్‌లో కూడిన ఫొటో ఆల్బమ్స్‌ను కస్టమర్స్‌కి మోడల్స్ కేటలాగ్‌లా ఉపయోగపడేందుకు రెడీ చేసుకోండి. కస్టమర్స్‌చక్కగా మాట్లాడటం ముఖ్యం. మీ అనుభవాన్ని ఉపయోగించి అనువయిన యాంగిల్స్‌లో అందమయిన ఫొటోలు తీయటానికి ప్రయత్నించండి. ఫొటోలు చక్కగా తీయటం, చెప్పిన టైంకి డెలివరీ ఇవ్వటం మీ స్టూడియో అభివృద్ధి కారణమై ఆశాజనకమయిన ఆదాయాన్ని అందిస్తుంది.

గమనిక: ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ వివరాలు ప్రత్యేకంగా ఇవ్వబడ్డాయి.



# ఐరన్ ఫర్నిచర్

*గృహోపకరణాల విషయంలో మన్నికను ప్రధానాంశంగా తీసుకోవటం జరుగుతుంది. ఆ తరువాత ధర, మోడల్స్ పరిగణలోకి వస్తాయి. కలపతో తయారు చేసే చెక్క సామాను ఖరీదు ఎక్కువ కావటంతో ఎక్కువ కాలం మన్నిక నిచ్చే ఐరన్ ఫర్నిచర్‌కి మార్కెట్‌లో బాగా డిమాండ్ పెరిగింది. సులువైన పద్ధతిలో తయారుచేసే వీలున్న ఈ ఐరన్ ఫర్నిచర్ పరిశ్రమ లాభాల బాటలో పయనిస్తోంది.*

**'రా' మెటీరియల్(ముడిసరుకులు):-** 1. C.R. షీట్స్ (వివిధ గేజ్‌లలో) 2. M.S. షీట్స్ 3. ఫినిషింగ్‌తో కూడిన చెక్క పలకలు (వివిధ సైజులలోనివి) 4. పెయింట్స్ 5. రిపిట్లు 6. గ్యాస్ సిలెండర్

**ఫార్ములా:-** ట్రెయినింగ్ లేక ఒకచోట పనిచేసిన అనుభవం, మెషిన్స్ ఆపరేటింగ్.

**యంత్రపరికరములు:-**1. స్ప్రేగన్ (చేతితో పనిచేసేది) 2. పైప్‌బెండింగ్ మెషీన్ 3. హేండ్ డ్రిల్లింగ్ మెషిన్ 4. గ్యాస్ వెల్డింగ్ సెట్ 5. షీట్ బెండింగ్ మెషిన్ 6. షీరింగ్ మెషిన్ 7. గ్రైండింగ్ మెషిన్ 8. ఎలక్ట్రిఫికేషన్ 9. హేండ్ టూల్స్

***తయారుచేయు విధానము:-*** ముందుగా అవసరం అయిన కొలతలలో డ్రాయింగ్ గీసుకోవాలి. ఆ కొలతల ప్రకారం CR షీట్స్‌ని MS రాడ్స్‌నీ కటింగ్ యంత్రసహాయంతో కట్‌చేసుకోవాలి. కొన్ని వస్తువులను డ్రిల్లింగ్‌మెషిన్ ద్వారా రంధ్రాలు ఏర్పాటుచేసి విడిభాగాలను అవసరమయిన ఆకృతిలో ఫిట్‌చేయాలి. మరికొన్ని ఫర్నిచర్ అయిటమ్స్‌ను బెండింగ్ యంత్రసహాయంతో అవసరం అయిన షేప్‌లలో బెండ్‌చేసుకొని వెల్డింగ్ చేయటం ద్వారా పూర్తి రూపాన్ని ఇవ్వాలి. ఆ తరువాత హేండ్‌గ్రయిండర్‌తో వెల్డింగ్, మరియు కటింగ్ స్పాట్స్‌లో ఫినిషింగ్ ఇచ్చి పెయింట్ వెయ్యాలి. టేబుల్స్ స్టూల్స్ మొదలయిన కొన్ని వస్తువుల పైభాగాలను చెక్క పలకలతో కప్పవచ్చును.

గమనిక: ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ వివరాలు ప్రత్యేకంగా ఇవ్వబడ్డాయి.

# హెయిర్ క్రీమ్

*మార్కెట్‌లో ఎన్ని హెయిర్ ఆయిల్స్‌వస్తున్నా, చాలామంది మగవారు హెయిర్ క్రీములు వాడటానికి ఇష్టపడతారు. తలవెంట్రుకలు బిరుసుగా వుండి, ఎన్నిసార్లు దువ్వినా వంగకుండా ఇబ్బంది పెట్టే జుత్తుకు హెయిర్‌క్రీమ్స్ చక్కగా వుపయోగపడతాయి. జుత్తును హెయిర్‌స్టయిల్స్‌కి అనువుగా వుంచటమే కాదు చక్కటి సువాసనలు వెదజల్లుతూ జుత్తుకు మెరుపును, నునుపును ఇచ్చే ఈ హెయిర్‌క్రీమ్స్‌కి ప్రస్థుతం మార్కెట్‌లో మంచి గిరాకీయే వుంది.*

**'రా', మెటీరియల్స్(ముడిసరుకులు):-** 1. గ్లిజరిన్ 2. కాస్టర్‌ఆయిల్ 3. బొరాక్స్ 4. గ్రౌండ్‌నట్ ఆయిల్ 5. కలర్. 6. ఫెరఫ్యూమ్ 7. స్వచ్ఛమయిననీరు 8. సోడియం అర్బినేట్.

**ఫార్ములా:-** 1. గ్లిజరిన్ 13 గ్రా॥ 2. కాస్టర్ ఆయిల్ 25 గ్రా॥ 3. బొరాక్స్ 3 గ్రా॥ 4. గ్రౌండ్‌నట్ ఆయిల్ 100 గ్రా॥ 5. రంగు ఏదైనా 5 మి.గ్రా. 6. ఫెరఫ్యూమ్ 7 నీరు తగినంత 8. సోడియం ఆర్బినేట్ తగినంత.

**యంత్రపరికరాలు:-** 1. మిక్సర్ 2. పాత్రలు 3. చెక్క గరిటెలు 4. ఫిల్టర్స్ 5. ట్యూబ్‌లు, సీసాలు 6. పేకింగ్ అట్టపెట్టెలు 7. ట్యూబ్‌ఫిల్లింగ్, మరియు బాటిల్ పిల్లింగ్ మెషీన్స్ 8. మూతలుబిగించే యంత్రం.

***తయారుచేయు విధానము:-*** ముందుగా తగినంత నీటిలో బొరాక్స్‌ను కలుపుకోవాలి. ఆ మిశ్రమం 120 గ్రాములు వుండేలా చూసుకుని, దానిని గ్లిజరిన్, కాస్టర్ ఆయిల్, గ్రౌండ్ నట్ ఆయిల్స్ కలపాలి. (కలపటానికి ముందు బొరాక్స్ వాటర్ మిశ్రమాన్ని వడగట్టాలి) ఆ మిశ్రమంలో సోడియం ఆర్బినేట్‌ని తగినంతగా వేసి, మొత్తం మిశ్రమాన్ని ఒక మిక్సర్‌లో వేసి మృదువైన వెన్నలా వచ్చేటంతవరకూ బాగా మిక్స్ చేయాలి. ఆ తరువాత ఫిల్లింగ్ యంత్రాల సహాయంతో ట్యూబులలోకి, సీసాలలోకి ఎక్కించి, అందమయిన డిజైన్‌లో ప్రింట్‌చేయబడిన అట్టపెట్టెల్లో పేక్ చేసి మార్కెట్ చేయాలి.

గమనిక: ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ వివరాలు ప్రత్యేకంగా ఇవ్వబడ్డాయి.

# చిట్‌ఫండ్ కంపెనీ

నిజాయితీ, నమ్మకం, సామర్థ్యంతో కూడుకున్న లాభసాటి నిర్వహణ ఇది. డబ్బు విషయంలో చాలామంది అంటే దాదాపు నూటికి తొంభైమంది ఎవర్నీ నమ్మరు. అటువంటి వారికి కూడా నమ్మకం కలిగించటం ఈ చిట్‌ఫండ్ నిర్వహణకు మూలధనం లాంటిది. ప్రజావిశ్వాసాన్ని కోల్పోయినచిట్‌ఫండ్ కంపెనీలు కొన్ని ఒక ప్రక్క మూతపడుతున్నా మరో పక్క ఈ కంపెనీలు పుటట్టగొడుగుల్లా పుట్టుకు వస్తూనేవున్నాయి. ప్రజా విశ్వాసాన్ని చూరగొన్న కంపెనీగా మీ సంస్థ పదికాలాల పాటు వర్ధిల్లాలంటే కొన్ని కఠినమయిన నియమాలను రూపొందించి. వాటికి కట్టుబడివుంటే మీ ఆదాయానికి తిరుగు వుండదు.

**'రా' మెటీరియల్:-** 1. మూలధనం 2. పబ్లిసిటీ 3. నియమనిబంధనల పత్రాలు.

**నిర్వహణ ఫార్ములా:-** నమ్మకం. నిజాయితీ, సామర్థ్యం. కలిగివుండటం, కలుపుగోలుతనంతో వుంటూ చక్కటి సర్కిల్‌ని పెంచుకోవటం ఛిట్‌మెంబర్స్ స్థితిగతులపై కామన్ ఎంక్వయిరీలేక అవగాహన. సమయం పాటించటం.

**కావలసిన వస్తువులు:-** 1. ఆఫీస్ ఫర్నిచర్ 2. టెలిఫోన్ 3. టైప్‌రైటర్ 4. స్కూటర్ మోపెడ్స్, సైకిల్స్ వంటి వాహనాలు 5. పబ్లిసిటీ మెటీరియల్స్ 6. చిట్‌సంబంధమైన డాక్యుమెంట్స్,. ఇంకా కొన్ని ఇతర వస్తువులు.

***నిర్వహణ విధానము:-*** మీ చుట్టు పక్కలవారికి, మీకున్న ఫ్రెండ్స్, మరియు పరిచయస్తులకు మీ ఆర్థికస్తోమత మీ సిన్సియారిటీలపై ఖచ్చితమయిన నమ్మకం కలిగించాలి. ముందుగా చిన్నచిన్న ఛిట్స్‌తో ప్రారంభించాలి. ఎవర్ని పడితే వారిని చేర్చుకోకూడదు. ఆర్థికంగా మెరుగైన స్థితిలో వున్న వారినీ, గవర్నమెంట్ ఉద్యోగస్థులనూ, వ్యాపారంలో బాగా రాణిస్తున్నవారినీ, చిట్‌మెంబర్స్ గా చేర్చుకోవాలి. చిట్‌పాటకి అందరూ వచ్చేటట్టుచూడాలి. నిర్ణయింపబడిన కాలపరిమితిలో పాట ముగిసేలాచూడాలి. చీటీపాట 40 శాతం దాటిపోకుండా నిబంధనలు విధించి ఖచ్చితంగా అమలుపరచాలి. నిబంధనలలో వివరించిన ప్రకారం తగిన హామీలూ, సెక్యూరిటీ ఇవ్వగలిగిన వారికి ఒక్కరోజుకూడా ఆలస్యంచేయకుండా నిర్దేశిత సమయానికి సొమ్ము అందజేయగలగాలి. నిర్దేశితసమయంలో చిట్ అమౌంట్ కట్టలేనివారిని నిర్దాక్షిణ్యంగా ఛిట్‌లోంచి

తొలగించేవిధంగా నియమనిబంధనలు రూపొందించాలి. (చిట్‌మెంబర్స్ అవసరాన్నిబట్టి అంతవరుకు వారు కట్టిన అమౌంట్‌లో 25నుండి 40 శాతం వరుకూ తక్కువ వడ్డీతో ఫైనాన్స్ ఇచ్చే సదుపాయం కల్పించాలి.) అన్నిటికంటే ముఖ్యమయినది, ఇది కాష్‌తో కూడిన నిర్వహణ కాబట్టి. నమ్మకస్తులయిన స్టాఫ్‌ను తగిన డిపాజిట్ కట్టించుకుని నియమించుకోవాలి. బ్యాంక్ పనులు సాధ్యమయినంతవరుకూ మీరే స్వయంగా చూసుకోవాలి. మీరు ఎన్నిగ్రూపులు నిర్వహించిన ఒక్కోగ్రూప్‌కు సంబంధించి ఒక్కోచిట్ తాలుకు పూర్తి అమౌంట్ బేంక్ బేలన్స్ వుండేలా చూసుకోవాలి. ప్రతిపదిమందిలో ఏర్పాటుచేసే చిట్‌లో ఒకచిట్ మీ కంపెనీచిట్ అయివుండాలి. మెంబర్స్‌ను చేర్చుకోటానికి తగినంత సమయం వుండాలి. ఆ విషయంలో హడావుడి పడి అయిదుగురు చేరారుకదా అని మిగతా అయిదు చిట్స్ కంపెనీ తరుపున వేయకూడదు. ఇలా చాలామంది చేస్తారు. అది మంచి పద్ధతికాదు.

**గమనిక:** ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ వివరాలు ప్రత్యేకంగా ఇవ్వబడ్డాయి.



# కేంఫైర్ టాబ్లెట్స్

## (కర్పూరపు బిళ్లలు)

కర్పూరం వెలిగించి హారతినివ్వనిదే ఏ పూజాకార్యక్రమము పూర్తికాదన్న సంగతి అందరికీ తెలియనికాదు, దేవాలయాలలోనూ, ఇంట్లోని పూజామందిరాలలోనూ పూజలప్పుడు కర్పూరం ఎంతో అవసరం వుంటుంది. నూతన వధూవరులకు హారతి పట్టడం, దిష్టి పరిహారార్థం కూడా కర్పూరాన్ని ఉపయోగిస్తుంటారు. సుగంధంతో కూడిన ముడికర్పూరాన్ని కన్స్యూమర్ అవసరాలను అనుగుణంగా ఇప్పుడు రకరకాల ఆకారాలలో బిళ్లల రూపంలో కూడా లభిస్తోంది. ఈ టాబ్లెట్స్ తయారీ చక్కటి లాభాలలో కూడుకున్నదని కూడా చెప్పవచ్చు. సాంకేతికపరిజ్ఞానం అవసరంలేదు. తయారుచేయటం చాలాసులభం.

**'రా' మెటీరియల్స్ (ముడిసరుకులు):-** 1. ముడికర్పూరం 2. నీరు

**ఫార్మూలా:-** ముడికర్పూరాన్ని పొడిచేసి తగినంత నీటిలోకలపటం.

**యంత్రపరికరాలు:-** 1. టాబ్లెట్స్ తయారుచేయు యంత్రం. 2. వివిధసైజులలో డైస్ 3. పేకింగ్ మెటీరియల్

**తయారుచేయు విధానము:-** బెడ్డలుగా వుండే ముడికర్పూరాన్ని మెత్తటి పొడర్‌గా చేయాలి. దానికి తగినంత నీటని చేర్చి బాగా కలిపి ముద్దచేసి, విద్యుత్ యంత్ర సహాయంతో గాని చేతితో ఆపరేట్ చేసే మెషిన్‌లో గాని, డైస్ అమర్చి ఉపయోగించటం ద్వారా వివిధ సైజులలో కర్పూరపు టాబ్లెట్స్ తయారుచేయవచ్చును. ఇలా తయారుచేసిన కర్పూరపు బిళ్ళలను తూకం ప్రకారం పొలిథిన్ కవర్స్‌లో పేక్‌చేసి మార్కెట్‌చేయాలి.

గమనిక: ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ వివరాలు ప్రత్యేకంగా ఇవ్వబడ్డాయి.

# రీఫిల్స్ ఇంక్

*బాల్ పాయింట్ పెన్‌లకు రైటింగ్ రీఫిల్స్ ప్రధానం, పూర్తి అయిపోగానే ఎప్పటికప్పుడు మార్చుకునే ఈ రీఫిల్స్‌కి ఒక ప్రత్యేకమయిన ఇంక్‌తో అవసరం వుంది. ప్లాస్టిక్ ఇండస్ట్రీస్‌లో ఆర్డర్ ఇవ్వటంద్వారా ఈ రీఫిల్స్‌ను కొనుక్కుని వాటిలో యింక్ నింపాల్సివుంటుంది. బాల్‌పాయింట్ పెన్‌లకు రీఫిల్స్‌ఎంత అవసరమో, ఈ రీఫిల్స్‌కి ఇంక్‌కూడా అంతే అవసరం.*

**'రా' మెటీరియల్ (ముడిసరుకులు):-** 1. జిలిక్ ఏసిడ్ 2. బాయిల్డ్ కాస్టర్‌ఆయిల్ 3. రోజిన్ 4. రెసినోలిక్ ఏసిడ్ 5. మెథిలేటెడ్ స్పిరిట్ 6. ఆయిల్ సాల్యూబుల్ కలర్ 7. ఆముదం.

**ఫార్ములా:-** 1. జోలిక్ ఏసిడ్ 90 గ్రా॥ 2. బాయిల్డ్ కాస్టర్ ఆయిల్ 275 గ్రా॥ 3. రోజిం 140 గ్రా॥ 4. రెసినోలిక్ ఏసిడ్ 110 గ్రా॥ 5. మెథిలేటెడ్ స్పిరిట్ 50 గ్రా॥ 6. ఆయిల్ సాల్యుబుల్ రంగు 70 గ్రా॥ 7. ఆముదం 135 గ్రా॥

**యంత్రపరికరములు:-**1. రీఫిల్ ఫిల్లింగ్ మెషిన్ 2. ఫిల్టర్స్ (జల్లెడలు) 3. బాల్‌మిల్ 4. పింగాణీ పాత్రలు 5. కొయ్యగరిటెలు 6. సింగిల్ బర్నర్ గ్యాస్‌స్టౌవ్ 7. గ్యాస్ సిలిండర్ 8. రౌండ్ బాటమ్‌గ్లాస్ ప్లాస్క్ 9. రబ్బర్‌హేండ్ గ్లవ్స్

***తయారుచేయు విధానము:-*** ఆయిల్స్ అన్నిటినీ ఒక పింగాణీ పాత్రలో వేసుకోవాలి. ఎంచుకున్న కలర్‌ను బాగా ఫిల్టర్ బేసి, ఆయిల్స్‌వేసి పాత్రను కదుపుతూ, లేక గరిటెతోకలియ బెడుతూ మిశ్రమం చేయాలి. ఆ మిశ్రమాన్ని రౌండ్‌బాటమ్ గాజు ప్లాస్క్‌లో వేసి సింగిల్ బర్నర్‌గ్యాస్ స్టౌమీద వేడిచేస్తూ 50 నుండి 70 డిగ్రీల సెంటీగ్రేడ్ ఉష్ణోగ్రత వుండేలా చూడాలి. ఆ తరువాత మిగిలిన ముడిసరుకులను ఆ మిశ్రమంలో జతచేసి బాల్‌మిల్‌లో వేసి బాగా కలిసేటట్టు చేయాలి. ఆ తరువాత రెడీచేసుకున్న రీఫిల్స్‌లో ఫిల్లింగ్ మెషిన్ ద్వారా నింపాలి.

ఇంక్ గట్టిపడకుండా వుండటం ఈ ఇంక్ తయారీ నాణ్యతకు నిదర్శనం.

గమనిక:: ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ వివరాలు ప్రత్యేకంగా ఇవ్వబడ్డాయి.

# టీ.వి. సర్వసింగ్ సెంటర్

గృహ సంబంధమైన లగ్జరీస్ లో నేడు టెలివిజన్ ప్రధానపాత్ర వహిస్తోంది. ఈ నాడు దాదాపు అన్ని ప్రాంతీయ భాషలలోనూ ఛానల్స్ వెలిసాయి. విద్యా, వినోదం, జనరల్ నాలెడ్జ్ మొదలయిన అంశాలకు రకరకాల ప్రోగ్రాములు ప్రసారం చేయబడుతున్నాయి. ఇంటిల్లపాదికీ వినోదాన్ని కాలక్షేపాన్ని అందించే టి.వి షడన్‌గా పనిచేయటం మానేసినా, సరిగా పనిచేయకపోయినా ఇంటిల్లపాదికే పిచ్చెత్తినట్టయిపోతుంది. వెంటనే మెకానిక్ కోసం పరిగెడతారు. మళ్ళీ టి.వి సరిగా పనిచేసేవరకూ ఆరాటపడిపోతారు. అటువంటి అవసరాలను తీర్చి ఇబ్బంది పెడుతున్న టెలివిజన్ టెక్నికల్ ఫెయిల్యూర్స్‌ని సవరించే టి.వి. సర్వీసింగ్ సెంటర్ ప్రతిరోజూ ఆదాయాన్ని తెచ్చిపెట్టే నిర్వహణ క్రిందేలెక్క.

**'రా' మెటీరియల్స్ (ముడిసరుకులు):-** 1. రెసిస్టర్స్ 3. కాయిల్స్ కట్రాన్సిస్టర్స్ 4. సోల్డర్ 5. ఇంటిగ్రేటెడ్ సర్క్యూట్ 6. ఫ్లెక్స్‌కేబుల్స్ 7. వైర్స్ 8. ఇతర విడిభాగాలు.

**ఫార్ములా:-** T.V. మెకానిజంలో శిక్షణ, సర్వీసింగ్ సెంటర్స్‌లో పనిచేసిన అనుభవం.

**యంత్రపరికరాలు:-** 1. పవర్‌కనెక్షన్ 2.H.F. అసిలేటర్ 3. 25 వాట్ అయిరన్ 4. మల్టీ మీటర్ 5. సిగ్నల్ జనరేటర్ 6. అసిలోస్కోప్ 7. టేబుల్స్, కుర్చీలు 8. T.V. స్టాండ్స్, 9. ఆఫీస్ ఫర్నిచర్ 10. హాండ్‌టూల్స్.

***నిర్వహణ విధానము:-*** ఏ వస్తువు సర్వీసింగ్ కయినా కస్టమర్ సంతృప్తే ప్రధానం. అదే మీకు అదనపు ప్రచారాన్ని ఇచ్చి మీ సర్వీసింగ్ సెంటర్ అభివృద్ధికి బాగా తోడ్పడుతుంది. ఫెల్యూర్స్‌ని కనిపెట్టి తగిన విధంగా సర్వీసింగ్ చేసి టైంప్రకారం కస్టమర్స్‌కి డెలివర్ ఇవ్వాలి. కస్టమర్స్‌నిమీ చుట్టూ త్రిప్పించుకోకూడదు. మీ సర్వీసింగ్ పై గ్యారంటీ ఇవ్వగలగాలి. గ్యారంటీ పీరియడ్‌లోగా ఆ టెలివిజన్ మరోసారి మొరాయిస్తే స్పేర్‌పార్ట్‌లు మినహాసర్వీసింగ్ ఫ్రీగా చేసి ఇవ్వాలి. (స్పేర్‌పార్ట్స్ కొనుగోలులో సర్వీసింగ్ చార్జీల కంటే ఎక్కువ మిగులుతుంది)

మీ సర్వీసింగ్ సెంటర్‌లో టెలివిజన్స్ చక్కగా రిపేర్ చేస్తారన్న పేరుతెచ్చుకుంటే చాలు. మీ రాబడికి తిరుగువుండదు.

అంతేకాకుండా కొన్ని సరికొత్త స్కీమ్స్ ఏర్పాటుచేసి మీ ఆదాయాన్ని పెంచుకునే వీలుంది. సంవత్సరకాలంలో టెలివిజన్ ఎప్పుడు రిపేర్ వచ్చినా సర్వీస్ చేయటానికి ఒకమొత్తంగా 100 రూపాయలనుండి 300 వరకూ నిర్ణయించి వసూలు చేయండి. ఆ సంవత్సరంలో ఎన్నిసార్లు అవసరం అయితే అన్నిసార్లు సర్వీస్‌చేయండి (స్పేర్‌పార్ట్స్ కొనుగోలు వుండనేవుంది) ఈ విధంగా చేయటంవల్ల ఒకేసారి కొంతమొత్తం ఆదాయం రావటమేకాక, కస్టమర్స్ మీ సర్వీసింగ్ సెంటర్‌కి అలవాటు పడిపోతారు.

# బ్లాక్ ఫినాయిల్

ఫినాయిల్ ఉపయోగాలనూ, వైట్ ఫినాయిల్ తయారీని ఇంతకుముందే వివరించటం జరిగింది. ఇప్పుడు బ్లాక్‌ఫినైల్ గురించి, సాధారణంగా ఎక్కువ మంది బ్లాక్ ఫినాయిల్‌నే వాడటానికి ఇష్టపడతారు. బ్లాక్ ఫినైల్ పవర్ ఎక్కువ అన్నదే దీనికి కారణం. ఎవరు ఎలా అనుకున్నా ఫినాయిల్ గచ్చునేలను శుభ్రపరచటానికీ దుర్గంధ నివారణకూ, కంటికి కనిపించని క్రిముల సంహారానికి ఉపయోగపడుతుందన్నది నిజం.



**'రా' మెటీరియల్ (ముడిసరుకులు): + ఫార్ములా:- (శాంపిల్)** 1. క్రియోసోట్ ఆయిల్ 15 KG. 2. రోజిన్ 1 KG. 600 గ్రా॥ 3. నీరు తగినంత 4. కాస్టర్ ఆయిల్ 5 KG. 5. కాస్టిక్ సోడా 1 500 గ్రా॥ 6. వేపనూనె



**యంత్రపరికరములు:-**1. గ్యాస్‌స్టవ్ 2. గ్యాస్‌సిలెండర్ 3. పెద్ద కళాయి 4. చెక్కగరిటెలు 5. బాటిల్ ఫిల్లింగ్ మెషీన్ 6. లేబల్స్



***తయారుచేయు విధానము:-*** ముందుగా కాస్టిక్ సోడాను తగినంత నీటిలో వేసి ఒక పాత్రలో బాగా కరిగించి వుంచుకోవాలి. పెద్ద కళాయిని స్టవ్‌మీద వుంచి అందులో రోజన్ కాస్టర్ ఆయిల్ వేపనూనె వేసి 75 డిగ్రీల సెంటీగ్రేడ్ ఉష్ణోగ్రతలో మరగపెట్టాలి. ఆ తరువాత ఆ మిశ్రమంలో కరిగించిన కాస్టిక్ సోడా ద్రవాన్ని పోస్తూ బాగా కలబెట్టాలి. ఆయిల్స్ మిశ్రమంలో కార్బిక్ సోడా ద్రవం బాగా కలసిపోయిన తరువాత స్టౌ మంట తగ్గించి కొద్దిపాటి సెగమీద వుంచి, ఆవిరి రూపంలో హరించుకుపోయిన దాన్ని గుర్తుపెట్టుకుని పాత్రలో ఆ లెవెల్‌కి నీరు కలపాలి. అలా 45నిముషాల పాటు వుంచిన తరువాత, కళాయిని క్రిందికి దించి చల్లారనివ్వాలి. అలా 45నిముషాల పాటు వుంచిన తరువాత, కళాయిని క్రిందికి దించిచల్లారనివ్వాలి. ఆ తరువాత క్రియోసోట్ ఆయిల్‌ని ఆ మిశ్రమంలో వేసి చెక్కగరిటెను తీసుకుని మొత్తం మిశ్రమాన్ని బాగా కలిసేదాకా కలియబెట్టాలి. 40 గంటలపాటు అలాగే వదిలేసి ఆ తరువాత సీసాలలోనింపి లేబుల్స్ అతికించి మార్కెట్ చేయాలి.

గమనిక: ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ వివరాలు ప్రత్యేకంగా ఇవ్వబడ్డాయి.

# వీడియోకాసెట్ రికార్డింగ్

నిర్మాతల నుండి సినిమాలకి సంబంధించిన మాస్టర్ కాసెట్ కాపీ హక్కులు పొంది ఆ మాస్టర్ కాపీనుండి డూప్లికేషన్ ద్వారా అవసరం అయిన కాసెట్స్ తయారుచేసి మార్కెట్ చేసుకోవచ్చు. అందుకు అవసరం అయిన డూప్లికేషన్ యూనిట్‌ని పరిశ్రమగా పెట్టుకొని మంచి లాభాలు ఆర్జించవచ్చు. అయితే ఈ పరిశ్రమకి ప్రత్యేకమయిన లైసెన్స్ పొందలసిన అవసరం వుంది. ఈ యూనిట్ స్థాపనకు పెట్టుబడి ఎక్కువే అయినా లాభాలు కూడా అదే రేంజ్‌లో వుంటాయి. మార్కెట్‌లో వీడియో కాసెట్స్‌కి గిరాకీ వున్నంతకాలం ఈ యూనిట్ మూడుపువ్వులు ఆరుకాయలుగా వర్ధిల్లుతూనే వుంటుంది.

**'రా' మెటీరియల్ (ముడిసరుకులు):-** 1. ఎంప్టీ వీడియో కాసెట్స్

**ఫార్ములా:-** పెర్ఫెక్ట్ డూప్లికేషన్‌లో అనుభవం.

**యంత్రపరికరములు:-**1. మానిటర్స్ 2. మౌంటింగ్ వర్క్ టేబుల్స్ 3. వి.సి.ఆర్‌లు 4. ఎయిర్‌కండిషనర్ 5. ఓల్టేజిస్టెబిలైజర్ 6. యూ-మేటిక్ 0.75 ఇంచెస్ వీడియోకాసెట్ రికార్డర్ (కలర్) పవర్‌కార్డ్;: ఎడిటింగ్ మొ॥వాటితో 7. వీడియోడిస్ట్రిబ్యూషన్ ఆంప్లిఫైయర్స్

***డూప్లికేషన్ విధానము:-*** మాస్టర్‌కాపీ కాసెట్‌ను తీసుకుని, ముందుగా యూ-మేటిక్ ప్లేయర్‌లో దానిని క్వాలిటీని పరీక్షించాలి. ఆ తరువాత ఒకేసారి ఆ ప్లేయర్స్ పదీ, పన్నెండు వి.సి.ఆర్‌లకు కనెక్ట్‌చేయాలి. అప్పుడు ఆప్లిఫికేషన్, ట్రాకింగ్ మొదలయిన వాటిని పరిశీలించి సరిచేసిన తరువాత రికార్డింగ్ ప్రారంభించాలి. రికార్డింగ్‌పూర్తి అయిన తరువాత కేసెట్స్‌ని ఆ కాసెట్స్ తాలుకు రేపర్‌కవర్స్‌లో వుంచి, మార్కెట్ చేయాలి. సొంతకేసెట్స్ లేకపోయినా, తగిన చార్జ్‌తో కాంట్రాక్ట్ పద్ధతి మీద కాసెట్స్ డూప్లికేషన్ చేసి ఇవ్వవచ్చు.

గమనిక: ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ వివరాలు ప్రత్యేకంగా ఇవ్వబడ్డాయి.

# ట్యూబ్‌లైట్ స్టార్టర్స్

*ఎక్కువకాంతిని ప్రసరింపజేస్తూ కరెంట్‌ను పొదుపుచేసే ట్యూబ్‌లైట్స్ వెలగాలంటే స్టార్టర్స్ అవసరం ఎంతయినా వుంది. ఒకసారి వెలిగిన తరువాత స్టార్టర్‌ను తొలగించ వచ్చునుగానీ, ఆరిపోయిన ట్యూబ్‌లైట్ వెలగాలంటే స్టార్టర్ ఖచ్చితంగా వుండాలి. ఈ విధంగా ట్యూబ్‌లైట్స్‌లో అనుబంధం కలిగి ఈ స్టార్టర్స్ మార్కెట్లలో చాలా డిమాండ్ వుంది. ఈ స్టార్టర్స్ తయారీ లాభాలతో కూడిన పరిశ్రమం అయినా అందుకు తగిన సాంకేతిక పరిజ్ఞానం కలిగివుండటం అవసరం.*

**'రా' మెటీరియల్స్ (ముడిసరుకులు):** 1. కెపాసిటేటర్ లాంప్‌సమ్ 2. ఫైబర్ షీట్ 3. అల్యూమినియం కేన్ 4. మైకా 5. గ్లోలాంప్ 6. పేకింగ్ మెటీరియల్స్

**ఫార్ములా:-** సాంకేతిక పరిజ్ఞానం, ఎలక్ట్రికల్ ఇంజనీరింగ్ డిప్లమో, అసెంబ్లింగ్ ఎక్స్‌పీరియన్స్.

**యంత్రపరికరాలు:-** 1. మెగ్గర్ -100మెగా 2. ట్యూబ్‌లైట్ ఫిక్సర్ 3. డిమ్మర్‌సెట్ (0.27V/4A) 4. టూల్స్ అండ్ ఫిక్సర్స్ 5. బాల్‌ప్రెస్ 6. అమ్మీటర్ 7. వోల్టామీటర్ పానెల్ 8. టెస్టర్ 9. ఆఫీస్ ఫర్నీచర్.

***తయారుచేయు విధానము:-*** తగిన మెజర్‌మెంట్స్‌తో సరయిన సైజుకు ఫైబర్‌షీట్‌ను కట్‌చేయటానికి బాల్‌పెస్‌ని ఉపయోగించాలి. కెపాసిటేటర్స్, గ్లోలాంప్స్‌ని సమాంతరంగా ఫిట్‌చేసి ఫైబర్ షీట్‌మీద వుండే బాక్ టెర్మినల్ రెండుపాయింట్‌కి కనెక్ట్‌చేయాలి. మైకాషీట్ చుట్టివుండే ఈ టోటల్‌యూనిట్‌ని అల్యూమినియం కేన్స్‌లో బిగించాలి. ఆ తరువాత పూర్తిగా తయారయిన స్టార్టర్స్‌ని లేబొరేటరీలో పరీక్షచేయించాలి. ఆ తరువాత అట్టపెట్టెలలో పేక్ చేసి మార్కెట్ చేయాలి. ఇదికేవలం అసెంబ్లింగ్ మాత్రమే స్టార్టర్‌ల వర్కింగ్ కెపాసిటియే మీరు అందించిన క్వాలిటీకి నిదర్శన.

గమనిక: ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ వివరాలు ప్రత్యేకంగా ఇవ్వబడ్డాయి.

# డీస్
## (టైలర్స్ మార్కింగ్‌చాక్)

*సరయిన కొలతలు తీసుకోనిదే దుస్తులు వివిధ మోడల్స్‌లో కుట్టటం టైలర్స్‌కి సాధ్యంకాదు. దుస్తులు కుట్టటానికి టైలర్స్ ముందుగా చేసేపని కస్టమర్‌కి కావాల్సిన మోడల్స్ తాలుకు దుస్తుల కొలతలు తీసుకోవటం తీసుకున్న కొలతల ప్రకారం కుట్టవలసిన క్లాత్‌మీద మార్కింగ్ చేసుకోటానికి టైలర్స్ ఉపయోగించే మార్కింగ్ చాక్‌నే డీస్ అంటారు. టైలర్స్‌కి దీని అవసరం చాలా వుంది. దీనిని తయారుచేసి టైలరింగ్ వస్తువులు అమ్మే షాపులవారికి సప్లయ్ చేసిమంచి లాభాలు ఆర్జించవచ్చు. టైలర్స్‌కి దీనికి అవసరం తప్పనిసరి కాబట్టి మార్కెట్‌లో ఎప్పటికప్పుడు దీనికి డిమాండ్ వుంటూనే వుంటుంది.*

**'రా' మెటీరియల్స్ (ముడిసరుకులు):-** 1. లితోఫెనోన్ 2. చైనాక్లే 3. పారాఫిన్‌వేక్స్ 4. కావాల్సిన రంగు. (ఆర్గానిక్)

**ఫార్ములా:- (శాంపిల్)** 1. లిథోపెనోన్ 500గ్రా॥ 2. చైనాక్లే 1 3. పారాఫిన్ మైనం 100 గ్రా॥ 4. ఆర్గానిక్ కలర్ (కావాల్సింది) 100 గ్రా॥

**యంత్రపరికరములు:-**1. ఎలక్ట్రిఫికేషన్ 2. తూనిక యంత్రం 3. డైస్ 4. హెచ్.ఓ.హైడ్రాలిక్ ప్రెస 5. పౌడర్ ఫిల్టర్స్ (జల్లెడలు) 6. వర్కింగ్ టేబుల్ 7. డ్రైయర్‌ఓవెన్ 8. ఇతర పనిముట్లు

***తయారుచేయు విధానము:*** ఒకపాత్రలో మైనాన్ని కరిగించాలి. పౌడర్స్‌గా తీసుకున్న చైనాక్లే, ఎథోపెనోన్, ఆర్గానిక్ కలర్‌లను బాగా జల్లెడ పట్టి కొద్దిగా నీరుచేర్చి కలిపి కరిగించి, కరింగించిన మైనంలో పోసి బాగా కలియబెడుతూ గట్టిముద్దగా అయ్యేటట్లు చేయాలి. ఆ ముద్దను వివిధ ఆకారాలలోని డైస్ ఉపయోగించి డీస్‌ను తయారుచేసి కనీసం 20 గంటలపాటు నీడలో ఆరబెట్టి ఆ తరువాత డ్రైయర్ ఓపెన్‌లో.... తగిన ఉష్ణోగ్రత వద్ద వేడిచేసి పేక్‌చేయాలి.

గమనిక: ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ వివరాలు ప్రత్యేకంగా ఇవ్వబడ్డాయి.

# ఫౌంటెన్ పెన్స్

*బాల్‌పాయింట్ పెన్‌లూ ఇతర పెన్‌లూ ఎన్ని రకాలు వస్తున్నా ఫౌంటెన్ పెన్స్ వాడేవాళ్ళు వాడుతూనే వున్నారు. ఇంక్‌లో నింపితే ఇబ్బంది పెట్టకుండా వ్రాసేపెన్ ఇదొక్కటే కావటం అందుకు కారణంకావచ్చు. బాల్‌పాయింట్ పెన్ ఉత్పత్తులు మార్కెట్‌లో విజృంభిస్తున్నా ఫౌంటెన్ పెన్‌లకున్న గిరాకీ ఏ మాత్రం తగ్గలేదు. రకరకాల సైజులలో అందంగా ఆకర్షణీయంగా తయారుచేసే ఈ పెన్‌ల పరిశ్రమను ఇప్పటికే తన డిమాండ్‌ను నిలుపుకుని లాభాల బాటలో పయనిస్తున్న పరిశ్రమగానే చెప్పవచ్చును.*

**'రా' మెటీరియల్స్ (ముడిసరుకులు):-** 1. సెల్యులోజ్ ఎసిటేట్ బ్యూరేట్ 2. జింక్ ఆక్సయిడ్ 3. పొటాషియం హైడ్రాక్సైడ్ 4. కలర్ పిగ్మెంట్ 5. థెర్మోసెట్టింగ్ 6. ప్లాస్టిక్ మెటీరియల్ 7. ఎబొనేట్ 8. పాళీలు, క్లిప్పులు 9. స్క్రూనెక్

**ఫార్ములా:-** స్క్రూనెక్, పాళీలు, క్లిప్‌లు ఎబొనేట్ మినహాయించి మిగతాముడి సరుకులన్నిటిని తగిన పాళ్ళలో కరిగించటం.

**యంత్రపరికరములు:-**1. కలర్ డ్రమ్ 2. ఫీడర్ టంగ్ గ్రైండింగ్ యంత్రం 3. మౌల్ట్‌లు, డైలు 4. హేండ్ ఆపరేటెడ్ ఇంజక్షన్ మౌల్టింగ్ మెషిన్ 5. స్టాంపింగ్ మెషిన్ 6. బెంచ్‌డ్రిల్ 7. బఫింగ్ మెషిన్

***తయారుచేయు విధానము:-*** కరిగించిన ప్లాస్టిక్ ద్రవంతో నిర్దేసితడైస్ ఉపయోగించి ఇంజక్షన్ మౌల్టింగ్‌యంత్ర సహాయంతో ఫౌంటెన్‌పెన్ బాడీలు తయారుచేయాలి. ఆ తరువాత ఫీడర్‌టంగ్‌ను ఎబొనేట్ తయారుచేసి గ్రైండింగ్ మిషన్ ద్వారా టంగ్‌కీ, పెన్ బాడీకి ఫినిషింగ్ ఇవ్వాలి. స్టాంపింగ్ యంత్రసహాయంలో పెన్‌బాడీమీద అవసరం అయిన పేర్లను (కంపెనీ పేరు) ముద్రించాలి. ఆతరువాత పాళీని స్క్రూనెక్‌నూ, క్లిప్‌నూ అసెంబ్లింగ్ చేయటంతో పెన్ తయారవుతుంది. వాటిని ఆకర్షణీయమైన ప్రింటెడ్ బాక్స్‌లలో పేక్‌చేసి మార్కెట్ చేయాలి. ఇందులో స్క్రూనెక్‌కి రబ్బర్ ట్యూబులు అమర్చటం ద్వారా ఇంక్‌ను ఫ్లోచేసే విధానం కూడా వుంది. ప్లాస్టిక్ బాడీలను కొన్ని పద్ధతుల ద్వారా మెటల్‌మౌల్టెడ్ బాడీలలోకి ఇన్‌సర్ట్ చేయొచ్చు. అందువల్ల పెన్‌లు ఎక్కువ కాలం మన్నే అవకాశం వుంది.

గమనిక: ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ వివరాలు ప్రత్యేకంగా ఇవ్వబడ్డాయి.

# కూల్‌డ్రింక్స్ & ఐస్‌క్రీమ్ పార్లర్

మండువేసవిలో చల్లదనాన్ని అనుభవించటం, ఆస్వాదించటం ఎంతో హాయినిస్తుంది. ఆ అనుభవం రుచులతో కూడుకున్నదయితే మరింత హాయిగా వుంటుంది. కూల్‌డ్రింక్స్, ఐస్‌క్రీమ్‌లు అంటే ఇష్టపడని వారు వుండరు. పిల్లలు మొదలుకొని పళ్ళుపూడి పోయిన వృద్ధులవరకూ వీటిని అమితంగా ఇష్టపడతారు. అటువంటి వారి అవసరాలను తీర్చటానికే ఈ పార్లర్స్ వెలిసాయి. వివిధ పనులమీద ఎప్పుడూ బిజీగా తిరిగేవారూ, షాపింగ్‌కోసం వెళ్ళేవారూ, కొద్దిసేపు పార్లర్స్‌లో కూర్చుని కూల్‌డ్రింక్స్, ఐస్‌క్రీమ్‌లు సేవించటానికి ఇష్టపడతారు. ఒకప్పుడు వేసవికాలంలో మాత్రమే బిజీగా వుండే ఈ పార్లర్స్ ఇప్పుడు అన్ని సీజన్స్‌లోనూ బిజీగానే వుంటున్నాయి. టీ,కాఫీలు త్రాగటంకంటే కూల్‌డ్రింక్స్ త్రాగటం చాలామంది డిగ్నిటీగా ఫీలవుతారు.

**'రా' మెటీరియల్స్ (ముడిసరుకులు):** వివిధ ఫ్లేవర్స్‌లో, వివిధకంపెనీలకు చెందిన కూల్‌డ్రింక్స్‌బాటిల్స్, రెడీమెడ్ ఐస్‌క్రీమ్ పేకింగ్స్, చాకోబార్, కోకోక్రీమ్‌బార్ మొదలయినవి.

**యంత్రపరికరాలు:- (నిర్వహణకు కావాల్సిన సామగ్రి)** 1. డీప్ ఫ్రీజర్స్ 2. ఐస్‌క్రీమ్ పార్శిల్‌కోసం పేకింగ్ మెటీరియల్స్. 3. కాష్ కౌంటర్స్ 4. ఐటమ్‌ను తెలియచేసే మెనోకార్డ్‌లు. 5. పార్లర్‌కి అవసరం అయిన టేబుల్స్, కుర్చీలు, ఇతర ఫర్నిచర్.

**నిర్వహణ విధానము:-** ట్రాఫిక్‌బిజీగా వుండే సెంటర్స్‌లో గానీ, షాపింగ్ సెంటర్స్‌కి దగ్గరలోగాని షాపును అద్దెకు తీసుకోవాలి. లేటెస్ట్ మోడల్ ఫర్నిచర్‌లో షాపును అందంగా ఆకర్షణీయంగా డెకరేట్ చేయాలి. కూల్ డ్రింక్స్, ఐస్‌క్రీమ్ ఐటమ్స్ సంబంధించి కస్టమర్స్ ఏది అడిగినా లేదనకుండా అందించగలగాలి. లేడీస్‌కోసం ఒక ప్రత్యేకమయిన చిన్న రూమ్‌ను ఏర్పాటుచేస్తే మంచిది. తగినంత స్టాక్‌ను ఎప్పుడూ డీప్ ఫ్రిజర్స్‌లో వుంచుకోవాలి. కస్టమర్స్‌లో అధికశాతం ఏ కంపెనీ, ఏ ఫ్లేవర్ డ్రింక్‌ను ఇష్టపడుతున్నారో శ్రద్ధగా గమనిస్తూ ఆ ఐటమ్‌కును అవసారానికి తగినంతగా స్టాక్ వుంచుకోవాలి. రెడీమేడ్ ఐస్‌క్రీమ్ ప్యాకింగ్స్‌లో నాణ్యతగలవాటిని ఎన్నిక చేసుకుని కస్టమర్స్ ఆకట్టుకోవాలి.

గమనిక: ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ వివరాలు ప్రత్యేకంగా ఇవ్వబడ్డాయి.

# ఫ్రూట్ జ్యూస్ & షుగర్ కేన్ జ్యూస్ స్టాల్

కూల్‌డ్రింక్స్ పార్లర్ కోవకిచెందే మరో నిర్వహణ ఇది. అయితే పార్లర్ నిర్వహణకు అవసరం అయినంత ఎస్టాబ్లిష్‌మెంట్ దీనికి అవసరంలేదు. కొద్దిపాటి స్థలంలోగాని, చిన్న షెడ్‌లోగానీ, టేబుల్స్, లేక కౌంటర్ ఏర్పాటు చేసుకుంటే సరిపోతుంది.

వివిధరకాల ఫ్రూట్స్, షుగర్‌కేన్, ఎసెన్స్ పంచదార దీనికి అవసరం అయిన ముడిసరుకులు. షుగర్‌కేన్ క్రషింగ్‌మెషిన్, మిక్సర్‌లు, లిక్విడ్‌ఫిల్టర్స్, గ్లాసులూ, స్టీల్ పాత్రలూ, వాష్‌బేసిన్లు ఈ నిర్వహణకు అవసరం అయిన యంత్రపరికరాలు. కుర్చీలూ, ఠిటేబుల్స్ వంటి అవసరంలేదు.

కస్టమర్స్ అడిగిన ఫ్రూట్స్‌ని తోలువలిచి, ముక్కలు చేసి గానీ, తొనలుగా గాని మిక్సర్స్‌లో పంచదారతో పాటు వేసి జ్యూస్ చేయాలి. ఆ తరువాత ఫిల్టర్స్ ద్వారా జ్యూస్‌ను వడగట్టి గ్లాస్‌లలో పోసి ఎసెన్స్ చల్లి కస్టమర్స్‌కి అందించాలి.

గమనిక: ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ వివరాలు ప్రత్యేకంగా ఇవ్వబడ్డాయి.



# వర్మిసెల్లీ (సేమియా)

*పాయసం వండుకోటానికి అవసరం అయిన వర్మిసెల్లీ అంటే పిల్లలకు మాత్రమేకాదు పెద్దలూ, వృద్ధులూ అందరికీ చెప్పలేనంత యిష్టం. ఒక పాయసం తయారీకి మాత్రమే కాకుండా రవ్వతో కలిపి ఉప్మా చేసుకోటానికి రోజ్‌మిల్క్ ఎసెన్స్‌తో పాటు చిక్కటి పాలల్లో కలిపి తినటానికి ఈ వర్మిసెల్లి ఉపయోగపడుతుంది. పెళ్లిళ్లూ ఇతర శుభకార్యాలకు సంబంధించిన విందులలో దీనిని పంచదారలో కలిపి ఒక ప్రత్యేకమైన స్వీట్‌గా కూడా తయారుచేస్తున్నారు. దీనిని అలాగే ఉడకబెట్టి మసాలా పౌడర్ చల్లి తినవచ్చును. ఇన్ని రకాల ఆహార పదార్థాలు తయారుచేసుకోటానికి ఉపయోగపడే సేమియా తయారీకి మార్కెట్‌లో డిమాండ్ వుండక ఏమవుతుంది.*

**'రా' మెటీరియల్స్ (ముడిసరుకులు):-** 1. మైదా, లేక గోధుమ లేక కర్ర పెండలం పిండి 2. పాలు 3. స్వచ్ఛమయిననీరు.

**ఫార్ములా:-** మైదా, లేక గోధుమ లేక కర్ర పెండలం పౌడర్‌లో ఏదో ఒకటి పాలలోనూ, తగినన్ని నీళ్ళలోనూ కలపాలి.

**యంత్రపరికరములు:-** 1. మోటర్‌తో నడిచే వర్మిసెల్లీ మేకింగ్ మెషీన్ 2. ఎగ్జాస్ట్‌ఫ్యాన్ 3. బేగ్‌సీలింగ్ మెషిన్ 4. పాలిథిన్ బేగ్స్.

***తయారుచేయు విధానము:-*** పైన ఇవ్వబడిన పౌడర్స్‌లో ఏదో ఒక పౌడర్‌ను ఎన్నుకుని ముందుగా జల్లెడలతో జల్లించాలి. ఆ పౌడర్‌లో కొద్దిగా పాలు, తగినన్ని నీళ్ళు కలిపి కొద్దిగా వేడిచేసి బాగా ముద్దగా పిసకాలి. (యంత్రసహాయంతో కూడా బాగా కలపవచ్చు) ఎక్కడా పొడిలేకుండా మెత్తటి ముద్దగా తయారయిన పిండిని సేమియా మేకింగ్ మెషిన్ ద్వారా సేమియా తీగలుగా రాగానే కావాల్సిన సైజులలో కట్‌చేసి అనువయిన ట్రేలలో వేసి ఆరబెట్టాలి. పూర్తిగా తడి ఆరి ఎండగానే ప్రింటెడ్ పాలిథిన్ బేగ్స్‌లో వేసి పేకింగ్ చేసి మార్కెట్ చేయాలి.

ఇదేవిధానంతో ప్రస్తుతం మార్కెట్‌లో విడుదలవుతున్న నూడిల్స్‌కూడా తయారుచేయవచ్చును. ఇందుకు సేమియా తీగలను తయారుచేసే గొట్టంలో కొట్టిపాటి మార్పులు చేసుకోవచ్చును. ఇదే సేమియాను ఇంట్లో తయారుచేసుకోటానికి చేతితో ఆపరేట్‌చేసే గొట్టాలవంటివి కూడా దొరుకుతాయి.

**గమనిక:** ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ వివరాలు ప్రత్యేకంగా ఇవ్వబడ్డాయి.

# బ్రిక్స్ (ఇటుకలు)

*నగరాలూ, పట్టణాలు త్వరితగతిని విస్తరిస్తున్న ఈ కాలంలో గృహనిర్మాణాలకు కొదువలేదు. గృహనిర్మాణంలో ఇటుకలు ప్రధానమయినవి. దేశ జనాభా నానాటికీ పెరుగుతూనేవుంది. ఆర్థికంగా వెనుకబడిన వారికి ఉచితంగా ఇళ్ళుకట్టి ఇచ్చే పథకాలను దాదాపు ప్రతిరాష్ట్ర ప్రభుత్వం చేపడుతోంది. అందువల్ల ప్రభుత్వ సంస్థలలో కాంట్రాక్టును కుదుర్చుకుని భారీఎత్తున ఇటుకల సప్లయ్ చేయటం మంచి ఆదాయాన్ని తెచ్చిపెడుతుందన్నది సందేహం లేని విషయం. ఇటుకలకున్న డిమాండ్ అపరిమితం. ఈ పరిశ్రమను స్థాపించి సమర్థవంతంగా నిర్వహించగలిగితే అధికలాభాలు సంపాదించవచ్చు. ఈ ఇటుకలను నాలుగయిదు ఫార్ములాలతో తయారుచేయవచ్చును. అందులో ఒక ఫార్ములా మాత్రమే ఇక్కడ ఇస్తున్నాం.*

**'రా' మెటీరియల్స్ (ముడిసరుకులు):-** 1. కొబ్బరిపీచు, 2, గ్రుడ్ల గుల్లలు 3. చెరకుపిప్పి 4. సన్నటి ఇసుక 5. ఎండుగట్టి 6 . దంపుడు పొట్టు 7. నిమ్మతొక్కలు 8. ఇంకామరికొన్ని.... 9. సముద్రపు ఆలిచిప్పలు

**ఫార్ములా:-** 1. కొబ్బరిపీచు బాగ నలగగొట్టినది 5 కిలోలు 2. గ్రుడ్లగుల్లలు లేక సముద్రపు గుల్లలు 5. కిలోలు 3. చెరకు పిప్పి నిమ్మతొక్కలు, ఇసుక, పొట్టు తగినంత

**యంత్ర పరికరాలు:-** 1. అచ్చుఫ్రేములు 2. ఇంజనాయిల్ (అచ్చులో పూయటానికి) 3. బట్టీ 4. అవసరం అయిన ఇంధనం (ఇటుకకాల్చటానికి) 5. చదును చేసే సాధనం.

***తయారుచేయు విధానం:-*** ఫార్ములాలో ఇవ్వబడిన ముడిసరుకులను బాగా మిశ్రమంచేసి (కాళ్ళతో తొక్కికానీ, యంత్రసహాయంతో కానీ చేయవచ్చు) ఆ మిశ్రమాన్ని అచ్చు ఫ్రేములలో నింపాలి. ఫ్రేముల పైభాగాన్ని సమానంగా వుండేలా చెక్కలోగానీ, కాపీవంటి పెద్ద సాధనంతోగాని చదునుచేయాలి. అవిబాగా ఆరిన తరువాత పచ్చి ఇటుకలను ఫ్రేములలోంచి బయటకి ఖాళీ ప్రదేశంలోను బట్టీలో ఒక పద్ధతిగా చేర్చి పొట్టునూ, వూకను బాగా కప్పి, బట్టీ వెలిగించాలి. మెల్లమెల్లగా బట్టీమండటం ప్రారంభిస్తుంది. ఇటుకలు బాగా కాలేటంతవరకూ బట్టీ మండుతూనే వుండాలి. ఇటుకలు ఎరుపు రంగుకు మారితే పక్వంగా కాలినట్టు లెక్క. బట్టీ ఆరి ఇటుకలు చల్లారిన తరువాత వాటిని దొంతర్లగా పేర్చి అమ్మకానికి సిద్ధంచేయాలి.

ఇంచుమించు ఇదే పద్ధతిలో పెంకులనూ, సిమెంట్ బ్లాక్‌లను తయారు చేయవచ్చు. వాటికి అవసరం అయినముడిసరుకులు వేరేగా వుంటాయి.

ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ ప్రత్యేకంగా యివ్వబడింది.

# జెమ్ క్లిప్స్

అన్ని ప్రభుత్వకార్యాలయాలలోనూ, స్టేషనరీ సంబంధమయిన డిపార్ట్‌మెంట్స్‌లోనూ, ఇంకా కాలేజీ, స్కూలు, బ్యాంక్‌లూ, ఇతర ప్రయివేట్ సంస్థలలోనూ జెమ్‌క్లిప్స్ అవసరం బాగా వుంటుంది. రంధ్రాలుపడే అవకాశంలేదు కాబట్టి గుండుసూదుల కంటే ఇది ఎక్కువ ఉపయోగకారి అని చెప్పవచ్చు. వివిధ వ్యాపార సంస్థలవారు కూడా వీటిని విరివిగా ఉపయోగిస్తుంటారు. ఈ జెమ్స్‌క్లిప్స్‌ను చాలా సులువుగా తక్కువ పెట్టుబడిలో తయారుచేయవచ్చు. మార్కెట్‌లో వీటికి వున్న డిమాండ్ ఎవర్‌గ్రీన్ అని చెప్పవచ్చును. వీటిని హోల్‌సేల్స్‌డీలర్స్‌కి సప్లయ్‌చేయటం ద్వారా అధికలాభాలను సంపాదించవచ్చును. మార్కెట్‌లో రిటైల్ షాపులవారికి డైరెక్ట్‌గా అమ్మవచ్చు.

**'రా' మెటీరియల్స్ (ముడిసరుకులు):-** 1. పాలిషింగ్ మెటీరియల్స్ 2. అట్టపెట్టెలు 3. H.B. వైర్ 20లేక 22 యస్.బి.డబ్ల్యూ.

**ఫార్ములా:-** మేకింగ్ టెక్నిక్ + అనుభవం.

**యంత్ర పరికరాలు:-** 1. పవర్‌కనెక్షన్స్ 2. ఆఫీస్ ఫర్నిచర్ 3. 0.25 మోటార్‌తో ఆటోమేటిక్ జెమ్‌క్లిప్స్ మేకింగ్ మెషీన్ 4. మెషిన్‌బిగించే స్టాండ 5. 0.5 H.P. మోటార్ గల పాలిషింగ్ బారెల్.

**తయారుచేయు విధానము:-** H.B.వైర్‌ను తగిన గేజ్‌లో తీసుకుని క్లిప్స్ మేకింగ్ యంత్రంలో ఫీట్ చేయటం ద్వారా చిన్న పెద్ద జెమ్‌క్లిప్స్ తయారుచేయవచ్చును. ఉత్పత్తి టార్గెట్ (ఆ రోజుకి ) పూర్తి ఆయన తరువాత క్లిప్స్ అన్నిటినీ పాలిషింగ్ బారెల్‌లో వేసిన మోటార్ ఆపరేషన్‌తో పాలిష్‌చేయాలి. ఆ తరువాత జెమ్‌క్లిప్స్‌ని తూనిక లెక్కనగానీ, వంద, రెండువందలు లెక్కనగాని అట్టపెట్టెలలో వేసి పేక్ చేయాలి. అట్టపెట్టెలపై మీ కంపెనీ లేబుల్స్ అంటించి మార్కెట్ చేయాలి.

గమనిక: ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ వివరాలు ప్రత్యేకంగా ఇవ్వబడ్డాయి.

# రబ్బర్ బ్యాండ్స్

*ఫీల్డ్ లాటెక్స్‌ను ఉపయోగించి తయారుచేసే ఈ రబ్బర్‌బ్యాండ్స్‌కి మార్కెట్‌లో విపరీతమైన గిరాకీ వుందనే చెప్పాలి. వీటి ఉపయోగం అటువంటిది మరి. అట్టపెట్టెలు పేక్‌చేయటానికీ, బాల్‌పాయింట్ రీఫిల్స్‌నీ కట్టగా కట్టివుంచటానికి, ఇంకా కాగితాలను మడతపెట్టి చెదిరిపోకుండా వుంచడానికి, మరియూ ఆడవారి శిరోజాలంకరణకు ఇలా రకరకాలుగా ఈ రబ్బర్ బ్యాండ్స్ ఉపయోగపడతాయి. వీటిని తయారుచేయటం సులువు. ధరకూడా తక్కువే కాబట్టి ఈ ఉత్పత్తులు మార్కెట్‌లో విరివిగా అమ్ముడుపోయే అవకాశం వుంది. వీటికి ఒక సీజన్ అంటూ ఏమీలేదు. అన్నిసీజన్స్‌లోనూ వీటికి వున్న గిరాకీ ఏమాత్రం తగ్గదు. గిరాకీవున్న ఉత్పత్తులు లాభాలను తప్పకుండా అందిస్తాయిమరి.*

**'రా'మెటీరియల్స్ (ముడిసరుకులు):-** 1. జింక్‌ఆక్సయిడ్ 2. స్టెబలైజర్ 3. పెగ్మెంట్ 4. ఫీల్డ్ లాటెక్స్ మొ॥

**ఫార్ములా:-** మేకింగ్ టెక్నిక్ + అనుభవం.

**యంత్రపరికరములు:-**1. బాల్‌మిల్ 2. ఎలక్ట్రిఫికేషన్ (3 H.P. లోడ్‌తో ) 3. కటింగ్‌మెషీన్ 4. వివిధ సైజులలో వుడెన్ మౌల్డ్స్. 5. M.S. టాంక్ 6. వర్కింగ్ టేబుల్ 7. హాండ్ టూల్స్ 8. అట్టపెట్టెలు 9. పాలిథిన్ బేగ్స్

***తయారుచేయు విధానము:-*** జింక్ ఆక్సయిడ్, పెగ్మెంట్ కలర్. స్టెబిలైజర్ సహాయంతో డిపింగ్ ప్రాసీజర్‌లో లాటిక్స్ తయారుచేసుకోవాలి. లేదా ముడి లాటెక్స్‌ను మార్కెట్‌లో కొనుక్కోవాలి. బాల్‌మిల్‌లో లాటిక్స్ మిశ్రమాన్ని కలుపుతూ వివిధ సైజులలో వున్న చెక్కమౌల్ట్స్‌ని డిప్పింగ్, ఆ తరువాత వల్కనైజింగ్ చేసి ఆరబెట్టాలి. బాగా ఆరిన తరువాత రబ్బర్ ట్యూబుల్ తయారవుతాయి. వాటిని మౌల్ట్స్ నుండి వేరుచేసి, తగిన పరిమాణాలలో రబ్బర్ బ్యాండ్స్‌గా కటింగ్ మెషీన్ సహాయంతో కట్ చేసుకోవాలి. ఆవిధంగా కట్‌చేసిన వాటిని అట్టపెట్టెలలోనూ చిన్నచిన్న పాలిథిన్ బేగ్‌లలోనూ పేక్ చేసి మార్కెట్‌లోకి విడుదలచేయాలి.

గమనిక: ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ వివరాలు ప్రత్యేకంగా ఇవ్వబడ్డాయి.

# పేపర్ కవర్స్

*ఇప్పడే కాదు, పేపర్ కవర్స్‌కి మార్కెట్‌లో ఎప్పడూ డిమాండే. మీ ఏరియా పోస్టాఫీస్‌లో ఎన్వలప్స్ స్టాక్ అయిపోయినా ఫరవాలేదు వివిధ సైజులలో మార్కెట్‌లో లభించే పేపర్ కవర్స్‌కి స్టాంప్స్ అంటించి మీరు లెటర్ పోస్ట్‌చేయవచ్చు. ముఖ్యమయిన కాగితాలను పొడిగాటి కవర్లలో పెట్టి, సీల్‌చేసి భద్రంగా దాచుకోవచ్చు. గ్రీటింగ్ కార్డ్‌లకీ, కొరియర్‌సర్వీస్‌లకీ, ఇంకా అఫిషియల్, నాన్ అఫిషియల్ పేపర్స్ పోస్టింగ్‌కీ, బ్యాంక్, వ్యాపార ఉద్యోగసంబంధమయిన ఉత్తర ప్రత్యుత్తరాలకూ ఈ కవర్స్ ఎంతగానో ఉపయోగపడతాయి. ఈ కవర్ల పరిశ్రమ ద్వారా ఎంతమంది ఎన్ని రకాల కవర్లు ఉత్పత్తి చేస్తున్నా మార్కెట్‌లో వీటికి ఉన్న డిమాండ్ అపారమైనదనే చెప్పాలి. అటువంటి డిమాండ్‌గల కవర్ల పరిశ్రమ మీ అంచనాలమేరకు లాభాలను ఖచ్చితంగా ఆర్జించిపెడుతుంది.*

**'రా' మెటీరియల్స్ (ముడిసరుకులు):-** 1. వివిధ రంగులలో కాగితం (ఎక్కువగా ఉపయోగించేది బ్రౌన్ పేపర్) 2. అరబిక్ గమ్ 3. సాధారణమైన గమ్.

**ఫార్ములా:-** మేకింగ్ నాలెడ్జ్ + మెషిన్ ఆపరేటింగ్ మరియు అనుభవం

**యంత్ర పరికరములు:-** 1. ఆటోమేటిక్ 'డై' పంచింగ్ మెషిన్ 2. ఎన్వలప్ ఫోల్డర్ 3. పేస్టింగ్ మెషిన్ 4. వర్కింగ్ టేబుల్ 5. మిసిలేనియస్ ప్లేట్స్ 6. ఇతర ఫర్నిచర్. టూల్స్.

***తయారుచేయు విధానము:-*** అవసరం అయిన కలర్, లేకవైట్ పేపర్‌ను తీసుకుని, ఆటోమేటిక్ డై పంచింగ్ మెషిన్ సహాయంతో షేప్‌లను కట్‌చేయాలి. ఆ తరువాత మూసి వుంచాల్సిన ఎడ్జ్‌లకి పేస్టింగ్ యంత్రంద్వారా సాధారణమయిన గమ్ అప్లయ్‌చేసి, ఫోల్డింగ్ మెషిన్ సహాయంలో ఎడ్జ్‌లకు తగినవిధంగా అతుక్కునేలా చేయాలి. ప్రయివేట్‌గా లభించే సాధారణమయిన కవర్స్‌కి ఇప్పుడు ప్రత్యేకంగా పేస్ట్ అప్లయ్‌చేయటం లేదు. ఒక వేళ అప్లయ్‌చేయాల్సివస్తే ఎన్వలప్స్‌కి మాత్రం అరబిక్ గమ్ అప్లయ్ చేయాలి. ఆ తరువాత వందకవర్లు చొప్పున పేపర్ బ్యాడ్స్ చుట్టి మార్కెట్ చేయాలి. వివిధ సైజులలో కవర్లు తయారుచేయటానికి మిసిలేనియస్ ప్లేట్స్ ఉపయోగించాల్సి వుంటుంది.

మీరు తయారుచేసే కవర్ల నాణ్యత మీరు ఉపయోగించే పేపర్ క్వాలిటీని బట్టి వుంటుంది. క్వాలిటీ పేపర్ ఉపయోగించి తయారుచేసే కవర్స్‌కి మార్కెట్ డిమాండ్ స్థిరంగా వుంటుంది.

గమనిక: ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ వివరాలు ప్రత్యేకంగా ఇవ్వబడ్డాయి.

# కార్పెంట్రీ యూనిట్

అయిరన్ ఫర్నిచర్, ప్లాస్టిక్ మౌల్డెడ్ ఫర్నిచర్ ఇంకా వివిధరకాల ఫర్నిచర్ మార్కెట్‌లో విరివిగా లభిస్తూ కొనేవారిని ఆకట్టుకుంటున్నా వుడెన్ ఫర్నిచర్ మాత్రం ఏ మాత్రం చెక్కుచెదరకుండా తన వునికినీ గిరాకీని నిలబెట్టుకుంటూనే వుంది. రకరకాల వుడ్‌తో ఫర్నిచర్ తయారుచేయటానికి అవసరం అయిందే ఈ కార్పెంట్రీ యూనిట్. భారీఎత్తున ఫర్నిచర్ తయారుచేసి విక్రయించే స్తోమతలేని నిపుణులయిన వడ్రంగి పనివారూ, ఇతరుల వద్ద జీతానికి పనిచేయటం ఇష్టంలేని కార్పెంటర్స్ ఈ యూనిట్స్ స్థాపించటం ద్వారా తగిన ఆదాయాన్ని ఆర్జించవచ్చు. భవనాల నిర్మాణంలో విండోఫ్రేమ్స్, ద్వారాలు, తలుపులు మొదలయిన వాటిని తయారుచేయటానికీ, స్కూల్, కాలేజీలలో బెంచీలూ, డెస్కులు చేయటానికి, హోటల్స్‌కి కుర్చీలూ, టేబుల్స్ మరియూ కొత్తగా ప్రారంభించే వివిధ వ్యాపార సంబంధమయిన షాపులలో కాష్‌కౌంటర్స్, సేల్స్ కౌంటర్స్ చేయటానికే ఈ యూనిట్ తప్పనిసరి. ఈ యూనిట్ స్థాపనకు పెట్టుబడి పెట్టవలసింది ఒక్కసారే. ఆ తరువాత సంవత్సరం పొడుగునా ఆదాయం వుంటూనే వుంటుంది. ప్రయివేట్, గవర్నమెంట్ సంస్థలకి సంబంధించిన కాంట్రాక్ట్‌లు సంపాదించగలిగితే అధిక లాభాలు సంపాదించుకోవచ్చు. యూనిట్ ప్రారంభంలో అమ్మకం కోసం ఆకర్షణీయమయిన చిన్నచిన్న వస్తువులు తయారుచేసి వుంచుకోవటం అవసరం!

**'రా' మెటీరియల్స్ (ముడిసరుకులు):-** 1. వివిధరకాల కలప దుంగలు. 2. కోయబడిన వివిధ రకాల కొయ్య పలకలు, 3. లక్క చెక్క పొడర్ కలిపిన మిశ్రమం (మక్కు) పగుళ్ళ దగ్గర అతికించటానికి, 4. వార్నిష్.

**ఫార్ములా:-** వర్కింగ్‌స్కిల్ + అనుభవం. లేక వృత్తి విద్యలో శిక్షణ

**యంత్రపరికరములు:-** 1. వృత్తాకార రంపం (సర్క్యులర్ సా) 2. బ్యాండ్ సా 3. వర్టికల్ బ్యాండ్ సా 4. ఉడ్‌టర్నింగ్ లేథ్ 5. ఫిక్సర్స్ 6. పవర్‌కనెక్షన్స్ 7. చిత్రిక (ఉపరిభాగాన్ని నునుపు చేయటానికి) 8. డిస్క్ శాండం 9. సాషార్ట్ 10. సెట్టర్ 11. పెడస్టల్ గ్రైండర్ 12. ఎలక్ట్రిక్ డ్రిల్లింగ్ మెషీన్ (పోర్టబుల్) 13. ఇంకాఇతర హేండ్‌టూల్స్.

**నిర్వహణ విధానము:-** పైన ఇవ్వబడిన యంత్ర సామగ్రిలో 200 చ.గజలాల స్థలంలోగానీ, హెర్‌లోగాని కార్పెంట్రీయూనిట్ స్థాపించుకో వచ్చును. కస్టమర్స్‌ని రాబట్టుకునేటంతవరుకూ స్వల్పమయిన పెట్టుబడిలో చిన్నచిన్న ఫర్నిచర్‌ని తయారుచేసుకుంటూ వుండాలి. ఆ తరువాత భవన నిర్మాణాలు, హోటళ్ళు మొదలయిన సంస్థలకు సంబంధించి జాబ్‌వర్క్‌లను తీసుకుని కాంట్రాక్ట్ పద్ధతిమీద పని ప్రారంభించాలి. జాబ్‌వర్క్ ఇచ్చిన వారే ముందుగా కొంత అడ్వాన్స్ ఇస్తారు కాబట్టి ఆడబ్బుతో కలప కొనుక్కోవచ్చు. ఇచ్చిన ఆర్డర్‌ను ఇచ్చిన వారి అంచనాలకు మించి అందమయిన ఆకర్షణీయమయిన పర్నిచర్‌ని అందించాలి. మీ పనితనం అంతా మీరు తయారు చేసే ఫర్నిచర్‌లో చూపించాలి. సకాలంలో చేసి ఇవ్వాలి. కలప ఎక్కువగా వేస్ట్ కాకుండా చూసుకోవాలి. కాంట్రాక్ట్ పద్ధతిలో అది మీకే లాభిస్తుంది. ఒకటి రెండు కాంట్రాక్టులు శ్రద్ధగా, నీట్‌గా చేస్తే చాలు. మీరు బిజీ కార్పెంటర్స్ అయిపోతారు. ఆరునెలలు తిరగకుండానే యూనిట్‌మీద మీరు పెట్టిన పెట్టుబడి మొత్తం రికవర్ అయి యూనిట్ మిగిలిపోతుంది. అక్కడ నుండి మీరు ఎన్ని కాంట్రాక్ట్‌లు చేసినా లేబర్ చార్జ్‌లు మినహాయించి మిగిలిందంతా మీకు లాభమే. ఫారెస్ట్ డిపార్ట్‌మెంట్‌తో కనెక్షన్స్ కలప కొనుగోలు విషయంలో మీరు మరింత లాభాన్ని పొందే అవకాశం ఉంది.



# టూత్ పౌడర్

టూత్‌పేస్ట్ ఖరీదు ఎక్కువ. దాని వాడకం ఎక్కువరోజులు రాదు. త్వరగా అయిపోతుంది. పైగా పొరపాటున గట్టిగా అదిమి ఎక్కువ పేస్ట్ బయటికి రావటం అంటూ జరిగితే పేస్ట్ వేస్ట్ అవుతుందే తప్ప తిరిగి ట్యూబులోనికి ఎక్కించటానికి కుదరదు. పై కారణాలను గురించి ఆలోచిస్తూ పొదుపును పాటించేవారికి, టూత్‌పేస్ట్‌ను కొనుక్కునే ఆర్థికస్తోమతలేని అందరికీ శ్రేష్ఠమైన టూత్‌పౌడర్ వరప్రసాదం లాంటిది. నిజానికి టూత్‌పేస్ట్‌లూ, టూత్‌పౌడర్‌లూ ఒకే విధమయిన లక్షణాలను కలిగివున్నా టూత్ పౌడర్‌లే తక్కువ ధరకు లభిస్తాయి. టూత్‌పౌడర్‌ని వాడేవాళ్ళు బ్రష్‌తోనూ, అదిలేకపోతే వ్రేలితోనూ పళ్ళుతోముకునే అవకాశం వుంది. అంతేకాదు డబ్బాలలోగానీ, పేపర్‌బేగ్స్‌లోగాని లభించే టూత్‌పౌడర్‌ని ఎంతకావాలంటే అంతే చేతితో వంపుకోవచ్చు. పొరపాటున ఎక్కువ పడితే తిరిగి డబ్బాలో, లేక పేపర్ బేగ్‌లో వేసెయొచ్చు. ఇన్ని చక్కటి ఉపయోగాలూ, అవకాశాలూ, వున్నాయి. కాబట్టి మార్కెట్‌లోకి విచ్చలవిడిగా విడుదలవుతున్న టూత్‌పేస్ట్‌ల ధాటికి తట్టుకుంటూ టూత్‌పౌడర్ తమగిరాకీని పెంచుకుంటున్నాయి. అందుకే సామాన్యులకు సయితం అందుబాటులో వుండే ఈ టూత్‌పౌడర్ తయారీ ఇప్పటికే లాభసాటి పరిశ్రమగానే వర్ధిల్లుతోంది.

**'రా' మెటీరియల్ (ముడిసరుకులు):-** 1. నిమ్మనూనె 2. లవంగనూనె 3. పిప్పర్‌మెంట్ ఆయిల్ 4. మెంథాల్ క్రిస్టల్స్ 5. మైదా 6. చాక్ పౌడర్ 7. కలర్.

**ఫార్ములా:-** 1. నిమ్మనూనె 20 గ్రాములు 2. లవంగనూనె 20 గ్రా॥ 3. పిప్పర్‌మెంట్ ఆయిల్ 15 గ్రా॥ 4. మైదా 60 గ్రా॥ 5. చాక్‌పౌడర్ 205 గ్రా॥ 6. మెంథాల్ క్రిస్టల్ 18గ్రా॥

**యంత్రపరికరములు:-** 1.మోటార్ మిక్సర్ 2. ఎనామిల్డ్ పాత్రలు. 3. పౌడర్ ఫిల్టర్స్ 4. లిక్విడ్ ఫిల్టర్ 5. టిన్స్ ఫిల్లింగ్ మెషిన్, మరియు సీలింగ్ మెషిన్ 6. టిన్స్, మరియు పేపర్ లేక పాలిథిన్ పేపర్ బేగ్స్ 7. ఇతర పరికరాలు.

**తయారు చేయు విధానము:-** ముందుగా ఆయిల్స్ అన్నిటినీ లిక్విడ్ ఫిల్టర్స్ ఉపయోగించి వడకట్టి అందులో నలకలు, మలినం వంటివి లేకుండా చూడాలి.

ఆ తరువాత ఆయిల్స్ మూడింటిని ఒకపాత్రలో వేసి మిశ్రమం చేసి వుంచుకోవాలి. మెంథాల్‌క్రిస్టల్‌ని మిక్సర్‌లో వేసి బాగా మెత్తగా పొడిచేయాలి. ఆ తరువాత ఆయిల్ మిశ్రమం వున్న పాత్రలో వేసి బాగా కలపాలి. ఆ మొత్తం మిశ్రమాన్ని చాక్ పౌడర్‌తోనూ, మైదాలోనూ చేర్చి కొద్దిగా రంగు కలిపి మరోసారి మిక్సర్‌లో వేసి సమానంగా కలిసేలా చూడటం మంచిది. అలా సమానంగా కలిపిన టూత్ పౌడర్‌ని పౌడర్ ఫిల్టర్స్ ద్వారా జల్లించి. యంత్రసహాయంతో వివిధ సైజుల డబ్బాలలోనూ, పేపర్, మరియూ పాలిథిన్ పేపర్ బేగ్‌లనూ తూనికల ప్రకారం నింపి మార్కెట్ చేయాలి.

మీరు తయారుచేసి అందించే టూత్ పౌడర్ నాణ్యతే మీ పరిశ్రమ అభివృద్ధికి దోహదకారి అవుతుంది.

గమనిక: ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ వివరాలు ప్రత్యేకంగా యివ్వబడ్డాయి.

# న్యూడిటర్జెంట్ పేస్ట్

*వినియోగదారులను ఆకట్టుకునే ప్రయత్నంలో వారి అవసరాలకు అనుగుణంగా ఎప్పటికప్పుడు కొత్త తరహా ప్రొడక్టులను ఉత్పత్తిచేసేందుకు పెద్ద పెద్ద కంపెనీలు ఎప్పుడూ పోటీ పడుతూనే వుంటాయి. వాషింగ్ ప్రొడక్టుకి సంబంధించినంత వరకూ డిటర్జెంట్ సోప్, డిటర్జెంట్ పౌడర్, లిక్విడ్ డిటర్జెంట్‌లు ఇప్పటివరకూ మార్కెట్‌లో విరివిగా లభ్యమవుతున్నాయి. ఇప్పుడు వాటి స్థానంలో లేటెస్ట్ డిటర్జెంట్ పేస్ట్ మార్కెట్‌రంగ ప్రవేశం చేసింది. సోప్, పౌడర్, లిక్విడ్, పేస్ట్ మొదలయిన వన్నీ తయారుచేయటానికి అవలంభించే విధానాలన్నీ యించుమించు ఒక్కటే. ముడిసరుకుల విషయంలో కూడా పెద్ద తేడావుండదు. కాకపోతే కొత్తదనం ఆశిస్తూ, ఆదరించే వినియోగదారులను త్వరితగతిని ఆకట్టుకుంటూ మార్కెట్ డిమాండ్‌ను పెంపొందించుకుంటోంది. డిమాండ్‌గల ఏ ప్రొడక్ట్ అయినా లాభాలను తెచ్చి పెడుతుంది కాబట్టి డిటర్జెంట్ పేస్ట్ తయారీని గురించి తప్పకుండా తెలుసుకోవాల్సిందే.*

**'రా' మెటీరియల్స్ (ముడిసరుకులు):-** 1. సోడియం సల్ఫేట్ 2. రోజిన్ 3. కోకోనట్ ఆయిల్ 4. వేపనూనె 5. కాస్టిక్ సోడా 6. ఆముదం 7. కాస్టిక్ పొటాష్ 8. సోడియం లారల్ సల్ఫేట్ 9. ఫోమ్ బూస్టర్ 10. సోడియం సిలికేట్ 11. స్వచ్ఛమయిన వాటర్ 12. ఆప్టికల్ వైట్నర్

**(శాంపిల్) ఫార్ములా:-** 1. సోడియం సల్ఫేట్ - 60 గ్రా॥ 2. రోజన్ - 30 గ్రాం॥ వె. కొబ్బరి నూనె -100 గ్రా॥7. కాస్టిక్ పొటాష్ 45 గ్రా॥ 8. సోడియ లారిల్ సల్ఫేట్ - 15 గ్రాములు 9. ఫోమ్ బూస్టర్ 15 గ్రా॥ 10. సోడియం సిలికేట్ -60 గ్రా॥ 11. నీరు - 100 మి.లీటర్సు 12. ఆప్టికల్ వైట్నర్ 3 గ్రా॥

**యంత్రపరికరములు:-**1. బట్టీ 2. అయిరన్ కళాయి 3. కొయ్యగరిటెలు 4. మెటల్‌డ్రమ్స్ 5. గ్రైండింగ్ మెషిన్ 6. మిక్సర్ 7. ఫిల్లింగ్ మెషీన్ 8. సీలింగ్ మెషిన్ 9. లిక్విడ్ మరియు పౌడర్ ఫిల్టర్స్ 10. పేకింగ్ మెటీరియల్స్.

***తయారుచేయు విధానము :-*** బట్టీని వెలిగించి లోతయిన కళాయిని దానిమీద వుంచి, ఆయిల్స్ రోజన్ కలిపి కళాయిలో వేసి 75 డిగ్రీల సెంటీగ్రేడ్ హీట్‌లో వేడిచేసి

కరిగిస్తూ మిశ్రమం చేయాలి. ముందుగానే సోడియం సిలికేట్‌ను ఒక పాత్రలో సిద్ధంగా వుంచుకోవాలి. సోడియం పాస్ఫేట్, ఫోమ్ బూస్టర్, మొదలయిన వాటిని మిశ్రమంచేసి సిద్ధంగా వుంచుకోవాలి. కాస్టిక్ సోడాను కూడా తగినంత నీటిలో కలిపి సిద్ధంచేయాలి. అన్నీ సిద్ధమయిన తరువాత మిగతామిశ్రమాలన్నిటినీ, కళాయిలో మరిగించిన ఆయిల్స్ రోజన్ మిశ్రమంలో ఒక్కటొక్కటి వేస్తూ కొయ్య గరిటెతో కలుపుతూ మిక్స్ చేయాలి. ఆ తరువాత సోప్ మిశ్రమాన్ని 80 డిగ్రీల సెంటిగ్రేడ్ వద్ద మరిగించి, అదిబాగా మెత్తబడిన తరువాత సోడియం సిలికేట్ మిశ్రమాన్ని కొద్దికొద్దిగా వేస్తూ మొత్తం మిశ్రమాన్ని సోప్ మిశ్రమంతో కలపాలి. అప్పుడు రెండు మిశ్రమాలు ఏకమై ద్రవంగా మారుతుంది. అప్పుడు సోడియం పాస్ఫేట్ ఫోమ్ బూస్టర్, కలిసిన మిశ్రమాన్ని మొత్తం ఆ మిశ్రమంలో చేర్చి హీట్‌ను తగ్గించి రంగును కలపాలి. అన్ని బాగా కలిపిన తరువాత మొత్తం మిశ్రమాన్ని చల్లారనివ్వాలి. బాగా చల్లారిన తరువాత- ఆకర్షణీయమైన డిజైన్స్‌లో ప్రింట్ చేయబడిన కార్డ్‌బోర్డ్ బౌల్స్‌లో నింపి, ప్యాకింగ్ చేసి మార్కెట్ చేయాలి.

కొత్త ప్రొడక్ట్సు డిమాండ్‌కి నాణ్యతే ముఖ్యకారణం అవుతుంది.



# రబ్బర్ వాషర్స్

*వివిధ రకాల బిగింపులకూ, సీలింగ్స్ చేయటానికి జాయింట్ కనెక్ట్ చేయటానికి రబ్బర్‌వాషర్స్ విరివిగా ఉపయోగించబడతాయి. లీకేజీలను అరికట్టేందుకు వీటిని ఆటోమొబైల్ అసెంబ్లింగ్స్‌లోనూ, పైప్‌లైన్లలోనూ ఇంకా ప్లాస్టిక్, మెటల్, చెక్కమూతలు బిగించటంలోనూ ఈ రబ్బర్‌వాషర్స్ ఉపయోగించటం తప్పనిసరి. రైల్వే సంబంధమయిన పనులలో కూడా ఈ రబ్బర్‌వాషర్స్ భారీ ఎత్తున ఉపయోగించబడతాయి. ఎలక్ట్రిక్ ఫిటింగ్స్‌లోనూ వీటి అవసరం చాలా వుంది. ఆటోమొబైల్ సర్వీస్ యూనిట్స్‌లో ప్రతిరోజూ వీటి వాడకం వుంటూనే వుంటుంది. ఇన్ని విధాల ఉపయోగపడే ఈ రబ్బర్ వాషర్స్ అమ్మకాలు ప్రతిరోజూ విపరీతంగా వుంటాయి. ఇవి లేనిదే బిగింపులూ, కనెక్షన్స్ కొనసాగవు. అందువల్ల మార్కెట్‌లో వీటికి వున్న అపారమయిన డిమాండ్‌నుబట్టి, వీటిఉత్పత్తికి సంబంధించిన పరిశ్రమ లాభాలు ఆర్జించటంలో కల్పతరువే!*

**'రా' మెటీరియల్స్ (ముడిసరుకులు):-** 1. రబ్బర్ కాంపౌండ్

**ఫార్ములా:-** ఆటోమొబైల్స్‌లో శిక్షణ + అనుభవం.

**యంత్రపరికరములు:-** 1. రకరకాల సైజులలో డైస్ 2. వర్కింగ్ టేబుల్ 3. ఎలక్ట్రిఫికేషన్ 4. ఎలక్ట్రికల్ హీటింగ్ ఆరేంజ్‌మెంట్స్‌తో ప్లైప్రెస్ 5. స్క్రాప్ గ్రైండర్ (చేత్తోపనిచేసేది) 6. హేండ్ టూల్స్.

**తయారుచేయు విధానము:-** ఉత్పత్తిచేయదలుచుకున్న వాషర్స్ సైజుకి డైస్ రెడీచేసుకోవాలి. ఈ డైస్‌ని కరెంట్ ఉపయోగించటం ద్వారా గానీ, నీటి ఆవిరి ఉపయోగించటం ద్వారా గానీ హీట్‌చేయాలి. ఆ తరువాత రబ్బర్ కాంపౌండ్‌ను కావలసిన సైజులలో కట్‌చేసి, వేడిచేయబడిన అచ్చులలో పెట్టి ప్లైప్రెస్‌తో ప్రెస్‌చేసి వాషర్స్ తయారుచేయాలి. ఆ తరువాత వాటిని స్క్రాప్ గ్రైండర్‌తో ఫినిషింగ్ ఇచ్చి శుభ్రంచేసి సైజులు వారీగా అట్టపెట్టెలలో వుంచి అమ్మకానికి సిద్ధంచేయాలి. వీటి తయారీలో నాణ్యత పాటించటం ప్రధానం. ఆ నాణ్యతే మీ పరిశ్రమ తాలుకు బ్రాండ్ వాషర్స్‌కి మార్కెట్‌లో మంచి గిరాకీని, తద్వారా మీకు మంచి లాభాలను తెచ్చిపెడుతుంది.

(రబ్బర్ వాషర్స్ ఫినిషింగ్‌ని స్క్రాప్ గ్రైండర్‌లో కాకుండా చేతిపనిముట్లు ఉపయోగించి కూడా చేయవచ్చును).

# సోలార్ వాటర్ హీటర్స్

వర్షాకాలం, శీతాకాలాలలో నూటికి తొంభై తొమ్మిది మంది వేడినీటితో స్నానం చేయటాన్నే ఇష్టపడతారు. ఎముకలు కొరికే చలిలో చన్నీటి స్నానం అంటే ప్రాణాలు ఎగిరిపోయినంతగా ఫీలవుతారు. అది దృష్టిలో వుంచుకొనే కొన్నికంపెనీలవారు ఎలక్ట్రిక్ హీటర్స్‌ని మార్కెట్‌లో ప్రవేశపెట్టి సక్సెస్ అయ్యారు. అయితే కరెంట్‌కోత ఇబ్బంది పెడుతున్న రోజులు ఇవి. అంతేకాకుండా ఎలక్ట్రిక్ వాటర్ హీటర్స్ ధర ఎక్కువై సామాన్యులకు అందుబాటులో లేకుండా పోయాయి. గ్యాస్ స్టవ్‌లమీద నీటిని వేడి చేయటం ఖర్చుతో కూడుకున్న పనికావటంతో గృహసంబంధమయిన వేడినీటి అవసరాలను తీర్చగల సోలార్ వాటర్ హీటర్స్‌ని ఉపయోగించటం ఎంతయినా అవసరం. ఈ సోలార్ వాటర్ హీటర్స్ ఉత్పత్తులను ప్రభుత్వ ప్రత్యేకమయిన శ్రద్ధతో ప్రోత్సాహాన్ని అందించటం గమనించ దగ్గ విషయం. వీటి తయారీ అమితమయిన జనాదరణ పొందుతుందనటంలో ఎలాంటి సందేహాలకూ తావు లేదు.

**'రా' మెటీరియల్స్ (ముడిసరుకులు):-** 1. ఉడెన్‌ప్లాంక్స్ 2. PVC పైప్స్ 3. హార్డ్‌వేర్ పరికరాలు 4. I.G. షీట్స్ 5.స్లాటెడ్ యాంగిల్స్ 6. M.S.పైప్స్ 7. ఇన్సులేటింగ్ మెటీరియల్ 8. వైర్స్.

**ఫార్ములా:-** శిక్షణ + శ్రద్ధ.

**యంత్రపరికరములు:-** 1. అవసరం అయిన ఫిక్చర్స్ 2. హెండ్‌టూల్స్ 3. ఫిక్సింగ్ పరికరాలు.

**తయారుచేయు విధానము:-** చేయదలచుకున్న చెక్కనుగానీ, మెటల్ షీట్స్‌గానీ తీసుకుని నిర్దేశిత మెజర్‌మెంట్స్‌లో కావాల్సిన సైజ్‌కు కట్‌చేసి బాక్స్‌ను తయారుచేసుకోవాలి. గ్లాస్ పాన్స్‌లో కప్పబడిన అబ్జర్బర్ ప్లేట్‌ను జతచేసి ఇన్సులేషన్ వేయాలి. ఇన్సులేషన్స్‌లో స్టోరేజి టాంక్‌ను తయారుచేసి, రాకపోకలకు కనెక్షన్స్ ఇవ్వాలి. ఆ తరువాత వాటర్ సదుపాయానికి ప్యానెల్. హీట్‌వాటర్ ఇచ్చే ట్యాప్. మరియు హీటర్ మొదలయిన వాటికి తగిన విధంగా అనుసంధానం చేయటంతో సోలార్ వాటర్ హీటర్ రెడీ అవుతుంది.

తగిన ప్రచారంతో వీటిని యూనిట్స్‌గా రూపొందించి మార్కెట్‌చేయగలిగితే మంచి లాభాలు వుంటాయి.

ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ ప్రత్యేకంగా యివ్వబడింది.

# పుట్టగొడుగులు

మాంసాహారాన్ని మరిపించే పుట్టగొడుగులకు ప్రస్థుతం మార్కెట్‌లో విపరీతమైన గిరాకీ వుంది. ఇది పుష్టికరమయిన ఆహారంగా గుర్తింపబడినప్పటినుండీ, విందుభోజనాలలో పుట్టగొడుగుల కర్రీ చేసివడ్డించటం చాలామంది గొప్పగా ఫీలవుతున్నారు. చిన్న తరహా పరిశ్రమలను, కుటీరపరిశ్రమలను ప్రోత్సహించే ప్రభుత్వ సంస్థలు కూడా ఈ పుట్టగొడుగుల పెంపకానికి అధికప్రాధాన్యతను ఇస్తూ ప్రోత్సహిస్తున్నాయి. ఇది చక్కటి శాఖాహారమే అయినా మాంసాహారాన్ని తిన్నంత అనుభూతికలగచేస్తుది. రుచికి రుచీ, ఆరోగ్యానికి ఆరోగ్యం ఈ పుట్టుగొడుగుల ప్రత్యేకత. కొద్దిపాటి శిక్షణతో ఈ పుట్టగొడుగులను సులువుగా పెంచవచ్చును. వీటి పెంపకానికి ఉపయోగించే ముడిసరుకులు కూడా మార్కెట్‌లో ఈజీగానే లభిస్తాయి. మార్కెట్‌లో గిరాకీ వున్న ఈ పుట్టగొడుగుల పెంపకం నిజంగా లాభాలను ఆర్జించి పెట్టే పరిశ్రమం.

**'రా' మెటీరియల్ (ముడిసరుకులు)** 1. కాటన్ సీడ్‌మీల్ 2. జిప్సం 3. రైస్ బ్రాన్ (వరిపొట్టు)

**ఫార్ములా:- (శాంపిల్)** సరైన నిష్పత్తిని గురించి ఇండియన్ సాండర్డ్ ఇనిస్టిట్యూషన్ వారిని సంప్రదించి తెలుసుకోవాలి. అప్పుడే మేలు రకం పుట్టగొడుగుల పెంపకం వీలవుతుంది.

**యంత్రపరికరములు:-** 1. ఎయిర్‌కండిషనర్స్ 2. డీప్ ఫ్రీజర్ 3. ఎగ్జాక్ట్ ఫ్యాన్స్ 4. 10 KVA జనరేటం 5. తూనికయంత్రం 6. నాన్ I.O.B. బ్రాయిలర్ 7. ఒకదాని పై ఒకటి పేర్చుకునే ట్రేలు 8. ప్యాకింగ్ మెటీరియల్స్ 9. పవర్‌కనెక్షన్స్

***పెంపకం విధానము:-*** ముందుగా పైన ఇవ్వబడిన ముడిపదార్థాలను ప్రమాణిక నిష్పత్తిలో తీసుకుని సమానంగా కలిసేలాచేసి, ఓపెన్ ప్లాట్‌ఫారం మీద వుంచాలి. ఇలా సుమారుగా 13, లేక 14 రోజులువుంచాలి. ఆ తరువాత దానిని ప్రత్యేకంగా తయారుచేయబడిన వుడెన్ ట్రేలలో ఒక పద్ధతి ప్రకారం నింపి, ఆ ట్రేలను ఒకదానిపై ఒకటి పేర్చి, కంపాస్ట్‌లో పెట్టి స్టీమ్ విడుదలచేయాలి. ఆ స్టీమ్‌లో ఉష్ణోగ్రత 45. లేక

50 డిగ్రీల సెల్సియస్‌గా వుండేలా చేయాలి. నాలుగు రోజులపాటు పాశ్చరైజ్‌చేసి కంపోస్ట్‌ను పంటగదిలోకి పంపాలి. ఆ గదిలో ఉష్ణోగ్రత 16లేక 18 డిగ్రీల సెల్సియస్ గానూ, గాలిలో తేమ 85, లేక 90 శాతం వుండేలా ఏర్పాట్లు చేయాలి. ఇందుకు ఎయిర్‌కండిషనర్స్‌ని ఉపయోగించాలి. ఏడు, ఎనిమిది రోజుల పిదమ పుట్టగొడుగులు అవసరం అయిన సైజులో ఎదుగుతాయి. వాటిని తీసి శుభ్రంచేసి, తూకం ప్రకారం పాలిథిన్ బేగ్‌లలోనూ, టిన్స్‌లోనూ పేకింగ్ చేసి మార్కెట్‌లో విడుదలచేయాలి.

ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ వివరాలు ప్రత్యేకంగా యివ్వబడ్డాయి.

# చాక్‌లెట్ కేక్

*పెరుగుతున్న నాగరికతతో పాటే కేక్‌ల వాడకం ప్రాధాన్యతను సంతరించుకుంటున్నది. పుట్టిన రోజు, యూనివర్సరీ, వెడ్డింగ్‌డే, సందర్భం ఏదయినా అందమయిన కేక్‌లను కట్ చేయటం ద్వారా సంతోషాన్ని పంచుకోవటం నేడు ఫ్యాషన్ అయిపోయింది. క్రిస్టమస్ వేడుకలలో ఈ కేక్ ప్రాధాన్యత ప్రత్యేకమయినది. మార్కెట్‌లో ఎల్లప్పుడూ డిమాండ్‌వుండే ఈ కేక్‌లు తయారు చేసి అమ్మటం ద్వారా అధిక లాభాలు ఆర్జించవచ్చు.*

**'రా' మెటీరియల్స్ (ముడిసరుకులు) :-** 1. గోధుమ పిండి, 2. చాక్‌లెట్ పౌడర్ /కోకో 3. కొబ్బరి 4. వెన్న 5. పంచదార 6. ఉప్పు 7. వనస్పతి 8. బేకింగ్ పౌడర్ 9. గుడ్లసొన 10. స్వచ్ఛమైన నీరు 11. పాలపొడి 12. మిల్క్‌క్రీమ్

**ఫార్ములా :-** గోధుమ పిండి 250 గ్రాములు., చాక్‌లెట్ పౌడర్ 50గ్రాములు. కొబ్బరి 50 గ్రాములు., వెన్న 25 గ్రాములు, పంచదార 250 గ్రాములు. ఉప్పు 7 గ్రాములు, వనస్పతి (నెయ్యి) 100 గ్రాములు, బేకింగ్ పౌడర్ 15, గుడ్లజన 25 గ్రాములు, పాలపొడి 25 గ్రాములు, స్వచ్ఛమయిన నీరు తగినంత, మిల్క్‌క్రీమ్‌కేక్‌పై డిజైన్ వేయటానికి అవసరమయినంత.

**యంత్రపరికరములు:-** 1. ఓవెన్ 2. తూనిక యంత్రం 3. పింగాణి పాత్రలు 4. చెక్కగరెటెలు

**తయారుచేయువిధానము :-** గుడ్లు కొట్టి జనను తీసి బాగా గిల కొట్టాలి. కొద్దిగా నీళ్ళు తీసుకుని గుడ్లజనను బేకింగ్ పౌడర్ లో కలిపి మిశ్రమం చేయాలి. గోధుమపిండి, పాలపొడి, కోకో పొడిని బాగా జల్లించి, వాటితో పాటు పంచదార నెయ్యి, ఉప్పు తగినన్ని నీళ్ళలో బాగా కలిపి మెత్తటి ముద్దగా చేయాలి. ఆ ముద్దను గుడ్లసొన, బేకింగ్ పౌడర్ మిశ్రమంలో కలిపి బాగా పిసికి ముద్ద చేసి, మీరుకోరుకున్న ఆకారంలోని 'డైస్' లో వేసుకుని 200 నుండి 250 డిగ్రీల సెంటిగ్రేడ్ ఉష్ణోగతతో బేకింగ్‌చేయాలి. తరువాత కేక్ పైన చాకొలెట్ పేస్ట్ రాసి, మిల్క్‌క్రీమ్ తో ఆ అందమయిన కేక్‌ను నలగిపోకుండా ఆకర్షణీయమయిన అట్ట పెట్టెలలో పేకింగ్ చేయండి. ఆర్డర్‌ల మీద వివిధ రకాల కేక్‌లు చేసి లాభాలను పొందండి.

కేక్ తయారీకి అవసరం అయిన ముడిసరుకులు ఒవెన్ వంటి యంత్రసామగ్రి మీకు స్థానికంగా లభిస్తాయి.

# మేంగోపికిల్ (మామిడి ఊరగాయ)

ఊరగాయ పచ్చళ్లను గురించి, ఆవకాయ పచ్చడిని గురించి తెలియని తెలుగువారుండరు. పప్పులో ఆవకాయ కలుపుకుని, నెయ్యి వేసుకుని తింటే ఎంతరుచిగా ఉంటుందోనని ఆ రుచి వూహించుకుంటూ లొట్టలు వేసే వారు చాలామంది వుంటారు. ఒకప్పుడు యిళ్లలో సొంతానికి మాత్రమే తయారుచేసుకోటానికి పరిమితమయిన ఈ పికిల్స్ ఇప్పుడు వ్యాపార రంగంలోకి ప్రవేశించి తనదయిన ప్రత్యేకతలో మార్కెట్‌లో గిరాకీ పెంచుకొంటూపోతోంది. సీజన్ టు సీజన్ నిలువ వుండే ఈ ఊరగాయ, ఆవకాయ పచ్చడి ఇప్పుడు లాభసాటి వ్యాపారంగా మారింది.

**'రా' మెటీరియల్ (ముడిసరుకులు)** :- 1. ఆవపిండి 2. కారం 3. మెంతులు 4. పప్పునూనె 5. పసుపు పొడి 6. మామిడికాయముక్కలు 7. ఉప్పు 8. పోపుగింజలు 9. వెల్లుల్లి.

**ఫార్ములా** :- ఆవపిండి 3 KGs, పప్పునూనె 3 లేక 4 KG., మెంతులు 2 కిలోలు. కారం 3 కిలోలు. (కారం ఎక్కువ తినేవారు అదనంగా కావాల్సినంత చేర్చుకోవచ్చు) పసుపు 1 1/2 కిలోలు, ఉప్పు 2 కిలోలు (దంచినది), పోపుగింజలు 2 కిలోలు, మామిడి కాయముక్కలు 10 కిలోలు.

**తయారు చేయు విధానము** :- పచ్చిమామిడి కాయలను పై తోలు పూర్తిగా చెక్కివేసి ముక్కలు కోయాలి (సన్నగా) టెంకను తొలగించాలి; ఆ ముక్కలను ఉప్పువేసి బాగా కలపాలి. ఆ ముక్కలను 3 లేక నాలుగు రోజులు ఎండలో వుంచండి. ముక్కలు ఎండి పసుపురంగుకు వస్తాయి. అప్పుడు ఆముక్కలను పైన యివ్వబడిన పొడులలో కలిపి బాగా పిసకండి. పప్పునూనెను కాచి వేడివేడి నూనెను ఆ పిసికిన ముక్కలలో కలిపి బాగా కలియబెట్టాలి. ఆ తరువాత అందమయిన గాజు సీసాలు (పావు, అర, ఒక కేజీ సీసాలు) తీసుకొని అందులో ఊరగాయను వేసి పేక్ చేయండి. సీసాల మీద అందమయిన డిజైన్స్‌లో ప్రింట్ చేయబడిన లేబల్స్ అంటించండి.

**గమనిక**:- ఈ పచ్చళ్ళకు సంబంధించిన ఖచ్చితమయిన పాళ్ళు చాలామంది ఆడవారికి బాగా తెలిసి వుంటుంది. పచ్చళ్ళు రుచిగావుండేటట్లు చేయటంలో వాళ్ళే సిద్ధహస్తులు.

# చికెన్ ఆవకాయ

*రుచిలో మామిడి ఆవకాయతో పోటీ పడేదే ఈ చికెన్ ఆవకాయ. ఎక్కువ కాలం నిలువ వుండే ఈ చికిన్ ఆవకాయ అంటే మాంసాహార భోజన ప్రియులు అమితంగా యిష్టపడతారు. యిది యింట్లో రెడీగా వుంటే భోజనవేళల్లో ఆలస్యం అయ్యే అవకాశం వుండదు. యింట్లోకూరలు వండే వ్యవధి లేనప్పుడూ, అర్జంట్ సమయాలలోనూ, ఈ చికెన్, ఆవకాయ కోడిమాంసంకూరలా ఉపయోగపడుతుంది.*

**'రా' మెటీరియల్స్ (ముడిసరుకులు)** :-1. కోడిమాంసం.2. ఉప్పు 3. మెంతులు 4. ఆవపిండి 5. పసుపుపొడి 6. కారం. 7. పప్పునూనె. 8. వెల్లుల్లి. 9. సోడియంబెంజూట్.

**ఫార్ములా:-** కోడిమాంసం, 5 K.G ఉప్పు, 1 K.G మెంతులు 250 గ్రాములు, ఆవపిండి 200 గ్రాములు., పసుపు 100 గ్రాములు, కారం 400 గ్రాములు (ఎక్కువకారం తినే వాళ్ళు అవసరం అనుకున్నంత కారం చేర్చుకోవచ్చు) పప్పునూనె 1 1/2 K.G, వెల్లుల్లి 500 గ్రాములు, సోడియంబెంజూట్ 4 గ్రాములు.

***తయారుచేయు విధానము*** :- కోడిమాంసము ముక్కలలో బొమికలను తీసివేసి బాగా కడిగి శుభ్రం చేయాలి. ఆ ముక్కలను నీటిలోవేసి కొద్దిగా ఉప్పువేసి వుడక బెట్టాలి. ఉడికిన ముక్కలను ఒక జల్లెడ బేసిన్‌లో వేసి నీరు యింకిపోయేవరుకూ బాగా ఆరబెట్టాలి. ఆరి, పొడిగా తయారయిన ముక్కలను నూనెలో బాగా వేయించి ఒక పెద్ద సైజు స్టీలు బేసిన్‌లో వేసి, పైన యివ్వబడిన పాళ్ళను అనుసరించి అన్నిటిని ముక్కలలో చేర్చి బాగా కలపాలి. ఆ తరువాత నూనె పోసి ఒక జాడీలో వేసివుంచండి. ఆ తరువాత పావు, అర, ఒక కిలో ఆకర్షణీయమయిన సీసాలో వేసి గట్టిగా మూతబిగించి పేక్ చేయండి. సీసాలపై అందమయిన డిజైన్‌తో ప్రింట్ చేయబడిన లేబుల్స్ అతకించాలి. జాడీలో వేసినపుడు సోడియంబెంజూట్ కలపడం మరచిపోకండి.

ఇదేవిధానాన్ని అనుసరించి, రొయ్య, చేప ఆవకాయలు కూడా తయారుచేయవచ్చు.

**పెట్టుబడి :** ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ వివరాలలో చూడండి.

# మేగజైన్ ఏజెన్సీ

*డిపాజిట్ కట్టగలిగి పేమెంట్ విషయంలో ఖచ్చితంగా, నిజాయితీగా వుండ గలిగితే మేగజైన్స్ ఏజెన్సీ నిర్వహణకూడా లాభసాటివ్యాపారమే. మార్కెట్‌లోకి విడుదలవుతున్న పాపులర్ మరియు లార్జెస్ట్ సర్క్యులేటెడ్ మేగజైన్స్‌ని గమనించండి. వీటిలో మాస, పక్ష వార పత్రికలు వుంటాయి ఉదాహరణకి చందమామ, బాలమిత్ర మొదలయిన మాస పత్రికలు స్వాతి, ఆంధ్రజ్యోతి మొదలయిన వారపత్రికలు సినిమాలకి సంబంధించిన వార,పక్ష పత్రికలు ఇవి కాక డైలీ పేపర్స్‌కి కూడా ఏజెన్సీ నిర్వహించవచ్చును. తెలుగు మేగజైన్స్‌నే కాకుండా ఇంగ్లీషు, హిందీ, తమిళం, కన్నడం, మళయాళీ, ఉర్దూ, మరాఠీ, గుజరాతీ, బెంగాలీ, దేశంలో యింకా ఏయే బాషలలో మాగజైన్స్ వెలువడుతున్నాయో, వాటి పాపులారిటీ రెగ్యులారిటీ ఎలావుందో తెలుసుకోండి. వాటికి ఏయే ఊళ్ళలో ఏజెన్సీ నిర్వహణకు అవకాశం వుందో ఆ పత్రికా కార్యాలయానికి వ్రాసి తెలుసుకోండి.*

**మీరుచేయాల్సింది:-** అవకాశంవున్నచోట, మీరు ఏజెన్సీ నిర్వహించవలసిన చోట ఆ మేగజైన్ పాపులారిటీ ఎలావుందో.....యించుమించు ఎన్ని కాపీలు మీరు అమ్మగలుగుతారో సర్వేచేసి తెలుసుకోండి. ఆ వూళ్ళో ఎన్ని బుక్ స్టాల్స్ వున్నాయో, ఎన్ని పాన్ షాపులు (మేగజైన్స్ అమ్మేవి) లెక్కపెట్టండి. ఒక్కక్కచోట సుమారుగా ఎన్ని కాపీలు అమ్ముడవుతాయో షాపువాళ్ళను అడిగి. ఆ తరువాత మీరు అంచనా వేసుకోండి. దానినిబట్టి మీకు ఏజెన్సీ యివ్వదలచి మేగజైన్‌కి సంబంధించిన సర్క్యులేషన్ మేనేజర్‌కి మీ ఆర్డర్‌ను కోడ్ చేసి. వారుకోరిన అమౌంట్‌ముందుగా డిపాజిట్ చేయండి. ఆ తరువాత మీరు ఆర్డర్‌చేసే మాస, పక్ష, వార పత్రికలకు కమీషన్ మినహాయించుకొని పూర్తి అమౌంట్ డ్రాఫ్టతీసి పంపండి.

**నిర్వహణ ఎలా? ఆదాయం ఎంత?:-** ప్రతి పాపులర్ మేగజైన్స్‌వారు పత్రిక రేటు మీద 25% కమీషన్ యిస్తారు. మీరు పత్రికలు ఇచ్చే షాపులవారికి బుక్‌స్టాల్స్ వారికి మీరు 10% కమీషన్ యిస్తే మీకు ప్రతి పుస్తకం ధరమీద 15% కమీషన్ మిగులుతుంది. దీనికే మీలైసెన్స్‌లు అక్కరలేదు. పార్ట్ టైంగా ఏజెన్సీ నిర్వహించవచ్చు. యిలానాలుగయిదు పాపులర్ మేగజైన్స్‌కి ఏజెన్సీ సంపాదించగలిగితే మంచి ఆదాయంవుంటుంది.

దినపత్రికల విషయంలో మీరు ఏజెన్సీ నిర్వహించేటట్లయితే కొంతమంది సబ్ ఏజెంట్లనూ, పేపర్‌బోయ్స్‌ని పెట్టుకోవలసి వుంటుంది.

**పెట్టుబడి** :- డిపాజిట్ కట్టవలసిన అమౌంట్....మీ ఆర్డర్‌కిముందుగా D.D. తీసిపంపవలసిన అమౌంట్. ఏజెన్సీ నిర్వహణకు అవకాశం లేకపోతే సబ్ ఏజెంట్‌గా ప్రయత్నించండి. ఒకటిరెండు ఏజెన్సీలు సమర్థవంతంగా నిర్వహిస్తే మిగతా ఏజెన్సీ అవకాశాలు వాటంతటవే మిమ్మల్ని వెదుక్కుంటూ వస్తాయి.

**ముఖ్యగమనిక:-** ఏజెన్సీ నిర్వహణకు మీరు చేసే ప్రయత్నాలు పాపులర్ మేగజైన్ వరకే పరిమితం చేసుకోండి. అప్పుడప్పుడూ ఆర్భాటంగా వెలువడే మేగజైన్స్‌కి డిపాజిట్‌లు చెల్లించి దెబ్బతినకండి.



# ఫుట్‌వేర్‌మార్ట్

ప్రతివారికీ దుస్తులు ధరించటం ఎంత ముఖ్యమో, పాదరక్షలు ధరించటం కూడా అంతేముఖ్యం. అందువల్లనే ఈ పాదరక్షల దుకాణం లాభసాటి వ్యాపారం అనిచెప్పవచ్చు. వివిధ డిజైన్‌లలో ఈ పాదరక్షలను భారీగా తయారుచేసే ఇండస్ట్రీస్ నుండి హోల్‌సేల్‌గా ఆర్డర్‌చేసి మంచి సెంటర్‌లో షాపును ప్రారంభిస్తే మంచి లాభం ఉంటుంది. ఈ షాప్‌లో పాదరక్షలు మాత్రమే కాకుండా వాటికి సంబంధించిన పాలిషింగ్ టిన్స్ సాక్స్ లెదర్‌షూస్, స్కూల్‌బేగ్స్ కూడా అమ్మవచ్చును.

**కావలసిన వస్తువులు:-** 1. గ్లాస్ డోర్స్‌ఫిట్ చేయబడిన రాక్స్2. ఫుట్‌స్టాండ్స్ 3. షోకేస్‌లు. 4. ఫేషన్‌బుల్ ఛైర్స్ 5. బూట్లు ధరించటానికి మెటల్ హెల్పర్స్ 6. సీలింగ్ ఆర్ స్టాండ్‌ఫ్యాన్స్ 7. కాష్ కౌంటర్ 8. టెలిఫోన్ 10. ప్లాస్టిక్‌కేరీబేగ్స్

**అమ్మకానికి కావలసినవి:-** 1. రకరకాల డిజైన్స్‌లో ఫ్యాషన్‌బుల్ ఫుట్‌వేర్స్ (వివిధరకాల సైజులు గలవి) లేడీస్ అండ్ జెంట్స్, పిల్లలు ధరించే ఫ్యాన్సీ చెప్పులు.

2. లేటెస్ట్ మోడల్ షూస్....మరియు క్వాలిటీసాక్స్, రెయిన్ షూస్,3. షూపాలిష్ , (బ్రౌన్ అండ్ బ్లాక్) 4. పాలిష్ బ్రష్‌లు 5. కాన్వాస్ షుపెయింట్ (వైట్) 6. స్కూల్‌బేగ్‌లు.

ఈ ఫుట్‌వేర్ షాప్ నిర్వహణకు, షాపు అద్దె, సిబ్బంది జీతాలు షాపు అడ్వాన్స్, కరెంట్ ఖర్చు, యితర ఖర్చులు కలిపి, సుమారుగా లక్ష నుండి 2 లక్షల దాకా అవుతుంది. అమ్మకాలను బట్టి లాభంకూడా అధికంగానే వుంటుంది. లోకల్‌గా తయారయ్యే ఫుట్‌వేర్స్ అమ్మకంలో మరింతగా మిగులు తుంది.

**పెట్టుబడి:-** ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ వివరాలు చూడండి.

# హేండ్‌గ్లవ్స్ (లెదర్)

ప్రమాదాన్ని కలిగించే కెమికల్స్‌నీ, ఎలర్జిటిక్ పదార్థాలను తాకవలసినప్పుడు తప్పని సరిగా ఈ లెదర్ గ్లవ్స్‌వాడుతుంటారు. కెమికల్ ఫ్యాక్టరీలలోనూ, ఫౌండ్రీలలోనూ స్టీలు మరియూ ఆయిల్ మిల్స్‌లోనూ ఈ గ్లవ్స్ ఉపయోగించటం మనకు కనిపిస్తూంటుంది. చేతుల పరిమాణాలను బట్టి ఈ గ్లవ్స్‌ని వివిధ సైజులలో నెంబర్ల వారీగా తయారుచేస్తుంటారు.

**'రా' మెటీరియల్స్ (ముడిసరుకులు):-**1. లెదర్ సోల్యూషన్. 2. స్ట్రాంగ్ త్రెడ్ 3. క్రోమ్ లెదర్. 4. ఫినిషింగ్ పాలీష్

**ఫార్ములా:-** వివిధ సైజులలో ఖచ్చితమైన మెజర్‌మెంట్స్‌లో వీటిని తయారు చేయటం తెలియటమే దీని ఫార్ములా.

**యంత్రపరికరములు:-**1. చేతి పనిముట్లు 2. ఇండస్ట్రియల్ కుట్టుమిషన్. 3. సిలిండర్ బెడ్ కుట్టు మెషిన్ 4. టేబుల్స్ 5. షేప్ కటింగ్ మెషిన్ 5. మరికొన్ని యితర పరికరాలు.

***తయారుచేయు విధానము:-*** ముందుగా నిర్ణయించుకున్న మెజర్‌మెంట్స్ (కొలతలు) ప్రకారం, సైజుల వారిగా లెదర్స్ షేప్ కటింగ్ యంత్రం ద్వారా గానీ, లెదర్ కట్టర్స్‌తో గాని కత్తిరించాలి. ఆ తరువాత కుట్టుమిషన్‌లతో కత్తిరించిన భాగాలను కుట్టాలి. పూర్తిగా తయారయిన గ్లవ్స్‌కి లెదర్ ఫినిషింగ్ పాలీష్‌తో ఫినిషింగ్ యిచ్చి, సైజులవారిగా ఒక్కోజతను పాలిథిన్ కవర్స్‌లో వుంచి, అట్టి పెట్టలలో ప్యాక్ చేయాలి.

ఈ గ్లవ్స్ తయారీకి సంబంధించిన యంత్ర పరికరాలు హైద్రాబాద్, మద్రాస్, బొంబాయి నగరాలలో లభిస్తాయి.

**పెట్టుబడి :-** ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ వివరాలలో చూడండి.

# మిల్క్ బిస్కట్స్

మిల్క్‌బిస్కట్ల రుచిని గురించీ, వాటికి మార్కెట్‌లో వున్న డిమాండ్‌ను గురించి తెలియని వారుండరు. ముఖ్యంగా పసి పిల్లలకు ఈ బిస్కట్లు అల్పాహారంగా ఉపయోగపడతాయి. పెద్దవాళ్ళు సైతం ఈవినింగ్ సమయాలలో టీ త్రాగే ముందు రెండు బిస్కట్లు తినటానికి ఇష్టపడతారు. ఈ బిస్కట్స్ డిమాండ్‌ను బట్టి వివిధ కంపెనీల వారు రకరకాల రుచులతో వీటిని మార్కెట్‌లో పోటాపోటీగా విడుదలచేస్తున్నారు. ఇది మంచిలాభాసాటి వ్యాపారం. తయారుచేయటం కూడా సులువే - మీరూ ప్రయత్నించండి. మంచిక్వాలిటీతో చక్కటి రుచితో మిల్క్ బిస్కట్‌లను మార్కెట్ చేసి లాభాలు ఆర్జించండి.

**'రా' మెటీరియల్ (ముడిసరుకులు):-** 1. గోధుమ పిండ 2. పాలపౌడర్ 3. బేకింగ్ పౌడర్. 4. స్వచ్ఛమయిన నీరు 5. తాజాగ్రుడ్లు 6. వనస్పతి (నెయ్యి) 7. పంచదార 8. మైదా 9. ఉప్పు

**ఫార్ములా:-** గోధుమ పిండి - 1 1/2K.G, పాలపౌడర్ 150 గ్రాములు, నెయ్యి 300 గ్రాములు, బేకింగ్ పౌడర్ 40 గ్రాములు, నీరు స్వచ్ఛమయినది తగినంత తాజాగ్రుడ్లు 3, పంచదార 500 గ్రాములు, ఉప్పు తగినంత, మైదా 1/2 K.G

**తయారుచేయు విధానము:-** గుడ్లుకొట్టి సొనలను ఒక లోతు గిన్నెలో వేసి బాగా గిలగొట్టాలి. బేకింగ్ పౌడర్‌ను నీటిలో కలిపి వుంచుకోవాలి! పాలపొడి, పంచదార, ఉప్పు, నెయ్యి, మెత్తగా వుండేలా చేసి మిశ్రమం చేయాలి. ఆ మిశ్రమంలో గిలగొట్టిన గుడ్లసొనను కలపాలి. గోధుమ, మైదా పిండిని మిశ్రమం చేసి బేకింగ్ పౌడర్ కరిగించిన నీటిలో కలపండి, ఆ మొత్తం పిండిముద్దను పాలపొడి, ఉప్పు, నెయ్యి, పంచదారల మిశ్రమంలో కలిపి బాగా పిసికి ముద్దచేయండి. ఆ ముద్దను ఒక అరగంటసేపు అలాగే వుంచి, కావాల్సిన సైజులలో MILK BISCUTS అన్న అక్షరాలలో వున్న డైస్‌లో పచ్చి బిస్కట్స్‌గా చేసి 200 డిగ్రీల సెంట్‌గ్రేడ్ హీట్‌లో బేకింగ్ చేయాలి. అప్పుడు బిస్కట్స్ గోధుమ రంగులో చక్కగా వేగుతాయి. అప్పుడు బిస్కట్స్ గోధుమరంగులో చక్కగా వేగుతాయి. వాటిని లెక్కప్రకారం వాక్సీ పేపర్‌లో చుట్టి అందమయిన డిజైన్ ప్రింట్ చేయబడిన రేపర్‌లో పేక్ చేసి మార్కెట్ చేయాలి. మీ స్తోమతను బట్టి పెట్టుబడి పెట్టుకోవాలి. చక్కటి క్వాలిటీకోసం ఫార్ములాలో హెచ్చుతగ్గులతో చిన్నచిన్న మార్పులు చేసుకోవటం అవసరం.

**పెట్టుబడి:-** ప్రాజెక్ట్ ఎస్టిమేషన్‌లో చూడండి.

# పప్పుల పేకింగ్

ఆహారానికి సంబంధించిన నిత్యావసర సరుకులలో పప్పులు (కందిపప్పు, పెసరపప్పు, సెనగ పప్పు, మినపప్పు మొ॥నవి) ప్రముఖ స్థానాన్ని వహిస్తాయి. ముద్దపప్పు, సాంబారు, పప్పు పులుసు చేయటానికి కందిపప్పు, ఎంతో అవసరం, అలాగే రుచికరమైన గారెలు చేయటానికి మినపప్పు, మసాల వడలకు సెనగపప్పు పెసరట్లుకు, పునుకులకు పెసరపప్పు, ఇలా ఒక్కో వంటకానికి ఒక్కో పప్పు ప్రత్యేకంగా అవసరం వుంటుంది.

మారుతున్న కాలాన్ని బట్టి, ఆరోగ్యస్థితిగతులను బట్టి నేడు ధనవంతులు మొదలుకొని మధ్య తరగతి వారి వరకూ రేట్లు ఎంత ఎక్కువ అన్నదానిని గురించి కాకుండా క్వాలిటీ వున్న సరుకులను కొనేందుకే ప్రాధాన్యతను యిస్తున్నారు. అటువంటి వారికోసమే ముడి ధాన్యాలను బాగుచేసి, చచ్చులు పుచ్చులూ మట్టిగెడ్డలు వేరుచేసి పప్పులు క్వాలిటీగా అందించటం లాభసాటి వ్యాపారంగా మారింది.

**'రా' మెటీరియల్స్ (ముడిసరుకులు:- ముడిపప్పుధాన్యాలు, పాలిష్ ఆయిల్.**

**ఫార్ములా:-** పప్పుధాన్యాలను క్వాలిటీగల పప్పులుగా తయారుచేయటం ఎలాగో, తెలియటం.

**యంత్రపరికరాలు:-** 1. డాల్‌మిల్ యంత్రం 2. 25 H.P. మోటార్ 3. జల్లెడలు 4. ఆటోమేటిక్ సేవింగ్‌మెషిన్ 5. ఎలక్ట్రిఫికేషన్ అడాల్‌మికమెషీన్

**తయారుచేయు విధానము :-** కందులు, మినుములు, సెనగలు, పెసలు మొదలయిన ముడి ధాన్యాలను బస్తాల లెక్కన కో ఆపరేటెవ్ సొసైటీలు నుండి కొనుగోలు చేయాలి. ఆ ముడిధాన్యాల పై నుండే పొట్టును తొలగించి లోపలి గుండ్లను బద్దలుగా డాల్‌మిన్‌యంత్రంద్వారా విడగొట్టాలి.

అదెలా అంటే?: పప్పుధాన్యాలను పొట్టుతొలగించటానికి ముందుగా డాల్‌మిన్ యంత్రంలో కొద్దిసేపు ఆడించాలి. ఆ తరువాత కొద్దిగా నూనెకలిపి డాల్‌మిల్‌లో వేసి ఆడిస్తే పొట్టుపోయి గుళ్ళుగా వుండే పప్పుధాన్యాలు బద్దలుగా (పప్పుగా మారుతుంది) అప్పుడు ఆ పప్పులను బాగా చెరిగించి, చచ్చులూ, పుచ్చులు, మట్టి గెడ్డలు తొలగించాలి. జల్లెడలతో జల్లించి, నూకనూ, మిగిలిన వూకను వేరుచేయాలి. చివరిగా అతి కొద్దిగా ఆయిల్ చేర్చి పప్పుధాన్యాలను బాగా కలిపితే పప్పులు ఒక విధమయిన షైనింగ్‌లో తాజాగా కనిపిస్తాయి. ఆ పప్పులను పావు, అర, ఒకకిలో రెండు కిలోలు. పాలథిన్ బేగ్స్‌లో వేసి పేక్ చేయాలి. ఆటోమేటిక్ యంత్రం ద్వారా పాలిథిన్ బేగ్‌లను సీలుచేసి మార్కెట్‌లోకి విడుదలచేయాలి.

**గమనిక:-** ఎక్కువ పెట్టుబడిలో యంత్రసామగ్రి కొనలేనివారు..ముడిపప్పు ధాన్యాలను మాత్రమే కొనుగోలుచేసి, విడిగావుండే డాల్‌మిల్స్ వారికి కిలోకి యింతని సొమ్ము చెల్లించి పప్పులను తయారు చేసుకొని పేకింగ్ చేయవచ్చును.

**పెట్టుబడి:-** ప్రాజెక్ట్ ఎస్టిమేషన్‌లో చూడండి.



# సెంటెడ్ సున్నం

వివాహాది శుభకార్యాలలోనూ, వివిధ ఫంక్షన్స్‌లోనూ, అతిథులకు తాంబూలం అందించటం అనాదిగా వస్తున్న మన సాంప్రదాయం. అటువంటి సందర్భాలలో చిన్నచిన్న ప్లాస్టిక్ డబ్బాలలోనూ, సీసాలలోనూ కనిపిస్తుంటుంది లేత గులాబీ రంగులో మెత్తగా పేస్ట్‌లా వుండే సున్నం. తాంబూల ప్రియులకు యిష్టమయిన ఈ సెంటెడ్ సున్నం తయారు చేయటం చాలా సులభం...... ఈ తయారీకి మీ సామర్థ్యాన్ని జోడించి మార్కెట్ చేయటం ద్వారా లాభసాటి వ్యాపారం ప్రారంభించవచ్చు.

**'రా' మెటీరియల్ (ముడి సరుకులు):-** తయారయిన సున్నం. 2. పచ్చకర్పూరం. 3. పిప్పరమెంట్ 4. కొద్దిగా రంగు. 5. నీరు

**ఫార్ములా :-** సున్నం, లేక కాల్చిన సున్నపురాళ్ళు 1 K.G , పచ్చకర్పూరం 30గ్రాములు. పిప్పరమెంట్ 50 గ్రాములు , లేత గులాబీరంగు, కొద్దిగా. నీరు 5. లీటరులు

**యంత్రపరికరములు :** 1. ప్లాస్టిక్ బక్కెట్లు 2. నానబెట్టేందుకు టాంక్ లాంటి పెద్దపాత్ర 3. పెద్ద చెక్కగరిటె. 4. ఇతర పరికరములు.

**తయారుచేయువిధానము :** కాల్చిన స్వచ్ఛమయిన సున్నాన్ని తీసుకొని నీటిలో వేసి ఒక పాత్రలో నానబెట్టి వడపోయాలి. దానిని సుమారు 8 నుండి పదిగంటలకాలం అలాగేవుంచేయాలి. అందువల్ల ఇంకా ఏదయినా మలినం వుంటే తేటతోపాటు పైకి తేరి అడుగున మెత్తని స్వచ్ఛమయిన సున్నంమిగిలిపోతుంది.

ఆతరువాత నీటిని తొలగించి, స్వచ్ఛమయిన పేస్ట్‌లాంటి సున్నానికి పచ్చకర్పూరం, పిప్పరమెంట్ వేసి బాగా కలిపి.... ఒకపాత్రలో వేసి గాలి జొరబడకుండా మూతపెట్టి కనీసం ఇరవైనాలుగు గంటలయినా అలాగే వదిలివేయాలి. ఆ తరువాత ఆకర్షణీయమయిన ప్లాస్టిక్ టిన్స్‌లోనూ, అందమయిన సీసాలలోనూ వేసి పేక్ చేసి మార్కెట్ చేయాలి.

**గమనిక:** క్వాలిటీకోసం అవసరాన్నిబట్టి యితర సుగంధ ద్రవ్యాల ఎసెన్స్‌ను కూడా చేర్చవచ్చును.

**పెట్టుబడి:-** ప్రాజెక్ట్ ఎస్టిమేషన్‌లో చూడండి.

# క్లీనింగ్ పౌడర్

అంట్లు తోమటానికి (మసిబారిన, ఉపయోగించిన వంటసామానులు) ఒకప్పుడు బూడిద, కొబ్బరిపీచు, సన్నటి యిసుకలాంటి ఉపయోగించేవారు. అందువల్ల స్టెయిన్ లెస్ స్టీలు, యిత్తడి, మొదలయిన పాత్రలు గీతలు పడి షైనింగ్ కోల్పోయేవి అంతేగాక సుకుమారంగా వుండాల్సిన ఆడవారిచేతులు రఫ్‌గా తయారయ్యేవి. ఈ యిబ్బందులకు ఫుల్‌స్టాప్ పెట్టేందుకు అనువుగా యిప్పుడు క్లీనింగ్ పౌడర్‌లు మార్కెట్‌లోకి వచ్చాయి. మృదువుగా వుండే ఈ క్లీనింగ్ పౌడర్ ఉపయోగించుటవల్ల సామానులు గీతలుపడే సమస్యవుండదు. పైగా పాలిష్ పెట్టినట్టు తళతళమెరుస్తాయి. అంతేకాకుండా ఆడవారి హస్త సౌకుమార్యానికి ఎటువంటి భంగం వాటిల్లదు. ఇటువంటి ఉపయోగాలు వున్నందువల్ల నేడు క్లీనింగ్ పౌడర్లకు మార్కెట్‌లో విపరీతమయిన గిరాకీ పెరిగిపోయింది.

**'రా' మెటీరియల్ (ముడిసరుకులు):-** 1. ట్రైసోడియం ఫాస్ఫేట్. 2. డోలమైట్ 3. కాస్టిక్‌సోడా (యాష్) 4. ఏసిడ్‌స్లర్రీ 5. కావాల్సిన రంగు.

**ఫార్ములా:-** ట్రైసోడియం ఫాస్ఫేట్ 500గ్రాములు, డోలమైట్ 750 గ్రాములు, కాస్టిక్ సోడా (యాష్) 150 గ్రాములు, ఏసిడ్‌స్లర్రీ 60 గ్రాములు. కావాల్సిన రంగు తగినంత.

**యంత్రపరికరాలు :-** 3 హార్స్ పవర్‌గల హెవీడ్యూటీ మిక్సర్ 2. పాలిథిన్ బేగ్స్. 3. సీలింగ్‌యంత్రం 4. లేబుల్స్. 5. లెదర్ హాండ్‌గ్లవ్స్ 6. అవసరమయిన పాత్రలు.

**తయారుచేయు విధానము :-** ఆసిడ్ స్లర్రీలో తగినంతరంగును ముందుగా కలిపి వుంచుకోవాలి. మిగతా మూడింటినీ హెవీడ్యూటీ మిక్సర్‌లో వేసి 15 నిముషాలపాటు బాగా కలిసేలా మిశ్రమం చేయాలి. అందులో రంగు కలిపిన ఆసిడ్ స్లర్రీని వేసి పౌడర్ యూనిఫామ్‌గా వచ్చేటంతవరకూ మరోసారి బాగా కలపండి. ఆ తరువాత అవసరం అయిన జల్లెడలలో జల్లించి........ఆపౌడర్‌ను.....50 డిగ్రీల సెంటిగ్రేడ్

ఉష్ణోగ్రతలో డ్రై చేయటంగాని, ఎండబెట్టటంగాని చేయాలి. ఆ తరువాత 1/2 K.G 1 KG, 2KG ల పాలిథిన్ బ్యాగ్‌లలో పేక్ చేసి మార్కెట్ చేయండి. బేగ్‌ల లోపల ఆకర్షణీయమయిన లేబుల్స్ వుంచాలి. లేదా బేగ్‌ల మీదనే ఆకర్షణీయమయిన రంగులలో అందమయిన డిజైన్‌లో మీ కంపెనీ పేరును, మీరు క్లీనింగ్ పౌడర్‌కి పెట్టుకున్న పేరును ప్రింట్ చేయించాలి. మీరు అందించే క్వాలిటీని బట్టి మార్కెట్‌లో డిమాండ్ పెంచుకోవచ్చని మరిచిపోకండి. క్వాలిటి కోసం ఫార్ములాలో చిన్నచిన్న మార్పులు, చేర్పులు చేయటం మీ సామర్థ్యంమీద ఆధారపడివుంది. డిమాండ్‌ను అనుసరించి క్వాలిటీని పెంచుకుంటూ అధిక లాభాలు ఆర్జించండి. యంత్రపరికరాలు బొంబాయి, మద్రాస్ హైదరాబాద్ నగరాలలో లభిస్తాయి.

**పెట్టుబడి:-** ప్రాజెక్ట్ ఎస్టిమేషన్‌లో చూడండి.

# మసాలాపొడి

*నోరూరంచే ఘూటమయిన మసాలా వంటకాలను గురించి తెలియని వారుండరు. మాంసాహారాలలోనే కాదు, కూరగాలయ వంటకాలలో కూడా మసాలా వేసుకోవచ్చు. మసాలా లేని నాన్‌వెజిటేరియన్ వంటకాలను వూహించలేము. ఒకప్పుడు ఈ మసాలకు సంబంధించిన దినుసులను సన్నికల్లుమీద వేసి నూరుకోవాలివచ్చేది. మిక్సర్స్ వచ్చిన తరువాత ఆపని కొంచెం సులభతరం అయింది. అదికూడా ఎంతో కొంత చాకిరీతోనూ, మోటార్ మిక్సర్ పనిచేయటానికి కరెంట్‌మీద ఆధారపడ వలసినందువల్ల సరిక్రొత్త ప్రక్రియతో మసాలా పొడులు తయారయ్యి మార్కెట్‌లో దర్శనం యిస్తున్నాయి. శ్రమను తగ్గించి, సమయాన్ని ఆదాచేసే ఈ మసాలా పొడులను మార్కెట్‌లో మంచిగిరాకీ వుంది.*

**'రా' మెటీరియల్స్: (ముడిసరుకులు):-**1. గసగసాలు 2. ధనియాలు 3. సోంపు 4. జీలకర్ర 5. మిరియాలు 6. లవంగాలు 7. దాల్చిన చెక్క 8. ఏలకులు.

**ఫార్ములా:- (పాళ్ళు):-** ధనియాలు 150 గ్రాములు, జీలకర్ర 10 గ్రాములు, మిరియాలు 10 గ్రాములు, లవంగాలు 5 గ్రాములు, దాల్చిన చెక్క 5 గ్రాములు, ఏలకులు 5 గ్రాములు, సోంపు 5 గ్రాములు, గసగసాలు 10 గ్రాములు,

**యంత్రపరికరాలు:-** 1. మిక్సర్స్ 2 జల్లెడలు 3. పాత్రలు.

***తయారుచేయు విధానం :-*** పైన యివ్వబడిన దినుసులన్నిటినీ ఆయా పాళ్ళల్లో మిశ్రమంచేసి. మిక్సర్‌లో వేసి బాగా పొడిచేయాలి, ఆ తరువాత వాటిని బాగా జల్లించి, వివిధ సైజులలో, తూకాలలో ముందుగానే రెడీ చేసుకున్న ప్లాస్టిక్ డబ్బాలలోనూ, చిన్నచిన్న పోలిథిన్ సంచులలోనూ వేసి పాక్‌చేయాలి. ప్లాస్టిక్ డబ్బాలపై లేబుల్స్ అంటించటం తప్పనిసరి.

కోరుకున్న రుచులనుబట్టి పాళ్ళలో చిన్నచిన్నమార్పులూ చేర్పులూ చేసుకోవటం అవసరం. చక్కని రుచి, మీరు అందించే క్వాలిటీకి నిదర్శన.

***గమనిక:*** ఈ పాళ్ళకు సంబంధించినంతవరకూ యింట్లో ఆడవారి సలహా తీసుకొనటం కూడా మంచిదే. ఎందుకంటే తూకాలజోలికి వెళ్ళేముందు చేతులలో, చూపులతో పాళ్ళు నిర్ణయించి చక్కటి మసాలాను తయారుచేయటంలో సిద్ధహస్తులు వారే మరి!

**పెట్టుబడి:-** ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ చూడండి.

# రైటింగ్ సిరా

*ప్రస్తుత కాలంలో బాల్ పాయింట్ పెన్‌లు ప్రాముఖ్యత పెరిగినా, సిరాతో వ్రాసే పౌంటెన్ పెన్‌లు ప్రాముఖ్యత ఏ మాత్రం తగ్గలేదనే చెప్పాలి. ఎక్కువ మేటర్ వ్రాయవలసి వచ్చినపుడు బాల్‌పాయింట్ పెన్‌లు కంటే మామూలు పెన్‌లే అధిక ప్రయోజనాన్ని అందిస్తాయి. బాల్‌పాయింట్ పెన్‌లతో వ్రాసినపుడు లెటర్ ప్రెస్ అవుతుంది. సిరాపెన్ విషయంలో అలాజరగదు. పౌంటెన్ పెన్‌కి సిరా ప్రాణం లాంటిది. సిరా పోయనిదే ఎంతటి ఖరీదయిన పెన్ అయినా నిరుపయోగమైన దానిక్రిందే లెక్క. అందుకే వ్రాతకు అవసరం అయిన ఈ సిరా తయారీ లాభసాటి వ్యాపారం అనటం అతిశయోక్తికాదు.*

'రా' మెటీరియల్స్ (ముడిసరుకులు):+ఫార్ములా:-

1. ఫెర్రస్ సల్ఫేట్ 100 గ్రాములు. 2. గాలిక్ ఏసిడ్ 10 గ్రా॥ 3. టానిక్ ఏసిడ్ 30 గ్రా॥ 4. డెక్స్ట్రిన్ 100 గ్రా॥ 5. స్వచ్ఛమయిన నీరు 1 లీటరు 6. హైడ్రోక్లోరిక్ ఆమ్లం 230 మి.లీ 7. గ్లిసరిన్ 200 మి.లీ. 8. అసిటోన్ 450 మి.లీ. 9. కార్బాలిక్ ఏసిడ్ 10 గ్రా॥ .

**తయారుచేయు విధానము** :- ఫెర్రిస్ సల్ఫేట్‌ను తగినంత నీటిలో కలిపి ఒక గాజు పాత్రలో వుంచాలి. అలాగే టానిక్, గాలిక్ ఏసిడ్‌లను ఒక పాత్రలోనూ డెక్స్ట్రిన్‌ని మరో పాత్రలోనూ ద్రవంగా కలిపి వుంచాఇ. మిగిలిన వాటిని ఒకటొక్కటిగా తగినంత వాటర్‌తో కలిపి వాటన్నిటిని మిశ్రమముచేసి ఒక గాజుజార్‌లో పోయాలి. ఆ తరువాత ముందు విడివిడిగా కలుపుకుని వుంచుకున్న ద్రవాలలో ఈ మొత్తాన్ని కలిపి ఒక ద్రవంగా చేసి గాజు జార్‌ని బాగా షేక్ చేస్తువుండాలి. ఈ ద్రవాన్ని అప్పుడప్పుడూ కదిలిస్తూ 30 రోజులపాటు జార్‌లోనే వుంచి చివరిగా 10 రోజులపాటు కదలించకుండా జార్‌లోనే వేడి చేయాలి. పైన తేరుకున్న డస్ట్‌తో కూడిన ద్రవాన్ని తొలగించి, బాగా

వడగట్టి, ముందుగా రెడీ చేసుకున్న పెద్ద, చిన్న సీసాలలో నింపి, స్క్రూటైపు మూతలలో సీలు చేయాలి. సీసాలపై మీ కంపెనీకి సంబంధించిన లేబుల్స్ అతికించడం తప్పనిసరి!

ఈ సిరాను వివిధ రకాల రంగులలో తయారు చేసుకోవచ్చును.

కావాల్సిన రంగు కోసం కలుపవలసినవి!

ఎర్రసిరాకి ఇయోసిన్ రెడ్

బ్లూ సిరాకి మెథున్ బ్లూ

వయొలెట్ సిరాకి జెన్షన్ వయొలెట్

పచ్చసిరాకి మాల్‌బైట్ గ్రీన్

బ్లాక్ సిరాకి నిగ్రోసన్

**పెట్టుబడి:-** ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ చూడండి.



# మొబైల్ కాంటీన్

*ఆధునిక ప్రపంచంలో ప్రజల అవసరాలకు అనుగుణంగా సౌఖర్యాలను కల్పిస్తూ రకరకాల వ్యాపారాలు మోడరన్ విధానాలతో ప్రారంభించబడుతున్నాయి అటువంటి వ్యాపారాలలో మొబైల్ కాంటీన్ మంచి లాభసాటిది అని చెప్పవచ్చు. ఒకచోట నుండి మరొక చోటికి కదిలి వెళ్లే ఈ మొబైల్ కాంటీన్స్ విదేశాలలో కనిపించినంతగా మనదేశంలో కనిపించవు. సొంత వేన్ కలిగి, హోటల్ నడిపే విధానం తెలిపిన వారికి ప్రతిదినం ఆదాయాన్ని తెచ్చి పెట్టే ఈ మొబైల్ కాంటీ కల్పతరువు లాంటిదనే చెప్పాలి. ప్రస్థుతం నాలుగు చక్రాల తోపుడు బళ్లమీద యిటువంటి కాంటీన్స్ నడుస్తున్నాయి. వాటి కంటే యిది రిచ్‌గానూ, అన్ని తరగతుల కస్టమర్స్‌ను ఆకర్షించేదిగాను వుంటుంది.*

**'రా' మెటీరియల్స్ (ముడిసరుకులు):-** ఫాస్ట్‌ఫుడ్స్ తయారుచేయటానికి అవసరం అయిన పప్పులూ, గోధుమ, రవ్వ మైదాలవంటి పౌడర్‌లూ, వుల్లిపాయలూ బంగాళాదుంపలూ, పచ్చిమిరపకాయలు వంటి కూరగాయలు. కాఫీ, టీ, బోర్నవిటా, హార్లిక్స్‌లు కలుపుకోవటానికి పాలు, పచ్చడి చేసుకునే 'వస్తువులు, ఆయిల్, ఇంకా మరికొన్ని యితర ముడిసరుకులు.

**యంత్రపరికరములు, యితరసామగ్రి:-** డీజల్‌తో నడిచే క్రొత్తవేన్ గానీ, సెకండ్ హాండ్ వేన్. గ్రయిండర్, మిక్సర్, గ్యాస్‌స్టవ్స్, గ్యాస్ సిలెండర్, పెనం, పేపర్ ప్లేట్స్, డిస్పోజల్ ప్లాస్టిక్ కప్స్ యింకా యితరవంట సామగ్రి.

***మొబైల్ కాంటీన్ నడిపే విధానం :-*** డీజిల్‌తో నడచే క్రొత్తదికానీ, సెకండ్ హాండ్‌ది గాని పెద్ద సైజు వేన్ తీసుకుని. దాని బాడీని రీబిల్ట్ చేయించటం ద్వారా కాంటీన్‌కి అవసరం అయిన, చిన్న కిచెన్, సేల్స్ కౌంటర్, పాత్రలువుంచటానికి అనువయిన రాక్స్, ఒక పక్క ఓపెన్ చేయటానికి వీలయిన సైడ్ డోర్స్ మొదలయినవి ఏర్పాటు చేయించుకోవాలి. డోర్స్ పూర్తిగా ఓపెన్ చేయగానే కాంటీన్ అనిపించేట్టు కనిపించాలి.

అడిగిన వెంటనే అయిటమ్స్‌ను తయారుచేసి అందించేందుకు వీలుగా దోసెపిండి, పెసరపిండి. యిడ్లీపిండి, పూరి పిండి, మొదలయిన వాటిని ముందుగానే గ్రయిండర్‌లలో రుబ్బించి వుంచుకోవాలి. పచ్చళ్ళు, సాంబారు, పొటాటోకర్రీ, కారపుపొడివంటివి కూడా సిద్ధంగా వుంచుకోవాలి. ఇవన్నీ వండటం తెలిసిన వంట మాస్టర్‌లు ఇద్దర్ని షిఫ్టు సిస్టంలో పనిలో పెట్టుకోవాలి. మంచిప్లోటింగ్ ఏరియాను ఎంచుకుని ఉదయం ఆరుగంటలకే వేన్‌తో అక్కడికి చేరుకోవాలి. ట్రాఫిక్ అంతరాయంలేని ప్రదేశంలో వేన్‌ను ఆపి కేంటీన్ ఓపెన్ చేయాలి. ఉదయం పది గంటలవరుకూ కేంటీన్ నడిపితేచాలు. ఆ తరువాత సాయంత్రం నాలుగు గంటల నుంచి రాత్రి ఎనిమిది గంటల వరకు నడపాలి. ముఖ్యంగా మీకు డ్రయివింగ్ తెలిసివుంటే మంచిది, మీతోపాటు, సరుకు మాస్టర్‌కాక మరో ఇద్దరు వర్కర్స్‌ని పెట్టుకుంటే చాలు. మొబైల్ కేంటీన్ నడపవచ్చు ఒక చోట వ్యాపారం డల్‌గా వుంటుందనిపిస్తే బెంగపడనవసరం లేదు. వెంటనే చోటుమార్చి, హోటల్, రెస్టారెంట్‌లు అందుబాటులోలేని చోట మొబైల్ కేంటీన్ తెరవచ్చు. ఇది ఉదయం ఒక చోట సాయంత్రం ఒకచోట నడపవచ్చు. రుచికరమయిన పదార్థాలను అందిస్తే మీ వ్యాపారానికి తద్వారా లాభాలకు తిరుగు వుండదు.

**పెట్టుబడి :-** ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ చూడండి.



# ఇండియన్ ఇంక్

లైన్ డ్రాయింగ్ కోసం చిత్రకారులు ఉపయోగించే ఈ ఇండియన్ ఇంక్‌కి ఒక ప్రత్యేకత వుంది. ప్రింటింగ్ ఇంక్‌లా ఇది స్థిరంగా వుంటుంది. నీళ్ళు పడినా చెరగిపోదు. ఈ ఇండియన్ ఇంక్ ఉపయోగించి గీచిన చిత్రాలు చెరిగిపోకుండా పెర్మనెంట్‌గా నిలచిపోతాయి. కమర్షియల్ పబ్లిసిటీ డిజైన్‌లు వేయటానికి ఆర్టిస్ట్‌లు ఎక్కువగా వాడే ఈ ఇండియన్ ఇంక్‌కి మార్కెట్‌లో చాలా గిరాకీ వుంది.

**'రా' మెటీరియల్స్ (ముడిసరుకులు):- ఫార్ములా:-**

స్టెబలైజర్20 గ్రా॥, బొరాక్స్ 40 గ్రా॥, బ్లీచ్డ్ లక్క 100 గ్రా॥

లాంప్ బ్లాక్ కలర్ 100 గ్రా॥ స్వచ్ఛమయిన నీరు కావలసినంత (800.మిలీ)

**తయారుచేయు విధానము:-** అవసరమైనంత స్వచ్ఛమయిన నీటిని తీసుకుని అందులో బొరాక్స్‌ను వేసి ద్రవంగా తయారుచేయాలి. లక్కను కరిగించి అందులో వేసి బాగా కలపుతూ మిశ్రమం చేయాలి. లాంప్‌బ్లాక్ కలర్‌ను వేరుచేసి అది వేడిగా వున్నప్పుడే జల్లించి, ఆ మిశ్రమంలో చేర్చాలి. అవసరాన్నిబట్టి తగినంత నీరు కలిపి, బాగా కలియబెట్టి, హూమిజేనైజర్‌లో వేయాలి. ఆ తరువాత కొద్ది రోజులపాటు అంటే సుమారు 20 రోజులపాటు అలాగే వుంచి, ఆ తరువాత బ్లాక్ కలర్‌పోకుండా వుండేదుకు సహాయపడే స్టెబలైజర్‌ను చేర్చి, ఫిల్లింగ్ మెషిన్ ద్వారా చిన్న పెద్ద, సీసాలలో నింపాలి. అలా తయారయిన ఇండియస్ ఇంక్‌కి మీ కంపెనీ పేరు పెట్టి క్రింద చేయించిన లేబుల్స్‌ని అతికించి మార్కెట్ చేయండి. మీరు అందించే క్వాలిటీయే మీ వ్యాపారాభివృద్ధి కారణం అవుతుందని మరచిపోకండి.

**పెట్టుబడికి :-** ప్రాజెక్ట్ ఎస్టిమేషన్‌లో చూడండి.

# బాల్‌పాయింట్ పెన్‌లు

బాల్‌పాయింట్ పెన్‌ల అవసరాన్ని గురించి, వాటికున్న ప్రత్యేకతలను గురించి అందరికీ తెలిసిందే. విద్యార్థులనుండి పెద్దపెద్ద ఆఫీసర్లవరకూ ఈ బాల్‌పాయింట్ పెన్‌లను విరివిగా వాడుతున్నారు. వీటివల్ల షర్టుకి గాని, చేతికిగాని సిరా మరకలు అంటుకునే ప్రసక్తిలేదు. క్వాలిటీగల రీఫిల్స్ ఉపయోగిస్తే వాటితో వ్రాసే వ్రాత ఎంతో స్పష్టంగా వుంటుంది.వీటికి మార్కెట్‌లో గల డిమాండ్ ఎవర్‌గ్రీన్ అనిచెప్పవచ్చు. ఈ బాల్‌పాయింట్ పెన్‌ల తయారీ చక్కటి లాభాలను ఆర్జించి పెట్టే వ్యాపారం.

**'రా' మెటీరియల్స్ (ముడిసరుకులు):- 1.**సెల్యులోజ్ ఎసిటేట్ 2. ప్లాస్టిక్ 3. అయిరన్, స్ప్రింగ్‌లు 4. ప్రెన్‌బటన్స్, 5. రీఫిల్స్, 6. పేకింగ్ మెటీరియల్.

**ఫార్మూలా:-** మేకింగ్ మెథడ్స్, మెజర్‌మెంట్స్‌కి సంబంధించిన అనుభవం.

**యంత్రపరికరములు:-** 1. బఫింగ్ యంత్రం 2. వివిధ ఆకారాలలో 'డైస్' 3. హాండ్ ఆపరేటింగ్ ఇంజక్షన్ మౌల్డింగ్ యంత్రం 4. యితర పరికరాలు.

***తయారుచేయు విధానము:-*** ఇంజక్షన్ మౌల్టింగ్ యంత్ర సహాయంతో.......సెల్యులోజ్ ఎసిటేట్ నుండి తయారయిన ప్లాస్టిక్‌తో ఈ బాల్‌పాయింట్ పెన్‌ల బాడీ తయారు చేసుకోవాలి, ఆ తరువాత రీఫిల్‌నీ, దానిని దత్తే స్ప్రింగ్‌నీ, పెసింగ్ బటన్స్ ఫిట్ చేస్తే బాల్‌పాయింట్ పెన్‌లు వ్రాయటానికి రెడీ అవుతాయి, వాటిని పొడుగాటి ఆకర్షణీయమయిన అట్టపెట్టెలలో, ఖరీదయిన ప్లాస్టిక్ బాక్స్‌లో పేక్ చేసి మార్కెట్‌లోకి విడుదల చేయాలి.

ఈ బాల్‌పాయింట్ పెన్‌లను సరయిన నాణ్యతను యిస్తూ పదికాలాలు పాటుమన్నేదిగా తయారుచేస్తే మార్కెట్‌లో మంచి గిరాకీ సంపాదించుకోవచ్చు.

యంత్రసామగ్రి మద్రాస్. కలకత్తా. బొంబాయి, ఢిల్లీనగరాలలో లభిస్తాయి.

**పెట్టుబడికి :-** ప్రాజెక్ట్ ఎస్టిమేషన్‌లో చూడండి.

# సువాసన సుపారీ

*సుష్టుగా భోజనం చేసిన వెంటనే సిగరెట్ కాల్చటం చాలామందికి అలవాటు. సిగరెట్ కాల్చని వాళ్ళు తాంబూలం వేసుకోవటం, వక్కపొడిని నమలటం లాంటివి చేస్తూంటారు. జీర్ణశక్తి ఉపయోగపడుతూ నోటిని మంచి సువాసలతో నింపే సుపారీలు ప్రతి పాన్ షాప్‌లోనూ మనకి దర్శనం యిస్తుంటాయి. కాలక్షేపానికే కాదు సిగరెట్లు అలవాటును మానుకోవాలనుకునేవారు కూడా ఈ సువాసన సుపారీని ఆశ్రయిస్తుంటారు. ఇది తయారుచేయటం కూడా సులువే. మంచి లాభసాటి వ్యాపారం కూడా.*

**'రా' మెటీరియల్స్: (ముడిసరుకులు):** 1. పుచ్చులు, డొల్లలూ లేని గట్టి వక్కలు. 2. నెయ్యి 3. గ్లిసరిన్ 4. సారపలుకులు 5. దోసవిత్తనాలు 6. పిప్పరమెంట్ 7. గ్లూకోజ్ 8. సుగంధద్రవ్యాల మిశ్రమం.

**ఫార్ములా:-** వక్కలు 1K.G, పిప్పరమెంట్ 20 గ్రా॥, గ్లిసరిన్ 50 గ్రా॥, నెయ్యి తగినంత, సారపలుకులు 100 గ్రా॥, దోసవిత్తనాలు 100 గ్రా॥, గ్లూకోజ్ 250 గ్రా॥, సుగంధ ద్రవ్యాల మిశ్రమం తగినంత

**యంత్రపరికరములు:-** 1. వక్కలకటింగ్ మిషిన్ 2. 2హార్స్‌పవర్ మోటార్ 3. మిక్సర్ 4. స్ట్రిప్ సీలింగ్ మెషిన్ 5. వెయింగ్ మెషిన్ 6. మిక్సింగ్‌కి కావాల్సిన పాత్రలు 7. పేకింగ్ మెటీరియల్ 8. అట్టపెట్టెలు

***తయారుచేయువిధానము:-*** ముందుగా డొల్లలూ, పుచ్చులు లేని గట్టి వక్కలను సుపారీ కటింగ్ యంత్రంతో సన్నటి పలుకులుగా కట్ చేసుకోవాలి. కళాయిలో నెయ్యివేసి, ఆ పలుకులను కొద్దిగా వేయించాలి. అలా వేయించిన పలుకులను గ్లిసరిన్‌లో వేసి, బాగా కలిపి ఒక పాత్రలో వుంచి మూత పెట్టాలి. సుమారు యిరవైగంటల తరువాత దోసవిత్తనాలు, సారపలుకులు వేసి బాగా కలిపి మిశ్రమంచేయాలి. ఆ మిశ్రమానికి తగినంత సుగంధ ద్రవ్యాలమిశ్రమాన్ని చేర్చి మరింతగా కలపాలి. ఆ తరువాత చిన్న చిన్న ప్రింటెడ్ మెటాలిక్ స్ట్రిప్ బేగ్స్‌లో వేసి పేక్ చేయాలి.

యంత్రసామగ్రి, ముడిసరుకుల కొనుగోలు, ఆఫీసు ఖర్చులలో కలిపి 65 వేల దాకా పెట్టుబడి పెట్టాల్సి వుంటుంది.

పెట్టుబడికి ప్రాజెక్ట్ ఎస్టిమేషన్‌లో చూడండి.

# పాప్‌కార్న్

ఒక రూపాయి, రెండు రూపాయలకు లభించే పాప్‌కార్న్ (పేలాలు) కాలక్షేపానికి ఎంతగానో ఉపకరిస్తాయి. బస్, రైలు ప్రయాణాలలోను సినిమాహాల్స్ స్కూల్స్ దగ్గర ఇవి ఎక్కువ దర్శనం యిస్తుంటాయి. పిల్లలకు ఇవంటే ఎంతో ఇష్టం. చేతులను జిడ్డు అంటుకోదు. ఇవి తిన్న తరువాత ప్రత్యేకంగా చేతులు కడుక్కోవాల్సిన అవసరం ఉండదు. తక్కువ పెట్టుబడితో తయారుచేసే ఈ పాప్‌కార్న్ మం:విలాభ సాటి వ్యాపారం. దీనిని తయారుచేయటానికి ఎలాంటి సాంకేతికపరిజ్ఞానం అవసరంలేదు. మార్కెట్‌లో దీని గిరాకీ అపరిమితం!

**'రా' మెటీరియల్స్ (ముడిసరుకులు):-** 1. నాణ్యత తగిలిన నెం 1 మొక్కజొన్నలు 2. సాధారణమయిన వంటనూనె 3. కారం. 4. ఉప్పు 5 పాలిథీన్ బేగ్స్

**ఫార్మూలా:-** తయారుచేయటం ఎలాగో తెలియటమే తప్ప ప్రత్యేకమయిన ఫార్ములా లేదు.

**యంత్రసామగ్రి:-** 1. పాప్‌కారన్ తయారీయంత్రం 2. వెయింగ్ మెషిన్ 3. హీట్‌సీవింగ్ మెషిన్ 4. మోటార్ 5 ఇతర పనిముట్లు

***తయారుచేయువిధానము:-*** మొక్కజొన్న విత్తనాలను బాగా చెరిగి, తగినంతగా ఉప్పు, కారం. ఆయిల్ చేర్చి పాప్‌కార్న్ మెషీన్ కెటిల్లో వేయాలి. అంతకుముందు మొక్కజొన్న విత్తనాలను సుమారు పదిగంటలపాటు తెల్లటి తడి వస్త్రంలో చుట్టి వుంచాలి. మెషన్ కెటిల్‌లో వేసిన మొక్కజొన్న విత్తనాలు పేలాలుగా (పాప్‌కార్న్‌గా) విచ్చుకోగానే కెటెల్ నుండి తీసి బాగా చల్లారనిచ్చి పాలిథీన్ బేగ్‌లలో వేసి పేక్‌చేసి మార్కెట్ చేయాలి.

మొక్కజొన్న విత్తనం ఎంత పెద్దదిగా విచ్చుకుంటే పాప్‌కార్న్ అంతనాణ్యత గల దన్నమాట.

ఈ పాప్‌కార్న్ పొట్లాలను సినిమాహాల్స్‌కాంటీన్‌లకూ, రైల్వే కాంటీన్‌లకూ, బస్‌స్టాండ్ కాంటీన్‌లకూ, వీధులలో తిరిగి అమ్ముమకునే వారికి హోల్‌సేల్‌గా సప్లయిచేయవచ్చు.

యంత్రపరికరాలు న్యూఢిల్లీ, బెంగుళూర్, అహ్మదాబాద్ నగరాలలో దొరుకుతాయి.

పెట్టుబడిని గురించి ప్రాజెక్ట్ వివరాలలో చూడండి.

# పొటాటో చిప్స్

పెద్దలూ, పిల్లలూ అందరూ ఇష్టపడితినే బంగాళాదుంపల చిప్స్‌కి మార్కెట్‌లో విపరీతమయిన గిరాకీ వుంది. ఇది కాలక్షేపానికి మాత్రమేకాదు మంచి రుచికరమయిన పౌష్టికాహారంకూడా. సాయంత్రం వేళల్లో అల్పాహారంగా కొన్ని చిప్స్‌తిని టీ త్రాగే అలవాటున్నవాళ్ళు చాలామంది వుంటారు. 'కాక్ టెయిల్' పార్టీలలో ఈ చిప్స్ 'టచింగ్' పేరుతో ప్రధానంగా చోటు చేసుకుంటాయి. మార్కెట్‌లో విపరీతమయిన డిమాండ్‌గల ఈ పొటాటో చిప్స్ వ్యాపారం లాభదాయకమయినదే!

**'రా' మెటీరియల్స్, (ముడిసరుకులు):-** 1. గట్టిగా పెద్దవిగా వున్న బంగాళాదుంపలు 2. ఉప్పు, 3. కారపుపొడి, 4. రిఫైండ్ ఆయిల్ 5. పసుపు, పాలిథీన్ బేగ్స్

**ఫార్ములా:-** పచ్చిబంగాళా దుంపముక్కలను కోయటం, తగినంత ఉప్పు,కారం, పసుపు చేర్చటం, అంతకుమించి ప్రత్యేకమయిన ఫార్ములా ఏదీ లేదు.

**యంత్ర పరికరములు:-** 1. త్రాసు 2. ఫ్రైయింగ్ ఫేన్ 3. విద్యుత్ పరికరాలు 4. చిపింగ్ మెషిన్ 5. హీట్ సీలింగ్ స్ట్రిప్ యంత్రం. 6. స్టీలు బేసిన్‌లు (పెద్దవి)

**తయారుచేయు విధానము:-** ఫ్రెష్‌గా, గట్టిగా, పెద్దవిగా వుండే బంగాళా దుంపలను మంచినీటిలో శుభ్రంగా కడిగి, పై తోలును చెక్కివేయాలి. వాటిని మళ్ళీ కడిగి, ఆరిన తరువాత చిపింగ్ మెషిన్ ద్వారా పల్చటి చిప్స్‌గా చేయాలి. పెద్ద సైజు ఫ్రైయింగ్ పాన్‌లో రిఫైన్డ్ ఆయిల్ పోసి బాగా మరగనివ్వాలి. ఈ లోగా రవ్వంత పసుపుపొడి వేసి తగినంత ఉప్పుకారంతో మిశ్రమం చేసి, ఆ మిశ్రమాన్ని తరిగివుంచుకున్న పచ్చి చిప్స్‌లో వేసిబాగా కలపాలి. ఆ తరువాత మరిగే నూనెలో వాటిని వేసి దోరగా వేయించాలి. (చిప్స్‌వేయించిన తరువాత కూడా వాటికి ఉప్పుకారం తగినంత పట్టించవచ్చు) తరువాత వాటిని స్టవ్‌మీద నుంచి దించి చల్లారాక 50 గ్రాములు 100 గ్రా, రెండవందల గ్రాములుగా తూచి, ఆయా సైజులలో రెడీ చేసి వుంచుకున్న పాలిథిన్ బేగ్స్‌లో వేసి హీట్‌సీలింగ్ యంత్రంద్వారా సీల్‌చేసి, మార్కెట్ చేయండి.

ముందుగా చిప్స్ పేకెట్స్ పరిమితంగా చేసుకోవాలి. మార్కెట్‌లో అమ్మకాలను బట్టి తయారీ సంఖ్యను పెంచుకొంటూపోవచ్చు.

పెట్టుబడిని గురించి ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ చూడండి

# ప్లాస్టిక్ బేంగిల్స్

గ్లాస్ బేంగిల్స్ కంటే ఎక్కువ కాలం మన్నటం, తక్కువధరలో వివిధ రకాల డిజైన్‌లలో రకరకాల షేపులలో లభించటం ఈ ప్లాస్టిక్ గాజులకు గల గిరాకీకి ముఖ్య కారణం అని చెప్పాలి. ఆడవారి చేతులకు అదనపు ఆకర్షణ చేకూర్చి అందంగా కనిపింపచేయటమే ఆ ప్లాస్టిక్ గాజులు కున్న ప్రత్యేకత. గాజు బేంగిల్స్‌తో పోటీ పడుతూ మార్కెట్‌లో ఎప్పటికప్పుడు తమ గిరాకీని పెంచుకుంటున్న ఈ ప్లాస్టిక్ గాజుల తయారీ లాభాలను ఆర్జించే పరిశ్రమలో ఒకటిగా గుర్తింపుపొందింది

**'రా' మెటీరియల్స్ (ముడిసరుకులు):-** 1. చెక్కుడు మెటీరియల్స్ 2. ఇన్‌స్టాంట్ కలర్స్ 3. వివిధ రంగులలో యాక్రలిక్ ప్లాస్టిక్ పైపులు 4. ప్యాకింగ్ బాక్సులు 5. వైట్ బటర్ పేపర్

**ఫార్ములా:-** యాక్రలిక్ ప్లాస్టిక్ పైప్స్ కటింగ్, చెక్కుడు, డిజైన్స్ వేయటం మొదలయినవి విషయాలలో అనుభవం వుండటమే దీని ఫార్ములా.

**యంత్ర పరికరాలు:-** 1. చెక్కుడు ఎక్విప్‌మెంట్ 2. ఫిక్సర్ 3. టాడామెషిన్ 4. సాకెట్ బఫింగ్‌యంత్రం డిజైన్డ్ అచ్చులు

**తయారుచేయు విధానము:-** 2.4', 2.6,'' 2.8'. మొదలయిన వివిధ సైజులలో యాక్రలిక్ పైప్స్‌ను తీసుకుని, ముందుగా నిర్ణయించుకున్న మందంలో మెషన్ సహాయంతో గాజులు కట్ చేయాలి. వాటికి ఫినిషింగ్ యిచ్చి, మెషిన్ సహాయంతో చెక్కుడు, మెటాలిక్ పెయింట్స్‌తో డిజైన్స్ వేసి, ముందుగా పల్చగా వుండే బటర్ పేపర్స్‌లో చుట్టి ఆ తరువాత ఆకర్షణీయమయిన అట్టపెట్టెలలో పేక్ చేసి మార్కెట్ చేయాలి.

పెట్టుబడిని గురించిన ఎస్టిమేషన్ వివరాలు చూడండి!

# టైలరింగ్ సెంటర్

*రెండుమూడు కుట్టుమిషన్‌లతో ఇద్దరుముగ్గురు పనివారలతో ఎప్పటికప్పుడు ఏ కొద్దిమందికో కుట్టటం సాధారణంగా టైలరింగ్ షాపులలో జరుగుతుంటుంది. అలాకాకుండా పాతిక ముప్పయి మెషిన్‌లతో భారీ ఆర్డర్స్‌ని సేకరించి కాంట్రాక్ట్ పద్ధతిమీద స్కూల్స్‌కీ, కంపెనీలకీ, ఇండస్ట్రీవర్కర్స్‌కి యూనిఫారాలు కుట్టటం, రకరకాల ఫ్యాషన్స్‌లో రెడీమెడ్ దుస్తులు తయారుచేసి రెడీ మెడ్ దస్తుల డీలర్స్‌కి అందించటం, మంచి లాభసాటి పరిశ్రమ మాత్రమేకాదు. పదిమంది ఉపాధికల్పించే పరిశ్రమ కూడా.*

**'రా' మెటీరియల్స్ (ముడిసరుకులు):-** 1. వివిధ రకాల క్లాత్స్ 2. వివిధ రకాల షేడ్స్‌లో రంగుదారాలు 3. ప్లాస్టిక్, మరియు మెటల్ బటన్స్ 4. హుక్స్, 5. జిప్స్ 6. చమ్కీచిప్స్ 7. మెరిసే సిల్కుదారాలు (ఎంబ్రాయిడరీకి) 8. టైలరింగ్ చాక్.

**ఫార్ములా:-** అన్నిరకాల దుస్తులు కుట్టటం, ఎంబ్రాయిడరీ చేయటం. వివిధరకాల ఫ్యాషన్ దుస్తులకు సంబంధించిన స్టిచ్చింగ్ అవగాహన, మెటీరియల్స్ పొదుపుగా వాడటం, దీనికి ఫార్ములా యిదే.

**యంత్రపరికరములు:-** 1. కుట్టుమిషన్‌లు 25 2. కత్తెరలు అవసరం అయినన్ని 3. జిగ్‌జాగ్ కుట్టుమిషన్‌లు 4. కటింగ్ టేబుల్స్ 5. ఐరన్ బాక్స్‌లు 6. ఎగస్ట్రా బాబిన్స్ (అవసరం అయినన్ని) 7. టేప్, షేప్‌స్కేల్ 8. కాజాలు కుట్టేమిషన్, 9. హేండ్‌స్టిచ్చింగ్ నీడిల్స్.

***తయారుచేయువిధానము లేక నిర్వహణ* :-** మీ స్తోమతను బట్టి 10 నుంచి 25 దాకా ఎన్ని కుట్టుమిషన్‌లయినా పెట్టుకోండి. (కుట్టుమిషన్‌లు మీకున్న పలుకుబడిని ఉపయోగించి హైర్‌పర్చేజ్‌లో కొనుగోలుచేసుకోవచ్చు ఇన్‌స్టాల్‌మెంట్ బేసిస్‌లో నెలకు యింతని చెల్లించవచ్చును) వివిధ రకాల ఫ్యాషన్స్‌లో కటింగ్ చేయగల నిపుణులయిన టైలర్స్‌ని పెట్టుకోండి (నెలజీతాలుగానీ, పీస్ కాంట్రాక్స్ పద్ధతిలోకాని) లేదా ఆర్థికంగా

వెనుకబడివున్న ఆడవారికి ముందుగా మీ దగ్గరే ట్రయినింగ్ ఇచ్చి, ఆ తరువాత జీతం ఏర్పాటుచేయండి. ఫ్యాక్టరీ వర్కర్స్, స్కూల్ చిల్డ్రన్స్, గవర్నమెంట్ ఆఫీస్ యూనిఫారాలు మొదలయినవి ఆర్డర్ సంపాదించి కాంట్రాక్ట్ పద్ధతిలో కుట్టియివ్వవచ్చు. ఇది ఏడాదికీ రెండేళ్ళకు ఒక సారే వుంటుంది కాబట్టి వివిధ ఫ్యాషన్స్‌లో గౌన్లు, చూడీధార్స్, మిడ్డీస్, నైటీస్, గాగ్రా, షరారా, పేర్లల్స్, మొదలయిన ఫ్యాషన్‌లతో కూడిన దుస్తులను సొంతంగా గానీ, హోల్‌సేల్ డీలర్స్, లేక కంపెనీలవారికి గాని ఆర్డర్ సంపాదించి, నీట్‌గా కుట్టి సప్లయ్ చేయండి.

జీతాలు, వర్క్ మెయింటెనన్స్ అన్ని ఖర్చులూ పోనూ 30 నుండి 35 శాతం వరకూ ఆదాయంవుంటుంది. ఈ స్టించ్చింగ్ సెంటర్ నిర్వహించటానికి అనుకూలంగా కటింగ్, స్టిచ్చింగ్, రెడీమెడ్ దుస్తులకి సంబంధించిన టెక్నిక్స్ తెలిసివుండటం ముఖ్యం.

పెట్టుబడిని గురించి ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ వివరాలు చూడండి.



# రెడీమెడ్ డ్రెసెస్

దుస్తులు మనిషి అందానికి అదనపు ఆకర్షణనూ, పర్సనాలిటీకి హుందాతనాన్ని చేకూరుస్తాయనటంలో సందేహపడవలసిందేమీ లేదు.....ఒకప్పుడు మార్కెట్‌లో గుడ్డ కొని టైలర్‌కి యిచ్చి కుట్టించుకోవటం జరిగేది. మారుతున్న కాలంతోపాటే మనిషి అవసరాలు, వాటికి సంబంధించిన వేగం పెరిగిపోయింది. డబ్బునూ, సమయాన్ని ఆదా చేసుకోవాలన్న ఆలోచన కలగటం మనిషిని రెడీమెడ్ దుస్తులు ధరించే దిశగా మళ్ళించింది. దానికి తోడు కంటికి యింపుగా, మనసును ఇట్టే ఆకట్టుకునే రీతిలో అద్భుతమయిన ఫ్యాషన్స్‌లో ండీమెడ్ దుస్తులు మార్కెట్‌లో దర్శనం యిస్తువుండటంతో అన్ని తరగతులవారూ వాటి పట్ల ఆకర్షితులవుతారనే చెప్పాలి. అందువల్లనే ఈ రెడీమెడ్ దుస్తుల తయారీకి సంబంధించిన పరిశ్రమ నిత్య గిరాకీతో వర్ధిల్లుతూ యాజమాన్యానికి లాభాలు ఆర్జించి పెడుతోంది.

**'రా' మెటీరియల్స్ (ముడిసరుకులు):-** సిల్కు, కాటన్, పాలిస్టర్, పాప్లిన్, పాలిస్టర్‌మిక్స్‌డ్ కాటన్.......మల్టీకలర్ ప్రింటెడ్ డిజైన్స్ మొదలయిన క్లాత్స్.

**ఫార్మూలా:-** బిజినెస్, అనుభవం, మార్కెట్ చేయగల సామర్థ్యం.........వివిధ రకాల ఫ్యాషన్డ్ దుస్తులు అమ్మకాలకు సంబంధించిన మార్కెట్ సర్వే......తప్ప ప్రత్యేకమయిన ఫార్మూలా ఏదీ లేదు.

**యంత్రపరికరములు లేదా నిర్వహణకు కావలసినవి:-** క్లాత్స్ సప్లయిచేసి, స్టిచ్చింగ్ సెంటర్స్ ద్వారా కాంట్రాక్టు పద్ధతిలో కుట్టించుకునేటట్లయితే యంత్రపరికరాలతో పనిలేదు.

ఇక నిర్వహణకు కావాల్సినవి : 1. వివిధ రకాలకు, వివిధ నాణ్యతలకు సంబంధించిన క్లాత్స్ తాలుకు తానులు, లేదా తూకంలో వేచ్చే కట్ పీసెస్ 2. మీరు తయారు చేయించదలుచుకున్న రెడీమెడ్ దుస్తులకు సంబంధించిన డిజైన్స్ కేటలాగు.

వివిధ మోడల్స్, వాటి సైజుల వివరాలు, 3. వివిధ సైజులలో ప్రింటెడ్ అట్టపెట్టెలు 4. ట్రాన్స్‌పోర్ట్‌షన్‌ని కావాల్సిన చెక్క పెట్టెలు, పేకింగ్ అయిరన్ బెల్టులు. 5. తయారయిన రెడీమెడ్ దుస్తులును వుంఛేందుకు పెద్దగోడౌన్, రాక్స్. 6. ఇంకా ఆఫీసు సరంజామా; ఇతరవస్తువులు.

***నిర్వహణ విధానము:-*** మీరు తయారు చేసే రెడీమెడ్ దుస్తులకు సంబంధించిన పబ్లిసిటీయిస్తూ, సమర్థులయిన ఏజెంట్స్ ను నియమించి, హోల్‌సేల్ డీలర్స్ నుండి భారీ ఆర్డర్స్ సంపాదించండి. వాళ్ళు ఆర్డర్ చేసిన పీసెస్ సకాలానికి అందించేలా ప్రయత్నించండి. మార్కెట్‌లో ఎప్పటికప్పుడు లేటెస్ట్ పేషన్డ్ రెడీమెడ్ దుస్తులు విడుదల చేస్తూ ఉండండి. ఏయే సైజులలో ఏయే మోడల్స్ బాగా అమ్ముడవుతున్నాయో శ్రద్ధగా గమనించి వాటిని ఎక్కువగా తయారుచేయటానికి ప్రయత్నించండి. మంచి క్వాలిటీ గల మన్నికతో కూడిన దుస్తులు అందించండి. ఈ పరిశ్రమకు పెట్టుబడి ఎక్కువే అయినా, పెట్టుబడికి తగిన లాభం మీ అంచనాలకు మించే వుంటుంది.

పెట్టుబడిని గురించి ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ వివరాలు చూడండి.



# ఐరన్ రాక్స్

ఎటువంటి సాంకేతిక పరిజ్ఞానం లేకుండా ఈ ఐరన్ రాక్స్‌ని కొద్దిపాటి అనుభవంతో చాలా సులువుగా తయారుచేసుకోవచ్చు. పుస్తకాలూ, ఆఫీసు ఫైళ్ళు భద్రపరుచుకోటానికి, షాప్‌లలో సేల్స్ మెటీరియల్స్ వుంచటానికి...ఇళ్లల్లో సీసాలు ప్లాస్టిక్ డబ్బాలవంటివి వుంచుకోటానికి....ఇలా ప్రతిచోటా ఈ అయిరన్ రాక్స్ అవసరం వుటుంది. ఐరన్‌కి తుప్పు పట్టే లక్షణం వుంది గనుక అలాజరగకుండా వుండేందుకు రాక్స్ తయారుచేసిన వెంటనే పెయింట్ వేస్తే సరిపోతుంది.

**'రా'మెటీరియల్స్ (ముడిసరుకులు):** 18 నుండి 20 యస్, డబ్ల్యు.జి గేజ్‌గల బి.డి.షీట్స్. 2. యం.యస్.ఐరన్ షీట్స్. 3. పైప్స్ 4. ఆలివ్‌గ్రీన్ పెయింట్ 5. రెడ్యూసర్ 6. థిన్నర్.

**ఫార్ములా:-** తయారుచేయు అనుభవం.

**యంత్ర పరికరములు:-** 1. బెంచ్‌గ్రయిండర్ 2. ఎయిర్‌కంప్రెషర్ స్ప్రేపెయింటింగ్ గన్ 3. షీట్ బెండింగ్ మెషీన్ 4. డ్రిల్లింగ్ యంత్రం 5. లీవర్ షీర్ (హేండ్) 6. గ్యాస్ వెల్డింగ్ యూనిట్ 7. పవర్ కనెక్షన్స్ 8. మెజర్‌మెంట్ మెటీరియల్స్ 9. యితర పనిముట్లు

**తయారుచేయు విధానము:-** అవసరమయిన గేజ్‌లో ఎం.యస్ షీట్ తీసుకుని నిర్ణయించుకున్న మెజర్‌మెంట్ ప్రకారం కట్‌చేసుకోవాలి. వాటిని బెండింగ్ మిషిన్ సహాయంతో అవసరం అయిన ఆకారంలో బెండ్ చేయాలి. ఆ తరువాత డ్రిల్లింగ్ యంత్రం ద్వారా రంధ్రాలు ఏర్పరచి, ఖచ్చితమయిన బోల్ట్‌హెడ్ బోల్టులో బిగించాలి. కటింగ్, బెండింగ్ అయిన తరువాత రాక్స్ పూర్తి ఆకృతి రావటానికి విడిభాగాలను గ్యాస్ వెల్డింగ్ ద్వారా జాయింట్ చేయాలి. బెంచ్ గ్రైండర్‌ద్వారా ఫినిషింగ్ యిచ్చి స్ప్రేపెయింటింగ్ గన్‌తో రెగ్యులర్ ఆలివ్‌గ్రీన్ కలర్‌ను వేసి అమ్మకానికి రెడీచేయాలి.

ఈ ఐరన్ ర్యాక్స్‌ని, స్కూలు, ఆఫీస్, షాపులు మొదలయిన వాటికి కోరిన సైజులను బట్టి అక్కడికక్కడే కాంట్రాక్ట్ పద్ధతిలో తయారుచేసి ఇవ్వవచ్చు.

యంత్రపరికరాలు హైద్రాబాద్, సికింద్రాబాద్ నగరాలలో లభ్యమవుతాయి.

పెట్టుబడిని గురించి ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ వివరాలు చూడండి.

# బిరియానీ సెంటర్

నోరూరుంచే మసాలా రుచులతో బిరియానీలు అందిస్తూ కస్టమర్స్‌ని ఆకట్టుకునే ఈ బిరియానీ సెంటర్ నిర్వహణ అధికలాభాలను ఆర్జించి పెట్టే సులువైన వ్యాపారం. హోటల్, రెస్టారెంట్ నిర్వహణకు పెట్టవలసినంత పెట్టుబడిగానీ, ఎస్టాబ్లిష్‌మెంట్‌గానీ దీనికి అవసరంలేదు. రెండుమూడు రకాల బిర్యానీలూ, నాలుగయిదు రకాల నాన్‌వెజ్ 'కర్రీస్ తప్ప, కూరగాయలూ, పులుసులు, పప్పులూ, రసాలు, సాంబార్, పచ్చళ్ళు, వేపుళ్ళు వగయిరాలవంటివి తయారుచేయనవసరం లేదు. డాల్డా, అప్పడాల ప్రసక్తి వుండదు. భోజన ప్రియులను, ముఖ్యంగా బిరియానీ ప్రియులను దృష్టిలో వుంచుకుని ఈ బిరియానీ సెంటర్‌లు అక్కడక్కడే వెలుస్తున్నాయి. ఆఫీసులకూ, సినిమాహాళ్ళకూ, లాడ్జింగ్‌లకూ, రైల్వేస్టేషన్, బస్‌స్టాండ్, వైన్‌షాప్‌వంటి వాటికి దగ్గరలో ఈ బిరియానీ సెంటర్ ప్రారంభించి నిర్వహిస్తే.......మంచి గిరాకీ వుంటుంది.

**'రా' మెటీరియల్స్ (ముడిసరుకులు):-** 1. నెంబర్ వన్ క్వాలిటీ బాసుమతి బియ్యం. 2. మటన్3. చికెన్ 4. ప్రాన్స్,ఎగ్స్ వగయిరాలు 5. ఉల్లిపాయలు 6. పెరుగు. 7. మసాలా సరుకులు 8. బిరియానీలో కలుపుకునే సువాసన ద్రవ్యాలు 9. నెయ్యి. లేక డాల్డా మరియు రిఫైన్డ్ ఆయిల్.

**ఫార్ములా:-** 1. రైస్ 1KG కి. 2 మటన్ లేక చికెన్, లేక రొయ్యలు 1KG 3. లవంగాలు 5 గ్రా. దాల్చినచెక్క 5 గ్రా. 4. ఏలకులు 5 5. డాల్డా 200 . 6. ఉప్పు తగినంత 7. అల్లం 100గ్రా 8. పచ్చి మిరపకాయలు పెద్దవి 75గ్రా. 9. బిరియానీ లీఫ్ తగినంత 10. ఉల్లిపాయలు పెద్దవి రెండు. 11. పెరుగు కావలసినంత 12. వెల్లుల్లి 100గ్రా॥ 13. సువాసన ద్రవ్యాలు తగినంత 14. ధనియాలు 50గ్రా। 15. గసగసాలు 25గ్రా.

**అవసరమయిన (వంట) సామగ్రి:-** 1. ట్రిపుల్ బర్నర్ గ్యాస్ స్టవ్‌లు2, 2. పెద్దసైజు రాగిపాత్రలు మూడు, 3. స్టీలుబేసిన్‌లు, గరిటెలూ, డిష్‌లూ, పాత్రలు

4 పెద్ద సైజు జల్లి గరిటె 5. కత్తులూ, కత్తిపీట 6. గ్యాస్ సిలెండర్ 7. నిప్పులు చేసేందుకు అవసరం అయిన బొగ్గులు 8. ప్లేట్లు, గ్లాసులు 9. టేబుల్స్, కుర్చీలూ, 10. వాష్‌బేసిన్ 11. పార్శిల్స్ పేకింగ్ మెటీరియల్

**తయారుచేయు విధానము:-** ఏలకులు, లవంగాలు, ధనియాలు, దాల్చిన చెక్క, అల్లం, వెల్లుల్లి అన్నీ కలిపి మిక్సీలో వేసి ముద్దచేసి వుంచుకోవాలి. స్టవ్ మీద వెడల్పాటి పాత్రవుంచి అందులో 50గ్రాములు డాల్డా 100గ్రాములు నెయ్యి వేసి కరిగించాలి. అది కరిగిన తరువాత మరాఠీ మొగ్గ బిరియానీ లీఫ్ మొదలయిన సువాన ద్రవ్యాలు ఉల్లిపాయముక్కలు, పచ్చిమిరపకాయలూ, ముద్ద చేసిన మసాలాను వేసి బాగా వేయించాలి. చికిన్ పీసెస్‌ని శుభ్రంగా కడిగి ఆమిశ్రమంతో పాటే దోరగా వేయించాలి. ఇందులో ఒక కట్ట పుదీనా ఆకు వేయాలి. మసాలతో పాటు వేగిన చికెన్ పాత్రల్తో రెండులీటర్ల నీళ్ళు పోసి మరిగించాలి. నీళ్ళు బాగా మరిగిన తరువాత కడిగిన బియ్యాన్ని అందులో వేయాలి. పక్వంగా ఉడికిన తరువాత దించాలి. అంతే! వేడి వేడి రుచికరమయిన బిరియానీ రెడీ! దీంట్లో కలుపుకోటానికి ఉల్లి చట్నీ మటన్ హేర్వావ తయారుచేసి వుంచుకోవాలి! కస్టమర్స్‌కి అందించి సొమ్ముచేసుకోవాలి. రోజంతా కాకుండా సాయంత్రం ఆరుగంటలనుంచి రాత్రిపది గంటల వరకూ బిరియానీ సెంటర్ నిర్వహిస్తే చాలు. మీరు అందించే క్వాలిటీ, రుచులను బట్టి ఊపిరి సలుపుకోలేనంత గిరాకీని సంపాదించుకుని దండిగా లాభాలు ఆర్జించవచ్చు. ఈ బిరియానీ సెంటర్ నిర్వహణలో అన్ని ఖర్చులూ పోగా 40% దాకా లాభం వుంటుంది.

పెట్టుబడిని గురించి ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ వివరాలు చూడండి.



# ప్లాస్టిక్ కవర్లు

చాలాకాలం జాగ్రత్తగా వుంచుకోవలసిన వస్తువులకోసం ప్లాస్టిక్ కవర్స్ ఉపయోగించటం అందరికీ తెలిసిందే. ప్లాస్టిక్ మెటీరియల్స్ వాటర్ ప్రూఫ్. కాబట్టే పేపర్స్‌తో కార్డ్ బోర్డులతో తయారుచేసిన కవర్స్ కంటే ప్లాస్టిక్ కవర్స్ మన్నిక ఎక్కువ. ముఖ్యమయిన పుస్తకాలకూ, కళ్ళజోళ్ళకూ, బేంక్ పాస్ బుక్‌లకూ, ముఖ్యమయిన డాక్యుమెంట్స్ భద్రతకూ, కొన్ని రకాల పాపులర్ ప్రొడక్ట్స్‌కీ ఈ ప్లాస్టిక్ కవర్స్ తప్పనిసరిగా ఉపయోగిస్తారు. ఈ ప్లాస్టిక్ కవర్లకి ప్రస్తుతం మార్కెట్‌లో విపరీతమయిన గిరాకీ వుంది. గిరాకీని బట్టే లాభం కూడా వుంటుందిమరి.

**'రా'మెటీరియల్స్ (ముడిసరుకులు):-** 1.P.V.C. షీట్స్ (వివిధ రంగుల్లో) 2. జిప్స్, 3. బటన్స్ 4. ఎంబోసింగ్‌కోసం బ్లాక్స్.

**ఫార్ములా:-** ప్రత్యేకమయిన ఫార్ములాలేదు. మెజర్‌మెంట్స్ కటింగ్, మెషీన్స్ ఆపరేటింగ్, మేకింగ్ ఎక్స్‌పీరియన్స్ వుంటే చాలు.

**మేకింగ్ మెషినరీ:-** 1. ఎంబోజింగ్ యంత్రం 2. బ్లాక్స్ 3. హేండ్‌టూల్స్ 4. ప్లాస్టిక్ వెల్డింగ్ మెషీన్ 5. పాలిథీన్ బేగ్స్ (వివిధ సైజులలో)

**తయారుచేయు విధానము:-** అవసరమయిన రంగులో P.V.C షీట్‌ను తీసుకుని, ముందుగా రెడీచేసుకున్న మెజర్‌మెంట్స్‌తో డిజైన్, ఆకారము వచ్చేలా కట్ చేసుకోవాలి. బ్లాక్‌లను ఉపయోగించి, ఎంబోజింగ్ యంత్ర సహాయంలో కవర్స్‌మీద ఆకర్షణీయమయిన డిజైన్ గానీ, అక్షరాలను కాని ప్రింట్ చేసుకోవాలి (ఇది కవర్ తయారయిన తరువాత కూడా చేసుకోవచ్చు) ఆ తరువాత కావాల్సిన ఆకారాలలో కట్‌చేసి వుంచుకున్న P.V.C. షీట్స్ భాగాలను ప్లాస్టిక్ వెల్డింగ్ మెషిన్‌తో అతికించాలి. చివరిగా జిప్స్ ప్రెస్సింగ్ బటన్స్ లాంటివి అవసరం అయిన చోట బిగించి, ఫినిషింగ్ ఇచ్చి, సైజులవారీగా పాలిథిన్ బేగ్స్‌లో పేక్‌చేసి మార్కెట్‌లో విడుదల చేయాలి.

యంత్ర పరికరాలు బొంబాయి, ఢిల్లీ నగరాలలో లభ్యమవుతాయి. పెట్టుబడిని గురించి ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ వివరాలు చూడండి.

# ఫ్లాష్‌గన్స్ (ఎలక్ట్రానిక్)

*రీఛార్జిబుల్ బేటరీ సహాయంతో పనిచేసే ఫ్లాష్‌గన్స్ చీకటిలో కూడా ఫోటోలు పెరఫెక్ట్‌గా తీయగల సామర్థ్యాన్ని కెమెరాలకి సమకూరుస్తాయి. కెమెరాలకు అనుబంధంగా అమర్చే ఈ ఫ్లాష్‌గన్స్ ప్రొఫెషనల్ ఫోటోగ్రాఫర్స్‌కి ఎంతగానో ఉపయోగపడతాయి.*

*కరెంట్ ఫెయిల్‌కావచ్చు, వోల్టేజ్ తగ్గిలైట్స్ డిమ్ అయిపూర్తి స్థాయి కాంతిని అందించలేకపోవచ్చును. అటువంటి సమయాలలో ఈ ఫ్లాష్‌గన్స్ అద్భుతమయిన పనితనాన్ని చూపిస్తాయి. సినిమా కెమెరా మేన్‌లు విదేశాల నుండి దిగుమతి అయిన ఈ ఫ్లాష్‌గన్స్‌ని ఎక్కువగా ఉపయోగిస్తుంటారు.*

**'రా' మెటీరియల్స్ (ముడిసరుకుల):-** 1. ప్లాస్టిక్ స్విచ్‌లు, 2. ప్రింటెడ్ సర్క్యూట్ బోర్డ్ 3. ప్లాస్టిక్ బాక్స్ 4. ప్లాస్టిక్ కవర్డ్ కాపర్‌వైర్ 5. ఫిటింగ్ మెటీరియల్ 6 అవసరం అయిన ఇతర పరికరాలు. టెమర్స్, అసిలేటర్ సర్క్యూట్స్, వోల్టేజమల్టిప్లయిర్, ఫ్లాష్‌ట్యూబ్, రిఫ్లెక్టర్, ఎలక్ట్రో కెపాసిటేటర్, వైర్‌కోర్.

**ఫార్ములా:-** ఎలక్ట్రానిక్స్ మెకానిజం తెలియటం, ఎలక్ట్రానిక్ విడిభాగాల అసెంబ్లింగ్‌లో ఎక్స్‌పిరియన్స్,

**యంత్రపరికరములు:-** 1. సెమీ ఆటోమేటిక్ బైండింగ్ మెషిన్ 2. పరీక్షాపరికరాలు 3. వి.టి.హెచ్. ఎం.హెచ్. టి.ప్రోబ్. రికార్డర్. అపిలోస్కోప్, స్పెక్ట్రోమీటర్, ఫ్లోరెసెన్స్. 4. ప్లాస్టిక్ మౌల్డ్ మెషీన్.

***తయారుచేయు విధానము:-*** ఎలక్ట్రోలటిక్ కెపాసిటేటర్ స్విచ్‌లు, బేటరీ కనెక్టర్, మరియు, స్విచ్‌లను ప్లాస్టిక్ బాక్స్‌కి బిగించాలి. టెమర్స్, అసిలేటర్ సర్క్యూట్స్, వోల్టేజ్ మల్టీప్లయిర్ మూడింటినీ ప్రింటెడ్ సర్క్యూట్ మీదికి ఎక్కించాలి. ఫ్లాష్ ట్యూబ్ రిఫ్లెక్టర్‌ని ప్లాస్టిక్ బాక్స్ వెనుక ఫిట్ చేయాలి. వీటన్నిటినీ కలిపేందుకు వీలుగా ఒక వైర్‌కోర్‌లో కనెక్షన్ ఇవ్వాలి.

ఇక ఫ్లాషగన్ పనితనాన్ని........ దాని నిర్దేశితకాంతి ప్రసరణ వైశాల్యాన్ని తగిన యంత్రాల ద్వారా పరీక్షించి పూర్తి స్థాయిలో పనిచేస్తున్నదో లేదో తెలుసుకోవాలి.

ఈ ఫ్లాష్‌గన్స్ తయారు చేయటానికి అవసరం అయిన లైసెన్స్‌లు పొంది, ఎలక్ట్రానిక్స్ డీలర్స్‌కి వీటిని సప్లయ్ చేయటం ద్వారా మార్కెట్ చేయాలి.

పెట్టుబడిని గురించి ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ వివరాలు చూడండి.

# ఫ్లోర్‌క్లీనింగ్ పాలీష్

ఆధునిక గృహనిర్మాణంలో ఫ్లోరింగ్ ఒక ప్రత్యేకమయిన స్థానాన్ని సంపాదించుకుంది. భవంతులే కాకుండా సాధారణమయిన పెంకుటిళ్ళు, డాబా ఇళ్ళు నిర్మించుకునేవాళ్ళు కూడా ఫ్లోరింగ్‌విషయంలో ప్రత్యేకమయిన శ్రద్ధతో కూడిన అభిరుచిని కనబురుస్తున్నారు. మట్టి ఇళ్ళు అలుక్కోవటం, సిమెంట్‌గచ్చును తడిగుడ్డతో పరిశుభ్రం చేసుకోవటం వంటి పరిశుభ్రత ప్రక్రియలను దాటి మిల్క్‌వైట్ స్టోన్ పాలిషింగ్ బ్లాక్ స్టోన్, మొజాయిక్, స్ఫార్టెక్స్ మొదలయినవి ఫ్లోర్‌నిర్మాణంలో ఎప్పుడో చోటుచేసుకున్నాయి. దేనితో నిర్మించినా మురికి పట్టడం, దుమ్ము ధూళిపేరుకోవటం సహజంగా జరుగుతుంటుంది. ఆ మురికిని వదిలించి ఫ్లోర్‌ని నీట్‌గా షైనింగ్‌గా వుంచటానికి ఉద్దేశించిందే ఈ ఫ్లోర్‌క్లీనింగ్ పాలీష్ పరిశుభ్రతను పాటించే గృహిణులకు ఇది ఎంత ఉపయోగంగా వుంటోంది అందుకే దీనికి మార్కెట్‌లో మంచి డిమాండ్ కూడా వుంది.

**'రా' మెటీరియల్స్ (ముడిసరుకులు):-** 1. పారాఫిన్ మైనం 2. కాస్టిక్ పొటాష్ 3. స్వచ్ఛమయిననీరు 4. కాగ్నుబా 5. తేనె మైనము 6. రోజిన్ 7. టర్పెనాల్ (సువాసనకు)

**ఫార్ములా:-** పారాఫిన్ మైనం 150 గ్రాములు, కాస్టిక్ పొటాష్ 25 గ్రా॥ స్వచ్ఛమయిన నీరు 800 మి.లీ., కాగ్నుబా 75 గ్రా॥, తేనె మైనం 50 గ్రా॥, రోజిన్ 25 గ్రా॥, టర్పెనాల్ తగినంత

**యంత్రపరికరములు:-** 1. హోమోజినైజర్ 2. అవసరం అయిన పాత్రలు 3. మిక్సర్. 4. కొయ్యగరిటెలు 5. పేకింగ్ మెటీరియల్స్ (ప్లాస్టిక్ కంటెయనర్స్, గాజ సీసాలు, ఎనామిల్ రేకు టిన్స్)

***తయారుచేయువిధానము:-*** పారాఫిన్ మైనం, కాగ్నుబాలను ఒక పాత్రలో వేసి సన్నటి సెగలో వేడి చేసి కరిగించి వుంచుకోవాలి. తేనె మైనం, కాస్టిక్ పొటాష్ రోజన్‌ల మిశ్రమంలో లిక్విడ్ సోడ్‌ను తయారుచేసి, ఆ లిక్విడ్‌లో, కరిగించిన పారాఫిన్‌మైనం, కాగ్నుబాలమిశ్రమాన్ని వేసి బాగా మిక్స్‌చేసి తగినంత టార్పెనాల్ సుగంధాన్ని చేర్చాలి. ఆ తరువాత మొత్తం మిశ్రమాన్ని హోమజీనైజర్‌లోకి పంపాలి అన్ని మెటీరియల్స్ బాగా మిక్స్ అయిన తరువాత........గాజు సీసాలలోనూ, ప్లాస్టిక్ కంటయినర్‌లలోనూ, డబ్బాలలోనూ పేక్‌చేసి ఆకర్షణీయంగా ప్రింట్‌చేయబడిన లేబుల్స్ అతికించి మార్కెట్ చేయండి.

పెట్టుబడిని గురించి ప్రాజెక్ట్ ఎస్టిమేషన్‌లో చూడండి.

# పెన్ పాళీలు

ఫౌంటెన్ పెన్‌కి సిరా ప్రాణంలాటిదయితే ఆ ప్రాణాన్ని సరయిన పద్ధతిలో జీవింపచేసేది పాళీ అని చెప్పవచ్చును. సరయిన పాళీలేకపోతే ఎంతటి నాణ్యతగల సిరాతో వ్రాసినా రాతలో స్పష్టత ప్రయోజనం వుండదు. పెన్‌కి పాళీ అంతముఖ్యమయినది. ఈ పాళీలను వివిధ లోహాలతో చేస్తారు. ఖరీదయిన పెన్‌లకు వెండి, బంగారం వంటి లోహాలను కూడా ఉపయోగిస్తారు. పెన్‌లవాడుక ఉన్నంత వరకూ ఈ పాళీల అవసరం, వాటికి మార్కెట్‌లో డిమాండ్ వుంటూనే వుంటుంది.

**'రా'మెటీరియల్ (ముడిసరుకులు):-** 1. నిర్ణయింపబడిన లోహం (టంగస్టన్, బ్రాస్‌మెటల్, స్టెయిన్‌లెస్ స్టీలు, వెండి, బంగారం మిశ్రమ లోహం, మొదలయినవి) 2. డైల్యూటెడ్ సల్ఫ్యూరిక్ ఏసిడ్ 3. పేకింగ్ మెటీరియల్.

**ఫార్ములా:-** మేకింగ్ మెథడ్ తెలిసివుండాలి. మెషిన్స్ ఆపరేట్ చేయడంలో అనుభవం లేక ట్రయినింగ్.

**యంత్రపరికరాలు:-** 1 పాయింట్ గ్రైండింగ్ యంత్రం 2. డైస్ 3. ప్లేటింగ్ ఎక్విప్‌మెంట్ 4. యస్.టి.పవర్‌ప్రెస్ 5. పాయింట్ వద్ద చీలిక చేసే యంత్రం 6. వెల్డింగ్ మెషిన్ 7. హేండ్‌ప్లైప్రెస్‌లు 8. పాలీష్ తొట్టె 9. నికెల్ లేదా గోల్డ్‌పూత.

**తయారుచేయు విధానము:-** ఎంచుకున్న మెటల్‌ని నిర్దేశిత యస్.డబ్ల్యు.జి.గేజ్‌లో తీసుకుని డైస్ ఉపయోగించి ఆకారాలు వచ్చేలా బ్లాంక్ పంచ్ చేయాలి. ఆ తరువాత సెంటర్‌హోల్ పంచ్ చేయాలి. వ్రాయటానికి అవసరం అయిన నిబ్ పాయింట్స్‌ని ఇండియమ్‌తో వెల్డింగ్ చేసి, డైల్యూట్ సల్ఫ్యూరిక్ యాసిడ్‌లో ముంచాలి. నిబ్స్‌ని అవసరమయిన పరిమాణానికి పాయింట్ గ్రైండింగ్ యంత్రంలో గ్రైండింగ్ చేయాలి. ఆ తరువాత స్లిట్టింగ్ మెషిన్ ఉపయోగించి పాయింట్ దగ్గర మధ్యన చీలిక పెట్టాలి. పాళీపాయింట్‌ని డైలో పెట్టి ప్రెస్ చేసి నికెల్ ప్లేటింగ్ చేసి అమ్మకానికి సిద్ధంగా అట్టబాక్స్‌లలో వుంచి మార్కెట్ చేయాలి.

పెట్టుబడిని గురించి ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ వివరాలు చూడండి.

# స్వీట్ బ్రెడ్

అది మహానగరమయినా, ఒక మోస్తరు పట్టణమయినా, చివరికి చిన్న గ్రామమయినా బ్రెడ్ అవసరం తప్పనిసరిగా వుంటుంది. అధిక పోషక విలువలను కలిగి, ఈజీ డైజెస్టెడ్ ఆహారంగా డాక్టర్లచే గుర్తింపు పొందినది బ్రెడ్. పేదవారికి సైతం అందుబాటు ధరలో లభించే ఈ బ్రెడ్ తయారుచేయటం కూడా తేలిక. మార్కెట్‌లో దీనికి వున్న డిమాండ్ అపరిమితం. అందరికీ అందుబాటులో వుండే ఈ బ్రెడ్ తయారీ మంచి లాభసాటి పరిశ్రమ అని చెప్పొచ్చు.

**'రా' మెటీరియల్స్ (ముడిసరుకులు):+ఫార్ములా:** 1. పంచదార 350గ్రా॥ 2. కంప్రెస్‌డ్ ఈస్ట్ 30 గ్రా॥ 3. మిల్క్ పౌడర్ 500 గ్రా॥ 4 . గోధుమ పిండి 1KG 5. నీరు (స్వచ్ఛమయినది) తగినంత 6. బటర్ 50 గ్రా॥ 7. నెయ్యి లేక నూనె 50 గ్రా॥

**యంత్ర పరికరములు:-** 1. బేకరీ ఓవెన్ 2. బ్రెడ్ డైస్ (వివిధ సైజులలో) 3. వివిధ రకాల పాత్రలు 4. స్లైస్ కట్టర్స్ 5. పేకింగ్ మెటీరియల్. 6. పేపర్‌గమ్ (ఆఫీస్‌గమ్)

**తయారుచేయు విధానం:-** ఒక లోతయిన పాత్రలో పంచదార వేసి తగినంత నీరు పోసి బాగా కరిగించాలి. ఆ కరిగిన నీటిలో గోధుమ పిండిని కలిపి, ముందుగా నీటిలో కలిపి వుంచుకున్న ఈస్ట్ ద్రవాన్ని వేసి బాగా తట్టి పిసకండి. అలా కలిపే టప్పుడు చేతికి నూనె రాసుకుంటే పిండి అంటకుండా వుంటుంది. బాగా తట్టి పిసికిన ఈస్టు పంచదార, గోధుమల మిశ్రమం ముద్దను 3 గంటలపాటు అలాగే వదిలేస్తే. పిండి బాగా పొంగి రెట్టింపు అవుతుంది. ఈస్ట్ కలపటం వల్లనే యిలా జరుగుతుంది. అప్పుడు పిండిమొత్తాన్ని... సమాన తూకంతో విభజించి..ఒకేసైజులో వుండేలా వుండలుచేసి, నూనె రాసిన డైస్ వేయాలి. కొద్దినిముషాల తరువాత పిండిముద్దలు డైస్ ఆకారంలో సర్దుకుంటాయి. ఆ డైస్‌ని 50 డిగ్రీల సెంటీగ్రేడ్ హీట్ వద్ద ఒక అరలో 40 నుండి 60 నిముషాల పాటు వుంచితే ఈస్ట్ రియాక్షన్స్ వల్ల డైస్‌లోని పిండి ముద్దలు బరువులోనూ, సైజులోనూ పెద్దవిగా మారతాయి. ఆ తరువాత ఆ డైస్ ట్రేని 240, లేక రెండు వందలయాభై డిగ్రీల సెంటీగ్రేడ్ హీట్‌లో ఓవెన్‌లో వుంచి బేకింగ్ చేయాలి. 45 నిముషాలలో బ్రెడ్ తయారవుతుంది. ఆ తరువాత బ్రెడ్ పై భాగంలో లైట్‌గా వెన్నరాసి, స్లైస్‌లుగా కట్‌చేసి, ఆ స్లైస్‌లను అలాగే వుంచి ఆకర్షణీయమయిన డిజైన్స్‌లో ప్రింట్ చేయబడిన బేకరీ పేపంతో పేకింగ్ చేసి మార్కెట్‌లోకి విడుదల చేయాలి.

పెట్టుబడిని గురించి ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ వివరాలు చూడండి.

# టీ స్టాల్

*తక్కువ పాటి పెట్టుబడితో ఎవరయినా చేసుకోగల స్వయం ఉపాధి పథకం ఇది. టీస్టాల్స్ వీధికి ఒకటి వున్నా డిమాండ్, కస్టమర్ల ఫ్లోటింగ్ ఏమాత్రం తగ్గని వ్యాపారం ఇది. చాలామంది భోజనానికి ఇవ్వని ప్రాధాన్యతను టీ త్రాగటానికి ఇస్తారు. నైట్ డ్యూటీ చేసేవాళ్ళకీ, పరీక్షలకు ముందు అర్ధరాత్రి దాకా చదువుకునే విద్యార్థులకూ, చాలా ఉపయోగకరమయినది ఈ టీ. పార్టీలలో ఎటువంటి పానీయాలను ఇచ్చినా దానిని 'టీ' పార్టీ అనే పిలుస్తుంటారు. టీ స్టాల్ నిర్వహణ అత్యంత లాభదాయకమయిన వ్యాపారం. టీస్టాల్‌లో బిస్కట్‌లూ, వెజిటబుల్ సమోసాలు, బ్రెడ్‌లూ, లాంటి డ్రైఫుడ్స్ కూడా అమ్మటం మనం చూస్తూనే ఉంటాము.*

**'రా' మెటీరియల్స్ (ముడిసరుకులు) :-** 1. పాలు 2. పంచదార 3. టీ పౌడర్ 4. బిస్కట్ పౌడర్ 5. కాఫీ పౌడర్ 6. హార్లిక్స్ 7. బోర్నవిటా మొ॥

**ఫార్ములా:-** ప్రత్యేకమయిన ఫార్ములా ఏమీలేదు. చక్కటి రుచిగల టీ తయారు చేయటంలోనూ, టీస్టాల్ నిర్వహణంలోనూ కొద్దిపాటి అనుభవం ఉండాలి అంతే!

**అవసరమయిన సామగ్రి:-** 1. స్టీలు పాత్రలు 2. పింగాణీ కప్పులూ, సాసర్లు 3. బాయిలర్, పెద్ద సైజు కిరోసిన్ స్టవ్‌లు... 4. స్పూన్‌లు 5. అల్యూమినియంలోతు ట్రేలు 6. గ్లాసులు 7. అద్దాల షోకేస్ 8. కాష్ కౌంటర్.

***నిర్వహణ విధానము:-*** టీ స్టాల్ నిర్వహించేది మీరే అయినా మీకు టీ తయారు చేయటం తెలిసివుండాలి. మంచి టీ మాస్టర్స్ ఇద్దర్ని పనిలో పెట్టుకోండి. (షిఫ్టు పద్ధతిలో) మీ టీ స్టాల్‌లో అందించే కాఫీ, టీ, రుచినీ చిక్కదనాన్ని మెయిన్‌టెయిన్ చేయండి. మీ టీ స్టాల్ మిరిచ్చే టీ ఎప్పుడూ ఒకేరకమయిన టేస్ట్‌లో వుండేలా శ్రద్ధ వహించటం ప్రధానం. ఒకే రకమయిన టేస్ట్‌కి అలవాటు పడిన కస్టమర్స్ తప్పనిసరిగా మీ స్టాల్‌కే వచ్చి టీ త్రాగటం కాకుండా, ఫలానా స్టాల్‌లో టీ బాగుంటుంది అని పదిమందికీ చెప్పే అవకాశం ఉంది. ఆ తరువాత మీ చుట్టు పక్కలఉండే షాపులకూ, ఇతర వ్యాపార సంస్థలకూ టీలు అందించేందుకు కమీషన్ పద్ధతిలో పనిచేసే ఒకరు లేక ఇద్దరు కుర్రాళ్ళకు (బార్‌వాలాలు) నియమించుకోండి. శుచీ, శుభ్రతా,రుచి, చిక్కదనం టీ..... గిరాకీని పెంచే ప్రధానసాధనాలు. ఈ టీస్టాల్ నిర్వహణకి పెట్టుబడి సుమారు 25 వేల రూపాయలు కావచ్చు (షాపు అడ్వాన్స్‌తో సహా) ఏ రోజులాభం ఆ రోజే లెక్క చూసుకోవచ్చు. ఈ టీస్టాల్ నిర్వహణలో అన్ని ఖర్చులూ పోనూ రోజు కనీసం ఏడెనిమిది వందలకు పైనే మిగులుతుంది.

పూర్తి వివరాలు ప్రాజెక్ట్ ఎస్టిమేషన్‌లో

# ఐరన్ కాట్స్

ఎక్కువ కాలం మన్నిక కలిగిన వస్తువులంటే ఎవరయినా ఇ
ఇష్టపడతారు. కాస్త రేటు ఎక్కువయినా ఎగబడతారు. ఇక ధరతక్కువ మన్ని
ఎక్కువ అంటే ఆ వస్తువులకు వుండే గిరాకీని గురించి ప్రత్యేకించి చెప్పనవసర
లేదు. అయిరన్ పైపులతో తయారుచేయబడే అయిరన్ కాట్స్ ఆ కోవ
చెందుతాయి. ఈ మంచాలకు ఇప్పుడు మార్కెట్‌లో చాలా గిరాకీ వుం
గవర్నమెంట్, మరియూ కొన్ని ప్రయివేట్ హాస్పిటల్స్‌లోనూ ఈ అయిరన్ కాట్స్
వాడతారు. ఐరన్ పైపులను బెండ్‌చేయటం ద్వారా తయారుచేసే ఈ అయిర
కాట్స్ మంచిలాభాలను చేకూర్చే పరిశ్రమ,

**'రా'మెటీరియల్స్ (ముడిసరుకులు):-** 1. వివిధ సైజులలో (మంద
అయిరన్ పైపులు 2. పెయింట్, థిన్నర్ 3. అయిరన్ షీట్స్, వివిధ గేజ్‌ల
(18 నుండి 22)

**ఫార్ములా:-** మేకింగ్ ఎక్స్‌పీరియన్స్ తప్ప, ప్రత్యేకమయిన ఫార్ములా అంటూ ఏమీలేద

**యంత్ర పరికరములు:-** 1. ఆర్క్ వెల్డింగ్ మెషిన్ 2. వెల్డింగ్ రాడ్స్ 3. పై
బెండింగ్ మెషిన్ 4. మోటార్ డ్రిల్లింగ్ మెషిన్ 5. ఫ్లెక్సిబుల్ షాఫ్ట్ గ్రైండ
6. స్ప్రేపెయింటింగ్ గన్ 7. థిక్ గేజ్డ్ యం.యస్ షీట్స్ లేదా ప్లాస్టిక్ నవ్వారు
8. మెజర్‌మెంట్ టూల్స్ 9 రివిట్స్ 10. ఫిట్టింగ్స్

**తయారుచేయు విధానము:-** కావల్సిన మెజర్‌మెంట్స్‌తో వివిధ సైజుల
అయిరన్ పైపులు తీసుకోవాలి. వాటిని బెండింగ్ మెషిన్ సహాయంతో అవసరం అయి
ఆకారంలో బెండ్ చేసి, ఆర్క్ వెల్డింగ్ మెషీన్ ఉపయోగించి బెండ్ చేసిన పైపులన
తగిన విధంగా జాయింట్ చేస్తూ వెల్డింగ్ చేయాలి: ఆ తరువాత పైపులన
సమానమయిన కొలతలలో తీసుకొని, జాయింట్ ఫోల్డింగ్ లెగ్స్ కానీ, పెర్మనెం
లెగ్స్ కాని వెల్డింగ్‌చేసి రివిట్స్‌తో ఫిట్ చేయాలి. తలభాగంలో కాస్త ఎత్తుగాను
కాళ్ళభాగంలో పైపులు బిగించాలి. (అవసరాన్ని బట్టి థిక్ గేజ్ అయిరన్ షీట్‌న
ప్లాట్‌ఫారంగా అమర్చుకోవచ్చు) లేదా ప్లాస్టిక్ డిజైన్డ్ నవ్వారు నేత పద్ధతిల
అమర్చుకోవచ్చు. బెండింగ్ ఫిట్టింగ్స్ వెల్డింగ్స్ పూర్తి అయిన తరువాత ఫ్లెక్సిబుల్ షా
గ్రైండర్‌లో వెల్డింగ్ పాయింట్స్ దగ్గర ఫినిషింగ్ ఇవ్వాలి. ఆ తరువాత రెగ్యులర్ ఆలివ్‌గ్రీ
పెయింట్‌నే స్ప్రేగన్‌తో స్ప్రే చేసి పెయింట్ వేయలి. అంతే! అయిరన్ కాట్స్ రెడీ!

ఈ అయిరన్ కాట్స్ తయారీకి అవసరమయిన యంత్రపరికరాలు విజయవాడ
హైద్రాబాద్, మద్రాస్ నగరాలలో లభిస్తాయి.

పెట్టుబడిని గురించి ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ వివరాలు చూడండి.

# డెకరేటింగ్ యూనిట్

నాగరిక ప్రపంచంలో, ముఖ్యంగా అభివృద్ధి చెందుతున్న నగరాలలోనూ, పట్టణాలలోనూ ప్రతిరోజూ ఎక్కడో ఒకచోట, ఏదో ఒక ఉత్సవం (ఫంక్షన్) జరుగుతూనే వుంటుంది. ఆడంబరంకోసం కాకపోయినా, అందరితో కలసి ఆనందాన్ని పంచుకోవటం కోసమయినా ఆయా ఉత్సవాలను గొప్పగా, ఘనంగా కన్నుల పండుగగా జరుపుకోటానికి ప్రతివారూ ఇష్టపడుతుంటారు. పొదుపునూ, సింప్లిసిటీని పాటించే వాళ్ళు కూడా ఈ విషయంలో వెనుకాడరని చెప్పవచ్చు! పెళ్లిళ్ళు, యానివర్సిరీలూ, ఓపెనింగ్ సెర్మనీస్, మొదలయిన అనేక ఉత్సవాల సందర్భాలలో, ఇంటినీ, కళ్యాణ మంటపాలనూ, భవంతులనూ, ఫ్యాక్టరీలనూ చూడముచ్చటగా అలంకరిచడం మనం తరుచూ చూస్తూనే వుంటాం. దేవీనవరాత్రి, గణపతినవరాత్రి సందర్భాలలో ఈ అలంకరణ మరింత ఎక్కువగా, శోభాయమానంగా ఉంటుంది. అటువంటి అలంకరణ సామగ్రిని అద్దెకు ఇచ్చే డెకరేటింగ్ యూనిట్‌ని సప్లయ్ చేయటం ఆదాయంతో కూడుకున్నదన్న విషయం అవాస్తవంకాదు!

**డెకరేటింగ్ మెటీరియల్స్ (అలంకరణ సామగ్రి):-** 1. ట్యూబులైట్స్ 2. డూమ్‌లైట్స్ 3. ప్లాస్టిక్ ఫ్లవర్ తోరణాలు (వివిధ రంగులలో కూడినవి) 4. రంగు రంగుల పేపర్ ఫ్లవర్ తోరణాలు 5. లైట్ సెట్టింగ్ ఫ్రేమ్స్ (వివిధ డిజైన్స్‌తో ఆకారాలతో కూడినవి) 6. పందిరి సీలింగ్ డెకరేషన్ ఉపయోగించే లాంగ్ సైజ్ వైట్ క్లాత్. 7. రంగు రంగుల సీరియల్ బల్బ్‌తోరణాలు 8. గేట్ సెట్టింగ్స్. 9. ఎంప్లెప్లేన్స్ 10. స్విచ్ బోర్డ్స్ 11. ప్లాస్టిక్ కవర్డ్ ఎలక్ట్రిక్ వైర్స్ 12. బల్బుఫిట్టింగ్ వెల్‌కంబోర్డ్స్ 13. అవసరం అయిన ఎలక్ట్రిక్ ఎక్విప్‌మెంట్ 14. స్టేజ్ డెకరేషన్ ఎక్విప్‌మెంట్ 15. ఆటోమేటిక్ ఎలక్ట్రిక్ రొటేటర్స్.... ఇంకా మరికొన్ని అవసరమయిన పరికరాలు

**ఫార్ములా:-** ఎలక్ట్రిక్ మెకానిజం, డెకరేటింగ్ ఎక్స్‌పీరియన్స్, వెరైటీ డెకరేషన్ చేయగలగటం.

**నిర్వహణ విధానము:**-తగిన పెట్టుబడితో పైన ఇవ్వబడిన మెటీరియల్స్ ఒకేసారి నాలుగయిదుచోట్ల (కనీసం ఒకటి రెండు చోట్లయినా ఫరవాలేదు) డెకరే చేసేందుకు సరిపడా సమకూర్చుకోవాలి. నిపుణులయిన ఎలక్ట్రిషియన్స్‌ని మాస్ట డెకరేటర్స్‌ని లేదా డెకరేషన్ చేయటంలో అనుభవం ఉన్న యువకులను పని పెట్టుకోవాలి. మీ నిర్వహణలో వున్న డెకరేటింగ్ యూనిట్ గురించి మీ వూళ్ళోనే కాకుం చుట్టు పక్కల ఊళ్ళల్లో కూడా తెలిసేలా పాంప్లెట్స్‌ద్వారా.........వాల్‌పోస్టర్స్ ద్వా ప్రచారం చేసుకోవాలి. మీరు డెకరేట్ చేసే ఒక్కో రకమయిన మెటీరియల్, ఐటమ్ రోజుకి ఇంత అద్దె అని ముందే నిర్ణయించాలి. బ్రోకెన్ లేదా మిస్సింగ్ అయిటమ్స్ ఉత్సవ నిర్వాహకులే పూర్తి రేటు చెల్లించేలా ముందుగానే మాట్లాడుకోవాలి. మొత్త అద్దెలో సగం అమౌంట్ అడ్వాన్స్‌గా తీసుకోవాలి. డెకరేషన్ వున్నన్ని రోజులూ మీ వర్కర్ నిర్వాహకులే భోజన సదుపాయాలు కల్పించేలా మాట్లాడుకోవాలి. మీ నియమాలత మీ దగ్గర లభించే డెకరేటింగ్ అయిటమ్స్‌తో కూడిన అగ్రిమెంట్ సమానమైన ప్రింటె పేపర్ మీద నిర్వాహకులతో సంతకం చేసుకోవాలి.

ఆ తరువాత డెకరేషన్ ప్రారంభించి ఫంక్షన్ నిర్వహణ ప్రదేశాన్ని అందంగ శోభాయమానంగా, చూపరులను ఆకట్టుకునే విధంగా.... వివిధ రకాలుగా డెకరే చేసి మీ డెకరేటింగ్ యూనిట్‌కి మంచి డిమాండ్‌ను సంపాదించుకోవాలి. మీ డెకరేటిం టాలెంట్ మీ ఆదాయం పెరుగుదలకు మూలం అని మరచిపోకూడదు. "డెకరేటిం మెటీరియల్స్ లేటెస్ట్‌వి బొంబాయి, మద్రాస్ నగరాలలో లభిస్తాయి.

పెట్టుబడిని గురించి ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ వివరాలు చూడండి.

# స్టీల్ బీరువాలు

ట్రంకు పెట్టెలలోనూ, చెక్కబీరువాలలోనూ బట్టలూ ఇతర ఖరీదయిన వస్తువులను భద్రపరచుకునే కాలం చెల్లిపోయింది. వాటి స్థానాన్ని స్టీలు బీరువాలు భర్తీ చేసికూడా చాలాకాలం అయింది. స్టీల్ బారువాల అవసరాన్ని వాటి ఉపయోగాన్ని అందరూ గుర్తించటంతో మార్కెట్‌లో వాటికి విపరీతమయిన డిమాండ్ పెరిగిపోయింది. అధికార, అనధికార కార్యాలయాలలో ముఖ్యమయిన డాక్యుమెంట్స్ ఫైళ్ళు భద్రపరిచేందుకు స్టీలు బీరువాలనే ఉపయోగిస్తున్నారు. ఒకప్పుడు ఇంట్లో స్టీల్ బీరువా వుండటం గృహసంబంధమయిన ఫ్యాషన్, ఇప్పుడది తప్పనిసరి అవసరం! అందుకే అనేక ప్రయోజనాలు కలిగిన ఈ స్టీలుబీరువాల తయారీ డిమాండ్‌తో కూడిన పరిశ్రమగా మంచి లాభాలను అందిస్తోంది.

**'రా' మెటీరియల్స్ (ముడిసరుకులు):-** 1.M.S. లేక B.P / CRBP షీట్స్ 2. గ్యాస్ 3. కార్బయిడ్ 4. అయిరన్ పైప్స్ 5. పెయింట్స్ (వివిధ రంగులలో ) 6 థిన్నర్

**ఫార్ములా:-** ప్రత్యేకమయిన ఫార్ములా ఏమీలేదు. మేకింగ్ ఎక్స్‌పీరియన్స్, మెషనరీ ఆపరేటింగ్ తెలిసివుంటే చాలు.

**యంత్రపరికరములు:-** 1. గ్యాస్ వెల్డింగ్ సెట్ 2. చేతితో ఉపయోగించగల బెండింగ్ మెషీన్ 3. షియరింగ్ మిషిన్ 4. ఎయిర్ కంప్రెషర్‌తో స్ప్రేపెయింటింగ్‌గన్ 5. బేస్ ప్లేట్ 6. మోటార్ డ్రిల్లింగ్ మెషీన్ 7. పవర్ కనెక్షన్ 8. హాండ్‌టూల్స్ 9. ప్లెగ్జిబుల్ షాఫ్ట్ గ్రైండర్ 10. రోలింగ్ టేప్ (కొలతలకోసం)

**తయారుచేయు విధానము:-** మార్కెట్ మూమెంట్‌ను బట్టి 18 నుండి 22 యస్.డబ్ల్యు.జి గేజ్‌లో అవసరం అయిన షీట్స్ తీసుకోవాలి. ముందుగా నిర్ణయించుకున్న మెజర్‌మెంట్స్ ననుసరించి కావాల్సిన సైజులలో షిరియంగ్ మెషన్ ఉపయోగించి షీట్స్ కట్ చేసుకోవాలి. తరువాత ఆ కట్‌చేసని షీట్స్‌ని బెండింగ్ యంత్రసహాయంతో

నిర్దేశిత ఆకారంలో బెండ్ చేయాలి. ఆలా కట్‌చేసి, బెండ్ చేసిన భాగాలను గ్యాస్ వెల్డింగ్ ద్వారా జాయింట్ చేసి ఖచ్చితమయిన షేప్ వచ్చేలా చూసుకోవాలి. బీరువాలోపలి భాగంలో అరలూ..... హేంగర్స్‌రాడ్, సీక్రెట్ లాకర్, దానిడోర్, బేస్‌మెంట్ లెగ్స్, డబుల్ డోర్స్ కరెక్ట్‌గా వుండేలా వెల్డింగ్ ద్వారా అమర్చాలి. చివరిగా ప్లెగ్జిబుల్ షాఫ్ట్ గ్రైండర్‌తో వెల్డింగ్ స్పాట్స్ దగ్గర గరుకుదనాన్ని, హెచ్చుతగ్గులను సరిచేసి ఫినిషింగ్ ఇచ్చి లాక్ సిస్టమ్‌ని బిగించాలి ఆ తరువాత మార్కెట్ డిమాండ్‌లో వున్న పెయింట్‌ను ప్రధానంగా తీసుకుని స్ప్రేగన్‌తో పెయింటింగ్ చేయాలి. అది బాగా ఆరిన తరువాత నికిల్ కోటెడ్ హేండిల్ ని బిగించి బీరువాను అమ్మకానికి సిద్ధం చేయాలి.

అవసరం అనుకుంటే బీరువాలో ఒకడోర్‌కి (మనకి కుడివైపున వుండాలి) వెల్డింగ్ ద్వారా ఫ్రేమ్‌ను అమర్చి, చెక్కుడు డిజైన్‌తో వున్న నిలువుటద్దాన్ని ఫిట్ చేయాలి. బీరువా చాలా కాలం మన్నాలంటే నాణ్యతగల మెటీరియల్స్‌ని ఉపయోగించాలి. అప్పుడే మీ పరిశ్రమ కూడా పదికాలాలపాటు నిలిచివుంటుంది.

యంత్రపరికరాలు హైద్రాబాద్, మద్రాస్ మరియూ బెంగుళూర్ నగరాలలో లభిస్తాయి.

పెట్టుబడిని గురించి ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ వివరాలు చూడండి.



# ఫ్యాన్సీ షాప్

*అలంకరణకు ప్రాధాన్యత పెరిగినప్పుడే ఫ్యాన్సీ వస్తువుల గిరాకీ కూడా బాగా పెరిగింది. నాగరిక ప్రపంచంలో రోజు రోజుకీ పెరిగిపోతున్న అలంకరణ పద్ధతులను బట్టి వివిధ ఫ్యాషన్స్‌లో ఎప్పటి కప్పుడు కొత్త ఫ్యాన్సీవస్తువులు మార్కెట్‌లోకి విడుదలవుతున్నాయి. రకరకాల ఫ్యాన్సీ వస్తువులు తయారుచేయటం ఎంత లాభదాయకమో ఈ ఫ్యాన్సీ షాప్ నిర్వహణ కూడా అంతే లాభసాటి వ్యాపారంగా మారింది. ఫ్యాన్సీ వస్తువులకు సంబంధించినంత వరకూ మోడల్, ఫ్యాషన్‌లే ప్రధానం. ధరను గురించి ఆలోచించే ప్రసక్తి ఉండదు. ముఖ్యంగా ఆడవారు ముఖ్యంగా యువతులూ, కాలేజీ విద్యార్థినులు ఈ ఫ్యాన్సీ వస్తువులను ఉపయోగించటానికి ఎక్కువగా ఇష్టపడతారన్నది నిర్వివాదాంశం.*

**అమ్మకానికి కావలసిన వస్తువులు:-** 1. ప్లాస్టిక్ హెయిర్ క్లిప్స్, ఫ్లవర్స్, హెయిర్ బేండ్స్, పూసల దండలు, ఫ్యాన్సీ చైన్స్, గోల్డ్ కవరింగ్ ఆర్నమెంట్స్, రకరకాల గాజులు, రిబ్బన్స్, ఫ్యాన్సీ చెంప పిన్‌లు, వివిధ రంగులలో నెయిల్‌పాలిష్, పౌడర్‌లూ, వేనిషింగ్ క్రీమ్‌లు, మేకప్‌మెటీరియల్స్, ప్లాస్టిక్ బటన్స్, మెటల్‌హుక్స్, హేండ్‌బేగ్స్, లెదర్ పర్స్‌లూ, కీచైన్స్, ఫ్యాన్సీలైట్స్, వైర్‌బేగ్స్, ఆల్బమ్స్, ఫొటో ఫోల్డర్స్, ప్లాస్టిక్ ఫ్లవర్ వేజ్‌లు, గిఫ్ట్ ఆర్టికల్స్ యింకా లేటెస్ట్ ఫ్యాషన్‌కి సంబంధించి వివిధ రకాల, కంపెనీల ఫ్యాన్సీ ప్రొడక్ట్స్.

**నిర్వహణకు అవసరమైన సామగ్రి:-** 1. గ్లాస్ ఫిట్టింగ్ సేల్స్ కౌంటర్స్. 2. గ్లాస్ డోర్స్ అల్మైరాలు 3. షోకేస్‌లు 4. లైటింగ్ అరేంజ్‌మెంట్స్ 5. ఫ్యాన్లు 6. కాష్‌కౌంటర్ (సొరుగులతో) 7. వివిధ రకాల పేకింగ్ మెటీరియల్స్ 8. కేరీబేగ్స్

**ఫార్ములా:-** ప్రత్యేకమయిన ఫార్ములా అంటూ ఏమీలేదు. హోల్‌సేల్ పర్చేజింగ్ కెపాసిటీ, బిజినెస్ టెక్నిక్స్, ఎట్రాక్టివ్ టాకింగ్ పవర్, కస్టమర్స్‌ని మెప్పించి. ఒప్పించగల నేర్పు, లేటెస్ట్ ఫ్యాషనింగ్ అబ్జర్వేషన్ వుండాలి.

***నిర్వహణ విధానము:-*** ముందుగా మీరు అద్దెకు తీసుకోవాల్సిన షాప్ మంచి సెంటర్‌లో వుండేలా చూసుకోవాలి. మెయిన్‌రోడ్‌లో గానీ, షాపింగ్ సెంటర్‌లో గాని

వుంటే మరీ మంచిది. కస్టమర్స్‌ని ఆకర్షించే విధంగా షాప్‌ను అందంగా, నీట్‌గా డెకరేట్ చేయాలి. మీరు సేల్స్ చేసే ముఖ్యమయిన ఫ్యాన్సీ వస్తువులను (రెగ్యులర్‌గా మూవ్ అయ్యేవి) షోకేస్‌లలోనూ, సేల్స్‌కౌంటర్స్‌లోనూ, గ్లాస్ అల్మైరాలలోనూ వుంచాలి. ఇద్దరు సేల్స్ గర్ల్ వుండాలి. కస్టమర్స్‌కి ఫ్యాన్సీ ప్రొడక్ట్స్ గురించీ. వాటి మన్నిక గురించి, వివరించి చెప్పే నేర్పు వుండాలి. రెగ్యులర్‌గా అమ్ముడుపోయే వస్తువులను కాక స్లోమూమెంట్ ఫ్యాన్సీ వస్తువుల విషయంలో ప్రత్యేకమయిన శ్రద్ధను కనబరుస్తూ కస్టమర్స్ వాటిని కొనేటట్టు చేయటానికి ప్రయత్నించాలి. షాప్‌ను ఎప్పుడూ నీట్‌గా వుంచటానికి ప్రయత్నించాలి. కస్టమర్స్‌కి అయిటమ్స్‌ని చూపించే విషయంలో ఓర్పు, సహనం చాలా అవసరం.

కొంతమంది కస్టమర్స్ మొత్తం అయిటమ్స్‌ని బయటికి తీయించి నచ్చలేదంటూ వెళ్ళిపోతుంటారు. కోపం తెచ్చుకోకుండా అలాంటి వారిచేత కూడా ఏదో ఒక వస్తువును కొనిపించటంలోనే వుంది మీ సామర్థ్యం! అదే మీ షాప్‌లో సేల్స్ పెరగటానికి దారిచూపించే.... ప్రధానాంశం.

ఫ్యాన్సీ షాప్ నిర్వహణ చాలా లాభదాయకమయినది. కొన్ని కొన్ని ఫ్యాన్సీ వస్తువులలో 50 శాతం లాభం వుంటుంది. మరి కొన్నింటిలో 50 నుండి 70 శాతం వరకూ లాభం వుంటుంది.

గమనిక: ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ ప్రత్యేకంగా ఇవ్వబడింది.



# కృత్రిమ ఫ్రూట్ డ్రింక్స్

ఏ మాత్రం తేడా తెలియకుండా కోరిన పండ్ల రసాలను అప్పటికప్పుడు కలుపుకునేందుకు వీలుగా కృత్రిమ పండ్ల రసాలను కూడా తయారుచేయవచ్చు. ఒరిజనల్ ఫ్రూట్ డ్రింక్స్‌తో పోటీ పడుతున్న ఈ కృత్రిమ ఫ్రూట్ డ్రింక్స్ కొంత సాంకేతిక పరిజ్ఞానం అవసరమే అయినా కొద్దిపాటి అనుభవంలో కూడా వీటిని తయారుచేసుకోవచ్చు. వీటి తయారీకి ఏ విధమయిన పండ్లూ అవసరంలేదు. ఫ్రూట్ ఎసెన్స్ తప్ప..... సీజన్, అన్‌సీజన్స్‌లో కూడా మార్కెట్‌లో డిమాండ్‌ను నిలబెట్టుకునే ఈ కృత్రిమ ఫ్రూట్ డ్రింక్స్‌ని తయారుచేసి మంచిలాభాలను సంపాదించవచ్చును. పూర్తిగా తయారయిన డ్రింక్ ఎస్సెన్స్‌ని గ్లాసులో కొద్దిగా వేసి దాని నిండుగా నీళ్ళుపోసి, ఐస్‌ముక్కలు వేసుకొని త్రాగితే ఒరిజినల్ ఫ్రూట్‌డ్రింక్ తాగినట్లే వుంటుంది. ఆలస్యందేనికి? మీరు ప్రయత్నించండిమరి!

**'రా' మెటీరియల్స్:(ముడిసరుకులు):+(శాంపిల్) ఫార్ములా:-** 1. సిట్రిక్ ఏసిడ్ 5 గ్రా. 2. సోడియం బెంజూట్ 1 గ్రా. 3. పంచదార 750 గ్రా. 4. పుడ్ కలర్ మొత్తం ద్రవానికి 10 మి.లీటర్లు 5. స్వచ్ఛమయిన నీరు తగినంత (చిక్కదనాన్ని పరిశీలించి కలపాలి) 6. కావల్సిన ఫ్రూట్ ఫ్లేవర్ ఎసెన్స్ 1 1/2 మిల్లీ లీటర్.

**యంత్రపరికరములు:-** 1. గ్యాస్‌స్టవ్ 2. గ్యాస్ సిలెండర్ 3. బాటిల్ ఫిల్లింగ్ మెషీన్ 4. స్టీలుపాత్రలు లేక స్టీల్ డ్రమ్స్ 5. బాటిల్ సీలింగ్ మెషీన్ 6. గాజుబాటిల్స్ తగరపు మూతలు 7. బాటిల్ పేకింగ్ మెటీరియల్స్.

**తయారుచేయు విధానము:-**సిట్రిక్ యాసిడ్‌నీ, డ్రింక్‌ను పాడవకుండా నిలవవుంచేందుకు ఉపయోగించే సోడియం బెంజోట్‌ను అందుబాటులో వుంచుకోవాలి. పంచదారలో ఒక లెక్కగా తగినంత నీరు కలిపి ఒక స్టీలు పాత్రలో పోసి స్టవ్ మీద వుంచి వేడిచేయాలి. అయిదు నిముషాల పాటు వేడెక్కనిచ్చి పంచదార బాగా కరిగిపోయాక సిట్రిక్ యాసిడ్, సోడియం బెంజూట్‌లను అందులో వేసి బాగా కలిపి కరిగేలా చేయండి. ఆ తరువాత ఆ మిశ్రమాన్ని బాగా చల్లార్చి పుడ్‌కలర్‌నీ, ఎస్సెన్స్‌నీ వేసి బాగా కలపండి. మొత్తం ద్రవం ఒక మోస్తరు చిక్కగా వుండేటట్లు చూడాలి.

ఆ తరువాత వివిధ సైజులలోని గాజు సీసాలను బాగా కడిగి తడి ఆరేలా తుడిచి, బాటిల్ ఫిల్లింగ్ యంత్రంలో డ్రింక్ ఎసెన్స్ని బాటెల్లో నింపండి (నింపబడ్డ బాటిల్స్ 50 డిగ్రీల సెంటిగ్రేడ్ ఉష్ణోగత గల వేడిసీటిలో పదినిముషాల నుండి ఇరవై నిముషాలవరకూ ఉంచాలి) ఆ తరువాత బాటిల్ సీలింగ్ యంత్రాన్ని ఉపయోగించి మూతలు బిగించాలి, చివరిగా అందమయిన డిజైన్స్ ప్రింట్ చేసిన మీ కంపెనీ తాలుకు లేబుల్స్, అంటించి, పేకింగ్ చేసి, మార్కెట్ చేయండి. క్వాలిటీ కోసం ఫార్ములాలో చిన్నచిన్న మార్పులు చేర్పులూ అవసరం. ఈ కృత్రిమ కూల్‌డ్రింక్ ఎసెన్స్ని, మాంగో, పైనాపిల్, ఆరంజ్, లైమ్ ఇంకా చాలా రకాల ఫ్లేవర్స్‌లో తయారుచేయవచ్చు. ఏ రకం ఎస్సెన్స్ మార్కెట్‌లో డిమాండ్‌గా వుందో అబ్జర్వ్ చేయటం చాలా అవసరం.

గమనిక : ప్రాజెక్ట్ వివరాలు ప్రత్యేకంగా ఇవ్వబడ్డాయి.





# ప్లాస్టిక్ ఆర్టికల్స్

*ప్లాస్టిక్ వస్తువుల వాడకాన్ని గురించి, వాటి ఉపయోగాన్ని గురించి తెలియనివారుండరు. ఇంట్లో పోపుడబ్బాలు మొదలుకొని మౌల్డింగ్ ఛైర్స్ వరకూ గల గృహోపకరణ వస్తువులను చూస్తునేవున్నాం. ప్లాస్టిక్ అలంకార వస్తువులూ, పేకింగ్ మెటీరియల్స్ గృహోపకరణాలు మార్కెట్‌లోకి విపరీతంగా విడుదలవుతూ, ఎన్నిరకాల వస్తువులు తయారు చేసినా వాటికి మార్కెట్‌లో గిరాకీ పెరుగుతూనేవుంది. ప్లాస్టిక్ ఉత్పత్తుల తయారీ లాభదాయకమయిన పరిశ్రమగా గుర్తింపుపొందింది కాబట్టే చాలామంది ఈ ప్లాస్టిక్ ఆర్టికల్స్ ఉత్పత్తిచేయటం పట్ల ఆసక్తి చూపుతున్నారు.*

**'రా' మెటీరియల్స్ (ముడిసరుకులు):-** 1. పాలిథిన్ గ్రాన్యుల్స్ 2. ప్లాస్టిక్ మిక్స్‌డ్ కలర్స్.

**ఫార్ములా:-** మెజర్‌మెంట్స్‌తో అవసరం అయిన మౌల్డ్స్ తయారుచేసుకోవటం. మౌల్డ్స్‌ని యంత్రాలకి అమర్చి, తయారయిన వస్తువులకు ఫినిషింగ్ ఇవ్వటం, ప్లాస్టిక్స్ టైమింగ్స్‌లో పక్వంగా కరిగించటంలో కొంతసాంకేతిక పరిజ్ఞానం, వర్కింగ్ ఎక్స్‌పీరియన్స్ అవసరం.

**యంత్రపరికరములు:-** 1. వివిధ రకాల మౌల్డ్స్ 2. స్క్రాల్‌గ్రైండర్ 3. ఆటోమేటెక్ ఇంజక్షన్ మౌల్డింగ్ మెషీన్ 4. హేండ్‌టూల్స్ 5. ఎలక్ట్రిఫికేషన్

***తయారుచేయు విధానము:-*** థర్మోప్లాస్టిక్ మెటీరియల్‌ని యంత్రసహాయంతో టైమింగ్స్ ప్రకారం అవసరం అయిన పద్ధతిలో కరిగించాలి. ఆ తరువాత యంత్రానికి అమర్చిన వివిధ రకాల మౌల్డ్స్‌లో ప్రెసింగ్ కరిగించటం ద్వారా వివిధ రకాల వస్తువులు తయారుచేయవచ్చును. ఆవిధంగా తయారయిన వస్తువులను సాధ్యమయినంత వరకూ జాయింట్ తెలియకుండా వుండేందుకు స్క్రాప్ గ్రైండర్ యంత్రం ద్వారా ఫినిషింగ్ ఇచ్చి మార్కెట్‌లోకి విడుదల చేయాలి.

పెట్టుబడిని గురించి ప్రాజెక్ట్ ఎస్టిమేషన్‌లో వివరాలు చూడండి.

# రోలింగ్ షట్టర్స్

మారుతున్న కాలంతో పాటే భద్రతా చర్యల విషయంలో కూడా అనేకమైన మార్పులు చోటుచేసుకుంటున్నాయి. ఒకప్పుడు షాపులకూ, షోరూంలకూ గోడౌన్‌లకూ కొన్ని ముఖ్యమయిన సంస్థలకు భద్రతా దృష్ట్యా చెక్కతో మందంగా చేసిన తలుపులూ, ఆ తరువాత అయిరన్ షీట్‌తోచేసిన డోర్స్‌వాడేవారు. ప్రస్తుతం వాటి స్థానాన్ని రోలింగ్ షట్టర్స్ ఆక్రమించుకున్నాయి. పైకి చుట్టుకుపోయే ఈ రోలింగ్ షట్టర్‌కి ప్రత్యేకమయిన స్థలం అవసరంలేకపోవటం, వాటివల్ల షాపులోని రాకపోకలకు ఎలాంటి ఇబ్బంది వుండకపోవటంతో ఈ రోలింగ్ షట్టర్స్ మార్కెట్‌లో విపరీతమయిన గిరాకీని పెంచుకున్నాయి. నేడు పెద్దపెద్ద భవంతులు నిర్మించుకునే వారు సైతం గ్రౌండ్‌ఫ్లోర్‌ను షాపులుగా కేటాయిస్తున్నారు. అటువంటి నిర్మాణాలలో ఈ రోలింగ్ షట్టర్స్ ప్రధానంగా చోటుచేసుకుంటున్నాయి.

**'రా' మెటీరియల్స్ (ముడిసరుకులు):-** 1. M.S పైప్ 1 నుండి 2 1/2 mm. 2. రివిట్స్ 3. స్ప్రింగ్‌వైర్ 4. M.S షీట్ స్ట్రిప్స్ (స్ట్రాంగ్‌గేజ్)

**ఫార్ములా:-** అసెంబ్లింగ్ ఎక్స్‌పీరియన్స్, మెజర్‌మెంట్ నాలెడ్జ్.

**యంత్రపరికరములు:-** 1. 0.5 H.P. మోటార్ డ్రిల్లింగ్ మెషీన్ 2. 1 HP మోటార్ బెంచ్‌గ్రైండర్. 3. ఆర్క్‌వెల్డింగ్ యూనిట్ 4.హాండ్ షియరింగ్ మెషీన్ 5. ఎలక్ట్రిఫికేషన్ 6. హాండ్ టూల్స్

**తయారుచేయు విధానము:-** కావాల్సిన సైజులలో M.S షీట్స్ తీసుకుని, ఆర్క్ వెల్డింగ్ ద్వారా అసెంబ్లింగ్ చేయాలి. అవసరం అయిన చోట డ్రిల్లింగ్ చేసి, రివిట్స్ బిగించి షట్టర్ పై భాగాన్ని M.S పైప్‌కి చుట్టుకుపోయేలా స్ప్రింగ్ సిస్టంలో ఏర్పాటు చేయాలి. అలా తయారుచేయబడిన షట్టర్స్‌కి ఫ్లెక్సిబుల్ షాఫ్ట్ గ్రైండర్‌తో ఫినిషింగ్ ఇవ్వాలి. ఆ తరువాత షట్టర్స్‌కి రెడ్ ఆక్షయిడ్ ఆప్లయ్ చేయాలి. ఆ తరువాత షట్టర్‌ని అమ్మకానికి సిద్ధంగా మార్కెట్‌లోకి విడుదలచేయాలి. షట్టర్స్ అమర్చవలసిన చోట అమర్చిన తరువాత కావాల్సిన రంగుతో పెయింట్‌చేయాలి. షటర్స్ క్రింది భాగంలో ఇరువైపులా లాక్ చేయటానికి అనువుగా డ్రిల్లింగ్ చేయబడిన ప్లేట్ బోల్టు అమర్చటం మరిచిపో కూడదు. ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ ప్రత్యేకంగా ఇవ్వబడింది.

# చికెన్ సెంటర్

*కోడిమాంసం అంటే ఇష్టపడని మాంసాహారభోజన ప్రియులు వుండరు. ఒకప్పుడు ఇంట్లో కోడిమాంసం వండటం అంటే బాగా గొప్పగా భావించేవారు. కొన్ని పండగలకూ, ముఖ్యమయిన అతిధులూ, దూరప్రాంతాలనుండి చుట్టాలు వచ్చినప్పుడు కోడిమాంసంతో విందు భోజనం పెట్టాల్సిందే....ఇదివరకటి రోజులలో అయితే కోళ్లను పెంచి అవి పెద్దవయిన తరువాత కోసి వండటం జరిగేది. కానీ ఇప్పుడు కోళ్ల పెంపకం ఒక పరిశ్రమగా మారిపోయింది. ఇళ్లల్లో నాటు కోళ్ల పెంపకం దాదాపు కనుమరుగయిపోయింది. చికెన్ ప్రియులు అవసరాలను దృష్టిలో వుంచుకుని చికెన్ సెంటర్స్ వెలిసాయి, కస్టమర్స్ అవసరానికి అనుగుణంగా కోళ్లను అమ్మటంతోపాటు కోడిమాంసాన్ని అమ్మటం కూడా లాభసాటి వ్యాపారం అయింది.*

**'రా' మెటీరియల్స్ (ముడిసరుకులు)** 1.బ్రాయిలర్, ఫారం, నాటు కోళ్ళు.

**ఫార్ములా:-** కస్టమర్స్‌ని ఆకట్టుకోవటం, పరిశుభ్రమయిన కోడిమాంసాన్ని అందించటం, ఖచ్చితమయిన తూకం, కొద్దిపాటి ముందు అనుభవం.

**యంత్రపరికరాలు:-** 1. స్టవ్ 2. వేడినీళ్ళు కాచే పెద్ద సైజు పాత్రలు 3. చిన్న పెద్ద కత్తులు 4. చికెన్ ముక్కలు కొట్టేందుకు వెడల్పాటి కొయ్యదిమ్మ 5. హెయిర్ రిమూవింగ్ మెషీన్ 6. తూనిక యంత్రం. 7. ప్లాస్టిక్ కేరీబేగ్స్ 8.కోళ్ళువుంచటానికి అయిరన్ తీగలతో అల్లిన బాక్స్‌లు 9. ఆఫీస్ ఫర్నిచర్.

***నిర్వహణ విధానము:-*** ముందుగా విచారించి, అమ్మకాలు బాగా జరిగే అవకాశం వుందన్నచోట ఒక మోస్తరు షాపును అద్దెకు తీసుకోవాలి. షాపు వెనుక భాగంలో గోడౌన్ తప్పనిసరిగా వుంచాలి. కోళ్ళఫారం నుండి అమ్మకానికి సిద్ధంగా వున్న బ్రాయిలర్. మరియు ఫారం కోళ్ళను హోల్‌సేల్‌గా కొని మీ గోడౌన్ లో వుంచుకోండి. మార్కెట్‌లో నిర్ణయించిన హోల్‌సేల్, రిటైల్ ధరలకు కోళ్ళనూ, కోడిమాంసాన్ని అమ్మటం ప్రారంభించండి.

కోడిమాంసం అమ్మకంలో రెండు రకాలున్నాయి. ఒకటి స్కిన్‌లెస్ చికెన్, రెం
చికెన్ విత్ స్కిన్. ఈ రెండు రకాలు అమ్మే రేట్లలో కూడా తేడా వుంటుంది.

**స్కిన్‌లెస్ :-** కోడిని కోసిన తరువాత బొచ్చుతో సహా తోలు లాగి పారేయట

**చికెన్ విత్ స్కిన్:-** మరుగుతున్న వేడి నీటిలో ముంచుతూ కోడిబొచ్చున
తొలగించటం (ఇలా బొచ్చును తొలగిఇంచేందుకు యంత్రం కూడా తయారుచేయ
బడింది.)

ఈ విధంగా చేసిన తరువాత కస్టమర్ అవసరాన్ని బట్టి, పావు, అర, ముప్పావ
ఒకకిలోల వంతున్న మాసాన్ని కట్ చేసి కేరీ బేగ్‌లలో వేసి అందించాలి. ఇందుక
నమ్మకస్తులయిన ఇద్దరు వర్కర్స్‌ని నియమించుకోవాలి. మీ సామర్థ్యాన్ని బట్టి
హోటల్స్‌కీ, బిరియానీ సెంటర్స్‌కీ, చికెన్‌ఫుడ్ స్టాల్స్‌కీ కోళ్ళు లేక మాంసాన్ని హో
సేల్‌గా సప్లయ్ చేయవచ్చును. ఆదివారాలలో మీకు ఊపిరి తిరగనంత వ్యాపారం
వుంటుంది.

**గమనిక:-** అమ్మకానికి ముందు కోళ్ళకు బరువునిచ్చే ఆహారాన్ని పెడితే
కోళ్ళుబరువుగా వుండి ఎక్కువతూకం వస్తుంది.

ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ ప్రత్యేకంగా ఇవ్వబడింది.





# బుక్ పబ్లికేషన్స్

చేయగలిగిన వారికి ఇదొక డిగ్నిఫైడ్ పరిశ్రమ అని చెప్పొచ్చు. ఒకప్పుడు సాహిత్యాభిరుచీ, సాహిత్యం పట్ల చక్కటి అవగాహన మొదలయిన అర్హతలు గల వాళ్ళు మాత్రమే ఈ బుక్ పబ్లికేషన్స్‌ని నడుపుతూ ఉన్నత ప్రమాణాలతో కూడిన పుస్తక ప్రచురణలను అందించేవారు. ఇప్పుడు కాలం మారింది. ఎలాంటి అర్హతలు లేని వాళ్ళు కూడా కొద్దిపాటి అనుభవంతో మార్కెటింగ్ టాలెంట్‌తో ఈ బుక్‌పబ్లికేషన్స్ నడుపుతున్నారు. ఇది మంచి లాభసాటి వ్యాపారం అని గుర్తించటంతో చాలామంది ప్రచురణ కర్తలుగా మారిపోయారు. ఈబుక్ పబ్లికేషన్స్‌లో ఇటీవలకాలంలో చాలా మార్పులు వచ్చాయి. నిన్నమొన్నటివరకూ, డిటెక్టివ్ సాహిత్యం, వివిధ కథావస్తువులతో కూడిన నవలా సాహిత్యం మొదలయిన వాటితో కూడిన పుస్తకాలు విరివిగా అమ్ముడుపోతూ పబ్లిషర్స్‌కి మంచి లాభాలు ఆర్జించిపెట్టేవి. ఈమధ్యకాలంలో ఆ రకమయిన ప్రచురణలను ఆదరణబాగా తగ్గింది. కారణం ఏదయినా, కారకులు ఎవరయినా మార్కెట్‌లో నవలలకు గిరాకీ వెనకబడింది. ప్రస్తుతం జనరల్ నాలెడ్జ్‌కి సంబంధించిన పుస్తకాలను డిమాండ్ పెరిగింది. అటువంటి పుస్తకాలను ప్రచురించటం లాభసాటి వ్యాపారం అయింది.

**'రా' మెటీరియల్స్ (ముడిసరుకులు):-** 1. పేపర్ (మీరు ప్రచురించే పుస్తకానికి సంబంధించిన సైజుగలది. వైట్‌ప్రింట్, న్యూస్ ప్రింట్ మొదలయినవి) 2. స్క్రిప్టు 3. టైటిల్ డిజైన్ 4. టైటిల్ బోర్డ్ 5. పేకింగ్ మెటీరియల్.

**ఫార్ములా:-** పుస్తకం తయారీ చక్కటి నాణ్యతా ప్రమాణాలను పాటించటం, పాఠకులను ఎట్రాక్ట్ చేసే సబ్జక్ట్ ఎంచుకోవటం, ముఖచిత్రాలంకరణ పట్ల చక్కటి అభిరుచి కలిగి ఉండటం, మార్కెటింగ్ టాలెంట్ కలిగివుండటం, పొదుపును పాటిస్తూ ప్రచురణలను సాధ్యమయినంత మంచి క్వాలిటీ. క్వాంటిటీతో అందించగలగటం.

**యంత్రపరికరములు:-**నిజానికి బుక్ పబ్లికేషన్స్ నిర్వహణకు యంత్రపరికరాల కొనుగోలుతో పనిలేదు. ఎందుకంటే బుక్ తయారీకి అవసరం అయినవి ప్రింటింగ్‌ప్రెస్, ఆఫ్‌సెట్ ప్రింటింగ్, బైడింగ్ మొదలయిన పరిశ్రమలు వేటికవే విడిగా ఉన్నాయి. మీరు చేయాల్సిందల్లా ఆయారేట్లు చెల్లిస్తూ ఆ పరిశ్రమలను ఉపయోగించుకోవటమే!

**తయారుచేయు విధానము:-** ముందుగా జనరల్ నాలెడ్జ్‌కి సంబంధించి చక్కటి కొత్త సబ్జెక్ట్‌ను ఎంచుకోండి. దానిని సేకరణ కర్త లేక రచయితతో చెప్పి స్క్రిప్ట్ తయారుచేయించుకోండి. లేదా సేకరణకర్త దగ్గర సిద్ధంగా వున్న స్క్రిప్టులలో మీకు నచ్చిన జనరల్ నాలెడ్జ్ సంబంధమయిన స్క్రిప్టును తీసుకోండి. ఆ ప్రచురణను ఏసైజులో ఎన్ని పేజీలతో, ఎంత ధరలో ఎన్నికాపీలు ప్రచురించాలో ముందుగానే ఆలోచించి నిర్ణయించుకోవాలి. ప్రింటింగ్ ప్రెస్‌వారిని కాంటాక్ట్ చేసి అందుకు అవసరం అయిన కటింగ్ పేపర్‌ని ప్రెస్‌కి పంపి, స్క్రిప్టు ఇవ్వండి. పుస్తకంలోపలి పేజీలు ప్రింట్ అవుతుండగా.... ఆర్టిస్టు చేత మీరు ప్రచురించే పుస్తకానికి సంబంధించిన టైటిల్ డిజైన్ వేయించాలి. ఆ డిజైన్‌ని స్కానింగ్ ద్వారా పాజిటివ్ తీయించండి. (కొన్ని డిజైన్‌లు ఒకేసారి పాజిటివ్ తీయించాలి) ఆ తరువాత, మీరు కోరుకున్న గేజ్‌లో బోర్డ్‌ను అవసరం అయిన కాపీలకు సరిపడాకొని, పాజిటివ్స్‌తో పాటు ఆ బోర్డ్‌ను ఆఫ్‌సెట్ ప్రింటర్స్‌కి అందచేయండి. ఆ తరువాత తయారయిన టైటిల్ రేపర్‌నీ, ఇన్‌సైడ్ ప్రింటెడ్ ఫారాలను బైండర్‌కి అందచేయండి. వాళ్ళు బైండింగ్ చేయటం ద్వారా రెండుమూడు రోజులలో మీరు ప్రచురించదలచుకున్న పుస్తకంలు పూర్తి ఆకారాన్ని సంతరించుకుని మీకు అందుతాయి. చివరిగా ఆ పుస్తకాలను కాపీలవారీగా పేక్‌చేసి పోస్టల్ ద్వారా వివిధ పట్టణాలలో డిస్ట్రిబ్యూటింగ్ ఏజెంట్‌లకూ, బుక్‌షాపులవారికి బేంక్‌ద్వారా, ఫ్రీడెలివరీ, వి.పి.పి.ద్వారా పంపండి. బుక్ పబ్లికేషన్ విషయంలో చక్కటి ప్రచురణలను విడుదలచేయటం, ఏజెంట్స్ విషయంలో ఖచ్చితంగా వ్యవహరించటం చాలా అవసరం. లేదంటే లాభాల మాట ఎలా వున్నా అసలుకే ముప్పు వచ్చే ప్రమాదం వుంది.

పెట్టుబడిని గురించి ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ వివరాలు చూడండి.



# ఎలక్ట్రిక్ డిమ్మర్స్ స్విచ్‌లు

స్వినిమాహాల్స్‌ని లైట్స్ సినిమా ప్రారంభానికి ముందు ఉన్నట్టుండి డిమ్ అవుతాయి. అలాగే లారీలు, కార్లు, బస్‌లూ మొదలయిన మోటార్ వాహనాలకు చెందిన హెడ్‌లైట్స్ విషయంలో, ఇలా జరుగుతూ వుండటం మనం చూస్తూనే వుంటాం. ఇలా లైట్స్‌ను డిమ్ చేయటానికి ఉపయోగించే సాధనాన్ని డిమ్మర్ అంటారు. కొన్ని ఎలక్ట్రిక్ సాధనాలు అసెంబ్లింగ్ చేయటం ద్వారా తయారుచేసే ఈ ఎలక్ట్రిక్ డిమ్మర్స్‌కి మార్కెట్‌లో ఎప్పుడూ గిరాకీ వుంటూనే వుంటుంది. వీటిని తయారుచేసి ఎలక్ట్రిక్ వస్తువులు అమ్మే షాప్‌లకు సప్లయ్ చేయటం ద్వారా మంచి లాభాలు ఆర్జించవచ్చు.

**'రా' మెటీరియల్స్ (ముడిసరుకులు లేక భాగాలు):-** 1. కెపాసిటేటర్లు 2. ప్రింటెడ్ సర్క్యూట్ బోర్డ్ 3. కండక్టివ్ సెల్స్ 4. ట్రియాకా - డియాక్ 5. పవర్ రివేస్ 6. పొటెన్షియా మీటర్స్ 7. రెసిస్టర్స్ 8. ప్రీసెట్స్ 9. ట్రాన్స్‌ఫార్మర్స్ 10. ట్రాన్సిస్టర్స్

**ఫార్ములా:-** ఎలక్ట్రికల్ మెకానిజం తెలియాలి. ఎలక్ట్రిక్ స్పేర్ పార్ట్స్ అసెంబ్లింగ్ లోనూ, ఆ ఎలక్ట్రిక్ పరికరం పనిచేయాల్సిన నిర్దేశిత స్థాయిని పరీక్షించి తెలుసుకోవటంలోనూ ఎక్స్‌పీరియన్స్ వుండటం తప్పనిసరి.

**యంత్రపరికరములు:-** 1. వేరియాక్ 2. సిల్లోస్కోప్ 3. ఎల్. సి. ఆర్ బ్రిడ్జ్ 4. మల్టీమీటర్ 5. వోల్టామీటర్.

**తయారుచేయు విధానము:-** కెపాసిటేటర్ కండెక్టివ్ సెల్స్ ట్రియాకా డియాక్. పవర్ రిలే. పొటెన్షియామీటర్. రెసిస్టర్ ప్రెసెట్. ట్రాన్స్‌ఫర్, ట్రాన్సిస్టర్ మొదలయిన వాటిని తీసుకుని ప్రింటెడ్ సర్క్యూట్ బోర్డ్ మీద బిగించాలి. ఇవ్వవలసిన వైర్ కనెక్షన్స్ ఇవ్వటం పూర్తి చేసిన తరువాత డిమ్మర్స్ స్విచ్‌ని పూర్తి స్థాయిలో పనిచేస్తున్నాయా లేదా అన్నది ఒకటిరెండు సార్లు పరీక్షించి తెలుసుకున్న తరువాత మార్కెట్ చేయాలి.

(హెచ్చరిక: - కేవలం పుస్తకం చదివి మాత్రమే ఎలక్ట్రిక్ పరికరాలను తయారుచేసుకొనేందుకు ప్రయత్నించకండి! ఇందుకు సంబంధించిన మెకానిజం నేర్చుకోండి! తగినంత అనుభవం సంపాదించుకుని ఆ తరువాత ఏదయినా వెనకాడకుండా చేయటం మంచిది.)

ఇందుకు సంబంధించిన ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ వివరాలు ప్రత్యేకంగా ఇవ్వబడ్డాయి.

# వైర్ హేంగర్స్

ఇంట్లో ఉతికేదుస్తులను ఎండలో ఆరబెట్టటానికి, ఇస్త్రీమడతలు నలగకుండా స్టాండ్‌కి తగిలించుకోటానికి హేంగర్స్ ఉపయోగించటం అందరికీ తెలిసిందే. ప్లాస్టిక్‌తో, చెక్కతో, వైర్‌తో, మెటల్‌తో చేసిన వివిధ రకాల హేంగర్స్‌ను మనం చూస్తూనే వుంటాము. వీటిలో సులువుగా తయారుచేసుకోటానికి వీలయినవి, తక్కువ ధరలో లభించేవి అయిన వైర్ హేంగర్స్‌కి మార్కెట్‌లో విపరీతమయిన గిరాకీ వుంది. వీటిని తయారుచేసి హోల్‌సేల్‌గా షాప్‌లకు సప్లయ్ చేయటం వల్ల మంచి లాభాలు సంపాదించవచ్చు. ఈ వైర్ హేంగర్స్ తయారు చేయుటానికి పెద్ద యంత్రసామగ్రి గానీ, సాంకేతిక పరిజ్ఞానం గానీ అవసరం లేదు.

**'రా' మెటీరియల్స్ ( ముడిసరుకులు):-** 1. P.V.C. స్లీవ్స్ 2. గాల్వనైజ్డ M.S వైర్ (అవసరమయిన మందంలో) 3. మెజర్‌మెంట్ మెటీరియల్.

**ఫార్ములా:-** ప్రత్యేకమయిన ఫార్ములా లేదు., తయారుచేయటంలో కొద్దిపాటి ఎక్స్‌పీరియన్స్.

**యంత్రపరికరములు:-** 1. వైర్‌ను వంచేందుకు అవసరం అయిన చేతిపనిముట్లు 2. వైర్‌కట్టర్. 3. వంకర్లు తీసే సాధనం.

**తయారుచేయు విధానము:-** గాల్వనైజ్‌డ్ M.S వైర్‌ను అవసరం అయిన మందంతో ( P.V.C స్లీవ్స్ లాగడానికి వీలుగా) తీసుకుని సరయిన మెజర్‌మెంట్స్‌తో ముందుగా నిర్ణయించుకున్న సైజుకి కట్ చేసుకోవాలి. అలా కట్‌చేసిన వైర్‌ను వంకర్లు లేకుండా స్ట్రెయిట్‌గా చేయాలి. ఆ తరువాత చేతి పనిముట్లు ఉపయోగించి వైర్‌ను వంచవలసిన చోట వంచుతూ హేంగర్‌షేప్‌కి మార్చండి.

వైర్ నిలువుగా వున్నప్పుడే P.V.C స్లీవ్‌లను తొడిగి స్లీవ్ ఎక్కడా మడతపడకుండా చూడాలి. P.V.C స్లీవ్‌లు వివిధ రంగులలో ఉండవచ్చు. నాణ్యత ముఖ్యం. ఈ వైర్ హేంగర్స్‌ని నెలకు 150 డజన్లు తయారుచేయటం లక్ష్యంగా పెట్టుకుని. మార్కెట్ చేయటానికి ప్రయత్నించాలి. మార్కెట్ చేయటం మీ సామర్థ్యం. పట్టుదలమీద ఆధారపడి వుంటుందన్న సంగతి మరచిపోకూడదు. మార్కెటింగ్ సామర్థ్యమే మంచి లాభాలను ఆర్జించిపెట్టే సాధనం!

(ప్రాజెక్ట్ వివరాలు ప్రత్యేకంగా ఇవ్వబడ్డాయి)

# సాంబ్రాణివత్తులు

*గృహసంబంధమయిన వాతావరణకాలుష్యాన్ని దూరం చేసేందుకూ, షాప్‌లలోనూ, ఇతర వ్యాపార సంస్థలలోనూ సాంబ్రాణి ధూపం వేయటం మనం చూస్తూనే వుంటాము. పూజలూ, వ్రతాలు చేసేటప్పుడు కూడా సాంబ్రాణి దూపం వేయటం తెలిసిందే. ముడి సాంబ్రాణి ముక్కలను పొడిగా కొట్టి మండుతున్న నిప్పులమీద వేయగానే ఒక విధమయిన కమ్మటి వాసనతో దూపం గాలిలోకి వ్యాపిస్తుంది. మారుతున్న కాలంతో పాటే మనం వాడే వస్తువులను ఉపయోగించే పద్ధతులలో కూడా కొత్త కొత్త మార్పులు చేసుకుంటున్నాయి. సాంబ్రాణిని పొడిగా కొట్టి నిప్పులుమీద వేసి ధూపాన్ని సృష్టించటానికి బదులుగా సాంబ్రాణిని ఎక్కువ సేపు నిలిచి కాలుతూ ధూపాన్ని వ్యాపించేసే వత్తులుగా తయారుచేసే ప్రక్రియ అమలులోకి వచ్చింది. ఇలా తయారు చేసే వత్తులకు మంచి లాభాలను సమకూర్చేటంత డిమాండ్ ప్రస్తుతం మార్కెట్‌లో వుంది.*

**'రా' మెటీరియల్స్ (ముడిసరుకులు):+ఫార్ములా:-** (శాంపిల్) 1. చందనం పౌడర్ 100 గ్రా॥ 2. వట్టివేరు 60 గ్రా॥ 3. సాంబ్రాణీ (వైట్) 70 గ్రా॥ 4. మృదువైన వరిపిండి 1 1/2 గ్రా॥ 5. కిచిలికెళంగ్ 25 గ్రా॥ 6. ఉప్పు 5 గ్రా 7. అంబర్ 1 గ్రా॥ 8. పచ్చ కర్పూరం 1 గ్రా 9. పునుగు 1గ్రా॥ 10. జిగురు కొద్దిగా.

**యంత్రపరికరములు:-** 1. మోటార్‌గ్రయిండర్ లేక మిక్సర్ 2. స్టీలు పాత్రలు 3. తూకం మెషీన్ 4. స్థూపాకారపు డైలు (4 సెం.మీ ఎత్తుగలది) 5. పేకింగ్ మెటీరియల్స్ 6. పల్చటి రబ్బరు హేండ్‌గ్లవ్స్.

***తయారుచేయు విధానము:-*** వైట్‌సాంబ్రాణి, వట్టివేరు, చందనపు పౌడర్, వరి పిండి, ఉప్పు, కిచిలీకెళంగ్ మొదలయిన వాటిని ఒక గ్రయిండర్‌లో వేసి తగినంత పన్నీరు వేసి మెత్తగా అయ్యేలా చేయాలి. అంబర్, పునుగు, పచ్చకర్పూరం సుగంధ ద్రవ్యాలను ఒక పాత్రలో వేసి బాగా కలిసేలా మిశ్రమంచేయాలి. గ్రయిండర్‌లో ముద్దగా చేసిన మిశ్రమంలో సుగంధ ద్రవ్యాల మిశ్రమాన్ని కలిపి, కొద్దిగా గమ్ చేర్చి మరోసారి గ్రయిండర్‌లో వేసి మరింత మెత్తగా అయ్యేటట్టు చేసి ఆ తరువాత చేతులతో గట్టిగా పిసికి మృదువుగా వచ్చేటట్టు స్థూపాకారపు డైస్‌లో వేసి బాగా ఆరిపోయేటంతవరకూ వుంచాలి. అంతే! సాంబ్రాణి వత్తులు తయార్. డైస్‌లోంచి తీసిన ఈ వస్తువులను లెక్క ప్రకారం అట్టపెట్టెలో వేసి పేకింగ్ చేసి, మార్కెట్ చేయాలి. మీరు అందించే క్వాలిటీ. వత్తులు నిలిచి కాలటంతోనూ, కమ్మటి వాసనతో చక్కటి ధూపాన్ని ఇవ్వటంతోనూ కనబరచాలి.

పెట్టుబడిని గురించి ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ వివరాలు చూడండి.

# ఉడుకులాము

స్నానం చేయగానే ఎవరయినా సరే ఒక విధమయిన ప్రెష్‌నెస్ ఫీలవుతారు. వేడినీటితో స్నానం చేసేవాళ్ళు ఆ నీటిలో కొద్దిగా ఉడుకులాం లోషన్ కలుపుకుని స్నానం చేస్తే మరింత ప్రెష్‌నెస్‌నీ, ఉత్తేజాన్ని పొందుతారు. యాంటీ సెప్టిక్ వంటి గుణాలు కలిగివున్న ఉడుకులాం కలిసిన నీటిలో చిన్న పిల్లల దుస్తులు ముంచి ఆరబెడితే కొన్ని రుగ్మతలను దూరంగా వుంచుతుంది. పురటాళ్ళకు (ప్రసవించినస్త్రీలు) ఇచ్చే వేడినీటిలో దీన్ని ఒకటిరెండు చుక్కలు కలిపిఇస్తే... శారీరక ఉష్ణోగ్రతను పెంచి, రొంప, జలుబు వంటి వాటినుండి రక్షణ కల్పిస్తుంది. ఉడుకులాం వేడినీటిలో కలిపి స్నానం చేస్తే ఒకరకమయిన ఉత్తేజంతోపాటు శరీరంకు సువాసన కలిగివుండటం వలన చాలామంది దీనిని తప్పని సరిగా వాడతారు. కొంతమంది దీనిని యాంటీసెప్టిక్ లోషన్‌గా కూడా వాడతారు. ఈ ఉడుకులామును తయారుచేయటం సులువే అయినా రసాయనాలను మిశ్రమం చేసే పరిజ్ఞానం వుండాలి! హైక్లాస్ మరియు మిడిల్ క్లాస్ వారుకూడా ఉపయోగించటానికి ఆసక్తి కనబరిచే ఈ ఉడుకులాం తయారుచేసి మార్కెట్ చేయటం ద్వారా లాభాలు సంపాదించవచ్చును.

**'రా' మెటీరియల్స్ (ముడిసరుకులు):-** 1. లవెండర్2. లెమన్ ఆయిల్ 3. ఆల్కహాల్ 4. క్లవ్ ఆయిల్ 5. బర్గ్‌మోడ్ ఆయిల్ 6. జాస్మిన్ ఓటో ఆయిల్ 7. చినామిన్ 8. రోజ్ ఆయిల్ 9. నిరోన్ ఆయిల్

**ఫార్ములా:-** 1. లవెండర్ 10. మి.లీటర్లు 2. లెమన్ ఆయిల్10 మి.లీ. 3. ఆల్కహాల్ 30 మి.లీ. 4. చినామిన్ 7 మి.లీ. 5. బర్గ్‌మోర్ ఆయిల్ 10 మి.లీ. 6. జాస్మిన్ ఆయిల్ 7 మి.లీ. 7. క్లవ్ ఆయిల్ 10 మి.లీ 8. నిర్సో ఆయిల్ 10 మి.లీ. 9. రోజ్ ఆయిల్ 30 మి.లీ.

**యంత్రపరికరములు:-** 1. గాజుకూజాలు2. గాజుసీసాలు 3. పేకింగ్ మెటీరియల్స్ 4. బాటిల్ ఫిల్లింగ్ మెషిన్ 5. బాటిల్‌సీలింగ్ మెషిన్.

**తయారుచేయు విధానము:-** పైన ఇవ్వబడిన ఆయిల్స్ అన్నీ ఆల్కాహాల్‌తో సహా ఒక పెద్ద సైజు గాజు కూజాలో వేసి బాగా కలిసిపోయేలా కూజాను షేక్‌చేస్తూమిక్స్

చేయాలి. ఆ తరువాత కూజామూత బిగించి సుమారుగా 15 రోజులపాటు ఆ మిశ్రమాన్ని అందులోనేవుంచి, రోజుకు ఒక సారి కలుపుతూ వుండాలి.

ఆతరువాత అందులో తగినంత డిస్టిల్డ్‌వాటర్‌ని వేసి, బాగా కలిపి, ముందుగా రెడీ చేసుకున్న ఆకర్షణీయమయిన ఫ్యాన్సీ గాజు సీసాలలో బాటిల్‌ఫిల్లింగ్ మెషీన్ సహాయంతో నింపి, సీలింగ్ మెషిన్ ద్వారా మూతలు బిగించాలి. ఆ తరువాత లేబుల్స్ అంటించి, అట్టపెట్టెలలో పేక్ చేసి మార్కెట్‌లో విడుదల చేయాలి.



# కళ్లజోళ్ల ఫ్రేమ్స్ (ప్లాస్టిక్)

దృష్టి లోపాన్ని సవరించుకోవటానికి మాత్రమే కాదు. నేటి నాగరిక ప్రపంచంలో కళ్లజోళ్లు ధరించటం అనేది ఒక ఫేషన్‌గా మారిపోయింది. కళ్లజోళ్ల ధారణ మనిషి అందానికి అద్భుతమయిన ఆకర్షణను చేకూరుస్తుందనటంలో ఎలాంటి సందేహం లేదు. అయితే ఆ గొప్పదనం అంతా అద్దాలది కాదు. ఆ అద్దాలను ఫిట్‌చేసే ప్లాస్టిక్ ఫ్రేమ్‌ది. వివిధ ఫ్యాషన్స్‌లో రకరకాల ఆకారాలతో తయారుచేయబడే ఈ కళ్లజోళ్ల ఫ్రేమ్స్ ధరించినంతనే మనిషి రూపురేఖలకు ఎంత అందాలను చేకూరుస్తాయి. మంచిరంగులలో ఫ్యాన్సీ ఆకారాలలో సరికొత్త డిజైన్‌లలో తయారుచేయబడే ఈ ఫ్రేములకు మార్కెట్‌లో విపరీతమయిన గిరాకీ వుంది. గిరాకీ గలిగి బాగా అమ్ముడుపోయే వస్తువులకు లాభాలు కూడా బాగానే వుంటాయి మరి.

**'రా' మెటీరియల్:- (ముడిసరుకులు):-** 1. పాలిషింగ్ కాంపౌండ్ 2. సెల్యులోజ్ ఎసిటేట్ హీట్ 3. మౌల్డింగ్ మెషిన్ 4. హీట్‌కటింగ్ మెషీన్ 5. బఫింగ్‌మెటీరియల్ 6. హిగిన్స్ రివిట్స్ 7. సైడ్‌వైర్ 8. ప్యాకింగ్ మెటీరియల్

**ఫార్ములా:-** మేకింగ్ నాలెడ్జ్. ప్రివియస్ ఎక్స్‌పీరియన్స్. మెషినరీ ఆపరేటింగ్‌ని గురించి పూర్తిగా తెలిసివుండాలి.

**యంత్రపరికరాలు:-** 0.5 HP మెటార్‌మిల్లింగ్ యంత్రం. 2. 1 HP మోటార్ డ్రిల్లింగ్ యంత్రం 3. 1 HP మోటార్ బఫింగ్‌మెషీన్ 4. వైర్ ఇన్‌సర్టింగ్ మెషీన్ 5. 0.5 HP మోటార్ హీట్ కటింగ్ మెషీన్ 6. మౌల్డింగ్ మెషీన్ 7. ఫిక్సర్ 8 .చేతి పనిముట్లు 9. వర్కింగ్ టేబుల్స్.

**తయారుచేయు విధానము:-** సెల్యులోజ్ ఎసిటేట్ షీట్స్‌ను కావాల్సిన మందంలో తీసుకుని. ఫ్రేముల సైడ్స్‌సైజు మెజర్‌మెంట్‌ను అనుసరించి పీసెస్‌గా సెట్ చేయాలి. గ్లాసెస్‌ని అమర్చాలి. ఆ తరువాత తగినవిధంగా పాలిష్‌చేసి. ఫ్రేములను తగు వ్యాసార్థంలో కట్‌చేయాలి. నోస్ ప్యాడ్స్‌ని రసాయన ద్రవాలలోముంచి, పొడిగా తయారయిన తరువాత వేడి నీళ్ళలోముంచి మెత్త బడగానే కావాల్సిన విధంగా బెండ్

చేయాలి. ఆవిధంగా తయారయిన ఫ్రేమ్స్‌కి క్వాంటిటీ, బ్రాండ్‌వైజ్, కలర్ వేసి ఆకర్షణీయమయిన ప్లాస్టిక్ కవర్‌లలోనూ, బాక్సులలోను ప్యాక్‌చేసి మార్కెట్‌లో విడుదలచేయాలి.

ఈ ఫ్రేముల తయారీలో ఎప్పటికప్పుడు లేటెస్ట్ ఫ్యాషన్స్ అనుసరిస్తూ వుండాలి. మార్కెటింగ్ డిమాండ్ కేవలం క్వాలిటీ, డిజైన్స్ మీదనే ఆధారపడి వుంటుంది. ఈ ఫ్రేముల తయారీకి నిపుణులయిన పనివారు వుండటం చాలా అవసరం.

పెట్టుబడిని గురించి ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ వివరాలు చూడండి!



# హెయిర్ రిమూవింగ్ సోప్

జుత్తు బాగా పెంచుకుని అందమయిన హెయిర్‌స్టయిల్స్‌తో కనిపించటానికి ఇష్టపడేవారు వున్నట్టే, అనవసరమయినచోట పెరిగి, అసహ్యంగా కనిపించటానికి కారణమయిన వెంట్రుకలను వదిలించుకోటానికి అవస్థపడే వాళ్ళు కూడా వున్నారు. ఇలాంటి వారు బ్యూటీక్లినిక్‌లను ఆశ్రయించి తమ సమస్యలను పరిష్కరించుకోవాలని ప్రయత్నిస్తూ ఉంటారు. అలాంటివారికోసమే తయారుచేయబడింది హెయిర్ రిమూవర్ సబ్బు. టాయ్‌లెట్ సబ్బులకి మార్కెట్‌లో ఎంత డిమాండ్ వుందో ఈ సబ్బులకి కూడా ఇంచుమించు అంత డిమాండ్ వుందని చెప్పవచ్చు. ఈ సబ్బు తయారీ చాలా సులువు. అయినా రసాయన శాస్త్ర పరిజ్ఞానం అవసరం.

**'రా' మెటీరియల్: (ముడిసరుకులు):-** 1. సోప్‌పౌడర్ 2. వైట్‌స్టార్చ్ 3.బేరియం సల్ఫేట్ 4. కొబ్బరినూనె

**ఫార్ములా:-** 1. వైట్‌సాలుర్చ్ 200 గ్రాములు 2. బేరియసల్ఫేట్ 200 గ్రాములు 3. సోప్‌పౌడర్ 100 గ్రా॥ 4. కొబ్బరినూనె తగినంత

**యంత్రపరికరములు:-** 1. మోటార్ మిక్సర్ 2. స్టవ్ 3. కళాయి 4. చెక్కగరిటె 5. డైస్ 6. పేకింగ్ మెటీరియల్.

**తయారుచేయు విధానము:-** సబ్బుపౌడర్ తెల్లస్టార్చ్, బేరియం సల్ఫేట్ కొబ్బరినూనెతో కలిపి ఒక మిక్సర్‌లో వేయటం ద్వారా మెత్తగా మిశ్రమం అయ్యేటట్టు చేయాలి. ఆ తరువాత ఆ మిశ్రమాన్ని స్టవ్‌మీద వుంచిన కళాయిలో పోసి సన్నటి సెగమీద కరిగిస్తూ బాగా కలియబెడుతూ వుండాలి. కొంతసేపటికి ఆ మిశ్రమం బాగా చిక్కబడుతుంది. ఆ తరువాత దానిని స్టవ్‌మీద నుండి దించి బాగా చల్లారేవరుకు అట్టే పెట్టాలి. చల్లారిన తరువాత వివిధ సైజులలోని, ఆకారాలలోని డైస్ ఉపయోగించి సబ్బులుగా తయారుచేయాలి. ఆ సబ్బులను పేకింగ్ చేసి మార్కెట్‌లో విడుదలచేయాలి.

గమనిక: ముందుగా మీరు తయారుచేసిన ప్రాడెక్ట్ శాంపిల్‌ని సంబంధిత పరిశోధనాలయానికి కెమికల్ ఎనాలసిస్ టెస్ట్ నిమిత్తం పంపాలి. అనుమతిలభించగానే ప్రాడక్ట్‌ను కావాల్సినంతగా తయారుచేయటం ప్రారంభించాలి.

ప్రాజెక్ట్ వివరాలు ప్రత్యేకంగా ఇవ్వబడ్డాయి.

# ఆటోమొబైల్ ఫిల్టర్స్

మోటార్ వాహనాలకు ఈ ఫిల్టర్స్‌తో తప్పనిసరిగా అవసరం వుంటుంది. వీటి ద్వారా టాంకర్స్‌లోని ఆయిల్ ఇంజన్‌కి చేరే లోపు ఫిల్టర్ చేయబడుతుంది. వాహనాలు నిత్యం రన్నింగ్‌లో వుండటంవల్ల ఈ ఫిల్టర్స్‌ని కొంతకాలం మాత్రమే ఉపయోగించి, వాటి వర్కింగ్ కెపాసిటీ తగ్గిన వెంటనే మార్చవలసి వుంటుంది. వాహనాల ముఖ్యమయిన స్పేర్‌పార్ట్స్‌కి డిమాండ్ వున్నట్లే ఈ ఫిల్టర్‌కి కూడా మార్కెట్‌లో బాగా డిమాండ్ వుంది. వీటిని ఫ్యూయల్ మరియు ఆయిల్ ఫిల్టర్స్‌గా తయారుచేయవచ్చును.

ఈ ఫిల్టర్స్‌కి ముఖ్యమయిన 'రా' మెటీరియల్ ఫిల్టర్ పేపర్. (ఫిల్టర్ మెష్) ఇది మార్కెట్‌లో సులువుగా నే లభిస్తుంది. ఈ ప్రొడెక్టును స్టేట్‌వైడ్‌గా మాత్రమే కాదు కంట్రీవైడ్‌గా డీలర్స్‌కి సప్లయ్‌చేయటం ద్వారా మంచి లాభాలను ఆర్జించేందుకు అవకాశం ఉంది.

**'రా' మెటీరియల్స్: (ముడిసరుకులు):-** 1. పెర్ఫొరేటెడ్ M.S. షీట్ 26 SWG 2. ఫిల్టర్ పేపర్ 3.యం.ఎస్ కేన 4. ఉలెన్ బెల్ట్1 యం.యం. - 3 యం.యం. 5. రబ్బర్ సెల్డింగ్స్ 6. G.I. వైర్ 7. కార్టన్ బేగ్స్ 8. ఎడ్‌హెసిల్ 9. ఫన్నెల్‌క్లాత్ 1 యం.యం, 3 యం.యం. 10. ఉడెన్ పెకింగ్ బాక్స్ 11. పాలిథిన్‌బేగ్స్ 12. పెద్ద రోటెడ్ రేపర్ పేపర్.

**ఫార్ములా:-** ఆటోమొబైల్ యింజనీరింగ్‌లో అనుభవం, తయారుచేయటంలో ఎక్స్‌పీరియన్స్, ఆటోమొబైల్ మెకానిక్‌గా విశేష అనుభవం. 'రా' మెటీరియల్స్‌ని అసెంబ్లింగ్ చేయగల పనితనం వుండాలి.

**యంత్ర పరికరములు:-** 1. మాన్యువల్ ప్రెడిషియరెంగ్ మెషీన్ 2. స్పాట్ వెల్డింగ్ మెషీన్ (పోర్టబుల్) 3. డ్రైయింగ్ ఓవర్ 4. 900 × 46 M.M. రోలర్ మెషీన్. 5. రివిట్స్ 6. హేండ్ టూల్స్ 7. వర్కింగ్ టేబుల్స్

**తయారుచేయు విధానము:-** మెజర్‌మెంట్స్ ప్రకారం షీట్స్‌కట్‌చేసి, వాటిని కావాల్సిన ఆకారానికి అనువుగా బెండ్‌చేయటం బ్లాంకింగ్స్. షీరింగ్స్, రివిటింగ్స్ అసెంబ్లింగ్, ఫిల్టర్ పేపర్ అమర్చటం మొదలయిన పద్ధతులద్వారా ఆటోమొబైల్ ఫిల్లర్స్ రూపొందించవచ్చు. ఆ తరువాత తయారయిన ఫిల్టర్స్ పూర్తిస్థాయి సామర్థ్యంతో పనిచేస్తున్నాయో లేదో పరీక్షించి తెలుసుకుని, ఆ తరువాత పేకింగ్ చేసి మార్కెట్‌లోకి విడుదల చేయాలి.

ఈ ఫిల్టర్స్‌ని మంచి క్వాలిటీతో తయారుచేసి అందించటం ద్వారా మార్కెట్‌లో గిరాకీనీ, తద్వారా మీ ఉత్పత్తిని పెంచుకోవచ్చును. పట్టుదలతో చేసే పనికి ఖచ్చితంగా ఫలితం వుంటుంది.

ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ వివరాలు ప్రత్యేకంగా ఇవ్వబడ్డాయి.

# హెయిర్ డై

వయసుపెరగటంతో పాటే నల్లజుత్తు తెల్లబడటం సహజమయిన లక్షణం. కానీ, కొంతమందికి అతిచిన్న వయసులోనే జుత్తు తెల్లబడిపోవటం జరుగుతూ వుంటుంది. ఇలా జరగటాన్ని బాల మెరుపు అని అంటుంటారు. టెన్షన్‌తో కూడిన ఆలోచనవల్ల జుత్తు తొందరగా తెల్లబడిపోయింది అని కూడా కొంతమంది అనడం తెలిసిందే. ఎవరెన్ని అనుకున్నా, చిన్నవయసులో జుత్తుతెల్లబడటానికి కొన్ని పోషకాహారాల లోపమే మూలకారణం. తెల్లబడిన జుత్తుకు నల్లరంగు (హెయిర్‌డై) వేయటం అనేది ఇప్పుడు సర్వసాధారణమయిన ఫ్యాషన్‌గా మారిపోయింది. బాల మెరుపువచ్చిన వాళ్ళేకాదు వయసుపైబడినా అందంగా, ట్రిమ్‌గా, యంగ్‌గా కనిపించాలనుకునే వారుకూడా రకరకాల కంపెనీల హెయిర్‌డైని విస్తృతంగా వాడుతూవుండటంతో మార్కెట్‌లో దీని డిమాండ్ విపరీతంగా పెరిగిపోయింది.

**'రా' మెటీరియల్ (ముడిసరుకులు):+ ఫార్ములా:- (శాంపిల్)** 1. రెక్టిఫైడ్ స్పిరిట్ 50 గ్రా॥ 2. సోడియం సల్ఫేట్ 125 గ్రా॥ 3. డైడిడ్ హైడ్రోక్లోరైడ్ 75 గ్రా॥ 4. డిస్టిల్డ్ వాటర్ 400 మి.లీటర్లు

**యంత్రపరికరాలు:-** 1. మిక్సర్ 2. పింగాణీ పాత్రలు 3. రబ్బర్ హాండ్ గ్లవ్స్ 4. బాటిల్స్, లేక ప్లాస్టిక్ సాచెల్స్, (ప్రింటెడ్‌వి) 5. లేబిల్స్, 6. పేకింగ్ అట్టపెట్టెలు 7. స్టవ్ 8. ప్లాస్టిక్ సాచెల్స్ సీలింగ్ మెషిన్

**తయారుచేయు విధానము:-** సోడియం సల్ఫేట్, డైడిడ్ హైడ్రోక్లోరైడ్‌ని రెక్టిఫైడ్ స్పిరిట్‌తో కలిపి. మిక్సర్‌లో వేసి బాగా మిశ్రమం చేయాలి. ఆ మిశ్రమంలో చర్మానికి హానికలిగించే లక్షణాలను తొలగించుకోటానికి అందులో తగినంతగా పొటాషియం డైక్రోమేట్‌ను కలపాలి.

హెయిర్‌డై పౌడర్‌గా కావాలనుకుంటే అందులో తగినంత సోప్ పౌడర్‌ని కలిపి.... మొత్తం మిశ్రమాన్ని వేడి చేయటం ద్వారా బాగా కరిగించి. ఆ తరువాత బాగా చల్లారనిచ్చి పౌడర్‌ని ఫిల్టర్స్ ద్వారా మెత్తగా వుండేటట్లు చేసి ఆకర్షణీయంగా ప్రింట్‌చేయబడిన ప్లాస్టిక్ స్యాచెట్‌లోగాని బాక్స్‌లలోగాని నింపి పేక్‌చేయాలి.

హెయిర్‌డైని లిక్విడ్‌గా తయారుచేయాలనుకునే వారు తగిన పాళ్ళలో డిస్టిల్డ్ వాటర్ కలిపితే సరిపోతుంది. ఆ లిక్విడ్‌ని సీసాలలో నింపి మార్కెట్ చేయవచ్చును.

**గమనిక:** మీరుముందుగా తయారుచేసిన శాంపిల్ ఫార్ములా పౌడర్‌ను గానీ లిక్విడ్‌ని గాని, కెమికల్ ఎనాలసిస్‌కోసం సంబంధిత పరిశోధనాలయానికి పంపటం తప్పనిసరి. వారినుండి అనుమతి లభించాకనే మీరు మార్కెట్‌చేసేందుకు ప్రాడక్ట్‌ను తయారుచేసుకోవాలి.



# బేకరీ

బేకరీ నిర్వహణ చాలా చక్కటి వ్యాపారం. బేకరీల్లో తయారుచేసేవి. అమ్మేవి ఎక్కువగా డ్రైఫుడ్స్ కాబట్టి నష్టం వస్తుందనే భయం లేదు. డ్రైఫుడ్స్ ఎక్కువ సమయం నిలవ వుంటాయి. బ్రెడ్, బిస్కట్స్ రస్కులు, మొదలయినవి తగిన విధంగా స్టోర్‌చేస్తే రోజులతరబడి తాజాగానే వుంటాయి. ఈ బేకరీ నిర్వహణ కాస్త ఎక్కువ పెట్టుబడితో కూడుకున్నదే అయినా అటు హోల్‌సేల్‌గానూ, ఇటు రిటైల్‌గానూ మంచి లాభాలను తెచ్చిపెట్టే వ్యాపారం అని చెప్పక తప్పదు. ఈ బేకరీ నిర్వహణ ఎక్కడయినా ఎప్పుడూ డిమాండ్‌తో కూడుకున్నదే.

**'రా' మెటీరియల్ (ముడిసరుకులు):-** బ్రెడ్స్, బిస్కట్స్, రస్కులు, వివిధ వెజటబుల్ శాండ్‌విజ్, వెజటబుల్ పఫ్స్, రక రకాలకేక్‌లూ, సాస్‌లూ, మొదలయినవి తయారుచేయటానికి అసవరం అయిన ముడిసరుకులు.

**యంత్రపరికరాలు:-** 1 వివిధ రకాల మౌల్డ్‌లు 2. మోలూర్‌షేరింగ్ మెషిన్ 3. ఫైర్‌బ్రిక్స్ బేకరీ ఓవెన్. లేక ఎలక్ట్రిక్ బేకరీ ఓవెన్ 4. కటింగ్ బ్లేడ్స్ 5. తూకం మెషీన్ 6. ప్లేట్లు 7. పేకింగ్ మెటీరియల్ 8. పిన్‌మెషిన్ (చేతితో నొక్కేది)

**నిర్వహణకు అవసరం అయినవి:-** కౌంటర్ సేల్స్‌కోసం మంచి సెంటర్‌లో ఒకషాపు ( ఆ షాపు వెనుకభాగంలో కిచెన్, స్టోర్ రూమ్‌లు వుండేలా చూసుకోవాలి) షాపులో సేల్స్‌కౌంటర్స్, అద్దాలషోకేస్‌లు, రాక్స్, పెద్దపెద్దగాజుసీసాలు. అల్యూమినియం ట్రేలు, కవర్‌లూ, పేకింగ్ అట్టపెట్టెలు కాష్‌కౌంటర్ అరేంజ్‌చేసుకోవాలి.

***నిర్వహణ విధానము:-*** బేకరీ యజమానిగా మీకు వివిధ రకాలు బేకరీ ఉత్పత్తులకు సంబంధించిన ఫార్ములాలు, తయారుచేయు విధానమూ బాగా తెలిసివుండాలి. (అవసరం అయినంతవరకూ ఉత్పత్తులకు సంబంధించిన పాళ్ళు మీరే మిక్స్ చేయటం మంచిది) ఒకరు లేక ఇద్దరు సరుకు మాస్టర్‌లను పనిలో పెట్టుకోవాలి. మీ ఆదాయాన్ని బట్టి తగినంత జీతాల్లో సేల్స్ గర్ల్స్ పెట్టుకోండి, హోల్‌సేల్ బిజినెస్ నిర్వహించేందుకూ, ఆర్డర్స్ తెచ్చి సప్లయ్ చేసేందుకు నమ్మకస్తులయిన కుర్రాళ్ళను పనిలో పెట్టుకోండి (వారికి సైకిల్స్ వుండటం అవసరం) షాపును ఎప్పుడూ నీట్‌గా వుంచండి. కస్టమర్స్‌తో ప్లెజంట్‌గా, పద్ధతిగా వ్యవహరించండి. మీ బేకరీలో తయారుచేసే అయిటమ్స్ విషయంలో క్వాలిటీ మెయిన్‌టెయిన్ చేయటం చాలా అవసరం. మీ వ్యాపారాన్ని తద్వారా మీ ఆదాయాన్ని పెంచే ప్లస్‌పాయింట్ అదే!

పెట్టుబడి గురించి ప్రాజెక్టు ఎస్టిమేషన్ వివరాలు చూడండి.

# గ్లాస్ సిల్వరింగ్

సహజమయిన ట్రాన్సఫరెంటెడ్ గ్లాస్‌లో ప్రతిబింబాన్ని చూసుకోటానికి వీలువడదు. అలాచూసుకోవాలంటే అద్దాన్ని ఒక వైపున పూర్తిగా కప్పివేయాల్సివుంటుంది. ఏ కాగితాన్ని అంటించటంవల్లనో, రంగుపూయటం వల్లనో అది సాధ్యంకాదు. ఎందుకంటే కాగితం, రంగు మొదలయినవి రెండోవైపుకి కూడా కనిపిస్తూ ప్రతిబింబాన్ని డిస్టర్బ్ చేస్తుంది. అలాకాకుండా ప్రతిబింబాన్ని క్లియర్‌గా చూసుకునేందుకు వీలుకలిగించే ప్రక్రియను కళాయివేయటం అంటారు. గ్లాస్ సిల్వరింగ్ అంటే అదే! ఈ సిల్వరింగ్ ఆదాయంలో కూడుకున్న పరిశ్రమ. ప్రతిబింబం చూసుకునే ఏ అద్దాన్ని ఏ సైజులోదయినా, ఏ మోడల్‌దయినా ఖచ్చితంగా సిల్వరింగ్ చేయాల్సిందే. అందుకే వివిధ మోడల్స్‌కి సంబంధించిన అద్దాలకు గిరాకీ వున్నంతకాలం ఈ సిల్వరింగ్‌కి కూడా డిమాండ్ వుంటూనే వుంటుంది: ఈ సిల్వరింగ్ కోసం రెడ్యూసింగ్ మరియూ, సిల్వర్ అనబడే రెండు రకాల సొల్యూషన్ తయారుచేయాల్సివుంటుంది.

**'రా' మెటీరియల్ (ముడిసరుకులు):-**

రెడ్యూసింగ్ సొల్యూషన్:- సిల్వర్ సొల్యూషన్:- 1. డిస్టిల్డ్ వాటర్ 1. సిల్వర్ నైట్రేట్ 2. రోసెల్లీసాల్ 2. అమోనియా 3. సిల్వర్ నైట్రేట్ 3. డిస్టిల్డ్ వాటర్ 4. ఆల్కహాల్.

**(శాంపిల్) ఫార్ములా:-** రోసెల్లీ సాల్ట్ 15 గ్రా॥ , సిల్వర్ నైట్రేట్ 3 గ్రా॥, డిస్టిల్డ్ వాటర్ తగినంత, సిల్వర్ నైట్రేట్ 2 గ్రా॥, ఆల్కహాల్ 2 మి.లీటర్., అమోనియా 10 గ్రా॥,

**యంత్రపరికరములు:-** 1. స్టవ్ 2. పింగాణీ పాత్రలు 3. కొయ్యగరిటెలు 4. వివిధ సైజులలో బాటిల్స్, 5. పేకింగ్ మెటీరియల్స్, 6 లేబుల్స్ 7. వివిధ సైజులలో తొట్లు (మెటల్)

**తయారుచేయు విధానము:-** అమోనియాని నీటిలో, ఒక పాత్రలో వేసి కరిగించి. ఆ కరిగించిన ద్రవాన్ని ఒక పాత్రలో వేసి స్టవ్‌మీద సన్న సెగలో వుంచి కలుపుతూ అందులో ముందుగా కలిపి వుంచుకున్న సిల్వర్ నైట్రేట్ ద్రవమును చేర్చి మిశ్రమాన్ని చేయాలి, ఆ మిశ్రమాన్ని కొయ్యగరిటెలో కలుపుతూనే ఆల్కాహాల్‌కు

తగినంత డిస్టిల్ వాటర్ కలిపి ఆ మిశ్రమాన్ని, స్టవ్‌మీది మిశ్రమంలో వేయవలయును. ఆ తరువాత ఆ.మొత్తం మిశ్రమద్రావాన్ని అలాగే సీసాలలో నింపాలి.

ఆ తరువాత - రోసెల్లీసాల్ట్‌ను ఒక పాత్రలో వేసి డిస్టిల్డ్ వాటర్‌లో కరిగించి, ఆ పాత్రను ఒకస్టవ్ మీద వుంచి మరిగించాలి. అలా మరుగుతున్న దానిలో సిల్వర్‌నైట్రేట్‌ను తగినంత డిస్టిల్డ్ వాటర్‌తో కలిపి, అందులో వేసి బాగా కలుపుతూ మిశ్రమం చేయాలి. ఆ తరువాత దానిని స్టవ్ మీంచి దించి చల్లార్చి సీసాలలో నింపవచ్చును. ఇక ఏ సైజుగాజు పలకని సిల్వరింగ్ చేయదలుచుకున్నారో, ఆ గాజుపలకల్ని స్వచ్ఛమయిన నీటితో కడిగి, మరకలూ, వేలిముద్రలూ పడకుండా నీట్‌గా తుడిచి ఆరబెట్టాలి ఆరిన గాజుపలకలను ఆ పలికలకంటే పెద్ద సైజులో ముందుగా రెడీ చేసుకున్న పింగాణీ కోటెడ్ తొట్లలో గానీ, స్టీలు తొట్టెలలోగాని గాజుపలకలను వుంచి, వాటిపై సీసాలలో వుంచుకున్న రెండు సొల్యూషన్‌లనూ సమానంగా అప్లయ్‌చేయాలి. ఆగాజు పలకలను మూడు లేక నాలుగు రోజులపాటు అలాగే తొట్టెలలో వదిలేస్తే మిక్స్‌డ్ సొల్యూషన్ చిక్కబడిగాజు పలకలమీద ఫిక్స్ అయిపోతుంది.

సొల్యూషన్ తయారుచేయటంలో నాణ్యత ప్రధానం. అందుకోసం ఫార్ములాలో చిన్నచిన్న మార్పులు చేర్పులూ చేయటం అవసరం.

పెట్టుబడిని గురించి ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ వివరాలు చూడండి.

# గ్రానైట్ పలకలు

ఖరీదయిన భవంతులూ, పక్కాఇళ్ళు నిర్మించుకునేవాళ్ళు. ఫ్లోరింగ్ విషయంలో అత్యంత శ్రద్ధ వహిస్తూ; అందంగా, ఆకర్షణీయంగా చిరకాలం నిలచేవిగా వుండే గ్రానైట్ పలకల్ని (టైల్స్) ఉపయోగించేందుకు ఆసక్తికనబరుస్తున్నారు. ఎటువంటి వాతావరణ పరిస్థితులయినా జీర్ణించుకుని పగుళ్ళు తీయకుండా నిలిచివుండే ఈ గ్రానైట్ పలకలకు మార్కెట్‌లో సహజంగానే గిరాకీ వుంటుంది. వాటిని తయారుచేసి అందించేవారికి చక్కటి లాభాలు కూడా వుంటాయి.

**'రా' మెటీరియల్స్ (ముడిసరుకులు):-** డ్రెస్‌చేయబడిన 'రా' గ్రానైట్ బ్లాక్స్.

**ఫార్ములా:-** కటింగ్, పాలిషింగ్ మరియు ఫినిషింగ్ ఎక్స్‌పీరియన్స్.

**యంత్రపరికరములు:-** 1. ఎడ్జ్ కటింగ్ మెషీన్ 2. వర్టికల్ టైల్ స్లయింగ్‌మెషీన్ 3. వర్టికల్ హేండ్ పాలిషింగ్ మెషీన్ 4. త్రిహెడ్ ఆటోమేటిక్ పాలిషింగ్‌మెషిన్.

**తయారుచేయువిధానము:** - గ్రానైట్ మైన్స్ (గనులు) నుండి తెచ్చిన డ్రెస్‌చేయబడిన గ్రానైట్ 'రా' బ్లాక్‌లను కొనుగోలుచేయాలి. వాటిని నిర్దేశిత పరిమాణాలలో....వర్టికల్ స్లయింగ్ మెషిన్ ద్వారా కట్‌చేయాలి. ఆ విధంగా కట్‌చేయబడిన గ్రానైట్ పలకలను ఆటోమేటిక్ పాలిష్‌యంత్రంలో ముందుగా పాలిష్ చేయాలి. ఆ తరువాత అవసరం అయిన షైనింగ్ కోసం బఫింగ్ మెషిన్ మీద పాలిష్ చేసి నునుపును మెరుపును తీసుకురావాలి. ఆ తర్వాత పలకల వెనుకభాగంలో గ్రూప్స్‌చేసి ఎడ్జ్‌కటింగ్ యంత్రాన్ని ఉపయోగించి అంచులు కట్‌చేసి.....వివిధ సైజులలో కట్‌చేయబడిన పీసెస్‌ని పాక్‌చేసి మార్కెటింగ్‌కి సిద్ధం చేయాలి. పాలిషింగ్, ఫినిషింగ్‌లలో నాణ్యతను కనబరచటానికి ప్రయత్నించాలి.

ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ వివరాలు ప్రత్యేకంగా ఇవ్వబడ్డాయి.

# విజిటింగ్ అండ్ ఇన్విటేషన్ కార్డ్స్

వివిధరకాల ఇన్విటేషన్ కార్డులను గురించీ, విజిటింగ్ కార్డులను గురించీ అందరికీ తెలిసిందే. ఈ కాలంలో ఏ ఫంక్షన్ జరిగినా ఉత్సవాలు జరిగినా అందమయిన అక్షరాలతో సమయసందర్భాలను తెలియచేస్తూ ప్రింటింగ్ చేయబడిన కార్డుల ద్వారా బంధుమిత్రులను ఆహ్వానించటం పరిపాటి అయిపోయింది. అలాగే ఎదుటివారికి వివరాలు తెలియచేయాల్సి వచ్చినపుడు ఏ పేపర్‌మీదనో వ్రాసి ఇవ్వకుండా జేబులోంచి స్టయిల్‌గా విజిటింగ్ కార్డ్ తీసి ఇవ్వటం మనం చూస్తునేవున్నాం. ఇక వెడ్డింగ్ కార్డ్‌ను గురించి చెప్పనవసరం లేదు. చెప్పలేనన్ని రకాలూ, మోడల్స్, సైజులు మార్కెట్‌లో విరివిగా లభిస్తున్నాయి. ఇవి ఐడెంటిటీ కార్డ్, విజిటింగ్‌కార్డ్, వెడ్డింగ్‌కార్డ్, ఇలా చెప్పకుంటూ పోతే చాలాచాలా రకాలు వున్నాయి. పెళ్లిళ్లలోనూ, ఉత్సవాలలోనూ పార్టీలలో ఎప్పుడూ సందడిగా వుండే నాగరిక ప్రపంచంలో ఈ కార్డ్‌లకు విపరీతమయిన గిరాకీ వుందనే చెప్పాలి. అంతేకాదు ఎంతో సులువయిన ఈ కార్డ్‌ల తయారీ అత్యంత లాభదాయకం అని కూడా ఖచ్చితంగా చెప్పొచ్చు.

**'రా' మెటీరియల్స్ (ముడిసరుకులు):-** 1. వివిధ గేజ్‌లలో గేజ్డ్, నాన్‌గేజ్డ్ కార్డ్‌బోర్డ్

**ఫార్ములా :-** ఎట్రాక్టివ్ మోడల్స్‌లో, వివిధసైజులలో కార్డులు కట్‌చేయటం, మంచిమార్కెటింగ్ కెపాసిటీ వుండటం.

**యంత్రపరికరములు:-** 1. పేపర్‌కటింగ్ మెషిన్. 2. మెజర్‌మెంట్స్ స్కేల్. 3. కార్డ్‌ఫోల్డింగ్ మెషిన్ 4. పేపర్ ఎంబోజింగ్ మెషిన్ 5. ప్రింటింగ్ యూనిట్. 6. డిజైనింగ్ బ్లాక్స్ 7. పేకింగ్ మెటీరియల్స్.

**తయారుచేయు విధానము:-** వివిధ గేజ్‌లలోని కార్డ్‌బోర్డ్‌లను (గ్లేజ్డ్. నాన్‌గ్లేజ్డ్. వన్‌సైడ్ గ్లేజ్డ్ కలవి) రీములు లెక్కనగానీ. గ్రోసులు లెక్కనగాని తీసుకోవాలి. వాటిని ముందుగా నిర్ణయించుకున్న మెజర్‌మెంట్స్‌లో విజిటింగ్ కార్డ్‌లుగాను ఇన్విటేషన్‌కార్డ్‌లుగానూ కట్‌చేసి అట్టపెట్టెలలో పేక్ చేయాలి. సాధారణంగా విజిటింగ్, ఇన్విటేషన్‌లకు వైట్‌కార్డ్‌లే ఉపయోగిస్తారు కాబట్టి బోర్డ్‌ను కార్డ్‌లుగా కట్‌చేసుకుంటే సరిపోతుంది. ఇక వెడ్డింగ్ కార్డ్‌ల విషయానికి వస్తే వివిధ సైజులలో, రకరకాల

డిజైన్స్‌తోఅందించవలసిన అవసరం వుంది. వీటికోసం కలర్ బోర్డ్లు తీసుకోవటం గానీ, ప్రింటింగ్ ద్వారా వాటిని కలర్‌చేసి వివిధ డిజైన్స్‌ను బ్లాక్‌ల ద్వారా గానీ ఆఫ్‌సెట్ ప్రింటింగ్ ద్వారా గాని ప్రింటింగ్ చేయించి అమ్మకానికి పెట్టాలి. ఈ డిజైన్స్ ఎంత ఎట్రాక్టివ్‌గా ఎంత మోడ్రన్‌గా వుంటే అంత ఎక్కువ సేల్స్ వుంటుంది. కొందరు సాంప్రదాయాన్ని సూచించే డిజైన్ కార్డ్ లంటే ఇష్టపడతారు. అలాంటివారి కోసం కార్డ్ పైభాగం మీద మంగళసూత్రాలు, బాజాభజంత్రీలూ, అరటిచెట్లూ పచ్చతోరణాలు వంటి డిజైన్స్ ప్రింట్ చేయించాలి. సీతారామకళ్యాణం వెంకటేశ్వరస్వామి, ఇలా రకరకాల దేవుళ్ళబొమ్మలు కూడా డిజైన్‌గా వాడతారు. ఇక మోడరన్ డిజైన్స్ విషయానికి వస్తే అవి కోకొల్లలు. ఈ వెడ్డింగ్‌కార్డ్‌లలో సింగిల్, డబుల్ అండ్ ట్రిబుల్‌ఫోల్డింగ్ కార్డ్లు కూడా వున్నాయి. ఎంబోజింగ్ యంత్రాన్ని ఉపయోగించటం ద్వారా డిజైన్ చెక్కుడులా కనిపించేటట్టు చేయొచ్చు. ఇలా వివిధ రకాల కార్డులు తయారుచేయటం ద్వారా మంచి లాభాలు సంపాదించవచ్చు.

పెట్టుబడి తక్కువే! లాభాలు 50 నుంచి 60 శాతం వరకూ వుంటాయి.

ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ ప్రత్యేకంగా ఇవ్వబడింది.

# స్టాంప్‌పేడ్ ఇంక్

ఆఫీషియల్, నాన్‌ఆఫీషియల్ కార్యాలయాలలో రబ్బర్‌స్టాంప్‌లతోచాలా అవసరం ఉంటుంది. ఎవరు వాడినా, ఎందుకు వాడినా రబ్బర్ స్టాంప్‌లంటూ వాడితే వాటికి ఇంక్ పేడ్ అవసరం తప్పకుండా వుంటుంది. స్టాంప్ వేయాలంటే ముందుగా ఇంక్ పేడ్‌మీద అద్ది తీరాల్సిందే. ఆ అవసరాన్ని దృష్టిలో ఉంచుకునే తయారుచేయబడింది రబ్బర్‌స్టాంప్‌లకు అవసరం అయిన పేడ్ ఇంక్. ఇంక్‌పేడ్ ఒకసారి కొనుక్కుంటే చాలు. దాంట్లో ఇంక్ అయిపోయినప్పుడూ, ఆరిపోయినప్పుడూ ఈ ఇంక్ పోసుకుంటే రబ్బర్‌స్టాంప్‌ను చాలా సార్లు ఉపయోగించేందుకు వీలుంటుంది. రబ్బర్‌స్టాంప్‌లు ఉపయోగించే ప్రతిచోటా ఈ ఇంక్‌తో అవసరం వుంటుంది కాబట్టి దీనికి మార్కెట్‌లో తగిన డిమాండ్ వుంటుందని. ఖచ్చితంగా చెప్పొచ్చు.

**'రా' మెటీరియల్స్ (ముడిసరుకులు)** : 1. మెథిలేటెడ్ స్పిరిట్ 2. గమ్ 3. గ్లిసరిన్ 4. మెథిల్ వయొలెట్ 5. స్వచ్ఛమయిననీరు

**ఫార్ములా:-** 1. మెథిలేటెడ్ స్పిరిట్ 150 గ్రా॥ 2. గమ్ 75 గ్రా॥ 3. గ్లిసరిన్ 450 గ్రా॥ 4. మెథిల్ వయొలెట్ 75 గ్రా॥ 5. స్వచ్ఛమయిననీరు తగినంత.

**యంత్ర పరికరములు:-** 1. స్టవ్ 2. ఒక స్టీలు పాత్ర 3. కొయ్యగరిటె 4. ఫిల్టర్స్ 5. బాటిల్స్ 6. పేకింగ్ మెటీరియల్స్.

**తయారు చేయు విధానము:** - ముందుగా ఒక పాత్రలో తగినంతగా స్వచ్ఛమయిన నీరును తీసుకుని వేడి చేయాలి. ఆ వేడి నీటిలో మెథిల్ వయొలెట్ కలర్‌ని వేసి కలపాలి. అతరువాత దాంట్లో గ్లిసరిన్‌ను కొద్దికొద్దిగా వేస్తూ బాగా కరిగేదాకా కొయ్యగరిటెతో కలియబెడుతూ వుండాలి. ఇక ఆఖరున మెథిల్‌టెడ్ స్పిరిట్‌నూ గమ్‌ను ఆ మిశ్రమంలో కలిపి బాగా కలుపుతూ కుదించిన తరువాత నలభై ఎనిమిది గంటలపాటు అలాగే వదిలేసి. తరువాత అనువయిన ఫిల్టర్స్ ద్వారా వడగట్టి బాటిల్ ఫిల్లింగ్ యంత్రసహాయంతో ఆకర్షణీయమైన బాటిల్స్‌లో నింపి మూతలు బిగించి ఆబాటిల్స్‌కి లేబుల్స్ అంటించి మార్కెట్ చేయాలి.

పెట్టుబడిని గురించి ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ వివరాలలో చూడండి.

# చాక్‌లెట్స్

పిల్లలకూ, వృద్ధులకూ నోరూరుంచే చాక్‌లెట్స్ తయారీ చాలా లాభదాయకమయిన పరిశ్రమ. ప్రస్థుతం మార్కెట్‌లో పేరు మోపిన అనేక కంపెనీలవారు వివిధరకాల పేర్లతో రకరకాల చాక్‌లెట్స్ తయారుచేసి విడుదలచేస్తున్నా, ఈ చాక్‌లెట్స్‌కి నిరంతరంగా గిరాకీ పెరుగుతూనేవుంది. కొన్నిచాక్‌లెట్స్ తియ్యగా వుండటమే కాదు, వాటి తయారీలో రకరకాల రుచులతో కూడిన ఎసెన్స్‌కలపటం వల్ల కాఫీ, మేంగో, కోకోనట్ మొదలయిన రుచులు స్కూలీకాలేజి విద్యార్థులను సయితం విపరీతంగా ఆకట్టుకుంటూ తయారీదార్లకు లాభాలు చేకూర్చుతున్నాయి.

**'రా' మెటీరియల్స్ (ముడి సరుకులు):+ ఫార్ములా:-** 1. వనిలా 30 గ్రా॥ 2. షుగర్ ఐరన్ 45 గ్రా॥ 3. ఐరన్ లెక్టేడ్ 45 గ్రా॥ 4. పంచదార 600 గ్రా॥ 5. కోకో పౌడర్ 750 గ్రా॥ 6. కోకో ఆయిల్ 25 గ్రా॥

**యంత్ర పరికరములు:-** 1. మిక్సర్ 2. గ్రైండర్ 3. తగిన పాత్రలు 4. చాక్లెట్ డై చట్రము 5. స్టీల్ గరిటెలు

**తయారు చేయు విధానము:** - పంచదారను ముందుగా పొడిచేసి ఒక పాత్రలో [illegible]. కోకోపౌడర్‌నీ, కొకో ఆయిల్స్‌ని కలిపి ఒక గ్రయిండర్‌లో వేసి బాగా మిశ్రమం అయ్యేలా మెత్తగా రుబ్బాలి. పొడిచేసిన పంచదారను ఆమిశ్రమంలో వేసి బాగా కలపాలి. ఐరన్‌లెక్టేడ్, షుగర్ ఐరన్, వనిల్లా మూడింటినీ కలిపి పై మిశ్రమంలో చేర్చి గ్రయిండర్‌లో వేసి మరింత మెత్తగా రుబ్బాలి. అలా మొత్తం మిశ్రమం బాగా పాకంలా చిక్కబడేంతవరకూ రుబ్బి, ఆ తరువాత చాక్లెట్ డైస్‌లో కూడిన ఇనప చట్రంలో పోయాలి. బాగా ఆరిన తరువాత చట్రంలో నుండి ఆ చాక్‌లెట్స్‌ను వేరుచేసి అందమయిన ప్రింటెడ్ పేపర్స్‌లో చుట్టి 1/2 కిలో, 1 కిలో 2 కిలోల పాలిథిన్ బేగ్స్‌లో వేసి నీట్‌గా పేక్ చేసి మార్కెట్‌లోకి విడుదల చేయాలి.

చాక్‌లెట్స్ అనగానే తియ్యగా వుండటంతో సరిపోదు. మీరు తయారుచేసే చాక్లెట్స్‌కి నాణ్యత, తీపితో కూడిన ఒక క్రొత్తరకమయిన రుచి ఉండటం అవసరం.

ప్రాజెక్ట్ ఎస్టిమేషన్స్ ప్రత్యేకంగా యివ్వబడ్డాయి.

# మస్కిటోక్రీమ్

*మురికినీటి నిల్వ, వాతావరణ కాలుష్యం, పెంటకుప్పలు మొదలయిన వాటి కారణంగా పుట్టుకు వచ్చే దోమల బాధనుండి విముక్తి పొందేటందుకు మస్కిటోకాయల్స్, మస్కిటో రీఫెల్స్ లాంటిదే ఈ మస్కిటో క్రీమ్ కూడా. సాధారణంగా పగటిపూట కనిపించని ఈ దోమలు చీకటి పడగానే విజృంభిస్తాయి. సూదులు పెట్టి గుచ్చినట్టు చర్మంచురుక్కుమనేలా కుట్టి నిద్ర లేకుండా చేస్తాయి. అటువంటి సమయాలలో వెలుపలికి కనిపించే శరీరం అంతటా ఈ మస్కిటో క్రీమును రాసుకుంటే... దోమలు దరిదాపులకి కూడా చేరవు. అందుకే ఈ దోమల మందుకి మార్కెట్‌లో డిమాండ్ వుంది.*

**'రా' మెటీరియల్స్ (ముడిసరుకులు):-** 1. సిడార్‌వుడ్ ఆయిల్ 2. గ్లిసరిన్ 3. స్టీరిక్ ఆసిడ్ 4. బొరాక్స్ 5. కర్పూరం 6. కాస్టిక్ పొటాష్ 7. సిట్రోనెల్లా ఆయిల్8. నీరు (స్వచ్ఛమైంది)

**ఫార్ములా:-** సిడార్‌వుడ్ అయిల్ 15 గ్రా॥ , గ్లిసరిన్ 75 గ్రా॥, స్టీరిక్ ఏసిడ్ 300 గ్రా॥, బొరాక్స్ 225 గ్రా॥, కర్పూరం 15 గ్రా॥, కాస్టిక్ పొటాష్ 8 గ్రా॥, సిట్రోనెల్లా ఆయల్50 గ్రా॥,స్వచ్ఛమయిన నీరు తగినంత.

**యంత్ర పరికరములు:-** 1. ట్యూబ్స్ ఫిల్లింగ్ మెషిన్ 2. మిక్సర్ 3. స్టవ్ 4. స్టీల్ పాత్రలు 5. కొయ్యగరిటె 6. హాండ్‌గ్లవ్స్ (రబ్బరువి) 7. బాటిల్స్ 8. లేబుల్స్ 9. పేకింగ్ అట్టపెట్టెలు.

***తయారుచేయు విధానము:-*** గ్లిసరిన్‌ను వేడినీటిలో కలిపి వుంచుకోవాలి. ఒక పాత్రలో స్టీరిక్ ఏసిడ్ వేసి స్టవ్‌మీద సన్నటి సెగతో ఆ పాత్రను వుంచి కరిగించాలి.... అందులో బొరాక్స్, కాస్టిక్ పొటాష్‌లను కలిపి బాగా మిశ్రమం చేయండి. ఆ మిశ్రమంలో వేడినీళ్ళతో కలిపి వుంచిన గ్లిసరిన్‌ని వేయాలి. మొత్తం మిశ్రమాన్ని అంతటి తెల్లటి పేస్ట్‌లా వచ్చేలా కొయ్య గరిటెతో బాగా కలియబెట్టాలి. ఇక మిగిలినది.... అంటే సిరార్‌వుడ్ ఆయిల్, కర్పూరం, సిట్రోనెల్లా ఆయిల్, ఒకదాని తరువాత ఒకటి కలుపుతూ బాగా మెత్తగా మిశ్రమం అయ్యేలా చేయాలి. ఆ తరువాత ఆ మిశ్రమానికి తగినంత స్వచ్ఛమయి నీటిని కలిపి, బాగా కలియబెట్టి సుమారు 50 గంటలపాటు అలాగే వదిలేస్తే మిశ్రమం చిక్కబడి క్రీమ్‌లా తయారు అవుతుంది.

అప్పుడు ఆక్రీమ్‌ను ప్రింటెడ్ కొలాప్సబుల్ ట్యూబులలోకి గాజు సీసాల్లోకి ఎక్కించి, నీట్‌గా పేక్‌చేసి మార్కెట్‌లోకి విడుదల చేయండి. దోమల నివారణ ఒక్కటే మీరు అందించే క్రీమ్ నాణ్యతకు ప్రమాణం అవుతుంది. అదే మార్కెట్ గిరాకీని పెంచి అంచనాల మేరకు మీకు లాభాలను తెచ్చిపెడుతుంది.

పెట్టుబడిని గురించి ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ వివరాలు చూడండి.

# ఐస్ క్రీమ్

*వెన్నగా మృదువుగా, చల్లగా నోట్లోకి వెళ్లగానే కరిగిపోయే ఐస్‌క్రీం అంటే యిష్టపడనివారుండరు. దీన్ని కొరకనవసరం లేదు. నమిలే అవసరం అంత కంటే లేదు. అందుకే పళ్ళురాని పిల్లల దగ్గర నుండి పళ్లూడిపోయిన వృద్ధుల వరకూ ఐస్‌క్రీమ్‌ను చూడగానే పెదాలు చప్పరిస్తారు. వేసవి తాపాన్ని సేద దీర్చే శీతల పానీయాలతో సమానంగా అమ్మకాలలో పోటీ పడుతున్న ఈ ఐస్‌క్రీమ్ వివిధ రకాల రుచులలో తయారు చేయబడి అయస్కాంతం కంటే వేగంగా యువతరాన్ని ఆకట్టుకుంటోంది. ఒక్క వేశవిలోనే కాదు... అన్ని సీజన్స్‌లోను గిరాకీ తగ్గని ఈ ఐస్‌క్రీమ్ తయారీ మంచి లాభాలను తెచ్చిపెట్టే పరిశ్రమగా చెప్పాలి! అయితే యిక ఆలస్యం ఎందుకు ఆ లాభాల బాటలో మీరు పయనించటానికి ప్రయత్నించండి!*

**రామెటీరియల్స్ (ముడిసరుకులు):- ఫార్ములా:+** క్రీమ్ 3KG లు, పాలు 10 లీటర్‌లు, పౌడర్ 2 KGలు, పంచదార 15 KG లు, ఎసెన్స్ తగినంత.

**యంత్రపరికరములు** :- 1. ఫ్రీజర్ (1 హార్స్ పవర్‌లో నడిచేది) 2. పేపర్ కప్పులు (వివిధ సైజులలో) 3. ప్లాస్టిక్ గుల్లబంతులు 4. ఫ్రిజ్‌లు 5. ఎలక్ట్రి ఫికేషన్

***తయారు చేయువిధానము:-*** పౌడర్‌ని కొద్ది పాటి పాలల్లో ముందుగానే కలిపి వుంచుకోవాలి. మిగతా పాలు ఒక పాత్రలో పోసి స్టవ్ మీద పెట్టి బాగా మరగించాలి. పాలు బాగా మరుగుతున్నప్పుడే పాలల్లో కలిపివుంచుకున్న పౌడర్ కలిపిన ద్రవాన్ని పాలల్లో పోసి బాగా కలియబెడుతూవుండాలి. (లేదంటే గట్టి బడిపోయే అవకాశం వుంది. ఆ తరువాత చక్కెరనూ, క్రీమునూ ఒక దాని తరువాత ఒకటి చేర్చి మరింతగా కలపాలి. ఆ తరువాత ఆ మిశ్రమాన్ని స్టవ్ మీంచి దించి, మిక్సింగ్ యంత్రంలో వేసి బాగా మెత్తగా మృదువుగా కనిసిపోయేలా మిక్సింగ్ చేయాలి. ఆ తరువాత ఆ మిశ్రమాన్ని తీసి ఫ్రీజర్‌లో రెండు గంటలుపాటువుంచి వివిధ సైజులలో వుండే పేపర్‌కప్పులలోను, ప్లాస్టిక్ గుల్ల బంతులలోనూ వేసి పేక్ చేయాలి. డిమాండ్‌ను బట్టి ఈ ఐస్ క్రీమ్‌లు ఎక్కువ ఖరీదులోనూ తక్కువ ఖరీదులోనూ తయారు చేయవచ్చును.

ఈ పరిశ్రమ స్థాపనకు మొత్తం యంత్ర పరికరాలతో పాటు యితర ఖర్చులు కలిపి సుమారు 40 వేల రూపాయలు కావచ్చు.

# ఆటోమొబైల్ సైలెన్సర్స్

ప్రయాణ సాధనాలయిన స్కూటర్, మోపెడ్, మోటార్‌బైక్, ఆటో, ఇంకా నాలుగు చక్రాల వాహనాలు రన్నింగ్‌లో వున్నప్పుడు విపరీతమయిన ధ్వని వస్తుందన్న సంగతి అందరికీ తెలిసిందే. ఆయిల్ ఇంజన్‌లు సృష్టించే ఈ ధ్వని తగ్గించేందుకు ఈ సైలెన్సర్స్ చక్కగా ఉపయోగపడతాయి. శబ్దకాలుష్యాన్ని నియంత్రించేందుకు ఈ సైలెన్సర్‌ల వాడకం తప్పనిసరి. మోటార్‌వాహనాల సంఖ్య విపరీతంగా పెరిగిపోతోంది. అవి ఎంతగా పెరుగుతాయో సైలెన్సర్‌ల వాడకం స్థాయి కూడా అంతకు రెట్టింపు పెరుగుతుంది. ఎందుకంటే, వాహనంతో పాటే ఫిట్‌చేయబడే సైనెన్సర్ కొంతకాలానికి తుప్పపట్టి పనికిరాకుండా పోతుంది. అప్పుడు వెంటనే సైలెన్సర్ మార్చాల్సివుంటుంది. అందువల్ల స్పేర్‌పార్ట్ విభాగంలో ఎప్పుడూ మార్కెట్‌లో రెడీగా వుంచబడతాయి. వీటిని తయారుచేసి స్పేర్‌పార్ట్స్ డీలర్స్‌కి అందచేయటం ద్వారా మంచి ఆదాయాన్ని సమకూర్చుకోవచ్చు. తగు లైసెన్స్‌లూ పర్మిషన్‌లు పొంది ఆటోమొబైల్స్ కంపెనీ వారితో భారీ కాంట్రాక్ట్‌లు కుదుర్చుకుని, వారు సూచించిన విధంగా తయారుచేసి అందించవచ్చును.

**'రా' మెటీరియల్ (ముడిసరుకులు):-** 1. M.S షీట్ 16-18 SWG 2. నిర్దేశిత పొడవులో M.S ట్యూబ్స్ 50 M.M వ్యాసంగలవి.

**ఫార్ములా:-** ట్రెయినింగ్ + అనుభవం. మెజర్‌మెంట్ మరియూ అసెంబ్లింగ్ నాలెడ్జ్.

**యంత్రపరికరములు:-** 1. చేతితో పనిచేసే ఫ్లెక్సిబుల్ గ్రైండర్ 2. ఎలక్ట్రికల్ ఫిటింగ్స్. 3. మెషినరీప్లేస్‌మెంట్ 4. గ్యాస్ వెల్డింగ్ సెట్ 5. హాండ్‌షియరింగ్ మెషిన్ 6.పైప్ బెండింగ్ మెషీన్ (హాండ్ ఆపరేటెడ్) 7. బెంచ్ గ్రైండింగ్ మెషీను 8. గ్యాస్‌సిలెండర్ 9. పెయింటింగ్ మెటీరియల్ 10. హేండ్‌టూల్స్ 11. ఆఫీస్ ఫర్నిచర్.

**తయారుచేయు విధానము:-** ముందుగా అవసరం అయిన మెజర్‌మెంట్స్‌తో కావాల్సిన సైలెన్సర్ ఆకారాన్ని డ్రాయింగ్ వేసుకోవాలి. ఆ తరువాత షియరింగ్ మెషిన్ సహాయంతో M.S షీట్స్‌ను కావాల్సిన సైజుకి కట్‌చేసుకోవాలి. అదేవిధంగా M.S పైప్‌ను కూడా కట్‌చేసి, అవసరం అయిన విధంగా బెండింగ్ యంత్రసహాయంతో

వంచుకోవాలి. స్క్రూహోల్స్ ఏర్పాటు చేసుకోవాలి. రెండుపార్ట్‌లుగా కట్‌చేసుకున్న M.S షీట్స్‌ని అవసరమయిన షేప్‌లో ఎడ్జ్‌లను వంచుకోవాలి. ఆ తరువాత M.S ట్యూబును ఒక పార్ట్‌కి వెల్డింగ్ ద్వారా కనెక్ట్‌చేసి, కటింగ్ పాయింట్‌ని గ్రైండింగ్ మెషిన్ ద్వారా సవరించి, రెండుపార్ట్‌లను కలిపి వెల్డింగ్ చేయటం ద్వారా కలిపితే లైసెన్సర్ తయారయినట్టే. ఆ తరువాత దానిని ఫ్లెక్సిబుల్‌గ్రైండర్‌లో ఫినిషింగ్ ఇచ్చి పెయింట్‌వేస్తే ఉపయోగించటానికి సిద్ధంగా మార్కెట్‌కి పంపవచ్చును.

గమనిక: ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ వివరాలు ప్రత్యేకంగా యివ్వబడ్డాయి.

# పెయింటింగ్ అండ్ టింకరింగ్ యూనిట్

*ఏక్సిడెంట్స్ మూలకంగానో, ఇతర కారణాలవల్లనో వాహనాలుకొన్ని ప్రదేశాలు దెబ్బతిని, సొట్టలుపడి ఆకారాన్ని కోల్పోతుంటాయి. పెయింట్‌పూడిపోయి చిరాకు కలిగించే విధంగా కనిపిస్తుంటాయి. స్టీలు, అయిరన్ ఆర్టికల్స్ ఫ్యాబ్రికేటర్స్ విషయంలో కూడా ఇలా జరుగుతుంటుంది. అటువంటి వాటి లోపాలను సవరించేందుకు ఉద్దేసించబడిందే టింకరింగ్ యూనిట్. ఈ యూనిట్ స్థాపన మంచి ఆదాయాన్ని ఇనస్తుంది. ఎప్పుడూ ఏదో ఒక టింకరింగ్ వర్క్ వుంటూనేవుంటుంది. అయిరన్ బీరువాలూ, టేబుల్స్, ఇంకా డ్రమ్ములు ఇతర సామగ్రిని తయారుచేసే పరిశ్రమల వారికి కూడా ఈ టింకరింగ్ యూనిట్‌తో అవసరం వుంటూనే వుంటుంది. అటువంటి పరిశ్రమలతో సంబంధాలు పెట్టుకోవటం ఈ యూనిట్ పెట్టుకున్న వారికి లాభదాయకంగా వుంటుంది.*

**'రా' మెటీరియల్స్ (ముడిసరుకులు):-** 1. పెయింట్స్ 2. ఎమెరీపేపర్ 3. పట్టీలు 4. గ్యాస్‌సిలెండర్ 5. ప్రైమర్స్ 6. ఎమెరీక్లాత్ 7. వేస్ట్‌కాటన్

**ఫార్ములా:-** టింకరింగ్, పెయింటింగ్‌లలో సాంకేతిక శిక్షణ లేక ఆ యూనిట్‌లో పనిచేసిన అనుభవం.

**యంత్ర పరికరాలు:-** 1. ఎలక్ట్రిఫికేషన్ 10 H.P లోడ్ 2.పెయింటింగ్ స్ప్రేమెషీన్ 3. ఎయిర్‌కంప్రెసర్ 0.5 H.P 4. వర్క్ టేబుల్ 5. గ్యాస్‌వెల్డింగ్ యూనిట్ 6. పోర్టబుల్ డ్రిల్లింగ్ మెషిన్ 7. గ్యాస్ సిలెండర్ 8. ఓవెన్ 9. హేండ్‌టూల్స్, ఇనుప వూచలు.

***నిర్వహణ విధానము:-*** అనువయిన చోట ఒక షెడ్‌ను, లేక చిన్న షాప్‌ను తీసుకుని యూనిట్ స్థాపించాలి. మీ షాప్ పేరునూ, మీరు చేసే వర్క్‌నూ తెలియచేసే బోర్డ్‌ను షాపుముందు అరేంజ్ చేసుకోవాలి. ముందుగా కొన్ని పరిశ్రమల వారిని కలవంటం ద్వారా మీ యూనిట్ స్థాపన గురించి తెలియచేసి వర్క్ సంపాదించాలి. ఇది ప్రారంభంలో చేయాల్సిన పని ఆ తరువాత వర్క్ మీరున్న చోటుకే వస్తుంది. దెబ్బతిన్న పరికరాలు వాహనాల బాడీలు సొట్టలుతీసి లోపాలను సవరించటం టింకరింగ్‌లో ప్రధాన ప్రక్రియ. ఆతరువాత అవసరమయిన చోట పగుళ్ళు కనపడకుండా

వెల్డింగ్ చేయాల్సివుంటుంది. ఆ తరువాత ఎమెరీ పేపర్‌తోగానీ, లేక క్లాత్‌తోగాని వెల్డింగ్, టింకరింగ్‌చోట నునుపుగా చేసి ఆతరుఛాత పెయింట్ అప్లయ్‌చేయాల్సివుంటుంది. టింకరింగ్‌చేసేందుకు ఒకోసారి పరికరాలను, విడిభాగాలను ఓపెన్‌లో వేడిచేసి లోపాన్ని మెత్తబరచవలసి వుంటుంది. టింకరింగ్, పెయింటింగ్‌లు చేయటంవల్ల పరికరాల లోపాన్ని సవరించనట్లు తెలియకుండా, కొత్త పరికరాన్ని చూపినట్టువుంటుంది.

టింకరింగ్‌కి వర్క్‌మేన్‌షిప్ ప్రధానం. పనిలో నైపుణ్యాన్ని ప్రదర్శిస్తే కస్టమర్స్‌ని విపరీతంగా రాబట్టుకుని ఎప్పుడు బిజీగా వుండవచ్చు. కస్టమర్స్ అడ్వాన్స్ ఇస్తారు కాబట్టి ఈ పనిలో వర్కింగ్ కేపిటల్ గురించి ఇబ్బందిపడవలసిన అవసరం ఉండదు.

# షేవింగ్ క్రీమ్

ఎంతషార్ప్‌గా వున్న బ్లేడ్ ఉపయోగించినా షేవింగ్ చేసినచోట చర్మం ఒక్కోసారి మంట పుడుతుంది. వెంట్రుకలు బిరుసుగా వున్నప్పుడు చర్మం తెగిపోవటం కూడా జరుగుతుంటుంది. అలా జరగకుండా వుండటానికే బార్బర్ షాపులలో ఒకప్పుడు సబ్బు ఉపయోగించేవారు. మొదట్లో టాయ్‌లెట్ సబ్బులనే వాడేవారు. అవి ఖరీదు ఎక్కువ కావటంతో వాటి స్థానంలో షేవింగ్ సోప్‌లూ, కేక్‌లూ ఆ తరువాత షేవింగ్ క్రీమ్ వరుసగా మార్కెట్‌లోకి రంగప్రవేశం చేసాయి. వీటి ధర సామాన్యులకు కూడా అందుబాటులో వుండటం. మృదుత్వాన్ని, సువాసనను కలిగివుండటంతో సెల్ఫ్‌షేవింగ్ చేసుకునే వాళ్ళు దీనిని వాడటం ఎక్కువయింది. సెలూన్స్‌నడిపేవాళ్ళు కూడా ఇప్పుడు ఈ క్రీమ్‌లు వాడకానికే అధికప్రాధాన్యతను ఇవ్వటంతో మార్కెట్‌లో వీటి గిరాకీ బాగా పెరిగిపోయింది. దేశంలోని పెద్దపెద్దకంపెనీల వారు కూడా ఉత్పత్తి చేసే విషయంలో పోటీ పడేస్థాయికి ఎదిగిపోయింది.

**'రా' మెటీరియల్స్ (ముడిసరుకులు):-** 1. ఫోమ్‌బూస్టర్ 2. కాస్టిక్‌సోడా 3. సోడియం లారిల్ సల్ఫేట్ 4. కాస్టర్ ఆయిల్ 5. స్టీరిక్ ఏసిడ్ 6. కొబ్బరినూనె 7. కొవ్వు 8. కాస్టిక్‌పొటాష్ 9. సుగంధ ద్రవ్యమిశ్రమం 10. స్వచ్ఛమయిన నీరు 11. బొరాక్స్ 12. రంగు 13. గ్లిసరిన్ 14. సోడియం సిలికేట్

**ఫార్ములా:-** 1. ఫోమ్‌బూస్టర్ 50 గ్రా॥ 2. కాస్టిక్ సోడా 20 గ్రా॥ 3. సోడియం లారిక్ సల్ఫేట్ 25 గ్రా॥ 4. కాస్టర్ ఆయిల్ 25 గ్రా॥ 5. స్టీరిక్ ఏసిడ్ 100 గ్రా॥ 6. కొబ్బరినూనె 50 గ్రా॥ 7. కొవ్వు 25 గ్రా 8. కాస్టిక్ పొటాష్ 20 గ్రా॥ 9. సువాసన 3 గ్రా॥ 10. స్వచ్ఛమైన నీరు 250 మి.లీ॥ 11. బొరాక్స్ 5 గ్రా॥ 12. రంగు 3 గ్రా॥ 13. గ్లిసరిన్ 50 గ్రా॥ 14. సోడియం సిలికేట్ 15 గ్రా॥

**యంత్రపరికరములు:-** 1. మిక్సర్ 2. గ్రైండర్ 3. డ్రమ్ములు, లేక బకెట్స్ 4. తూనిక యంత్రం 5. ఓవెన్ 6. పెద్దసైజు ఇనుప కళాయి7. కొయ్యగరిటెలు 8. మరికొన్ని పాత్రలు 9. సాంద్రత తెలుసుకునే హైడ్రోమీటర్ 10. వేయింగ్ మెషీన్ వగయిరాలు 11. ట్యూబ్స్. 12. ట్యూబ్స్ ఫిల్లింగ్ మెషీన్.

**తయారుచేయు విధానము:-** సోడియం సిలికేట్‌ను కావాల్సినంతగా తూచి ఒక పాత్రలో వేసి రెడీగా వుంచుకోవాలి. కాస్టిక్ సోడాను నీళ్ళలో. కలిపి, ద్రవంగా తయారుచేసుకోవాలి. ఆయిల్స్ అన్నిటితో పాటు కొవ్వు మొదలయిన వాటిని ఒక పెద్ద కళాయిలో వేసి 75 డిగ్రీల ఉష్ణోగ్రతలో మెల్లగా కాచటం ప్రారంభించాలి. ఆ మిశ్రమం మరుగుతుండగా రెడీగా వుంచుకున్న కాస్టిక్ సోడా వాటర్‌నీ, సోడియం సిలికేట్‌నీ, ఒక్కటొక్కటిగా అందులోవేసి కొయ్య గరిటెతో కలుపుతూ మిశ్రమం చేయాలి. అంతా మిశ్రమం చేసిన తరువాత మిశ్రమాన్ని 85 డిగ్రీల సెంటీగ్రేడ్ ఉష్ణోగ్రత వద్ద బాగా మరగబెట్టాలి. తరువాత ఉష్ణోగ్రతను 70 డిగ్రీలకు తగ్గించి సోడియం సిలికేటును వేసి బాగా కలపాలి. అప్పుడు మిశ్రమం పలచని ద్రవంగా మారుతుంది. ఆ తరువాత మిగిలిన ముడిసరుకులన్నీ కొద్ది కొద్దిగా వేసి కలుపుతూ ఉష్ణోగ్రతను 50 డిగ్రీలకు తగ్గించి, రంగునూ, సుగంధ మిశ్రమాన్ని జతచేసి అందులో చేర్చి కలపాలి. మొత్తం అన్నీ బాగా కలిపిన తరువాత కళాయిని దించి చల్లార నివ్వాలి. చల్లారిన తరువాత మృదువుగా మీగడ లాంటి క్రీమ్ తయారవుతుంది. దానిని ముందుగా రెడీచేసుకున్న ఆకర్షణీయమయిన ప్రింటెడ్ ట్యూబులోకి ఫిల్లింగ్ మెషిన్ ద్వారా ఎక్కించి, అందమయిన అట్ట పెట్టెలలో పేక్ చేసి మార్కెట్ చేయాలి.

**గమనిక:** ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ వివరాలు ప్రత్యేకంగా యివ్వబడ్డాయి.

# బీడా బంక్

*అతి తక్కువ పెట్టుబడితో దినసరి ఆదాయాన్ని సమకూర్చుకునే స్వయం ఉపాధి నిర్వహణ ఇది. లైసెన్స్‌లతో పనిలేదు. ఎలాంటి రిజిస్ట్రేషన్స్ అవసరంలేదు. బ్యాంక్ రుణాల కోసం తిరగనవసరం లేదు. ఇంకా చెప్పాలంటే దీనికి ప్రత్యేకంగా షాప్‌లాంటిది కాని, గది లాంటిదిగాని అవసరం లేదు. ఏ కాఫీ హోటల్ ముంగిటనో, సిగరెట్ షాప్, టీ స్టాల్స్ వంటివాటి పక్కనో, సినిమాహాళ్ళకి దగ్గరలో వున్న ప్లాట్‌ఫారం మీదనో ఒక స్టాండ్, లేక స్టూల్‌మీద బాగా పెద్ద సైజులో వున్న ఇత్తడి పళ్లెంలో బీడాలు తయారుచేయటానికి అవసరం అయిన సరంజామాను పెట్టుకుని కూర్చుంటేచాలు. బిజినెస్ మొదలయినట్టే. ఒకప్పుడు జీర్ణశక్తి కోసం భోజనం చేసిన వెంటనే తాంబూలం వేసుకోవటం అలవాటుగా వుండేది. కాలక్రమేణ అదే సుగంధ ద్రవ్యాలతో కూడిన స్వీట్ కిళ్ళీగా మారింది. స్వీట్ కిళ్ళీ ఇష్టంలేనివాళ్ళు సాదా కిళ్ళీ వాడటం ప్రారంభించారు. ఆ అలవాట్లు మెల్లగా కారాకిళ్ళీ, జర్దా కిళ్ళీలుగా మారాయి. మత్తును కోరుకునేవాళ్ళు వివిధరకాల జర్దాల మిశ్రమంతో కలిపి తయారుచేయించుకునేదే బీడా. పెట్టుబడి వెయ్యిరూపాయలకు మించని ఈ బీడాబంక్ నిర్వహణ రోజుకి 150 నుండి 200 వందల వరకూ ఆదాయాన్ని తెచ్చిపెడుతుంది. జన సాంద్రత అధికంగా వున్న ప్రదేశాలలో అయితే ఆ ఆదాయం మరోవందరూపాయలు పెరిగే అవకాశం వుంది. ఎందుకంటే బీడా అలవాటువున్నవాళ్ళు రోజుమొత్తంమీద కనీసం అయిదారుబీడాలను వేసుకుంటారు. మరికొందరు గంటకి ఒకసారయినా, అంటే రోజుకు సుమారు పదినుండి పదిహేను దాకా బీడాలు నమిలేస్తారు. అందుకే ఇది లాభసాటి వ్యాపారమయింది. దీనికి ఒక సీజన్ అంటూలేదు. అలవాట్లకు సీజన్ ఎందుకుంటుంది?*

**'రా' మెటీరియల్ (ముడిసరుకులు):-** 1. పచ్చివక్కపొడి 2. వేయించిన వక్కపొడి. 3. సున్నం 4. వివిధ రకాల జరదాలు, పాన్ మసాలాలు 5. సుగంధ ద్రవ్యాలు 6. సిల్వర్ పేపర్ 7. తమలపాకులు (వివిధ రకాలవి)

**ఫార్ములా:-** ప్రత్యేకమయిన ఫార్ములాలేదు. అవసరం అయినంత సున్నం రాయటం వక్కలు, జర్దాలు వేయటం అంతా అలవాటు ప్రకారం అనుభవం మీద చేయాల్సిందే జర్దాల ఎక్కువ తక్కువలు కస్టమర్ ఇష్టాన్ని బట్టి వుంటుంది.

**కావలసిన పరికరములు:-** 1. స్టీలు డబ్బాలు 2. వక్కను కట్‌చేసే హేండ్ కట్టర్, సున్నం రాసే పుల్ల 3. పెద్దసైజు ఇత్తడి పళ్ళెం 4. స్టూల్స్, 5. పేకింగ్ పౌడర్ 6. కాష్‌బాక్స్ ఇంకా అవసరాన్ని బట్టి మరికొన్ని.

***నిర్వహణ విధానము:-*** పైన చెప్పిన విధంగా బంక్ లేకపోయినా ఎక్కడో ఒకచోట స్టూల్‌మీద పళ్ళెం ఏర్పాటు చేసుకుని దానిచుట్టూ స్టీలు డబ్బాలు, జర్దా డబ్బాలు తడిగుడ్డలో చుట్టిన ఆకులు కాష్‌బాక్స్ పెట్టుకోవాలి. బీడా అడిగేవారి టేస్ట్‌నూ, అలవాటును తెలుసుకుని వారు కోరిన విధంగా బీడా కట్టిఇవ్వాలి. (అదిక్రమంగా అలవాటు అవుతుంది) నాణ్యతగల జర్దాలువాడాలి. నాసిరకాలవి వాడి కస్టమర్స్‌కు ఇబ్బంది పెట్టకూడదు... ఒకసారి మీ దగ్గర బీడా కట్టించుకోటానికి అలవాటు పడిన వాళ్ళు మళ్ళీమళ్ళీవచ్చేలా బీడా కట్టటంలో మీకున్న ప్రావీణ్యతను ఉపయోగించాలి. అప్పుడే మీరు నాలుగు కాసులు పోగుచేసుకోగలుగుతారు. బీడా కట్టటంతోపాటు, వివిధ కంపెనీలకి సంబంధించిన గుట్కాలు, పాన్‌పరాగ్‌లు కూడా అమ్మవచ్చు. మార్కెట్‌లో వీటి సేల్స్ ప్రస్తుతం విపరీతంగా వుంది. అంతేకాదు పెళ్ళిళ్ళకూ, ఖుతర శుభకార్యాలకు కిళ్ళీలు కట్టి ఇవ్వటంలాంటివి చిన్నచిన్న కాంట్రాక్ట్‌లు చేసుకోవచ్చు. మీది ఫ్లాట్‌ఫారాం దుకాణం అని మీరేమీ సిగ్గుపడనవసరం లేదు. ఎవరో చులకన చేస్తారని బాధపడకూడదు. చులకన చేసేవాళ్ళు రోజుకి 150 నుండి 200 ఆదాయాన్ని మీకు కల్పించలేరు కదా!

గమనిక: ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ వివరాలు ప్రత్యేకంగా యివ్వబడ్డాయి.

# చైల్డ్‌కేర్ సెంటర్

(ఈ పథకం ఆడవారికి ప్రత్యేకం)

*మగవారితో సమాన హక్కులు కోరే ఆడవారు సంపాదన విషయంలో కూడా వారికి చేదోడువాదోడుగా వుండేందుకు ఈ పథకం చక్కగా ఉపకరిస్తుంది. వంటపూర్తికాలేదనో, ఉద్యోగానికి వెళ్ళవలసిన వేళ మించి పోతున్నదనో, పిల్లల్ని రెడీచేసి స్కూలుకి పంపాలనో హడావుడి పడిపోనవసరంలేదు. ఇంటిపట్టునే వుంటూ, మీ పనులు మీరు చేసుకుంటూ చైల్డ్‌కేర్ సెంటర్‌ని సమర్ధవంతంగా నడపవచ్చు... అందువల్ల మీకు ఆదాయం రావటమేకాకుండా.... ఉద్యోగాలు చేసే సాటి ఆడవారికి వారి పిల్లల విషయంలో టెన్షన్ తొలగించిన వారు కూడా అవుతారు. ఇందువల్ల మీ కుటుంబానికి మీరు అందించే వ్యక్తిగత సేవలతో పాటు ఆర్థిక పరమయిన సహాయాన్ని అందించే అవకాశం కలుగుతుంది. ఈ చైల్డ్‌కేర్ సెంటర్ నిర్వహణకి అధిక పెట్టుబడులు పెట్టనవసరం లేదు.. అప్పలు చేయాల్సిన అవసరం అంతకంటేలేదు. అందుకే అటువంటి స్వయం ఉపాధి పథకానికి రూపకల్పన చేయటం వెంటనే ప్రారంభించండి. ఊరికే తినికూర్చోవటం కంటే మీ పిల్లలతో పాటే మరికొంతమంది పిల్లల సంరక్షణ బాధ్యతల్ని నిర్వహిస్తూ ఎంతో కొంత సంపాదించటం మంచిది కదూ!.*

**కావలసిన మెటీరియల్స్ం:-** రకరకాల ఆట బొమ్మలు, బేటరీతో పనిచేసేవి, చెక్కలతో రబ్బరుతో చేసినవి, టాయ్ సైకిల్స్, చెక్కగుర్రాలు, బెలూన్స్, రంగురంగుల బొమ్మలపుస్తకాలు, ఊయలలు, మినీ రంగులరాట్నం, చిన్నసైజు జారుడుబల్ల, పాలడబ్బాలు, చాక్లెట్స్, మిల్క్‌బిస్కట్స్ మొదలయినవి.

**నిర్వహణ ఫార్ములా:-** ఓపిక, సహనం, లాలన, పాలన, బుజ్జగింపు లవ్లీట్రీట్‌మెంట్ లైక్ ఎ మదర్.

***నిర్వహణ విధానము:-*** ముందుగా నిర్వహణకు అవసరం అయినవన్నీ కొద్దిపాటి పెట్టుబడిలో సమకూర్చుకోండి. ఇందుకు ప్రత్యేకంగా అద్దె భవనం అవసరం లేదు. మీ ఇంట్లో నే నిర్వహించవచ్చు. చైల్డ్‌కేర్ సెంటర్ ప్రారంభించినట్టు మీ చుట్టుపక్కలవారికి ఇతర ఏరియాలలో వున్న మీ చుట్టాలకీ స్నేహితులకీ

తెలియచేయండి. దిన పత్రికలలో వరుసగా రెండుమూడు రోజులు మీ చైల్డ్‌కేర్ వివరాలను తెలుపుతూ చిన్నచిన్న ప్రకటనలు ఇవ్వండి. పాంప్లెట్స్ ప్రింట్స్‌చేయించి ఆఫీసులలో ఇంకా ఇతరచోట్ల పంచిపెట్టండి. అంతేమీరు చేయాల్సింది. ఆ తరువాత పిల్లల తల్లిదండ్రులే వచ్చి మిమ్మల్ని సంప్రదించి వారి పిల్లల సంరక్షణ బాధ్యతను మీకు అప్పగిస్తారు.

మీ మాటకారితనం, సామర్థ్యాన్ని బట్టి ఒక్కోపిల్ల, పిల్లవాడికీ రు.300 నుండి 500 దాకా ఫీజువసూలు చేయవచ్చు. పిల్లల వయసును బట్టి కూడా ఈ ఫీజును నిర్ణయించవచ్చు. పిల్లలకు సంబంధించిన దుస్తులు, రబ్బర్‌షీట్స్, ఇంకా ఇతరములు క్లీన్‌చేసేందుకు ఒకరిద్దరు ఆయాలను నియమించుకోండి. (అది మీ దగ్గర చేరిన పిల్లల సంఖ్యనుట్టి చేయాల్సివుంటుంది) ఇక మీరు చేయాల్సింది పిల్లల్ని ముద్దు చేయటం, ఆడించటం, ఏడుస్తున్నవారిని బుజ్జగించటం...నిద్రపుచ్చటం లాంటివి. వారి పట్ల మీ ట్రీట్‌మెంట్ ప్రేమతో కూడినదై తల్లిదండ్రులను తాత్కాలికంగా మరిపించేదిగా వుండాలి.

**పిల్లల విషయంలో తీసుకోవాల్సిన జాగ్రత్తలు:**-1. పిల్లలు ఆడుకునే హాల్లో, వారికి అందుబాటులో ప్రమాదకరమైన పదార్థాలను కానీ, వస్తువులను కానీ వుంచకూడదు.2. నడిచే పిల్లలు, పాకే పిల్లలు బయటికి వెళ్ళిపోకుండా తగిన ఏర్పాట్లు చేయాలి.3. మీ చైల్డ్‌కేర్‌కి అతి సమీపంలోవున్న డాక్టర్ టైమింగ్స్ తెలుసుకోవాలి. అవసరాన్ని బట్టి ఆ డాక్టర్ పిల్లలకు వైద్య సహాయాన్ని అందించేలా మాట్లాడుకోవాలి. (పిల్లల వైద్య సంబంధమయిన ఖర్చులు తల్లిదండ్రులే భరిస్తారు) 4. పిల్లలు ఒకరికొకరు కొట్టుకోకుండా చూడాలి. ఒకేరకమయిన ఆటబొమ్మలు ఒకటికినాలుగు వుంచుకోవాలి 5. పిల్లల ఆహారపు అలవాట్లు, ఇతర అలవాట్లు తెలుసుకుని తల్లి దండ్రుల సలహాలను, సూచనలను తీసుకోవటం చాలా అవసరం. 6. పిల్లల తల్లిదండ్రుల ఆఫీస్ అడ్రసులూ, ఫోన్ నెంబర్‌లు మీ దగ్గర నోట్ చేసుకుని వుంచుకోవాలి. 7. పిల్లలు తిరుగాడే ప్రదేశాన్ని ఎప్పటికప్పుడు నీట్‌గా వుంచాలి. 8. పిల్లల క్లీనింగ్ విషయంలో ఆయాలు శ్రద్ధవహించేలా చూడాలి.

గమనిక: ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ వివరాలు ప్రత్యేకంగా యివ్వబడ్డాయి.

# లెదర్ బెల్ట్స్

*ఫాంట్‌కి అలంకరించుకునే లెదర్‌బెల్టుల ఉపయోగాన్ని గురించి తెలియని మగవారుండరు. ఫాంటు జారిపోకుండా వుండేందుకు స్టయిల్‌గా ఇన్‌షర్ట్ చేసుకునేందుకూ ఈ లెదర్‌బెల్టులను ఉపయోగించటం జరుగుతుంది. చిన్న పిల్లలు (మగపిల్లలు) మొదలుకొని అన్ని వయసుల వారూ ఈ లెదర్ బెల్టు ఉపయోగిస్తూంటారు. కాబట్టి మార్కెట్‌లో దీనికి వుండే డిమాండ్‌ను గురించి ప్రత్యేకించి చెప్పనవసరంలేదు. డిమాండ్‌గల వస్తువులను తయారుచేసే ఏ పరిశ్రమయినా అధిక లాభాలను ఆర్జించిపెడుతుందనటంలో ఎలాంటి సందేహమూ అక్కర్లేదు.*

**'రా' మెటీరియల్స్ (ముడిసరుకులు):-** 1. వెజిటబుల్ ట్యాన్డ్ లెదర్ వివిధమందాలలో 2. బకెల్స్ 3. ప్రెసింగ్ బటన్స్ 4. గోల్డ్‌ఫాయిల్స్ 5. పాలీష్

**ఫార్ములా:-** మేకింగ్ స్కిల్ + అనుభవం.

**యంత్రపరికరాలు:-** 1. పంచింగ్ మెషీన్ 2. హీట్ డివైస్ ఎంబోసింగ్ మెషీన్ (రోలర్‌టైప్) 3. డిజైన్డ్ రోలర్ డైస్ 4. స్ట్రాక్ కటింగ్ మెషీన్. 5. హాండ్ టూల్స్ 6. పాలిషింగ్ పరికరాలు.

***తయారుచేయు విధానము:-*** అవసరం అయిన ముడిచర్మాన్ని వెజిటబుల్ ట్యాన్డ్ పద్ధతి ననుసరించి శుద్ధిచేయాలి. ఆ తరువాత మెజర్‌మెంట్స్ ప్రకారం కావాల్సిన మందంలో కటింగ్ మెషిన్ ద్వారా కట్ చేసుకోవాలి. ఎంబోసింగ్ యంత్రం ద్వారా హీటింగ్ డివైస్‌తో వివిధ రకాలుగా డిజైన్డ్ చేయాలి. వివిధ కొలతలలో బెల్టు బిగించుకునేందుకు అనువుగా పంచింగ్ మెషిన్‌తో బెల్టు మీద కొద్దిపాటి గేప్స్‌లో రంధ్రాలు ఏర్పరచాలి. ఆ తరువాత బకిల్స్‌ను అమర్చి, బెల్టుముందు భాగాన్ని పోల్ట్‌చేసి రివిట్స్ అమర్చాలి ఆ తరువాత వార్నిష్ పాలిష్‌చేసి మార్కెట్‌లో విడుదలచేయాలి. ఖరీదయిన బెల్టులను చుట్టలుచుట్టి అట్టపెట్టెలలో నీట్‌గా ప్యాకింగ్ చేయవచ్చును.

గమనిక: ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ వివరాలు ప్రత్యేకంగా యివ్వబడ్డాయి.

# గాజు సామగ్రి

కొన్ని పనులకు, ముఖ్యంగా ప్రయోగశాలలో నిర్వహించే వివిధ ఎక్స్‌పరిమెంట్స్‌కి ఖచ్చితంగా గాజుసామగ్రినే ఉపయోగించాల్సి వుంటుంది. కిరోసిన్ లాంప్, లాంతర్‌వంటి వాటికి గ్లాస్ బర్నర్‌చాలా అవసరం. ఆసుపత్రుల మెడిసిన్స్ విలవకూ, కొలతలకూ గాజు పరికరాలనే ఉపయోగిస్తారు. హైస్కూల్, కాలేజీల ప్రయోగశాలలో ఈ గాజుసామగ్రి అవసరం ఎంతయినా వుంటుంది. అజాగ్రత్తవల్లగానీ, పొరపాటువల్లగానీ తొందరగా పగిలిపోయే ఆ గాజుసామగ్రిని అవసరం నిమిత్తం మళ్ళీమళ్ళీ కొనుక్కోవాల్సివుంటుంది. అందువల్ల ఈ గాజుసామగ్రికి మార్కెట్‌లో వుండే గిరాకీ స్థిరమయినదిగానూ, అపారమయినదిగాను చెప్పవచ్చు. సాంకేతిక పరిజ్ఞానంతో కూడుకున్న ఈ గాజుసామగ్రి తయారీ మంచిలాభసాటి పరిశ్రమ!

**'రా' మెటీరియల్స్ (ముడిసరుకులు):-** 1. గ్లాస్ గొట్టాలు (వివిధ మందాలలో) 2. పేకింగ్ మెటీరియల్స్ 3. ఆమ్లములు 4. షేప్ డిజైనింగ్ మెటీరియల్

**ఫార్ములా:-** సాంకేతిక పరిజ్ఞానం + అనుభవం. మేకింగ్ స్కిల్.

**యంత్రపరికరములు:-** 1. L.P.G. గ్యాస్ 2. బర్నర్స్ 3. పైప్ లైన్స్ 4. ఆక్సిజన్ రెగ్యులేటర్ 5. వర్కింగ్ టేబుల్స్ 6. స్టీమ్ టెస్టింగ్ 7. పెంటోగ్రాఫ్ మెషిన్ 8. ఎయిర్‌కంప్రెషర్ 9. హాండ్‌గ్లవ్స్ 10. ఇతర పరికరాలు.

**తయారుచేయు విధానము:-** వివిధ ఆకారాలలో వుండే గ్లాస్ ట్యూబ్‌లను అవసరం అయిన మందంలో తీసుకుని L.P.G. గ్యాస్ మంటలో బర్నర్స్‌మీద తగిన ఉష్ణోగ్రతలో వేడిచేయాలి. కొంతసేపటికి అవి మెత్తబడటం జరుగుతుంది. అప్పుడు మెత్తబడిన ఆ గ్లాస్ ట్యూబులలోకి ఒక పద్ధతి ప్రకారం ఎయిర్‌కంప్రెషర్ ద్వారా గాలిని పంపిస్తూ, పెంటోగ్రాఫ్ మెషిన్ సహాయంతో గుర్తులు పెట్టుకుని ఆకారాలలో సైజులలో గ్లాస్ సామగ్రిని తయారుచేయాలి. అలా తయారుచేయబడిన గాజుసామగ్రిని ఆమ్లములను ఉపయోగించి శుభ్రపరిచి, వివిధ పేకింగ్‌ల ద్వారా మార్కెట్‌కి పంపాలి. మెత్తబడిన గ్లాస్ ట్యూబులను వివిధ ఆకారాలలో మలచటం మీకున్న నైపుణ్యంమీద ఆధారపడి వుంటుంది.

గమనిక: ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ వివరాలు ప్రత్యేకంగా యివ్వబడింది.

# నికెల్ ప్లేటింగ్

*వివిధ రకాలయంత్ర సామగ్రి, ఇతర పరికరాలు తుప్పు పట్టకుండా వుండటానికి, ఆకర్షణీయంగా కనిపించటానికి...మన్నికకోసం ఈ నికెల్ ప్లేటింగ్ విరివిగా ఉపయోగపడుతుంది. వాచ్‌చైన్‌లూ, ఇతర ఫ్యాన్సీ గొలుసులు మెరుస్తూ కనిపించేలా చేయటానికి ఈ నికెల్‌కోటింగ్ వాడబడుతుంది. ఈ నికెల్ ప్లేటింగ్ యూనిట్ నెలకొల్పడం మంచిలాభసాటి పరిశ్రమ. అయిరన్ వస్తువులు తయారుచేసే వారికి ఈ యూనిట్ గల వారితో తప్పనిసరిగా అవసరం వుంటుంది. కాబట్టి నికెల్ ప్లేటింగ్ యూనిట్‌కి ఎప్పుడూ గిరాకీయే! డిప్‌చేయటం ద్వారా వస్తువులను నికెల్ ప్లేటింగ్ చేయాలి. యంత్రాల ద్వారా కూడా ఈ కోటింగ్ అప్లయ్ చేయవచ్చును.*

**'రా' మెటీరియల్స్(ముడిసరుకులు):-** 1. క్లీనింగ్ సాల్ట్ 2. నికెల్ ఎనోడ్స్ 3. నికెల్‌క్లోరైడ్ 4. బోరిక్ ఏసిడ్ 5. యింకా మరికొన్ని

**ఫార్ములా:-** రసాయనిక పరిజ్ఞానం + అనుభవం + వర్కింగ్ స్కిల్.

**యంత్రపరికరములు:-** 1. P.V.C. లైన్డ్ బేరల్ 2. ఎల్టార్ యూనిట్ 3. రెక్టిఫైడ్ ఆయిల్ ఇమ్మర్సిడి 4. ప్లాస్టిక్ బేరల్ 5. M.S వెల్డెడ్ ట్యాంక్ 6. హీటర్ 7 హేండ్ గ్లవ్స్ 8. ఇతర హేండ్ టూల్స్.

***తయారుచేయు విధానము:-*** నికెల్ ప్లేటింగ్‌కి అవసరమయిన రసాయనాలను ముందుగానే ఒక పాత్రలో మిశ్రమం చేసుకుని వుంచుకోవాలి. ప్లేటింగ్ చేయాల్సి వివిధ సామగ్రిని ఆల్కలీ క్లీనర్‌నందు శుభ్రం చేయాలి. ఆ తరువాత తుప్పుతొలగించటానికి ఏసిడ్స్‌లో ముంచి యాసిడ్ ట్రీట్‌మెంట్ ఇవ్వాలి. ఈ శుభ్రంపరిచే విధానం ఒక క్రమపద్ధతిలో జరపాల్సివుంటుంది. ముందుగా ఏసిడ్ ట్రీట్‌మెంట్. తదుపరి వాటర్ క్లీనింగ్, ఆతరువాత ఆల్కలీస్ క్లీనింగ్, వాటర్‌క్లీనింగ్, తరువాత ఏక్టిలేషన్ డిప్‌చేసి చివరిగా మళ్ళీ స్వచ్ఛమయిన నీటిలో శుభ్రపరిచి తడిలేకుండా చూసి నిర్దేశిత సమయం వరుకు నికిల్ ప్లేటింగ్‌లో డిప్‌చేసి, ఆ తరువాత వాటర్ క్లీన్‌చేయాలి. అప్పుడు డిప్ చేయబడిన వస్తువులు లేక సామగ్రి మిలమిల మెరుస్తూ ఆకర్షణీయంగా కనిపిస్తాయి

గమనిక: ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ వివరాలు ప్రత్యేకంగా యివ్వబడ్డాయి.

# షామియానా సప్లయిర్స్

*అభివృద్ధిచెందుతున్న నగరాలలో, పట్టణాల్లో ఎప్పుడూ ఎక్కడో ఒకచోట వివిధ రకాల ఫంక్షన్స్ జరుగుతూనే వుంటాయి. ముఖ్యంగా వివాహాది శుభకార్యాలలో జరిగే విందులకు అధిక సంఖ్యాకులయిన ఆహ్వానితులకు భోజనాలు ఏర్పాటుచేయాల్సి వుంటుంది. అటువంటి విందుల ఏర్పాటు చేయటానికి వంటకాలను భారీ ఎత్తున చేయించాల్సి వుంటుంది. అందుకు వంట సామగ్రి ఎక్కువగా పెద్ద సైజులలో కావాలి. పెళ్లిళ్లకు ఇంటిముందు పందిళ్ళు వేయటం ఎప్పుడో కనుమరగయింది. ఆ స్థానంలో షామియానాలు చోటుచేసుకున్నాయి. ఒకటి, లేక రెండు రోజులు జరిగే విందు ఏర్పాట్లు భారీఎత్తున సొంతంగా సమకూర్చుకోవటం ఖర్చుతో కూడుకున్నపని, పైగా పనిపూర్తయిన తరువాత వాటితో అవసరం తీరిపోతుంది. ఈ విషయాలన్నింటిని దృష్టిలో వుంచుకునే షామియానా సప్లయింగ్ యూనిట్స్ వెలిసాయి. విందులూ, ఉత్సవాలు నిర్వహించేవారు, షామియానాలు వంటసామగ్రి మొదలయినవి అవసరాలనికి ఉపయోగించుకుని కొద్దిపాటి ఛార్జీ చెల్లిస్తే సరిపోతుంది. సందర్భం గడిచిపోతుంది.*

**నిర్వహణకు అవసరమయిన పరికరములు:-** 1. టేబుల్స్ (చెక్కవి, ఐరన్‌వి) 2. కుర్చీలు (చెక్కవి, ఐరన్‌వి) 3. షామియానాలు 4. గ్లాసులు 5. వాటర్ జగ్స్. 6. అన్నిరకాలవంట సామగ్రి 7. జంపఖానాలు మొదలయినవి. 8. V.I.P. ఛైర్స్

***నిర్వహణ విధానము:-*** యూనిట్ స్థాపించగానే అందుకు అవసరమయిన పబ్లిసిటీని పాంప్లెట్స్‌ద్వారా, గోడలమీద వ్రాయించటం ద్వారా, వాల్‌పోస్టర్స్ అంటించటం ద్వారా చేయాలి. మీ నగరంలో వున్న కళ్యాణ మండమ నిర్వహకులతో కాంట్రాక్టు పెట్టుకోవాలి. అవసరాన్ని బట్టి నైపుణ్యం గల వంటవారిని మీరే సప్లయిచేయగలిగేలా ఉండాలి. ఎప్పటికప్పుడు సామగ్రిని శుభ్రంగా వుంచుకోవటంలో శ్రద్ధవహిస్తూ నీట్‌గా వుండే సామగ్రిని సప్లయ్‌చేయాలి. షామియానా, టేబుల్స్, కుర్చీలు, గ్లాసులు వంటసామగ్రి మొదలయిన వాటికి విడివిడిగా చార్జీలు నిర్ణయించాలి. మంచి

వస్తువులను సప్లయ్ చేయటంలో మీ యూనిట్‌కి వున్న ప్రత్యేకతను నిరూపించుకోవటం ద్వారా పదిమందిని ఆకర్షించేట్టు వుండాలి.

**నిర్వహణలో తీసుకోవాల్సిన జాగ్రత్తలు:-** 1. సప్లయింగ్‌కి సంబంధించి కొన్ని నిబంధనలను ముందుగానే నిర్ణయించుకుని కస్టమర్స్‌కి ముందుగానే తెలియచేయాలి. 2. సప్లయ్‌చేసిన ప్రతి ఐటమ్‌ను జాగ్రత్తగా లెక్కచూసుకుని ఒక కాగితం మీద నోట్‌చేసుకుని దాని డూప్లికేట్‌ను కస్టమర్స్‌కి ఇవ్వాలి. 3.డామెజ్ ఛార్జెస్‌ని కూడా మీ నిబంధనావళిలో చేర్చాలి. 4. టైం ప్రకారం డెలివర్ ఇచ్చి, అదేటైంకి సామాను వాపస్ తెచ్చుకోవాలి. 5. సప్లయ్‌చేసిన మొత్తం సామగ్రికి అయ్యే ఛార్జీలో సగం ముందుగానే తీసుకోవాలి. 6. మిస్ అయిన వస్తువులను పూర్తి ధరవసూలు చేయటం మీ నిబంధనావళిలో వుండాలి. 7. సామగ్రి డెలివర్ ఇచ్చేటప్పుడు వివరంగా లిస్ట్ వ్రాసి డెలివర్ తీసుకుంటున్నవారిచే సంతకంచేయించుకోవాలి. (డెలివరీ నోట్‌మీద) 8. సామగ్రిని అవసరం అయిన చోటుకి పంపేందుకు వేన్ వుంటే మంచిది. లేదంటే రిక్షావారితో లాగుడుబండివాళ్ళతో కాంట్రాక్టును పెట్టుకోవాలి. 9.వంటపాత్రలను రిటన్ తీసుకునేటప్పుడు వాటిని శుభ్రం చేసిఇచ్చే బాధ్యత కస్టమర్స్‌దేనని ముందుగానే మాట్లాడుకోవాలి.

గమనిక: ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ వివరాలు ప్రత్యేకంగా యివ్వబడ్డాయి.



# కాఫీ పొడి

*టీ, కాఫీలు మనిషి అలవాట్లతో అనుబంధాలు పెంచుకుని, నిత్యావసరపానీయాలుగా చెలామణి అవుతున్న రోజులు ఇవి. ఉదయం నిద్రలేస్తూనే బెడ్‌కాఫీ త్రాగనిదే కాలకృత్యాలు కూడా ప్రారంభించడం చాలామంది వేడివేడి కాఫీ పడకపోతే ఏమీ తోచదు. ఏదో తెలియని చికాకునీరసం లాంటివి ఆక్రమించుకుంటాయి. టీ ఇష్టంగా, చాలాసార్లు త్రాగే వారుకూడా ఉదయంపూట మాత్రం కాఫీ త్రాగటానికే ఎక్కువ ఇష్టపడతారు. కాఫీ ప్రియుల ఇష్టాన్ని గుర్తించినట్టు దేశంలోని వివిధ పెద్ద కంపెనీలు వారుకూడా రకరకాల రుచులలో కాఫీ పౌడర్స్ అందిచటంలో ఎప్పటికప్పడు పోటీపడుతూనేవున్నారు. కాఫీ పొడి ధరకాస్త ఎక్కువగానే వుంటుంది. అయినా ఇదంటే ఇష్టపడేవాళ్ళు ధరను గురించి ఆలోచించరు. అందుకే మార్కెట్‌లో దీనికి అపారమయిన డిమాండ్‌వుంది. నైపుణ్యాన్ని ప్రదర్శించి కాఫీ పొడిని తయారుచేసి కాస్తంత తక్కువ ధరకు అందించగలిగితే మార్కెట్ పోటీని తట్టుకుంటూ మంచి లాభాలు ఆర్జించవచ్చును. కాఫీపొడి ఎక్కువ రోజులు నిలవవుంచటం కంటే తాజాగా వున్నప్పడు త్రాగితేనే దాని రుచి అద్భుతమనిపిస్తుంది.*

**'రా' మెటీరియల్ (ముడిసరుకులు):-** 1. చికోరిపౌడర్ 2. కాఫీ గిజంలు (విత్తనాలు)

**ఫార్ములా:- (శాంపిల్)** 1. చికోరి 3 KG (పౌడర్) 2. కాఫీ గింజలు 10 కిలోలు.

**యంత్రపరికరములు:-** 1. ఎలక్ట్రిఫికేషన్ 2. స్టార్టర్ స్విచ్ 3. 2 H.P. మోటార్‌గల కాఫీ గ్రైండర్ 4. 0.5 H.P. కాఫీరూస్టర్ 5. స్టార్టర్ అండ్ స్విచ్. 6. అవసరం అయిన పాత్రలు 7. ఇతర పనిముట్లు 8. పేకింగ్ మెటీరియల్స్ 9. ఫిల్టర్స్ (జల్లెడలు)

***తయారుచేయు విధానము:-*** పైన ఇవ్వబడిన నిష్పత్తిలో కాఫీ పొడిని తయారుచేసుకోవచ్చును. ముందుగా కాఫీ గింజలను కాఫీ గ్రైండర్‌లోవేసి బాగా పొడిచేయాలి. ఆ పొడిని ఫిల్టర్‌చేసి చికోరి పౌడర్‌లో కలిపి రూస్టర్‌లో వేసి 10 నుండి

పదిహేను నిముషాలపాటు వుంచి, ఆ తరువాత మొత్తం పౌడర్‌ను తగిన ఫిల్టర్స్‌లో జల్లించి, ఆకర్షణీయమయిన పేకెట్స్ గా పేకింగ్ చేసి మార్కెట్ చేయాలి. భారీఎత్తున తయారుచేసేటట్లయితే పబ్లిసిటీ తప్పకుండా చేయవలసివుంటుంది. గ్రామస్థాయిలో అయితే ఇంటింటికి తిరిగి ప్రచారం చేయటం ద్వారా కాఫీ పొడిని విక్రయించవచ్చును.

రుచి, తాజాదనాలు మీరు తయారుచేసిన కాఫీ పొడి నాణ్యతకు గీటురాళ్ళవంటివి. మీ పరిశ్రమను అభివృద్ధిపరుచుకునేందుకు మీరు అవలంభించవలసిన సూత్రం అదే.

**గమనిక:** ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ వివరాలు ప్రత్యేకంగా యివ్వబడ్డాయి.

# కొబ్బరిత్రాళ్ళు

*కొబ్బరిపీచుతో చేసిన కొబ్బరితాళ్ళు చాలా గట్టిగా, మన్నికగలవిగా వుంటాయి. నీటిలో ముంచినప్పుడు కూడా మరింత బలంగా తయారవుతుందే తప్ప తెగిపోదు. ఈ కొబ్బరిత్రాళ్ళు ఇళ్ళు,మరియూ భవననిర్మాణాలలోనూ, కొన్ని వస్తువుల పేకింగ్‌లలోనూ, చక్కగా ఉపయోగపడుతుంది. ట్రాన్స్‌పోర్ట్‌కంపెనీల వారు దీనిని తప్పనిసరిగా వాడతారు. మనరాష్ట్రంలో కొబ్బరినార కావాల్సినంత నులువుగానే లభిస్తుంది. ఈ కొబ్బరితాళ్ళకు ఏ ఒక్క ఏరియాలోనో, ఒక్కరాష్ట్రంలోనే కాక దేశంఅంతటా మంచి డిమాండ్ వుంది. ఈ కొబ్బరి త్రాళ్ళు తయారీ అధిక లాభాలను ఆర్జించి పెట్టేపరిశ్రమల లిస్ట్‌లోకి చేరుతుంది.*

**'రా' మెటీరియల్స్ (ముడిసరుకులు):-** 1. కాయిర్‌ఫైబర్ (కొబ్బరినార)

**ఫార్ములా:-** కొద్దిపాటి అనుభవం + మెషీన్ ఆపరేటింగ్.

**యంత్రపరికరములు:-** 1. ఎలక్ట్రిఫికేషన్ 2. 1. H.P. మోటార్‌తో పనిచేసే రోప్ మేకింగ్ మెషిన్స్ - 3. పెడల్‌ఆపరేటెడ్ స్పిన్నింగ్ మెషిన్ 4. హేండ్‌టూల్స్ 5. ఇతరచిన్నచిన్నపరికరాలు.

***తయారుచేయు విధానము:-*** ముందుగా కొబ్బరిమట్టల నుండి నారను తీసుకుని క్లీనింగ్ కూంబ్స్ సహాయంతో శుభ్రపరచాలి... అంటేనారను అంటిపెట్టుకుని వుండే తుక్కును వేరుచేయాలి. ఆ తరువాత స్పిన్నింగ్ మెషీన్ సహాయంతో కొబ్బరినారను దారాలుగా చేస్తూ గుండ్రంగా చుట్టాలి. ఆ తరువాత రోప్‌మేకింగ్ యంత్రసహాయంతో పేని కావాల్సినమందంలో త్రాళ్ళుగా తయారుచేసుకుని ఒక పద్ధతిలో పెద్దపెద్ద బండిల్స్‌గా చుట్టుకోవాలి.

గమనిక: ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ వివరాలు ప్రత్యేకంగా యివ్వబడ్డాయి.

# ఉడెన్ టాయ్స్
## (కొబ్బరి బొమ్మలు)

కొయ్యబొమ్మల పేరు చెప్పగానే కొండపల్లి గుర్తు వస్తుంది. రాష్ట్రంలోనే కాదు దేశవ్యాప్తంగా కూడా కొండపల్లిబొమ్మలకు ఒక ప్రత్యేకతవుంది. అసలు కొయ్యతో చేసిన బొమ్మలు ఎక్కువకాలం మన్నికను కలిగివుండటమే వాటికి వున్న సహజమయిన ప్రత్యేకత అని చెప్పవచ్చు. ప్లాస్టిక్, రబ్బర్, ఫైబర్, గాజు మొదలయిన ఎన్ని రకాల బొమ్మలు మార్కెట్‌లోకి విడుదలవుతూ పిల్లలను మురిపిస్తున్నా కొయ్యబొమ్మలు మాత్రం తమగిరాకీని నిలబెట్టుకుంటూనే వున్నాయి. పిల్లలకు నడకను నేర్పేందుకు ఉపయోగించే తోపుడు బండీ, చక్కగా వూగే కొయ్యగుర్రం, ఈజీచైర్, గూడ్స్ ట్రెయిన్స్‌వంటివి పిల్లలకు ఇష్టమయిన ఆటవస్తువులుగా పేరెన్నికగన్నాయి. ప్రస్థుతం కొయ్యతో ఎడ్యుకేషనల్ పజిల్ ఆర్టికల్స్, కూడా తయారుచేయటం గమనించదగ్గ విషయం. ఇతర టాయ్స్ ఉత్పత్తుల పోటీకి తట్టుకుంటూ మార్కెట్‌లో తమ గిరాకీని నిలబెట్టుకుంటున్న ఈ కొయ్యబొమ్మల తయారీ మంచి లాభసాటి పరిశ్రమ అనిచెప్పవచ్చు.

**'రా' మెటీరియల్స్ (ముడిసరుకులు):** 1. పెయింట్స్ (వివిధ రంగులలో) సాఫ్ట్‌వుడ్ (అవసరమయిన ఘనపరిమాణంలో) 3. లక్క , చెక్కపొడి మిశ్రమం 4. రకరకాల బ్రష్‌లు.

**ఫార్ములా:-** వృత్తిపరమయిన శిక్షణ + అనుభవం. మేకింగ్ స్కిల్.

**యంత్రపరికరములు:-** 1. 05 H.P. మోటార్ విత్ బెల్ట్ అండ్ డిస్క్‌శాండర్ 2. బ్యాండ్‌సావిత్ 1 H.P. మెటార్ 3. 1H.P. మోటార్‌తో పనిచేసే సర్క్యులర్స్ 4. 0.5 H.P. మీటర్‌తో జిగ్‌సా మెషిన్ 5. వర్కింగ్ టేబుల్స్ 6. ఎమెరీపేపర్స్ 7. ఇతర హాండ్ టూల్స్.

**తయారుచేయు విధానము:-** చేయదలుచుకున్న బొమ్మకు ఉద్దేసించిన సాఫ్ట్ ఉడ్‌కు తగిన ఘన పరిమాణంలో తీసుకోవాలి. దానిపై బొమ్మతాలుకు డ్రాయింగ్‌కి సంబంధించి, అక్కడక్కడ మార్కింగ్ చేసుకోవాలి. తరువాత వివిధ రంపపు యంత్రాలను ఉపయోగించి, చెక్కను కావాల్సిన సైజులలో, ఆకారాలలో కట్‌చేయటం ద్వారా అవసరం అయిన విడిభాగాలను ముందు తయారుచేసుకోవాలి. ఎమెరీ పేపర్‌తో రుద్ది, వాటిని సాఫ్ట్‌గా వుండేలా చేసి, విడిభాగాలను తగిన విధంగా అసెంబ్లింగ్ చేయటంతో చెక్కబొమ్మ తయారువుతుంది. ఇక చివరిగా బొమ్మకు ఫినిషింగ్ ఇచ్చి, అవసరం అయిన పెయింట్ వేయటంతో బొమ్మ తయారీ పూర్తవుతుంది. గ్రామపట్టణ స్థాయిలో ఈ పరిశ్రమ చాలా లాభసాటిగా వుంటుంది.

గమనిక: ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ వివరాలు ప్రత్యేకంగా యివ్వబడ్డాయి.

# రబ్బర్ స్టాంప్స్

పరిశ్రమ నెలకొల్పినా, వ్యాపార సంస్థ స్థాపించినా ముందుగా కావాల్సినవి రబ్బర్ స్టాంప్స్. బ్యాంక్ వ్యవహారాలలో కూడా వ్యాపార సంస్థలవారు 'ఫర్' స్టాంప్ అనబడే రబ్బర్ స్టాంప్‌ను తప్పనిసరిగా ఉపయోగించాల్సి వుంటుంది. పేపర్ ద్వారా జరిపే అఫిషియల్ కార్యకలాపాలు కూడా రబ్బర్ స్టాంప్స్ తప్పక ఉపయోగించాల్సి వుంటుంది. అధికారికంగా కాగితాల మీద సంతకాలు చేసేవారు సంతకంతోపాటు తమ హోదాను తెలియచేసే రబ్బర్ స్టాంప్ వేస్తారు. అప్పడే కార్యాచరణకు అవసరం అయిన ఆ పేపర్‌కి వాల్యూ వుంటుంది. ఇలా రకరకాల ఉపయోగాలు కలిగిన ఈ రబ్బర్ స్టాంప్స్‌కి ఇప్పటికే మార్కెట్‌లో గిరాకీకి కొదువలేదు. కొద్దిపాటి పెట్టుబడిలో స్థాపించగలిగిన ఈ రబ్బర్ స్టాంప్‌ల తయారీయూనిట్ లాభసాటిదే.

**'రా' మెటీరియల్స్ (ముడిసరుకులు):-** 1. 'డై'స్టఫ్ 2. వుడెన్ బ్లాక్స్ 3. గ్లిజరిన్ 4. హేండిల్స్, డిస్టిల్డ్ వాటర్ 5. రబ్బర్ షీట్.

**ఫార్ములా:-** కొద్దిగా శిక్షణ, లేక అనుభవం. మేకింగ్ స్కిల్.

**యంత్రపరికరాలు:-** 1. S.S. స్టోరేజ్ వెస్సెల్స్ 2. చేతితో తూచే త్రాసు. 3. గాజు పరికరాలు 4. మినీ టెస్టింగ్ లేబొరేటరీ 5. పోర్టబుల్ స్టిరర్‌తో ఒక పాత్ర 6. హేండ్ ప్రెస్ (హీటింగ్ అరేంజ్‌మెంట్స్‌తో)

**తయారుచేయు విధానము:-** ముందుగా ప్లాస్టర్ ఆఫ్‌పారిస్ మౌల్డ్‌రెడీ చేసుకోవాలి. రబ్బర్ షీట్‌ను అమౌల్డ్ మీద వుంచి, తయారుచేయదలుచుకున్న స్టాంప్ తాలుకు మెటల్ అక్షరాలను కంపోజ్‌చేసి రబ్బర్‌షీట్ మీద వుంచి గట్టిగా ప్రెస్‌చేస్తే ఆ అక్షరాలలో స్టాంప్‌తయారవుతుంది. ఆ తరువాత దానిని అనువయిన రీతిలో కట్‌చేసి రబ్బర్ సొల్యూషన్‌లో చెక్కబ్లాక్, లేక ప్లాస్టిక్ బ్లాక్ కాని అందించటంతో రబ్బర్ స్టాంప్ తయారవుతుంది.

**గమనిక :** ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ వివరాలు ప్రత్యేకంగా యివ్వబడ్డాయి.

# ఆయుర్వేదిక్ మెడిసిన్స్

పాత తరం వారు ఇప్పటికీ ఆయుర్వేద మందులు వాడటానికి ఇష్టపడుతుంటారు. వ్యాధి నివారణ విషయంలో అవి దీర్ఘకాల ప్రభావాన్ని కలిగివుంటాయి. గ్రామప్రాంతాలవారు ఇప్పటికీ ఈ మందులనే వాడుతూ వుండటం గమనించదగ్గ విషయం. సరయిన వైద్య సదుపాయాలులేని మారు మూలపల్లెలూ, గ్రామాలు, కొండప్రాంతాలలో గూడేలు ఇప్పటికీ మనదేశంలో చాలా వున్నాయనటంలో ఆశ్చర్యపడవలసిందేమీ లేదు. అటువంటి చోట్ల నివసించేవారికి ఈ ఆయుర్వేదమందులు వ్యాధినివారణ విషయంలో సంజీవినిలా పనిచేస్తుంది. ఇంగ్లీషు మందులకంటే తక్కువ ధరలో లభించటం. సైడ్ ఎఫెక్ట్స్ లాంటివి లేకపోవటం ఈ ఆయుర్వేదమందుల ప్రత్యేకత. ఈ మందులను టానిక్‌లుగానూ, గుళికలు గానూ, చూర్ణం మరియూ కాప్సూల్‌రూపంలో తయారుచేయవచ్చు. ఈమందుల తయారీలో ఉపయోగించే మూలికలు, ఆకులూ, పువ్వులూ, కాయలూ మొదలయిన ముడిసరుకులు, గ్రామప్రాంతాలలోనూ, అడవులలోనూ లభిస్తాయి. ఆయుర్వేదిక్ మెడిసన్స్ తయారుచేసి, గ్రామప్రాంతాలలో విక్రయించటం మంచిలాభాలను అందిస్తుంది. ప్రభుత్వప్రోత్సాహ పధకాల సహకారంతో ఈ మందుల తయారీని కుటీర పరిశ్రమ స్థాయిలో నెలకొల్పవచ్చును.

**'రా' మెటీరియల్స్ (ముడిసరుకులు)** 1. మూలికలు 2. ఔషధానికి పనికి వచ్చే ఆకులు 3. పళ్ళు, కాయలు. 4. పువ్వులు 5. తేనె 6. పంచదార 7. ఖాళీకాప్స్యూల్స్ 8. బాటిల్స్ 9. డబ్బాలు.

**ఫార్ములా:-** మిక్సింగ్స్+ అనుభవం. తగిన శిక్షణ + నైపుణ్యం.

**యంత్రపరికరాలు:-** 1. ఎలక్ట్రిఫికేషన్ 2. బాటిల్ సీలింగ్ మెషీన్ 3. మినీ పల్వరైజర్ 4. స్టీల్ వెస్సెల్స్ 5. స్టిరర్స్ 6. ట్రేలు 7. ఫిల్టర్స్ (జల్లెడలు) 8. హీటింగ్ పరికరము 9. డ్రైయింగ్ ఓవెన్ 10. కేప్సూల్ ఫిల్లింగ్ మెషీన్స్ 11. వర్కింగ్ టేబుల్స్ 12. ఆఫీస్ ఫర్నిచర్ 13. ఇంకా ఇతర సామగ్రి.

***తయారుచేయు విధానము:-*** తయారుచేయదలుచుకున్న మూలికలు లేక పళ్ళు, పువ్వులు ఆకులు మొదలయినవి బాగా ఎండబెట్టాలి. ఆ తరువాత వాటిని

పల్వరైజర్ యంత్రంద్వారా చూర్ణంచేసి...దానిని నిల్వవుంచటానికి ఉపయెగించే రసాయన మిశ్రమ్మాన్ని కొద్దిగా చేర్చి పంచదారచూర్ణానికి తగినంతగా కలిపి బాగా మిశ్రమం అయ్యేలా చేసి డబ్బాలలో వేసి పేకింగ్ చేయాలి.

పొడిచేసిన చూర్ణాన్ని తేనెతో కలిపి గుళికలుగా తయారుచేసి సీసాలలో నింపాలి. లేదా పొడిమందును తగిన రసాయనాలతో మిశ్రమంచేసి జల్లెడలలో బాగా జల్లించి, కేప్సూల్ ఫిల్లింగ్ యంత్రంద్వారా కాప్స్యూల్స్‌లో నింపి కాప్సూల్స్ తయారుచేయాలి. ఈ కాప్సూల్‌ని మెటల్ స్ట్రిప్స్‌లో గాని, చిన్నచిన్న బాటిల్‌లో గాని పేక్ చేయాలి. ఇదే విధంగా ముడిసరుకులు పచ్చిగా వుండగానే గ్రైండింగ్ చేసి పంచదారని, తేనె మొదలయినవి కలిపి తగిన రంగులూ హాని చేయని రసాయనాలూ కలిపి టానిక్ గా తయారుచేసి బాటిల్‌ఫిల్లింగ్ యంత్రంద్వారా బాటిల్స్‌లో నింపి లేబుల్స్ అంటించి మార్కెట్ చేయాలి.

గమనిక: ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ వివరాలు ప్రత్యేకంగా యివ్వబడ్డాయి.



# బ్రీఫ్ కేసులు
## (లెదర్ మరియు రెక్సయిన్)

చిన్నచిన్న ట్రిప్స్..అంటే ఒకటి రెండు రోజులు మాత్రమే 'స్టే' చేయవలసివచ్చే ప్రయాణాలకు ఎక్కువలగేజి బాదరబందీ లేకుండా సింపిల్‌గా జతబట్టలు ఇతర అవసరాలకు ఉపయోగపడే టూత్‌బ్రష్, షేవింగ్ సెట్, మొదలయిన వస్తువులు తీసుకువెళ్ళటానికి బ్రీఫ్‌కేస్‌లు ఎక్కువగా ఉపయోగపడతాయి. ముఖ్యమయిన డాక్యుమెంట్స్, ఇతర కాగితాలు చిన్నచిన్న ఫైల్స్ వెంట తీసుకుపోటానికి కూడా ఈ బ్రీఫ్‌కేస్‌లను ఉపయోగించటం మనం చూస్తునేవున్నాం. మెడికల్, కాస్మొటిక్స్ మొదలయిన కంపెనీలకు సంబంధించిన రిప్రజెంటేటివ్‌లు, ఎగ్జిక్యూటివ్‌లు, వీటిని ఎక్కువగా ఉపయోగిస్తుంటారు. వీటిని ఉపయోగించటం సులువుగానూ, స్టయిల్‌గానూ వుంటుంది. పట్టణాలలోనూ, నగరాలలోనూ వీటిని ఎక్కువగా వినియోగిస్తుంటారు కాబట్టి అక్కడ వీటికి గిరాకీ ఎక్కువగానే వుటుందని చెప్పాలి. ఈ బ్రీఫ్‌కేస్‌ల తయారీ ఇప్పుడున్న లాభసాటి పరిశ్రమలలో ఒకటిగా చెప్పవచ్చును.

**'రా' మెటీరియల్స్ (ముడిసరుకులు):** 1. ప్లయివుడ్ (4 MM మందంగలది.) 2. కర్టెన్ లైనింగ్ క్లాత్ 3. స్టీల్ ఫ్రేమ్స్ 4. లాక్స్, 5. ఫిట్టింగ్ మెటీరియల్ 6. ఫైన్ ఫినిషింగ్ లెదర్ , లేదా రెక్సయిన్ 7. స్ప్రింగ్‌లు 8. లెదర్ ఫిక్సింగ్ గమ్.

**ఫార్ములా:-** శిక్షణ + అనుభవం + మేకింగ్‌స్కిల్.

**యంత్రపరికరములు:-** 1. ప్లయివుడ్ కటింగ్ మెషిన్ 2. ఎమెరీ పేపర్స్ 3. మెజర్‌మెంట్ స్కేల్ 4. మార్కింగ్ చాక్ 5. హెవీడ్యూటీ కుట్టుమెషిన్ 6. ఆఫీస్ ఫర్నిచర్ 7. హేండ్ టూల్స్.

**తయారుచేయు విధానము:-** నాణ్యతగల ప్లయివుడ్‌ను తీసుకుని, అవసరం అయిన విధంగా మార్కింగ్‌చేసుకుని, కటింగ్ మెషిన్ సహాయంతో మార్కింగ్ చేసిన విధంగా కావాల్సిన సైజులలో కట్ చేసుకుని అతికించటం ద్వారా కానీ, చిన్నచిన్న లెడ్ మేకులు ఉపయోగించటం ద్వారా గానీ సూట్‌కేస్ అడుగుభాగాన్ని, క్రిందిభాగాన్ని తయారుచేసుకోవాలి. ఆ తరువాత ఎమెరీ పేపర్‌తో నునుపుగా వుండేలా ఫినిషింగ్ ఇవ్వాలి. అదేవిధంగా లెదర్‌ని కానీ రెక్సయిన్‌గానీ కత్తిరించి హెవీడ్యూటీ కుట్టుమిషన్ ఉపయోగించి కావాల్సిన విధంగా కుట్టాలి. ఆ తరువాత ఆ లెదర్‌ని ప్లయివుడ్ అడుగు,

పై భాగాలకు ఎక్కించి, స్టీల్, లేక అల్యూమినియం ఫ్రేమ్స్‌ఫిక్స్ చేసి, లెదర్ గమ్‌తో అంచులను అతికించాలి. సూట్‌కేస్ లోపలిభాగం అంతటా లైనింగ్ వేసి కర్టెన్‌క్లాత్‌ని సూట్‌కేస్‌పైభాగానికి అరేంజ్‌చేయాలి. అంతకుముందే సెంటర్‌లాక్, సైడ్‌లాక్స్ ఫిట్‌చేసి లెదర్‌పాలిష్ ఇచ్చి సూట్‌కేస్‌ను రెడీ చేయాలి. అంతే! ఆ తరువాత అమ్మకానికి పంపటమే తరువాయి.

గమనిక: ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ వివరాలు ప్రత్యేకంగా ఇవ్వబడ్డాయి.



# శానిటరీ నేప్‌కిన్స్

వయసుకి వచ్చిన ఆడవారికి ఇది అంతరంగిక ఉపయోగకారి అనదగిన వస్తువు. ప్రతినెలా వీటితో వారికి అవసరం వుంటుంది. హాస్పిటల్స్‌లో కూడా వీటిని ఎక్కువగా ఉపయోగిస్తుంటారు. 'పీరియడ్' సమయాలలో ఆడవారు ఇబ్బంది పడకుండా ఈజీగా మూవ్ అయ్యేందుకు, మామూలుగా తిరిగేందుకు ఇవి వింతగానో ఉపయోగపడుతుంటాయి. ఎటువంటి ఎఫెక్ట్స్ లేకుండా ఆరోగ్యాన్ని సేఫ్టీగా వుంచటం వీటి ప్రత్యేకత. అందువల్ల వీటికి గిరాకీ మార్కెట్‌లో ఎక్కువగానే వుంటుంది. సులువుగా తయారుచేయగల ఈ శానిటరీ నేప్‌కిన్స్ లాభాలను చేకూరుస్తాయని చెప్పొచ్చు.

**'రా' మెటీరియల్స్ (ముడిసరుకులు:-** 1. ముడినూలు 2. దారం 3. తడిపీల్చేదూది 4. క్రాఫ్ట్ పేపర్ 5. అట్టపెట్టెలు 6. క్లాత్

**ఫార్ములా:-** స్వల్పశిక్షణ + అనుభవం.

**యంత్రపరికరములు:-** 1. వర్కింగ్ టేబుల్ 2. కత్తెర 3. మార్కింగ్ చాక్ 4. స్టూల్స్ 5. హాండ్ ఆపరేటెడ్ కుట్టుమిషన్ 6. అట్టపెట్టెలు (ప్రింటెడ్‌వి) 7. ఇతర పరికరాలు.

**తయారుచేయు విధానము:-** నూలు వస్త్రాన్ని, నూలు దారాన్ని ఉపయోగించి కుట్టుమిషన్ సహాయంతో చిన్న గొట్టంగా అల్లుకోవాలి. మెజర్‌మెంట్స్ ప్రకారం దాన్ని చిన్నచిన్న ముక్కలుగా కట్ చేస్తారు. ఆ తరువాత తడిని పీల్చుకునే కాటన్‌ని తగిన విధంగా ఆ గొట్టాలోకి దూర్చి ఆ పైన జల్లెడవంటి వస్త్రంలో చుట్టి రెండు చివరలా దారంతో కుట్టి నేప్‌కిన్స్ తయారుచేసి, అట్టపెట్టెలలో పేక్‌చేసి మార్కెట్‌చేస్తారు. తడిని పీల్చుకుని బయటికి వదలకుండా వుండటం, సున్నితంగా, మృదువుగా వుండటం వీటి నాణ్యతకు నిదర్శనం. వ్యాపారాభివృద్ధికి దోహదం చేసే అంశాలు ఇవే.

ఈ శానిటరీ నేప్‌కిన్స్‌కి సంబంధించిన యంత్రపరికరాలు లూధియానా, ఢిల్లీ నగరాలలోనూ, ముడిసరుకులు ఢిల్లీ, ఉదయపూర్, లూధియానాల నగరాలలోనూ లభిస్తాయి.

గమనిక:- ప్రాజెక్ట్ ఎస్టిమేషన్ వివరాలు ప్రత్యేకంగా ఇవ్వబడ్డాయి.

